# ఆదిత్యహృదయం
# సూర్యారాధన

సామవేదం షణ్ముఖ శర్మ

ప్రథమ ముద్రణ:
శ్రీవికారినామ సంవత్సరం
చైత్రం-ఏప్రిల్ 2019

2

డిజైనింగ్ : రాముపండా

ముద్రణ:
సంహిత గ్రాఫిక్స్, హైదరాబాద్

ప్రచురణ:
ఋషిపీఠం చారిటబుల్ ట్రస్ట్
ప్లాట్ నెం-1-19-46,
హెచ్.ఐ.జి.ఎ-40,
డా॥ఎ.ఎస్.రావు నగర్,
హైదరాబాద్-500 062.
ఫోన్: 040 27134557, 27132550

## ముందుమాట

**'ఆ**దిత్య హృదయం' అనే స్తోత్రాన్ని ఆధారం చేసుకొని వేద-పురాణ-ఆగమ-కావ్యాది గ్రంథాలలోని సూర్యతత్త్వాన్ని ప్రవచించే అవకాశం పరమేశ్వరానుగ్రహం వల్ల లభించింది. ఇది కేవలం స్తోత్రానికి ప్రతిపదార్థ తాత్పర్య వ్యాఖ్యానం కాదు. ఋషులు, ఉపాసకులు పలుతావుల్లో చెప్పిన సూర్య వైభవాన్ని తెలియజేస్తూ, ఆదిత్య హృదయ స్వరూపాన్ని ఆవిష్కరించినది.

'ప్రవచన పాఠము' కనుక ఆ శైలిలోనే ఉన్నది.

ఈ గ్రంథంద్వారా కర్మ-ఉపాసన-జ్ఞాన మార్గాలలోని సూర్యప్రశస్తిని చెప్పే ప్రయత్నం జరిగింది.

ప్రవచనాల ధ్వనిముద్రికలను శ్రద్ధతో విని గ్రంథస్థం చేసిన చిరంజీవి ఘండికోట చిట్టిబాబుశర్మ, పుస్తక రూపాన్ని సంతరించడంలో కృషి చేసిన చిరంజీవి సత్యనరసింహశర్మ, మిత్రులు శ్రీ రాముపండా అభినందనీయులు.

ప్రవచనం విని పుస్తకంగా రావాలని కోరుకొని, ప్రచురణకు ఆర్థిక సహాయ సంపత్తిని సమకూర్చిన **చిత్తూరువాసులు శ్రీ వేల్కూరు నరేంద్రబాబుగారు, అరవింద సొసైటీ, చిత్తూరు కేంద్రం** వారికి ఆదిత్యుని అనుగ్రహం వలన ఆయురారోగ్యైశ్వర్యాదులు సిద్ధించుగాక.



బుధజన విధేయుడు
సామవేదం షణ్ముఖ శర్మ

# ఆదిత్యహృదయము

ధ్యానమ్

*నమస్సవిత్రే జగదేకచక్షుషే జగత్ప్రసూతి-స్థితి-నాశ-హేతవే।*
*త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే విరించి-నారాయణ-శంకరాత్మనే॥*

తతో యుద్ధపరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్।
రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్॥ ॥1॥

దైవతైశ్చ సమాగమ్య ద్రష్టుమభ్యాగతో రణమ్।
ఉపగమ్యాబ్రవీద్రామమగస్త్యో భగవాన్ ఋషిః॥ ॥2॥

రామ రామ మహాబాహో శృణు గుహ్యం సనాతనమ్।
యేన సర్వానరీన్ వత్స సమరే విజయిష్యసి ॥ ॥3॥

ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్।
జయావహం జపేన్నిత్యమక్షయ్యం పరమం శివమ్॥ ॥4॥

సర్వమంగలమాంగల్యం సర్వపాపప్రణాశనమ్।
చింతాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్॥ ॥5॥

రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతమ్।
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥ ॥6॥

సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః।
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః॥ ॥7॥

ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః।
మహేంద్రో ధనదః కాలో యమః సోమోహ్యపాంపతిః॥ ॥8॥

పితరో వసవః సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః।
వాయుర్వహ్నిః ప్రజాః ప్రాణ(ప్రజాప్రాణ)ఋతుకర్తా ప్రభాకరః॥ ॥9॥

ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్।
సువర్ణసదృశో భానుః స్వర్ణరేతా దివాకరః॥ ॥10॥

హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్ ।
తిమిరోన్మథనః శంభుస్త్వష్టా మార్తాండ అంశుమాన్ । ॥11॥

హిరణ్యగర్భః శిశిరస్తపనోఽ భాస్కరో రవిః।
అగ్నిగర్భోఽ దితేః పుత్రః శంఖః శిశిరనాశనః। ॥12॥

వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుస్సామపారగః।
ఘనవృష్టిరపాంమిత్రో వింధ్యవీథీప్లవంగమః॥ ॥13॥

ఆతపీ మండలీ మృత్యుః పింగలః సర్వతాపనః।
కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః॥ ॥14॥

నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః।
తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోఽస్తు తే॥ ॥15॥

నమః పూర్వాయ గిరయే పశ్చిమాయాద్రయే నమః।
జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః॥ ॥16॥

జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః।
నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః ॥ ॥17॥

నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమో నమః।
నమః పద్మప్రబోధాయ ప్రచండాయ నమో నమః॥ ॥18॥

బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే ।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః॥ ॥19॥

తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః॥ ॥20॥

తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే।
నమస్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే॥ ॥21॥

నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః।
పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః॥ ॥22॥

ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః।
ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్॥ ॥23॥

వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ ।
యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః॥ ॥24॥

**ఫలశ్రుతిః**

ఏనమాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషు చ ।
కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ ॥ ॥25॥

పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్।
ఏతత్ త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి॥ ॥26॥

అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి ।
ఏవముక్త్వా తదాఽగస్త్యో జగామ చ యథాగతమ్॥ ॥27॥

ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽభవత్తదా।
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్॥ ॥28॥

ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వా తు పరం హర్షమవాప్తవాన్ ।
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్ ॥ ॥29॥



రావణం ప్రేక్ష్య హృష్టాత్మా యుద్ధాయ సముపాగమత్।
సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్॥ ॥30॥

అథ రవిరవదన్నిరీక్ష్య రామం
ముదితమనాః పరమం ప్రహృష్యమాణః।
నిశిచరపతిసంక్షయం విదిత్వా
సురగణమధ్యగతో వచస్త్వరేతి॥ ॥31॥

## ఆదిత్యహృదయ స్తోత్ర నామావళిః

శ్రీ రశ్మిమతే నమః।
శ్రీ సముద్యతే నమః।
శ్రీ దేవాసురనమస్కృతాయ నమః।
శ్రీ వివస్వతే నమః।
శ్రీ భాస్కరాయ నమః।
శ్రీ భువనేశ్వరాయ నమః।
శ్రీ సర్వదేవాత్మకాయ నమః।
శ్రీ తేజస్వినే నమః।
శ్రీ రశ్మిభావనాయ నమః।
శ్రీ దేవాసురగణలోకపాలాయ నమః।
శ్రీ బ్రహ్మణే నమః ।
శ్రీ విష్ణవే నమః ।
శ్రీ శివాయ నమః ।
శ్రీ స్కన్దాయ నమః ।
శ్రీ ప్రజాపతయే నమః ।
శ్రీ మహేన్ద్రాయ నమః ।
శ్రీ ధనదాయ నమః।
శ్రీ కాలాయ నమః ।
శ్రీ యమాయ నమః ।
శ్రీ సోమాయ నమః ।
శ్రీ అపాంపతయే నమః ।
శ్రీ పితృమూర్తయే నమః ।
శ్రీ వసుమూర్తయే నమః ।
శ్రీ సాధ్యమూర్తయే నమః ।
శ్రీ అశ్విమూర్తయే నమః ।
శ్రీ మరున్మూర్తయే నమః ।
శ్రీ మనవే నమః ।
శ్రీ వాయుమూర్తయే నమః ।
శ్రీ వహ్నయే నమః ।
శ్రీ ప్రజారూపాయ నమః ।
శ్రీ ప్రాణాయ నమః ।
శ్రీ ఋతకర్త్రే నమః ।
శ్రీ ప్రభాకరాయ నమః ।
శ్రీ ఆదిత్యాయ నమః ।
శ్రీ సవిత్రే నమః ।
శ్రీ సూర్యాయ నమః ।
శ్రీ ఖగాయ నమః ।
శ్రీ పూష్ణే నమః ।
శ్రీ గభస్తిమతే నమః ।
శ్రీ సువర్ణసదృశాయ నమః ।
శ్రీ భానవే నమః ।
శ్రీ హిరణ్యరేతసే నమః ।
శ్రీ దివాకరాయ నమః ।
శ్రీ హరిదశ్వాయ నమః ।
శ్రీ సహస్రార్చిషే నమః ।
శ్రీ సప్తసప్తయే నమః ।
శ్రీ మరీచయే నమః ।
శ్రీ తిమిరోన్మథనాయ నమః ।
శ్రీ శంభవే నమః ।
శ్రీ త్వష్ట్రే నమః ।
శ్రీ మార్తాణ్డాయ నమః ।
శ్రీ అంశుమతే నమః ।

శ్రీ హిరణ్యగర్భాయ నమః ।
శ్రీ శిశిరాయ నమః ।
శ్రీ తపనాయ నమః ।
శ్రీ అహస్కరాయ నమః ।
శ్రీ రవయే నమః ।
శ్రీ అగ్నిగర్భాయ నమః ।
శ్రీ అదితేఃపుత్రాయ నమః ।
శ్రీ శంఖాయ నమః ।
శ్రీ శిశిరనాశనాయ నమః ।
శ్రీ వ్యోమనాథాయ నమః ।
శ్రీ తమోభేదినే నమః ।
శ్రీ ఋగ్యజుఃసామపారగాయ నమః॥
శ్రీ ఘనవృష్టయే నమః ।
శ్రీ అపాంమిత్రాయ నమః॥
శ్రీ విన్ధ్యవీథీప్లవంగమాయ నమః॥
శ్రీ ఆతపినే నమః ।
శ్రీ మణ్డలినే నమః ।
శ్రీ మృత్యవే నమః ।
శ్రీ పింగలాయ నమః ।
శ్రీ సర్వతాపనాయ నమః ।
శ్రీ కవయే నమః ।
శ్రీ విశ్వస్మై నమః ।
శ్రీ మహాతేజసే నమః ।
శ్రీ రక్తాయ నమః ।
శ్రీ సర్వభవోద్భవాయ నమః ।
శ్రీ నక్షత్రగ్రహతారాణాం అధిపాయ నమః॥
శ్రీ విశ్వభావనాయ నమః॥
శ్రీ తేజసామపి తేజస్వినే నమః ।



శ్రీ ద్వాదశాత్మనే నమః॥
శ్రీ ఇన్ద్రాయ నమః॥
శ్రీ ధాత్రే నమః॥
శ్రీ భగాయ నమః॥
శ్రీ పూష్ణే నమః ।
శ్రీ మిత్రాయ నమః॥
శ్రీ వరుణాయ నమః ।
శ్రీ అర్యమణే నమః ।
శ్రీ అర్చిష్మతే నమః ।
శ్రీ వివస్వతే నమః ।
శ్రీ త్వష్ట్రే నమః॥
శ్రీ సవిత్రే నమః ।
శ్రీ విష్ణవే నమః ।
శ్రీ పూర్వాయగిరయే నమః॥
శ్రీ పశ్చిమాయాద్రయే నమః ।
శ్రీ జ్యోతిర్గణానాంపతయే నమః ।
శ్రీ దినాధిపతయే నమః ।
శ్రీ జయాఖ్య బ్రహ్మద్వారపాల మూర్తయే నమః॥
శ్రీ జయభద్రాఖ్య ద్వితీయ ద్వారపాల మూర్తయే నమః॥
శ్రీ హర్యశ్వాయ నమః॥
శ్రీ సహస్రాంశవే నమః॥
శ్రీ ఆదిత్యాయ నమః॥
శ్రీ ఉగ్రాయ నమః॥
శ్రీ వీరాయ నమః॥
శ్రీ సారంగాయ నమః॥
శ్రీ పద్మప్రబోధాయ నమః ।

శ్రీ ప్రచణ్డాయ నమః ।
శ్రీ బ్రహ్మేశానాచ్యుతేశాయ నమః॥
శ్రీ సూర్యాయ నమః ।
శ్రీ ఆదిత్యవర్చసే నమః ।
శ్రీ భాస్వతే నమః ।
శ్రీ సర్వభక్షాయ నమః॥
శ్రీ రౌద్రవపుషే నమః ।
శ్రీ తమోఘ్నాయ నమః ।
శ్రీ హిమఘ్నాయ నమః॥
శ్రీ శత్రుఘ్నాయ నమః ।
శ్రీ అమితాత్మనే నమః ।
శ్రీ కృతఘ్నఘ్నాయ నమః ।
శ్రీ దేవాయ నమః ।
శ్రీ జ్యోతిషాంపతయే నమః ।
శ్రీ తప్తచామీకరాభాయ నమః ।
శ్రీ హరయే నమః ।
శ్రీ విశ్వకర్మణే నమః ।
శ్రీ తమోభినిఘ్నాయ నమః ।
శ్రీ రుచయే నమః ।
శ్రీ లోకసాక్షిణే నమః ।
శ్రీ భూతస్రష్ట్రే నమః ।
శ్రీ భూతపాలాయ నమః ।
శ్రీ భూతనాశనాయ నమః ।
శ్రీ ప్రభవే నమః ।
శ్రీ అపాంపతయే నమః ।
శ్రీ తపతే నమః ।
శ్రీ వర్షతే నమః ।
శ్రీ సుప్తేషు జాగ్రతే నమః ।
శ్రీ భూతేషు పరినిష్ఠితాయ నమః ।
శ్రీ అగ్నిహోత్రాయ నమః॥
శ్రీ అగ్నిహోత్రిణాం ఫలదాయ నమః॥
శ్రీ భగవతే బ్రహ్మణే నమః ।

# ఆదిత్యహృదయం
## స్వరూపం, ఫలం

**ఆ**దిత్య హృదయమంటే ఏదో పుణ్యం వచ్చే కొన్ని అక్షరాల గుంపులు, శ్లోకాలు అనుకుంటాం కాని దీనిలో ఉన్న అంతరార్థాలను చూస్తే మహావిషయాన్ని ఒకచోట నిబద్ధం చేసి శక్తిమంతమైన మహామంత్రంగా సమకూర్చాడు అగస్త్యమహర్షి అనే విషయం తెలుస్తుంది. మన ఋషుల విజ్ఞానానికి, వాళ్ళ అనుగ్రహానికి రెండు చేతులెత్తి నమస్కరిస్తాం. సూర్య ఉపాసనకు సంబంధించి ఆదిత్యహృదయం రామాయణం యుద్ధకాండలో ఇంచుమించు చివర భాగంలో వస్తున్నది. అక్కడ వరకూ ఇంకెక్కడా ఆదిత్యుని గురించి చెప్పలేదా అంటే, పరిశీలించి చూస్తే రామాయణంలో అనేక చోట్ల సూర్యభగవానుని విశేషాలను చెప్తారు.



మహాభారతంలో కూడా సూర్యతత్త్వం చాలా విస్తారంగా చెప్పబడింది, భాగవతంలో ప్రత్యేకించి సూర్యోపాసన ఉన్నది. అష్టాదశపురాణాలలోను సూర్యతత్త్వం చెప్పబడుతున్నది. ఇదికాక వేదాలను పరిశీలిస్తే వేదాలు అసలు సూర్యుని గురించే చెబుతున్నాయా అని పిస్తుంది. మొత్తంగా, ఆదిత్యహృదయం గురించి ఆలోచన చేస్తే భారతీయులందరూ నిజానికి సూర్యభగవానునే ఉపాసిస్తున్నారు అని తెలుస్తుంది.

మనం రకరకాల దేవతలను ఆరాధిస్తున్నా ఈ దేవతలందరూ సూర్యభగవానుని స్వరూపాలే అని, ఋషుల హృదయం బట్టి స్పష్టమౌతుంది. దీన్నిబట్టి వేదం చెబుతున్న ఏకేశ్వరవాదం ప్రకారంగా మనందరం వివిధ రూపాలలో ఒకే పరమాత్మని ఉపాసిస్తున్నాం. సూర్యుని ద్వారానే ఆ పరమాత్మని మనం నేరుగా ఉపాసిస్తున్నాం.

ఇది వేదఋషుల హృదయం.

వేదంలో ఉన్న కర్మకాండ, ఉపాసనాకాండ, జ్ఞానకాండ – ఈ మూడు కాండములు కూడా సూర్యభగవానుని వైభవాన్ని అడుగడుగునా ఆవిష్కరిస్తున్నాయి.

విష్ణుసహస్రనామాల్లో వెయ్యినామాలు కూడా సూర్యుని పరంగానే అన్వయించబడుతూ ఉంటాయి. ఇలా ఏ దేవతకి సంబంధించిన ఉపాసనా ప్రక్రియ ఐనప్పటికీ... సూర్యుని పరంగా అన్వయించడం అనేది వైదిక ఆగమాలలోను, ఇతర ఉపాసనా పద్ధతులలోను కనిపిస్తున్నది. ఈ ప్రాతిపదికన రామాయణాన్ని పరిశీలిస్తే అసలు విశ్వామిత్రుడు రామచంద్రమూర్తిని అవతారప్రయోజనం కోసం మేలుకొల్పడం దగ్గరే ఆదిత్యహృదయం కనిపిస్తుంది.

విశ్వామిత్రుని నోటంట పలికిన తొలి సుప్రభాత శ్లోకం అందరికీ తెలిసిన

**'కౌసల్యా సుప్రజారామ పూర్వాసంధ్యా ప్రవర్తతే**
**ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికం'**

ఇక్కడినుంచే ఆదిత్యహృదయం మొదలైందా అనిపిస్తుంది. రామచంద్రమూర్తి ఎందుకు అవతరించాడు అనేది సరిగ్గా విశ్వామిత్రులవారు తీసుకువెళ్ళిన దగ్గర్నించే ప్రారంభ మౌతోంది. విశ్వామిత్రునికి తెలుసు రాముడంటే ఎవరో. ఆయనతోపాటు ఇతర ఋషులకు కూడా తెలుసు. ఆ మాట విశ్వామిత్రులవారే చెప్పారు.

**'అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమం**
**వశిష్ఠోపి మహాతేజా యే చే మే తపసి స్థితాః'**

రాముడు ఎవరో నాకు తెలుసు, వశిష్ఠులకి తెలుసు, తపస్వులైన ఋషులకు తెలుసు అన్నాడు. రాముడు పరతత్త్వమనేది ఋషులకే తెలుసు – అని భావం.

రామునిలో ఉన్న పరతత్త్వస్వరూపమైన గాయత్రీ చైతన్యాన్ని దర్శించిన మహానుభావుడు విశ్వామిత్రుడు.

ఆ కారణం చేతనే తన యాగరక్షణ నెపంతో అవతారకార్యం కోసం తొలి అడుగు వేయించాడు రామచంద్రమూర్తి చేత. అలా తీసుకువెళుతూ ఉండగా ఒకచోట రామ చంద్రమూర్తి ఆ రాత్రి విశ్రమించిన తరువాత ప్రాతఃకాలంలో నిద్ర లేపుతూ **'కౌసల్యా సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే'** అంటున్నాడు.

ప్రాతఃకాలంలో నిద్రలేపే పద్ధతి చూడండి. ఎందుకు లేపుతున్నాడు తొలిసంధ్య వస్తోంది – నిద్రలేవవయ్యా– అన్నాడు. తొలిసంధ్య వస్తున్న సమయంలో నిద్రపోతే తప్పు. ఎందుకు లేవాలి! 'ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికం'.

'దైవం ఆహ్నికం' – ఆహ్నికం అన్నప్పుడు పగటి ప్రారంభసమయంలో చేయవల్సిన దైవకార్యాలు చెయ్యడం కోసం లేవవయ్యా! అన్నాడు.

నిజానికి విశ్వామిత్రుడు గాయత్రీమంత్ర ద్రష్ట. గాయత్రి ఎవరు? **'గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా'** – ఆవిడ సంధ్యాదేవి.

**'పూర్వాసంధ్యా ప్రవర్తతే'** – సంధ్యాసమయంలో గాయత్రీ ఉపాసన చెయ్యాలి కనుక గాయత్రీ మంత్రద్రష్ట ఐన విశ్వామిత్రులవారు రామచంద్రమూర్తిని లేపుతున్నారు. పైగా ఇందులో పిల్లవాడిని లేపుతున్న భావం కనిపిస్తున్నప్పటికీ ఇంకొక అంతరార్థం ఏమిటంటే కేవలం నరుని రూపంలో సంచరిస్తున్న రామచంద్రమూర్తిలో దాగిన నారాయణ చైతన్యాన్ని మేల్కొలిపి అవతార ప్రయోజనం వైపు నడపడమే ఇందులో ఉన్న అంతరార్థం.

అందుకు 'కర్తవ్యం దైవమాహ్నికం' అనే మాటలో మరొక అర్థం 'దేవకార్యం కోసం నువ్వింక పనిచేయవలసిన సమయం ఆసన్నమయ్యింద'ని ఆ సుప్రభాతం ద్వారా చెప్తున్నాడు.

'దేవకార్యసముద్యతా' అని చెప్పినట్లుగా దేవకార్యం కోసం అవతరించిన రామచంద్ర మూర్తి అప్పటినుంచి ప్రారంభించాడు.

'పూర్వాసంధ్యా ప్రవర్తతే, కర్తవ్యం దైవమాహ్నికం' అన్నప్పుడే ఆదిత్యహృదయం గుప్త రూపంలో దాగివుంది ఆ ఒక్క శ్లోకములో.



అవతారప్రయోజనం నెరవేర్చడం కోసం మొట్టమొదట ఆదిత్యహృదయాన్ని విశ్వామిత్రుడు పలికాడు. తరువాత అక్కడ నుంచి బయలుదేరిన రామచంద్రమూర్తి మారీచ సుబాహులని శిక్షించడం, సీతమ్మని చేపట్టడం, రావణవధ కోసం సన్నద్ధుడై రావడం జరుగుతుంది.

యుద్ధంలో రామచంద్రమూర్తి చేతిలో రావణుడు మూడు మార్లు దెబ్బతిన్నాడు. మొట్ట మొదట రామచంద్రమూర్తి శక్తిని చూద్దామని వచ్చినప్పుడే గట్టి దెబ్బ తిన్నాడు. తిరిగివెళ్ళి కుంభకర్ణుని పంపించినపుడు కుంభకర్ణుని రాముడు సంహరిస్తాడు.

మూడవసారి యుద్ధానికి వచ్చినప్పుడు రామచంద్రమూర్తి వేసిన బాణాల దెబ్బకి మూర్ఛపోయి రథం మీదే ఒరిగిపోతే రథాన్ని నడుపుతున్న రావణాసురుని సారథి అతడిని అక్కడ్నించి దూరంగా తీసుకెళ్ళిపోతాడు.

అలా తీసుకువెళ్ళగా కొంతసేపటికి మెలకువ వచ్చి, 'ఏమిటి నన్ను యుద్ధభూమి నుంచి తరలించావు?' అని సారథిని అడిగితే...

'తమరు అలా మూర్ఛపోయాక ఏం చెయ్యాలో తెలీక ఇలా తీసుకు వచ్చా'నంటాడు. రావణాసురుడు తిరిగి యుద్ధభూమికి వస్తున్న సందర్భంలో–

> తతో యుద్ధపరిశ్రాంతమ్ సమరే చింతయాస్థితమ్
> రావణంచాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్ (1)

**యుద్ధ పరిశ్రాంతం** – యుద్ధంలో అలసి ఉన్న రామచంద్రమూర్తి దూరం నుంచి వస్తున్న రావణాసురుని ఎదుర్కొనడానికి సిద్ధపడుతున్న సమయంలో

> దైవతైశ్చ సమాగమ్య దృష్టమభ్యాగతోరణమ్
> ఉపగమ్యాదబ్రవీద్రామమ్ అగస్త్యో భగవాన్ ఋషిః (2)

**'దైవతైశ్చ సమాగమ్యా'** – అగస్త్యమహర్షి దేవతలతో సహా కలిసి అక్కడికి వచ్చాడు. రామచంద్రమూర్తి యుద్ధంలో అలసి ఉన్న సమయంలో రావణాసురుడు రాబోతున్నాడు, అప్పుడు అగస్త్యులవారు వచ్చి ఆదిత్యహృదయం ఉపదేశం చెయ్యబోతున్నారు.

**'అగస్త్యో భగవాన్ ఋషిః'** అని ప్రారంభించడం ఒక మంత్రాన్ని ఉపాసించే సంప్రదాయం తెలిసినవారికి బాగా తెలుస్తుంది. ఏ మంత్రమైనా జపించే ముందు న్యాసం చేసుకొనే టప్పుడు **'అస్యశ్రీ మహామంత్రస్య'**....... ఫలానా ఋషి పేరు చెప్పి **'భగవాన్ ఋషిః'** అని అంటాం. అలా ఇక్కడ చెప్పబోయే ఆదిత్యహృదయమనబడే మంత్రానికి ఋషి అగస్త్యమహర్షి



**'అగస్త్యో భగవాన్ ఋషిః'** – భగవాన్ శబ్దానికి 'జ్ఞానవాన్' అని అర్థం. అవతారకార్యం కోసం రాముని 'ఉత్తిష్ఠ' అని లేపినవాడు విశ్వామిత్రుడు. మళ్ళీ అవతార కార్యం నెరవేరుతున్న సమయంలో అగస్త్యులవారు వచ్చారు.

అప్పుడూ మహర్షే ఇప్పుడూ మహర్షే పైగా ఈ అగస్త్యులవారు రామచంద్రమూర్తికి అరణ్యకాండలో దివ్యములైన వైష్ణవాస్త్రం, ధనుర్బాణాలు ఇచ్చిన వాడు. అక్కడ కూడా అగస్త్యులవారితో అనుబంధం కన్పిస్తుంది. ఈ ఆదిత్యహృదయంలో కూడా 'కౌసల్యా సుప్రజా రామ'లో గుప్తంగా దాగిన ఏ ఆదిత్యతత్త్వం ఉన్నదో అది ఇక్కడ విస్తారంగా కనబడుతుంది.

గాయత్రీమంత్రస్వరూపమే ఆదిత్యహృదయం. సంధ్యలలో ఈ ఆదిత్యహృదయాన్ని పఠించేవారు గాయత్రీమంత్ర జప ఫలాన్ని పొందుతారు. ఉపనయనసంస్కారం పొంది సంధ్యావందనం చెయ్యవల్సిన వాళ్ళందరూ కూడా ఆ సంధ్యావందనాలు మానేసి ఆదిత్యహృదయం చదివితే లాభం లేదు. ఆ సంస్కారాదులు లేనివారు మాత్రమే ఈ ఆదిత్యహృదయ మంత్రం చదువుకుంటే చాలు.

ఉపనయన సంస్కారం ఉన్నవాళ్ళు సంధ్యావందనం, గాయత్రీ మంత్రజపం తరువాత ఆదిత్యహృదయం చదువుకోవచ్చు. ఇతరులకి గాయత్రీ మంత్రజపం లేకపోయినా ఆదిత్యహృదయం చదువుకుంటే గాయత్రీమంత్రజపం ఫలం వస్తుంది. ఇందులో సందేహం లేదు.

రామాయణంలో ఆదిత్యుని ప్రస్తావన అనేకచోట్ల కనబడుతుంది. రామచంద్రమూర్తి అరణ్యవాస సమయంలో కూడా అనేకమార్లు ఆదిత్యుని ప్రస్తావన చేస్తాడు. రామునికి ఆదిత్యునిపై భక్తి కనిపిస్తుంది. నిజానికి భారతీయులందరూ కూడా ఆదిత్యోపాసకులే. ఇది సనాతన విషయం.

సూర్యుని గమనాన్ని ఆధారంగా చేసుకొని సంధ్యాకాలం నిర్ణయించుకొని సంధ్యా సమయంలో సూర్యునికి అర్ఘ్యము ఇవ్వడం భారతదేశంలో పుట్టిన ప్రతి ఆస్తికుడు చేస్తున్న పని, చెయ్యవలసిన పని. దీనికి వర్ణవివక్ష లేదు. ప్రతివారు సంధ్యాసమయంలో సూర్యునికి నమస్కరించడం, అర్ఘ్యప్రధానం చేయడం వారి వారి విధానాలను అనుసరించి ఉన్నది.

సంధ్యాసమయంలో సూర్యుని ఆరాధిస్తే పుణ్యం వస్తుంది. ఆరాధించకుండా ఉంటే పాపం కూడా వస్తుంది. సంధ్యాసమయాల్లో సూర్యుని ఆరాధించడం అనేది ఉంది. మనం సంధ్య ఎలా నిర్ణయిస్తాం? సూర్యుని గమనం బట్టే సంధ్యానిర్ణయం జరుగుతున్నది. సంధ్యా సమయాల్లో సూర్యుని ఉపాసించడం అనాదిసిద్ధమైన భారతీయ సంప్రదాయం. ఆ సంప్రదాయానికి చెందినవాడే రామచంద్రమూర్తి.



అందుకే రామునికి కూడా సూర్యునిపై ఉన్న భక్తిని అనేకచోట్ల వాల్మీకి చెప్తాడు.

అరణ్యకాండలో ఒకచోట రాముడు ఉదయిస్తున్న సూర్యభగవానుని చూస్తూ లక్ష్మణు నితో "ఈ అరణ్యంలో ఉన్న అద్భుతమైన పువ్వులన్నికోసి మాలగా తయారుచేసి కొండల మీంచి వెళ్ళి ఆ సూర్యుడి కంఠంలో వెయ్యాలనిపిస్తోంది" అంటారు. ఇలా అనేక చోట్ల సూర్యుని వర్ణన చాలా అద్భుతంగా చేస్తాడు.

వాల్మీకిమహర్షి ప్రత్యేకించి వేదహృదయాన్ని ఆవిష్కరించడంకోసం రామాయణాన్ని రచించారు. వేదవేద్యమైన పరతత్త్వాన్నే ఆదిత్యహృదయంలో ప్రస్తావన చేస్తున్నాడు. సూర్యుని గురించి మరొక అందమైన సంఘటన యుద్ధకాండ ప్రారంభములోనే వాల్మీకి చెప్తాడు. సాధారణంగా దీనిని అందరూ దాటేస్తారు గాని అది పట్టుకోవాలి. అది పట్టుకో గలిగితే మనకి ఆదిత్యహృదయం అక్కడే దొరికిపోతుంది.

రామచంద్రమూర్తి వానరసేనతో సహా యుద్ధానికి సన్నద్ధుడవుతాడు. రావణాసురునికి

కూడా విషయం తెలిసింది. ఉక్రోషం వచ్చి మహాకోపం వస్తుంది. దానితో సీతమ్మని ఏడిపించాలని నిర్ణయించుకొని మాయతో ఖండించబడిన రామలక్ష్మణుల శిరస్సులను తయారుచేసి సీతమ్మకి చూపిస్తాడు. అవి చూసి సీత మూర్ఛపోతుంది. అతడు వికటాట్ట హాసం చేసి ఆ తలలు అక్కడ పడేసి వెళ్ళిపోతాడు.

ఈ లోపల విభీషణుడి కూతురు నల వచ్చి సీతమ్మను ఓదార్చి ఇదంతా మాయ అని చెబుతుంది. అయితే ఎంతైనప్పటికి తెగిన తన పతి తలను చూసి తీవ్రమైన మానసిక ఆందోళన చెందుతుంది. ఆవిడకి తీవ్రమైన వేదన కలిగింది. అప్పుడు వాల్మీకి ఒక మాట రాస్తారు.

**గిరివరమభితోను వర్తమానో హయరివమండలమాశు యఃకరోతి**
**తమిహశరణమభ్యుపైహి దేవం దివసకరం ప్రభవోహ్యయం ప్రజానామ్**

ఇది వాల్మీకి రామాయణంలోని శ్లోకం.

**'గిరివరమభితోను వర్తమానో'** – సూర్యభగవానుడు సమస్త భువనానికి కాంతిని ప్రసాదిస్తూ ఉదయగిరి, అస్తగిరుల యందు సంచరిస్తున్నవాడు. అలాంటి 'దివసకరం' – పగటిని కలిగించువాడు. 'ప్రభవోహ్యయం ప్రజానామ్' – జీవులను కలిగించువాడు. సృష్టి, స్థితి, లయ కారకుడైన దినకరుడు అయిన సూర్యభగవానుని 'శరణమభ్యుపైహి' – శరణువేడు అని ఒక సందేశం ఆవిడకి స్ఫురించింది.



శరణు వేడడం అంటే 'నీవే దిక్కు అని పట్టుకోవడం'. వెంటనే ఆవిడ సూర్యభగవానుని చూసి నమస్కరించగానే మనస్సులో వేదనంతా పోయింది. ఈ మాట యుద్ధకాండ ప్రారంభంలోనే వాల్మీకి రాసాడు. అంటే ఆదిత్యహృదయం అక్కడ మొదలయ్యిందని భావించవచ్చు.

ముందు సీతమ్మ, తరువాత రామచంద్రమూర్తి ఆదిత్యుని ఉపాసించడం చూపించాడు. సీతమ్మకి కలిగింది మానసికమైన వేదన. ఆ వేదనంతా పోగొట్టాడు సూర్యభగవానుడు. రామచంద్రమూర్తి 'యుద్ధపరిశ్రాంతమ్' – యుద్ధంలో అలిసిపోయాడు కాని ప్రతాపమేమీ తగ్గలేదు మహానుభావునికి. ఓడిపోయి దెబ్బతిని వెళ్ళింది రావణాసురుడు.

రామచంద్రమూర్తి అవతారపురుషుడైనప్పటికి మానవశరీరం ధరించి ఉన్నాడు కనుక తల్లక్షణాన్ని చూపిస్తున్నాడు. అందుకు 'యుద్ధపరిశ్రాంతం' అన్నారు. సీతమ్మకి కలిగింది మానసికమైన వేదన ఐతే రామచంద్రమూర్తికి కలిగింది శారీరకమైన వేదన. మానసికమైన వేదన నుండి శాంతి పొందడానికి సీతమ్మ దివాకరుని ఆశ్రయించింది. రాముడు

ఆదిత్యుని ఆశ్రయించబోతున్నాడు. ఆదిత్యుడు వేరు, దివాకరుడు వేరుకాదు. కానీ ఏ నామం ఉపాసన చేస్తే ఏ ఫలితం వస్తుందనేది ఒకటుంటుంది.

అందుకే సూర్యభగవానునికి చాలా పేర్లు ఉన్నాయి. ఒక్కో పేరుకి ఒక్కో ప్రయోజనం ఉంటుంది. అదే మంత్రమంటే, నామమంటే. సూర్యునికి ఇన్ని పేర్లు కేవలం భారతీయ హిందూమతంలో తప్ప ఇంకెక్కడా కనబడవు. ఇన్నిపేర్లు చెప్తున్నాడంటే అర్థం ఇన్ని పేర్లతో సూర్యవిజ్ఞానాన్ని చెప్తున్నాడు. ఒక్కొక్క పేరుకి అర్థం తీసుకుంటే సూర్యుని గొప్పతనం కనపడుతుంది. సూర్యవిజ్ఞానాన్ని అందించడం కోసం ఇన్ని పేర్లు పనికొచ్చాయి. ఇవన్నీ వేదం ఇచ్చిన పేర్లు.

దివాకర స్వరూపంగా సూర్యుని ఆరాధిస్తే మానసికమైన వేదనలు పోతాయి. ఆదిత్య స్వరూపంగా సూర్యుని ఆరాధిస్తే శారీరకమైన కలతలు, నలతలు తొలగిపోతాయనే భావాన్ని అన్వయించుకోవచ్చు. ఇలా ఆదిత్యోపాసన, దివాకరోపాసన రెండూ సూర్యోపాసనగా కనబడుతున్నాయి. అనేక చోట్ల వాల్మీకి సూర్యోపాసనా వైశిష్ట్యాన్ని మనకి తెలియజేసాడు.



ఆదిత్యహృదయమనే మంత్రం మన దాకా రావడానికి కారణం అగస్త్యులవారు. ఆయన రామచంద్రమూర్తికి ఉపదేశిస్తే దాన్ని వాల్మీకి తన తపశ్శక్తి ద్వారా దర్శించి మనకి అనుగ్రహిస్తారు. అగస్త్యుడు వేదఋషి. వేదాలలో అనేక మంత్రాలకి ద్రష్ట. అగస్త్యులవారి చరిత్ర పురాణాలలో అనేక చోట్ల కనిపిస్తూ ఉంటుంది. రామాయణంలో రామచంద్రమూర్తి అరణ్యవాసానికి వెళ్ళినప్పుడు అనేక మంది మహర్షులు ఆయన కోసం తపించిపోతూ ఆయన్ని చూడాలని ఎదురుచూస్తారు. వాళ్ళందరిని రాముడు అనుగ్రహించాడు. వాళ్ళను చూసి రాముడూ ఆనందించాడు. రామాయణంలో రాముని చూడాలనుకున్న మహర్షులు కనబడతారు. కాని రాముడు చూడాలనుకున్న మహర్షి ఒక్కడే ... ఆయనే అగస్త్యమహర్షి. వనవాసంలో దివ్యమైన ధనుస్సునిచ్చిన అగస్త్యులవారే ఇక్కడ దివ్యమైన మంత్రాన్ని ఇస్తున్నారు.

**రామ రామ మహాబాహో శ్రుణుగుహ్యం సనాతనమ్**
**యేన సర్వానరీన్ వత్స సమరేవిజయిష్యసి (3)**

ఓ రామా! విను. 'రామ రామ' అని పిలవడం అగస్త్యులవారికి రామునిపై ప్రేమని తెలియజేస్తోంది. మహాబాహో!– ఓ మహాపరాక్రమశాలియైన రామచంద్రమూర్తి! నేను చెప్పబోయేది విను. ఇది గుహ్యం. గుహ్యం అంటే రహస్యమైనది.

యుద్ధభూమిలో కూర్చోబెట్టి రహస్యం చెప్పడమా! కృష్ణపరమాత్మ గీత అంతాచెప్పి యుద్ధంలో 'ఇదం గుహ్యతమమ్' శాస్త్రం అన్నారు. ఇది గుహ్యాల్లోకెల్లా గుహ్యమైనది. అది గుహ్యతమం. గుహ్యతమమ్– రహస్యాల్లోకెల్లా మహారహస్యం. దీన్ని మించిన రహస్యం లేదు. అలాంటిది చెప్తున్నానని యుద్ధంలో చెప్పాడు, అదీ బహిరంగంగా.

గుహ్యం అనే పదం శాస్త్రశబ్దం. శాస్త్రాలలో ప్రకట, గుహ్య అని రెండు రకాలు ఉంటాయి. ప్రకట శాస్త్రాలు భౌతిక శాస్త్రాలు. ఇంద్రియాలకి తెలిసే శాస్త్రాలన్నీకూడా ప్రకటశాస్త్రాలు. సైన్సు అంతా ప్రకటశాస్త్రమే. కెమిస్ట్రీ, ఫిజిక్స్, బోటనీ లేదా బయాలజీ కావచ్చు ఏవైనప్పటికి కూడా ఇవన్నీ మన ఇంద్రియాలతో తెలుసుకొనే శాస్త్రాలు.

ఇంద్రియాలతో తెల్సుకోలేని శాస్త్రాలు ... అవి ఋషులు మాత్రమే ఇవ్వగలరు తప్ప భౌతిక విజ్ఞానశాస్త్రవేత్తలు ఇవ్వలేరు. అతీంద్రియ దృష్టి కలిగిన తాపసులు, ఋషులు ఇచ్చిన శాస్త్రాలే గుహ్యశాస్త్రాలు.

ఈ గుహ్యశాస్త్రాలు మూడు రకాలు. అవి గుహ్య, గుహ్యతర, గుహ్యతమ అని చెప్పబడతాయి. ఇప్పుడు మనం చెప్పుకున్న ఈ గుహ్యం దేనికైనా అన్వయించవచ్చు. గుహ్యశాస్త్రం అంటే ధర్మశాస్త్రం. ధర్మశాస్త్రాలను మనం భౌతికంగా ఋజువు చేయలేం. ఋజువు చేయలేం అని అవి అబద్ధాలు అనడానికి లేదు. ఇది భౌతికదృష్టికి అర్థం కాదు. ఋషులు చెప్పింది అతీంద్రియ దృష్టికి మాత్రమే అర్థమౌతుంది. ఈ ధర్మశాస్త్రాలన్నీ గుహ్యశాస్త్రాలు.



ఉపాసనా శాస్త్రాలన్నీ గుహ్యతర శాస్త్రాలు. గుహ్యతమ శాస్త్రం అంటే కేవలం బ్రహ్మవిద్య, ఆత్మవిద్య అని అర్థం.

గుహ్య అనే శబ్దం మూడింటికి కలిపి వాడినా మూడింటిలో చిన్న చిన్న తేడాలు గ్రహించాలి. భౌతికానికి అతీతమైన దానిని గుహ్య అంటారు. ఆదిత్యహృదయంలో చెప్పబడిన సూర్యవిజ్ఞానం భౌతికవిజ్ఞానానికి దొరకని అతీంద్రియ సూర్యవిజ్ఞానం.

దృష్టి మూడు రకాలు – భౌతిక దృష్టి, ఉపాసనా దృష్టి, తాత్త్విక దృష్టి. భౌతిక దృష్టితో చూస్తే సూర్యుడు మండుతున్న అగ్నిగోళం. ఉపాసనా దృష్టితో చూస్తే ఆయన సాక్షాత్తు పరదేవత. తత్త్వదృష్టితో చూస్తే ఆయనే సర్వజీవులలో ఉండే ఆత్మ.

భౌతిక దృష్టి మానవుల దగ్గర్నించి పశుపక్ష్యాదుల వరకూ ప్రతివారికి ఉంటుంది. భౌతికదృష్టి పాశవికం. భౌతికదృష్టి కంటె ఉపాసనాదృష్టి, దానికంటె తాత్త్విక దృష్టి ఉత్కృష్టమైనది. భౌతికదృష్టి వలన ప్రయోజనం ఏమీ లేదు. ఉపాసనా దృష్టి వల్ల క్రమంగా

తాత్త్వికదృష్టిలోకి పరిగణించబడతాం. అది మోక్షాన్ని ఇస్తుంది. ఉపాసనా దృష్టి, తాత్త్విక దృష్టి వల్ల మాత్రమే మోక్షాన్ని పొందగలం.

భౌతికదృష్టి అంటే ప్రహ్లాదుడు చెప్పినట్లుగా 'చచ్చుచు పుట్టుచున్ మరల చర్విత చర్వణులైన వారికిన్', అంతే! అదే భౌతికదృష్టిలో ఉన్నవారికి లభించేది. సూర్యభగవానుని ఉపాసనా దృష్టితో, తాత్త్విక దృష్టితో చూడగలిగిన మహర్షులు భారతీయ ఋషులు. అలాంటి ఋషి పరంపరకి చెందిన వారం మనం. ఇందులో భౌతిక దృష్టి ఉంది, కాని భౌతికదృష్టి ప్రధానం కాదు. భౌతిక దృష్టితో పాటు ఉపాసనాదృష్టి, తాత్త్విక దృష్టిని కూడా ఇచ్చింది వేదం. వేదాల్లో చెప్పిన సౌరవిజ్ఞానం కూడా ఆదిత్యహృదయంలో ఉన్నది.

గుహ్యమేకాదు 'సనాతనం' అన్నారు. సాధారణంగా ఇదంతా ఫలశ్రుతి క్రింద తీసేసు కుంటాం కాని ఇందులోనే ఆదిత్యహృదయం స్వరూపాన్ని చెప్తున్నాడు. ఇది ఎక్కడ నుంచి వచ్చింది? ఎలా వచ్చింది? ఎలా ఉంటుంది? అగస్త్యులవారు పరిచయం చేస్తున్నారు.

**'గుహ్యం సనాతనమ్'** - సనాతనం అంటే శాశ్వతం, 'సనత్' శబ్దానికి శాశ్వతం అని అర్థం. పురాతనం వేరు సనాతనము వేరు. పాతది అయితే పాడుబడే అవకాశం ఉంది. 'సనాతనమ్' ఇది నిత్యనూతనం.



**'శ్రుణుగుహ్యం సనాతనం'** - ఇది నేనేదో కొత్తగా నీకు చెప్పేది ఏం కాదు నాయనా! ఒక సనాతనమైన సత్యాన్ని, ధర్మాన్ని నేను నీకిప్పుడు బోధించబోతున్నాను. ఇది గుహ్యం. సనాతనం. ఎందుకు ఇప్పుడు చెప్తున్నావు? యుద్ధభూమిలో హఠాత్తుగా వచ్చి ఈ సనాతనం, గుహ్యం నాకెందుకయ్యా అంటావా!

**'ఏన సర్వాన్ అరీన్ వత్స సమరే విజయిష్యసి'** –వత్సా! ఎంత వాత్సల్యంగా పిలుస్తున్నారో ... అగస్త్యులవారు రామచంద్రమూర్తిని. నాయనా! 'యేన' - ఏ విద్య ద్వారా నువ్వు యుద్ధంలో సర్వశత్రువులని జయించగలవో ఆ విద్య ఇది అన్నాడు. శత్రునాశనం సులభంగా కలిగించే శక్తి దీనికుంది.

> **ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనమ్**
> **జయావహం జపేన్నిత్యమక్షయం పరమం శివమ్ (4)**

మనకెవరూ శత్రువులు లేరు కనుక మనకిది అక్కర్లేదు అనుకోవడానికి లేదు. దీనివల్ల ప్రయోజనాలు ఇంకా చాలా ఉన్నాయి అని చెప్తూ 'పుణ్యం' అన్నారు. 'పునాతి అనేన ఇతి పుణ్యం' - దేని వల్ల మనం పవిత్రులం అవుతామో అది పుణ్యం.

మనం శుద్ధులం కావాలి. చిత్తం శుద్ధం చేసే దానికి పుణ్యం అని పేరు. ఆదిత్యహృదయం మన చిత్తాన్ని శుద్ధం చేసి పవిత్రుల్ని చేస్తుంది. చాలామందికి సిద్ధి మీద ఎక్కువ ఆసక్తి ఉంటుంది. శుద్ధికి సున్నాపెట్టి సిద్ధికోసం తాపత్రయ పడితే ప్రయోజనం లేదు. మనకి ముందు శుద్ధి ఉండాలి. కనుక పుణ్యం అన్నారు.

మళ్ళీ 'సర్వశత్రువినాశనం' అన్నారు. ఒకడు శత్రువని మనకు తెలుస్తూ ఉంటుంది, మనకు తెలియకుండా ఎందరున్నారో శత్రువులు! ప్రతికూలతలే శత్రువులు. ఎవడి మీదో కక్ష పెట్టుకొని వాడు మన శత్రువు, వాడికి మనం శత్రువు అనుకుంటే సరిపోదు. మనం అభ్యుదయమార్గంలో ఉండేటప్పుడు ప్రతికూలతలు ఎదురైతే మనమేమీ సాధిం చలేం. 'అభ్యుదయం' – భౌతికజీవితంలో ఎదుగుదల కావచ్చు, ఆధ్యాత్మిక జీవితంలో పరిణితి కావచ్చు. ఈ ప్రతికూలతలు బయట నుంచి రావచ్చు, లేదా మన లోపలనించే రావచ్చు.

మనల్ని బాధించే శత్రువులు మనలో ఎంతమంది ఉన్నారో మనకి తెలియదు. అరిషడ్వ ర్గాలైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను జయించడం కష్టంగాని అవి తెలియడం సులభమే. కనుక సర్వశత్రువినాశనం అంటే అంతఃశత్రువులు, బహిః శత్రువులు, ప్రతికూలతలు.



ఇవన్నీ పోగొట్టగలిగే శక్తి ఆదిత్యహృదయానికి ఉంది. అందుకు **ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రువినాశనం.**

**'జయావహం'** – ఇది జయాన్ని కలిగిస్తుంది అన్నారు. శత్రువులు నశించారంటేనే జయం. 'జపేన్నిత్యం' – జయం అంటే 'మించిపోయి ఉండుట' ఒక అర్థం. అన్నిటి కన్నా మించిపోవడం. మనల్ని మించి ఎవడూ ఉండకూడదు. ప్రతివాడు ప్రక్కవాడి కంటే మనం గొప్పగా ఉండాలి – అనుకుంటాడు. వేదంలో 'సమానానాం ఉత్తమశ్లోకోస్తు' అని ఆశీర్వచనం ఉంది. నీ సాటివాళ్ళల్లో నువ్వు ఉత్తమశ్లోకుడుగా ఉందువుగాక! కనుక అందరినీ మించి మనం ఉండడమే జయం.

కాని జయమనే మాటకి శాస్త్రీయమైన అర్థం చతుర్విధ పురుషార్థాలు సాధించడమే. అదే 'తతోజయముదీరయేత్'. ఏ శాస్త్రం ద్వారా మనం ఈ నాలుగు సాధిస్తామో ఆ శాస్త్రం పేరు 'జయం'. అందుకే సూతపౌరాణికులు పురాణానికి, భారతానికి ముందు జయమని ఈ మాట చెప్తారు. కనుక 'జయావహం' అంటే ధర్మ, అర్థ, కామ, మోక్షాలని కూడా ఇవ్వగలిగే శక్తి ఆదిత్యహృదయానికి ఉన్నది.

'అక్షయం పరమం శివమ్' - అక్షయం అంటే అనంతం. దీనిలో ఉన్న తత్త్వం అనంత తత్త్వం. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అని శ్రుతి చెప్పినట్లుగా ఏది అనంతమైన పరతత్త్వమున్నదో ఇది దానినే చెప్తున్నది. జీవితంలో కేవలం భౌతికప్రయోజనాలే కాదు ఇంకా పొందవల్సింది ఒకటుంది. జీవితంలో ఎన్ని సాధించినా అది పూర్తిసాధన కాదు 'తతః కిమ్? తతః కిమ్?' అన్నారు శంకరులవారు.

ఏది సాధించినా ఏం ప్రయోజనం? కైవల్యాన్ని సాధించాలి అదే అక్షయం, అనంత ఫలప్రదం. అనంత ఫలప్రదం అంటే మోక్షం. మిగిలినవన్నీ 'అంత'ఫలాలే. ప్రతి దానికి అంతం ఉంది. కైవల్యానికే అంతం లేదు అది అనంతఫలం. దానికే అక్షయం, పరమం, శివం అని పేరు. ఈ మూడు మాటలు ఒక దానినే చెప్తున్నాయి.

ముందు చెప్పిన పుణ్యం, సర్వశత్రువినాశనం, జయావహం అనేవి భౌతిక ప్రయోజనాలు.

**'అక్షయం పరమం శివం'** అనేవి పారమార్థిక ప్రయోజనాలు. ఐహిక, పారమార్థిక ప్రయోజనాలు రెండూ ఇవ్వగలిగే శక్తి ఆదిత్యహృదయంలో ఉంది. కనుక దీన్ని శ్రద్ధగా ఏకాగ్రంగా తదేక శరణాగతితో పట్టుకుంటే ఇహము, పరము రెండూ ఇవ్వగలదు. అందుకు దీనిని అక్షయం పరమం శివం అన్నాడు.



అక్షయమంటే క్షయం కానిది. అంతం కానిది, నాశనరహితమైనది. దాన్నే 'పరమం' అన్నారు. 'పరమం' అంటే సర్వోత్కృష్టం అదే శివం అన్నారు. శివమనే మాట చాలా విశేషం. దాన్ని ఉపనిషత్తులలో వాడారు. శివం అంటే త్రిగుణాతీతస్థితి. త్రిగుణాలకు అతీతమైన మోక్షస్థితిని, కైవల్యపదవిని 'శివం' అంటారు. దేనికైనా శివం పొందటమే ప్రయోజనం. భాగవతం రెండవ శ్లోకంలో భాగవతం ఇచ్చే ఫలితం చెప్తూ 'శివదం తాపత్రయోన్మూలనం' అన్నారు.

తాపత్రయ శాంతి కలిగించి శివమును ఇస్తుంది. ఏది శివం ఇస్తుందో అదే మనకి కావాలి. అటువంటి పరమసత్యాన్ని ఆదిత్యహృదయం సిద్ధింపజేస్తుంది అని చెప్తూ

> సర్వమఙ్గలమాఙ్గల్యం సర్వపాపప్రణాశనమ్
> చిన్తాశోకప్రశమనమాయుర్వర్ధనముత్తమమ్ (5)

అసలు మంగళాలలోకెల్లా మంగళమైనది ఇది అన్నారు. సృష్టిలో శుభం అనేది ఒకటుంటుంది. ఇది శుభాలలోకెల్లా శుభం. పైగా దేన్నయినా శుభం చెయ్యగలిగే శక్తి

దీనికుంది అన్నారు. జీవితంలో అందరూ శుభం కోరుకుంటాం గాని అందరికీ శుభం రాకపోవచ్చు. అశుభం కూడా వస్తూ ఉంటుంది. కాని ఈ స్తోత్రం అశుభాన్ని రానివ్వదు. అంతేకాకుండా వచ్చిన అశుభాన్ని కూడా శుభంగా మార్చగలిగే శక్తి ఆదిత్యహృదయానికి ఉన్నది. అదే సర్వమంగళ మాంగళ్యం.

పుణ్యం అని ముందు చెప్పి ఇక్కడ 'సర్వపాపప్రణాశనమ్' అని నొక్కి చెప్పాడు. అన్ని పాపాలని కూడా తొలగించగలిగే శక్తి దీనికి ఉన్నది. కాయిక, వాచిక, మానసిక పాపములని నశింపజేసే శక్తి ఉన్నదని వివరిస్తూ 'చింతాశోకప్రశమనమ్'- చింత, శోకం ఈ రెండిటిని కూడా పూర్తిగా తొలగిస్తుంది అన్నారు.

'ప్ర-శమనం' - అంటే సంపూర్ణంగా తొలగించేది. ఇది ఐహిక ప్రయోజనాన్ని చెప్తున్నది. చింత అంటే హృదయంలో పడే తీవ్రమైన వేదన. శోకం అంటే దానిని వెళ్ళగ్రక్కేటప్పుడు వచ్చేది. బయటకి కనపడేది శోకం, లోపల కుమిలిపోవడం చింత. చింత, శోకం అజ్ఞానం వల్ల కలుగుతాయి. ఆ అజ్ఞానాన్ని తొలగించి ఇది జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. 'ఆయుర్వర్ధనం' - ఇది ఆయుష్షుని వృద్ధి చేస్తుంది. 'ఉత్తమమ్' - దీనిని మించి మరి ఉత్కృష్టమైనది లేదు.



ఇదే గొప్పది అని ఉపాసించాలి. మన పురాణాలలో స్తోత్రాలని పరిశీలిస్తే దేనికదే 'ఉత్తమం' అనే మాట కనబడుతూ ఉంటుంది.

అంతేకాదు మనం చేసే వ్రతాలలో ఏ వ్రతానికి ఆ వ్రతమే 'వ్రతానాం ఉత్తమం వ్రతం' అంటారు. అన్ని వ్రతాలలోకి ఈ వ్రతమే గొప్పదని అన్ని వ్రతాలకి రాస్తారు. ఉపాసన చేసేటప్పుడు ఇదే సర్వోత్కృష్టం అనే ప్రగాఢమైన శ్రద్ధ దాని మీద ఉండాలి. అప్పుడే అది ఫలిస్తుంది. అందుకు ఇది ఉత్తమం అనే భావాన్ని చూపిస్తున్నారు. ఇంత వరకూ అగస్త్యులవారు ఆదిత్యహృదయ స్వరూపం, ఫలం ఈ రెండు చెప్పారు. అదిత్యహృదయం వల్ల వచ్చే ఫలితం చెప్పారు.

### అగస్త్యుడు అనే పేరులో ఉన్న అంతరార్థం

అగస్త్యుడు దేవ ఋషి. అగస్త్యుడు అంటే అగమును స్తంభింపజేసినవాడు అని ఒక అర్థం. అగము అంటే కొండ. ఆయన కొండని స్తంభింపజేసాడు. వింధ్యపర్వత గర్వాన్ని అణచాడు గనుక అగస్త్యుడు - అని పేరు వచ్చింది. కాని వింధ్యపర్వతగర్వాన్ని అణచక ముందు కూడా ఆయన పేరు అగస్త్యుడే.

అగస్త్యుడు అన్న శబ్దానికి తత్త్వపరంగా రెండు అర్థాలున్నాయి. అగము అంటే

కదలకుండా ఉండేది. కదలకుండా ఉండే దానియందు ఎవడున్నాడో వాడు అగస్త్యుడు. కదలడం అంటే మార్పు చెందడం.

కదలిక అంటే మార్పు –మరొకటి కాదు. సృష్టిలో అన్ని మారిపోతూనే ఉంటాయి. ఏదీ స్థిరంగా ఉండదు. మారేదానియందు మారకుండా ఉన్నది ఆత్మతత్త్వం. ఏది మారకుండా, కదలకుండా ఉందో దానియందు బుద్ధిని నిలిపి ఉంచుట. అగస్త్యుడు అంటే నిశ్చలమైన పరతత్త్వమునందు తన బుద్ధిని నిలిపి ఉంచినవాడు. పరతత్త్వనిష్ఠ కలిగినవాడు. ఇదే అసలు అర్థం.

ఇంకో అర్థం అగము అంటే బురద. నక్షత్రాలలో కూడా అగస్త్య నక్షత్రం ఉన్నది. 'ఋషయః సప్తాః త్రిశ్చయః సర్వే త్రయో అగస్త్యా నక్షత్రైః సంకృతే వసన్' అని వేదం. 'సర్వే త్రయో అగస్త్యస్య' అని అగస్త్యంశం వేదములో కనబడుతోంది. జ్యోతిర్విజ్ఞానం కూడా మన గ్రంథాలలో దాగి ఉంది. ఋషులు సిద్ధదేహాలతో భూమియందు సంచరిస్తూ అనుగ్రహిస్తారు. యోగ్యులకు మాత్రమే దర్శనమిస్తారు. జ్యోతిర్దేహాలతో గగనంలో ఉంటూ విశ్వవ్యవస్థలో ప్రధాన భాగంగా ఉంటారు. ఋషులశక్తి, దేవతాశక్తి, మంత్రశక్తి ఈ మూడూ ప్రపంచాన్ని ఎప్పుడూ రక్షిస్తూ ఉంటాయి. అందుకే ఋషుల్ని, దేవతల్ని మనం ఉపాసన చేస్తాం. ఈ ఋషులకి, దేవతలకి అనుసంధానం మంత్రం. దేవతలకి ఎంత ప్రాధాన్యం ఉన్నదో ఋషులకు కూడా అంత ప్రాధాన్యం ఉన్నది. వీళ్ళు ప్రతి మన్వంతరం లోను, సర్వకాలములలోను ఉంటారు. గగనంలో సప్తఋషుల మండలాలు ఉన్నాయి.

విశ్వామిత్రుడు, వశిష్ఠుడు, జమదగ్ని వీరు మనకి సప్తర్షిమండలంలోనూ ఉన్నారు, పురాణపాత్రలలో కనిపిస్తారు. అంటే అక్కడినుంచి దిగి తిరుగుతున్నారని కాదు. వారు తమ తపఃశక్తిని ఈ తేజోరూపంగా మలచి అక్కడుంచుతారు. తద్రూపంగా జగత్తుని రక్షిస్తూ ఉంటారు. అలాగ అగస్త్యనక్షత్రం ఉంది. ఈ అగస్త్యతార మనకి భూమియందు కనిపించే సమయం ఒకటుంది.

నక్షత్రమండలాలు ఎప్పుడూ ఉంటాయి. కాని ఈ భూమి గమనం వల్ల కొన్ని నక్షత్రాల్ని తెల్సుకోగలం. ప్రతి మాసంలో కొన్ని నక్షత్రాలు మనకి కనబడతాయి. ప్లాంటోరియంకి వెళ్తే భూమి గమనం చేత ఏ మాసంలో, ఏ కాలంలో ఏ యే నక్షత్రాలు మనం చూడగలం అనేది తెలుస్తుంది.. అలాగ అగస్త్య నక్షత్రం మనకు కనబడే సమయం శరదృతువులో వచ్చే ఆశ్వీయుజమాసం.

దానికి అగస్త్య అనే పేరు పెట్టడానికి ఒక అంతరార్థము చెప్పారు. సరిగ్గా శరదృతువుకి

పూర్వం వరకూ వర్షఋతువు ఉంటుంది.

ఈ వర్షఋతువులో వర్షం వల్ల జలాశయాలన్ని బురదతో నిండి ఉంటాయి. శరదృతువు రావడంతో ఈ బురద అంతా క్రిందకి వెళ్ళి నీరంతా తేట పడుతుంది. శరత్కాలంలో నీరూ తేట పడుతుంది. ఆకాశం తేట పడుతుంది. బురద తగ్గి తేటదనం వచ్చే కాలం పేరు శరత్కాలం.

కాలపరంగా చూస్తే శరత్కాలంలో తేటదనం ఉండి ఆ సమయంలో ఈ నక్షత్రోదయం జరుగుతుంది. అగం అనగా బురద. కనుక అగస్త్య అంటే బురదను లేకుండా చేయువాడు. అగస్త్యోదయకాలంలో ఈ బురద మొదలైనవన్ని తగ్గుతాయి కనుక ఆ నక్షత్రానికి అగస్త్యనక్షత్రమని పేరొచ్చింది.

అగస్త్యమహర్షి మహాప్రభావశాలి. దేవతలు కూడా అగస్త్యమహర్షిని శరణువేడితే వారికి అభయమిచ్చి రక్షించిన ఘట్టాలు పురాణాల్లో అనేకం కనబడతాయి.

ఋషులు కొందరు శాశ్వతంగా ఉంటారు. అలాంటి ఋషుల్లో వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, అగస్త్యుడు మొదలైనవారు. ఇప్పటికీ అగస్త్యులవారు ఉన్నారు. సామాన్యులకు కనబడరు. ఇక్కడ తలంచుకున్నా వారు తెల్సుకొని మనల్ని అనుగ్రహిస్తారు.

'రశ్మిమంతం' దగ్గర్నించి ఆదిత్యహృదయం మొదలు అవుతుంది. రశ్మిమంతం నించి గమనించినట్లయితే 125 సూర్యనామాలు కనిపిస్తాయి. వీటిని వ్యాఖ్యాతలు 'భగవద్రహస్య నామములు' అన్నారు.

ఎన్నో అంతరార్థాలు దాగి ఉన్న నామాలు కనుక వీటికి రహస్యనామములు అని పేరు. ఇవి మహాశక్తిమంతములైన నామములు. ఏవి విలువైనవో అవే రహస్యంగా దాచుకుంటాం. గొప్పవి కనుక రహస్య నామములు. శాస్త్ర సహాయంతో మాత్రమే అర్థాన్ని గ్రహించగలిగే నామాలు, ఇవి ఎవరి నామాలు? భగవన్నామాలు.

భగవంతుడంటే ఎవరు? సూర్యుడా! విష్ణువా! శివుడా! మన సంస్కృతి గురించి శ్రద్ధతో చదివితే ఇందరు లేరు, ఉన్నవాడు ఒక్కడే అని తెలుస్తుంది. ఆ ఒక్కడే ఇన్ని రకాలుగా ఉన్నాడని తెలుసుకొని ఏ రకంగా ఉపాసించినా ఒక్కడినే ఉపాసిస్తున్నాం అనే సంస్కారం కలుగుతుంది. అదే మన భారతీయ సంస్కృతి. వేదంలో 'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి' అనే మంత్రం కూడా సూర్యునికి సంబంధించి మంత్రాలు చెప్పినప్పుడే చెప్పారు. కొంతమంది ఈ నామాలు 'రశ్మిమంతం సముద్యంతం' నుంచి మొదలయ్యాయి అంటే మరి కొంతమంది తరువాత శ్లోకం 'సర్వదేవాత్మకో హ్యేషః'

దగ్గర్నించి మొదలయ్యాయి అంటారు. ఎవరి పద్ధతి వారిది. మనం మాత్రం రశ్మిమంతం దగ్గర్నించే తీసుకొందాం.

## భగన్నామ వైశిష్ట్యం

ప్రతి నామానికి అర్థం చూస్తే దానిలో ఉన్న విశేషాలు బట్టి సూర్యభగవానుడంటే ఏమిటో మనకు తెలుస్తున్నది. మనకి అన్నీ నామాలే. విష్ణుసహస్రనామం, లలితా సహస్రనామం, సహస్రనామాలు లేకపోతే అష్టోత్తరశతనామాలు. అలా అన్నీ నామాలే. సూర్యునికి కూడా సహస్రనామాలు ఉన్నాయి.

నామం సాక్షాత్తు భగవంతుని శబ్దరూపం. మనకి ఈ దృష్టి ఉండాలి. నామమంటే ఏదో అక్షరాల గుంపు అనుకోకూడదు. నామాన్ని మంత్రం అని అంటాం. భగవన్నామాలు మంత్రాలు. మన నామాలు వ్యవహారాలు. మనకి ధర్మరాజు అనే పేరున్నవాడు కనిపించవచ్చు. కాని వాడు తప్పుచేసి జైలుపాలై ఉండవచ్చు. పేరు పెట్టుకొంటే సరిపోదు. మనవన్నీ వ్యవహారనామాలు. పరమాత్మనామాలు ఆయన స్వాభావికతత్త్వాన్ని, అనంత కళ్యాణ గుణాల్ని చెప్పేనామాలు.

కనుక మననామాలకి, ఆయన నామాలకి తేడా ఉంటుంది. దేవతానామాల బట్టి వాళ్ళ తత్త్వం తెలుస్తుంది. ప్రతినామంలో అర్థశక్తి, శబ్దశక్తి రెండు దాగి ఉంటాయి. ఆ శబ్ద చైతన్యం నామంలో దాగి ఉంటుంది.



మంత్రచైతన్యమే దేవత. ఒక మంత్రాన్ని ఉచ్చరించేటప్పుడు దానిలో ఒక అద్భుతమైన స్ఫోటకశక్తి ఉంటుంది. ఆ చైతన్యమే దేవత. అలా ఇక్కడ ప్రతినామంలో ఆ దేవత శబ్దరూపం దాగి ఉంటుంది.

మంత్రం, నామం భగవంతుని శబ్దావతారం. ఆయన రూపావతారాలు వెళ్ళిపోయినా శబ్దావతారాలు మాత్రం ఎప్పుడూ ఉంటాయి. రామావతారం మన కళ్ళముందు లేకపోవచ్చుగాని రామనామరూపంలో రామావతారం ఉంది. కనుకనే నామం రూపం కంటే గొప్పది. ఆ నామానికి ఆ శక్తి ఉంటుంది.

నామాన్ని, మంత్రాన్ని కేవలశబ్దం అనుకునేవాడు, గురువుని మనిషి అనుకునేవాడు, విగ్రహాన్ని రాయి అనుకునేవాడు ఎప్పుడూ తరించడు అని శాస్త్రం చెప్పింది. నామాన్ని కేవలం అక్షరము అనుకోకూడదు. గురువుని కేవలం మనిషి అనుకోకూడదు. అదే విధంగా విగ్రహాన్ని రాయి అనుకోకూడదు. దానియందు ఉండవలసినది దేవతా దృష్టి. నామమే దేవత, దేవతే నామం. ఈ దృష్టితో మనం నామం అంటే ఆ నామ ఫలం

ఇంకా ఎక్కువగా అనుభవిస్తాం. నామం ద్వారా జ్ఞానమివ్వడం మన ఋషుల ఉద్దేశం. ఎంత జ్ఞానం బోధించినా విషయం చెప్తూ ఉంటే జారిపోతుంది. కాని నామం పట్టుకొని ఆ నామం ఎప్పుడూ అలా అంటూ ఉంటే ఆ నామాలు మనకి గుర్తుండిపోతాయి. ఎప్పుడో అప్పుడు ఈ నామానికి అర్థం తెలుసుకోవడం మొదలుపెడితే ఆ అర్థం తెలుస్తున్న కొద్దీ జ్ఞానం తెలుస్తుంది.

విష్ణువు నామంద్వారా ఈ విష్ణువు విశ్వవ్యాపకమైన పరమాత్మ అని తెలిసి భగవత్ జ్ఞానం వస్తుంది. అందుకే భీష్ములవారు విష్ణుసహస్రనామం చెప్పడం. ఆయన ఆత్మజ్ఞానాన్ని సహస్రనామ రూపంలో ఇచ్చాడు.

అలాగే ఇక్కడ భగవద్రహస్యనామాలు 125 కూడా సూర్యజ్ఞానాన్ని ఇవ్వడానికి వచ్చాయి. అసలు సూర్యుడంటే ఏమిటి? ఆయన తత్త్వమేమిటి? ఎలా ఉపాసించాలి? పద్ధతి ఏమిటి? ఇవన్ని ఈ నామాల నెపంతో చెప్తున్నాడు. **దీన్ని జపిస్తే మంత్రం, ఆలోచిస్తే జ్ఞానం. జపం ధ్యానంలోకి వెళ్ళాలి, ధ్యానం జ్ఞానంలోకి వెళ్ళాలి. అప్పుడే పరిణామం. జపం కంటే ధ్యానం, ధ్యానం కంటే జ్ఞానం గొప్పది. అందుకే 'జపేన్నిత్యం' – ఎల్లవేళలా జపమే జ్ఞానంగా పండుతుంది.**



జపం నుంచి ధ్యానంలోకి వెళ్ళాలి. ధ్యానమంటే ఏకాగ్రత. ఏకాగ్రంగా మనస్సు నిలబెట్టడం ధ్యానం. ఈ భగవద్రహస్యనామములు భగవత్ జ్ఞానాన్ని అందివ్వడం కోసం వచ్చాయి. సూర్యుని ఎంతోమంది ఎన్నోరకాలుగా ఉపాసన చేసి సిద్ధి పొందటం అన్నిచోట్ల కనబడుతుంది.

మనకి అనేకమంది సూర్యోపాసకులు కనిపిస్తారు. మనం సంధ్యాసమయంలో ఉపాసించే గాయత్రీమంత్రం 'సవితుర్వరేణ్యం'. సవిత అంటే సూర్యభగవానుడు. సూర్య మండలాంతర్గతమైన పరమాత్మ చైతన్యాన్ని గాయత్రీమంత్రంలో ఉపాసిస్తున్నాం.
ఆదిత్యహృదయంలో ఒక్కొక్కనామానికి మూడు రకాల అర్థాలు వస్తాయి. ఒకటి మండలం లో కనపడుతున్న సూర్యభగవానుడు. రెండు – సర్వజగద్వ్యాపకుడైన పరమేశ్వరుడు లేదా పరమాత్మ, మూడు – మన యందు ఆత్మజ్యోతిగా ప్రకాశించేవాడు. ఒకటి మనకి కనపడుతున్న సూర్యబింబములో ఉన్న విశేషం. రెండవది సర్వజగత్సృష్టి స్థితి, లయ కారకుడైన పరమేశ్వరుడు. మూడవది మన యందున్న ఆత్మచైతన్యం.

ఒకవైపు ఆదిత్యుడు సూర్యుడే అంటాం. ఆ సూర్యుడు ఒట్టి సూర్యుడు కాదు. ఆయన సర్వజగత్సృష్టికర్తయైన పరమేశ్వరుడు పరమాత్మ అని రెండో అర్థం చెప్తూ ఉంటుంది.

మూడవ అర్థం ఆయన ఎక్కడో లేదు 'ఈశ్వరస్సర్వభూతేషు హృద్దేశే అర్జున తిష్ఠతి' అని చెప్పినట్లుగా మన హృదయంలో ఉన్న చిత్సూర్యుని తెల్సుకోవాలి. మన ఉపాసన చిట్టచివరికి ఆ స్థితికి రావాలి.

ఇంత జగత్తుని వెలిగిస్తున్న ఆ సూర్యుని ఎలా తెల్సుకుంటున్నామో మన శరీరమనే జగత్తంతటిని వెలిగిస్తూ మనలో ఉన్న ఆత్మసూర్యుని తెలుసుకోవాలి.

మనలో ఆత్మరూపమైన సూర్యుడు, పరమేశ్వరుడు, సూర్యమండలాంతర్గతమైన చైతన్యం ఈ మూడు ఒక్కటే అనే ఏకజ్ఞానం కలగాలి. ఆ ఏకజ్ఞానమే ఉపనిషత్తులు చెప్పిన రహస్యం. అదే గుహ్యం, సనాతనం. కనుక ఆదిత్యహృదయం అంటే ఉపనిషత్ ఆదిత్య హృదయం వేదాంతశాస్త్రం. ఆ దృష్టితో దీన్ని చూడాలి. అసలు తెల్సుకోవల్సిన పరమార్థం ఆత్మతత్త్వజ్ఞానం ఇవ్వడం కోసమే ఆదిత్యహృదయం ఉంది. రోజూ చేస్తే ఆరోగ్యం వస్తుందనే చిన్న ప్రయోజనమే కాకుండా, పరమాత్మ జ్ఞానం వస్తుంది అనేది అసలైన ప్రధాన ఉద్దేశం.

## పేరు పెట్టడంలో అంతరార్థం

ఈ స్తోత్రానికి ఆదిత్యనామాలు, ఆదిత్యస్తోత్రం అని పెట్టకుండా 'ఆదిత్యహృదయం' అని పేరు పెట్టారు. కనుక హృదయమనేది లోపల ఉన్నది.



లోకంలో బయటికి కనపడేది కాకుండా లోపల ఉన్న అసలు స్వరూపాన్ని హృదయం అంటాం. అసలు స్వరూపమే హృదయం అది బయటకి కనపడదు. హృదయమంటే గుండెకాయ కాదు. హృదయం మన లోపల ఉన్న అంతఃకరణం. బయటకి కనపడేది సత్యం కాదు. హృదయమే అసలైంది. ఆదిత్యమండలం అందరికీ తెలుస్తుంది. ఆదిత్య హృదయం ఋషికే తెలుస్తుంది.

ఒక మంత్రానికి హృదయం, బీజం, కీలకం, న్యాసం ఇవన్నీ అంగములుగా ఉంటాయి. అలాగ మంత్రం, బీజం, న్యాసం, కీలకం, హృదయం కలిపితే మంత్రపంచాంగం అని అంటారు. ఇది కాక మంత్రానికి మరో అంగం సహస్రనామం కూడా ఉంటుంది. ఏ మంత్ర దేవతను మంత్రంతో ఉపాసన చేస్తామో ఆ మంత్రదేవతకి సంబంధించి సహస్ర నామాలు కూడా ఉంటాయి. ఇవన్నీ కలుపుకుని మంత్రానికి మంత్రాంగాలు అనిచెప్ప బడతాయి. అలా ఆదిత్యమంత్రానికి అంగభూతంగా చెప్పుకోవలసింది ఆదిత్యహృదయం. మంత్రదేవత స్వరూపస్వభావాలు హృదయం ద్వారా తెలుస్తాయి. ఆదిత్యదేవత యొక్క సమస్తతత్త్వాన్ని తెలియజేసేది ఆదిత్యహృదయం. దీనికి మహర్షి అగస్త్యభగవానుడు.

ఆయన ప్రారంభించాడు.

హృదయం అంటే ఆంతర్యం, అంతఃకరణం, రహస్యం. ఏ సూర్యబింబమైతే అందరికీ వెలుగు ఇస్తోంది అనుకుంటున్నామో అది హృదయం కాదు అది మండలమే. హృదయం తన్మండలమధ్యంలో ఉన్న పరమేశ్వర చైతన్యం. ఆదిత్యమండలంలో దాగిన ఈశ్వర చైతన్యాన్ని ఆవిష్కరించే గ్రంథమే ఆదిత్యహృదయం.

ఇంద్రియాలతో తెల్సుకోలేని అతీంద్రియదృష్టితో తపస్వులు దర్శించిన ఆదిత్య మండలాంతర్గతమైన ఈశ్వరచైతన్య విజ్ఞానాన్ని తెలియజేసేది ఆదిత్యహృదయం. ఆదిత్యమండలం మామూలు కంటికి కనిపిస్తుంది, ఆదిత్యహృదయం ఋషిదృష్టికి మాత్రమే గోచరిస్తుంది. అందుకే **'అగస్త్యోభగవాన్ ఋషిః'** మాత్రమే ఇవ్వగలిగాడు. ఇదే ఆదిత్యహృదయం యొక్క అసలైన ఉద్దేశం.

## భవిష్యోత్తర పురాణంలో ఆదిత్యహృదయం

ఆదిత్యహృదయం రామాయణంలో కాకుండా మరొకచోట కూడా ఉంది. వ్యాసదేవుడు రచించిన భవిష్యోత్తర పురాణంలో ఏడు అధ్యాయాల ఆదిత్యహృదయం ఉంది. అందులో ఎన్నో మర్మాలు చెప్పాడు. ఇది శ్రీకృష్ణుడు అర్జునునికి ఉపదేశించాడు. సూర్యోపాసనా రహస్యాలు చెప్పాడు.



అందులో సూర్యయంత్ర విజ్ఞానం, సూర్యమంత్రవిజ్ఞానం గురించి తెలియజేశాడు. సూర్యుడు ఒక దేవత, సూర్యుడు ఒక యంత్రం, సూర్యుడు ఒక మంత్రం. ఇదంతా కూడా మండలాంతర్గతమైన దేవతా చైతన్యాన్ని చెప్తున్నాయి. ఆ విజ్ఞానం వేరు. సైన్సు దృష్టికి సూర్యుడు మండుతున్న అగ్నిగోళం మాత్రమే. సైన్సు దృష్టి వేరు. ఉపాసనా దృష్టి వేరు. దాని దృష్టి దానిదే. దీని దృష్టి దీనిదే.

లోకంలో ఒక స్త్రీమూర్తిని డాక్టరు చూసే దృష్టి వేరు. ఆ స్త్రీ యొక్క బిడ్డ చూసే దృష్టి వేరు. పిల్లవాడు అమ్మ అనే భావనతోనే చూస్తాడు. అమ్మతనం అమ్మ చేస్తున్న పనుల ద్వారా వ్యక్తీకరింపబడుతుంది. ఆ ప్రేమ ఆ శిశువుకి మాత్రమే తెలుస్తుంది. వాడు అమ్మా! అని పిలవగానే ఆ స్త్రీమూర్తి వాడిపట్ల ఒక వాత్సల్యభావంతో కరుణిస్తుంది. అలాగ ఉపాసకుడు సూర్యుని దేవతా దృష్టితో చూస్తాడు.

మనందరం ఆ సూర్యుడి వల్ల ప్రాణశక్తులను పొంది సూర్యుని వల్ల బ్రతుకుతున్నాం. సూర్యుడు ఒక జడపదార్థం కాదు. మహాచైతన్యమూర్తి. ఈ జడ జగత్తుకి చైతన్యాన్ని ఇచ్చే పరంజ్యోతి. సర్వజగత్తుకి శక్తిని ఇచ్చే అన్నప్రదాత. సూర్యుడు ఎన్ని ఇస్తున్నాడో

ఆనాడు వేదం చెప్పింది, ఇప్పుడు సైన్సు కొన్ని చెప్తోంది.

సూర్యుడు కనబడకపోతే జీవజగత్తుకి చైతన్యం లేదు, ఉత్సాహం లేదు. జగత్తుకి పుట్టుక లేదు. ఇది భారతీయ ఋషుల దృష్టి, ఇది సత్యదృష్టి. ఉపాసనాదృష్టి. ఆ దృష్టి మనకున్నప్పుడు మనం తరించగలం. ఆదిత్యమండల స్వరూపుడైన ఆయన సాక్షాత్తు పరమేశ్వరుడనే భావనని ఆవిష్కరిస్తున్నాడు. ఆ దృష్టితో ఎవరైతే నిత్యం సూర్యభగవానుని చూస్తారో వారే ఆయన్ని తెలుకోగలరు.

విష్ణుమూర్తి మన ముందు హఠాత్తుగా ప్రత్యక్షమైతే నారాయణుడని తెల్సుకోలేం. అలా తెల్సుకోవాలంటే మనలో ఉపాసనా దృష్టి ఉండాలి. అది ఉంటేనే తప్ప దేవతని పోల్చుకోలేం. రోజూ కనబడుతున్న సూర్యుని ఎంతమంది దేవుడని తెల్సుకోగలుగుతున్నారు? ఆయనలో దైవాన్ని చూడలేకపోతే ప్రపంచంలో అసలు దేవుణ్ణే మనం చూడలేం.

భారతీయ శాస్త్రాలన్నీ సూర్యభగవానునే సమస్తదేవతా స్వరూపంగా చూపిస్తున్నాయి. విష్ణు భక్తులైనా, శివ భక్తులైనా, అమ్మ భక్తులైనా సూర్యభగవానుని భక్తులైతేనే ఆ భక్తి సిద్ధిస్తుంది. మనం ఉపాసించే దేవతలందరూ సూర్యుని స్వరూపాలే.



అనునిత్యం మన కోసం స్వామి ఉదయిస్తూ, తనప్రాణశక్తిని ప్రసరింపజేస్తూ అనుగ్రహిస్తున్నాడు. అయితే ఎందరో సూర్యులు ఉన్నారు. ఈయనే సూర్యుడని ఎలా చెప్తాం? అని కొందరంటారు.

ప్రపంచంలో అనేక సూర్యమండలాలు ఉండొచ్చు. కాని మనల్ని పోషించే ఈ గ్రహ మండలంలోని సూర్యుడే మనకు కనిపిస్తున్నాడు.

మన ఊళ్ళో బోల్డు దీపాలు ఉంటాయి. ప్రతి ఇంట్లోను దీపకాంతులు ఉన్నాయి. అందరి ఇళ్ళల్లో దీపాలు ఉన్నప్పటికి మన ఇంటిలో వెలుగును ఇచ్చే దీపమే మనకు దేవుడు. కనుక అనంతవిశ్వంలో ఎన్నో సూర్యమండలాలు ఉండవచ్చు కాని మనం ఉన్న ఈ గ్రహమండలాన్ని, ఈ భూమిని, ఈ భూమి మీద ఉన్న జీవకోటిని నడిపిస్తూ అనుగ్రహిస్తున్న ఆయనలో మనం దైవాన్ని చూడగలగాలి.

దీపాలు ఎన్నిఉన్నా వాటిలో ఉండే అగ్ని ప్రకాశం ఒక్కటే. ఎన్ని సూర్యమండలాలు ఉన్నా అన్ని సూర్యమండలాల్లో ఉన్న సూర్య అనబడే ఈశ్వరచైతన్యం ఒక్కటే.

దీనికి అద్భుతమైన సమన్వయం భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్తూ...

**యదాదిత్య గతం తేజో జగద్భాసయతేఖిలం**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకం**

సూర్యుని యందు, అగ్నియందు, చంద్రుని యందు ఏ తేజస్సు ఉన్నదో ఆ తేజస్సు నాదే అని తెలుసుకో అని చెప్పాడు. మనమందరం సూర్యతేజస్సు చూస్తున్నాం కాని అది పరమాత్మ తేజస్సు అని తెల్సుకొంటే ఉపాసన. అలా తెల్సుకున్న వాడికి ఆ సూర్యునిలో ఉన్న పరమాత్మ, తల్లి బిడ్డను అనుగ్రహించినట్లు అనుగ్రహిస్తాడు.

మహాభారతం విరాటపర్వంలో ద్రౌపది సైరంధ్రిగా ఉన్నసమయంలో కీచకుడు ఆమెని తన మందిరానికి మదిరని పట్టుకొని రమ్మని చెప్పినపుడు సుధేష్ణాదేవి ద్రౌపదిని బ్రతిమాలుతుంది. వెళ్ళక తప్పని పరిస్థితి. ఆవిడ వెళ్ళే ముందు సూర్యభగవానునికి నమస్కరించి వెళ్ళినట్లు వ్యాసదేవుడు రచించాడు. ద్రౌపది అక్కడకి వెళ్ళినప్పుడు కీచకుడు చెయ్యి పట్టుకోవడానికి ప్రయత్నిస్తే, సూర్యుడు పంపించిన ఒకానొక శక్తి (రాక్షసుడు)ఆమెలో ప్రవేశించి చెయ్యి విదిలించగానే వెళ్ళి దూరంగా పడతాడు కీచకుడు.

కీచకుడు మహాప్రతాపశాలి. అలాంటివాడు ద్రౌపది విదిలించగానే పడ్డాడు. అదృశ్యంగా ఉన్న సూర్యగణాలలోని రాక్షసుని ప్రతాపం అది.

సూర్యుడే పరమాత్మ. సూర్యుడు విష్ణువు నేత్రమని కూడా చెప్తారు. నేత్రమంటే చూపు అంతేగాని 'కన్ను' అనే ఇంద్రియము కాదు, సూర్యుడే పరమేశ్వరుడి చూపు, కనుక పరమాత్మ మనలను చూస్తూనే ఉన్నాడు.

ప్రాతఃకాలంలో ఆయనకి అర్ఘ్యప్రదానం చేసి ఒక్క నమస్కారం చేసుకుంటే ఇంకేం కావాలి. **'నమస్కారప్రియః సూర్యః'** అని కృష్ణపరమాత్మ చెప్పినది ఈ మాట.

భాగవతంలో కృష్ణపరమాత్మ తన అవతార పరిసమాప్తి సమయంలో ఉద్ధవుడితో 'విశ్వంలో అంతటా ఉన్న పరమాత్మ ఒక్కడే అనే జ్ఞానం కలగడమే మోక్షం' అని చెప్తాడు. పరమాత్మ వేరు, ప్రపంచం వేరు, నేను వేరు అనుకుంటాం. కాని నీలో, నాలో, అంతటా ఉన్నది ఒక్కటే అన్న జ్ఞానం కలగాలి. అది భౌతికంగా చూస్తే తెలియదు. మనం భౌతికంగా చూస్తే భూమి కదులుతున్నట్లు కనిపించదు కనుక భూమి స్థిరంగానే ఉంది అని అంటే ఒప్పుకుంటారా! ప్రత్యక్షమే ప్రమాణం అన్నప్పుడు ఇది ఒప్పుకోవాలి. కాని సైన్సు భూమి తిరుగుతోందని చెప్పింది.

సైన్సు చెప్తే కనబడని దానిని ఒప్పుకుంటున్నాం కదా! అలాగే ఆధ్యాత్మికజ్ఞానం చెప్పిన సత్యం విశ్వమంతా పరమాత్మే. ఎలాగైతే భూమి కదులుతున్నా కదులుతున్నట్లు తెలీదో ఇది కూడా అలానే తెలియడం లేదు. ఆ శాస్త్రజ్ఞానం వల్ల అదెలా తెల్సుకున్నామో, ఈ శాస్త్రజ్ఞానం వల్ల ఇది తెలుసుకోవాలి. తెలుసుకోవడానికి తగిన సాధన చెయ్యాలి.

వేదాంత శాస్త్రాన్ని సరిగ్గా అధ్యయనం చేస్తే 'సర్వం పరమాత్మే' అన్న జ్ఞానం కలుగుతుంది. కృష్ణపరమాత్మ చెప్తూ 'నేను సర్వవ్యాపకుడను అయినప్పటికీ సర్వత్రా నన్ను చూడలేవు. సర్వత్రా నన్ను చూడలేవు కనుక కొన్నిచోట్ల నన్ను పూజించు. ఆ పూజించాల్సిన మొదటి చోటు సూర్యమండలం' అన్నాడు.

"సూర్యమండలానికి అర్ఘ్యమునిచ్చి, నమస్కారంచేసి రెండు విధాలుగా పూజించాలి" అని చెప్పాడు.సూర్యమండలంలో ఎవరిని పూజిస్తున్నాం? సూర్యుడినా! సూర్య మండలంలో ఉన్న పరమాత్మని.. రెండవది ఈశ్వరుని అగ్నియందు పూజించు. అందుకే అగ్నిలో ఆహుతులు సమర్పిస్తున్నాం. యజ్ఞం చెయ్యాలంటే అగ్నిని రగిల్చే చెయ్యాలి.
విష్ణుయాగం, సుదర్శనయాగం, రుద్రయాగం అగ్నిలోనే చేస్తాం. పరమాత్మయే అగ్ని యందు ఆరాధింపబడుతున్నాడు. అలాగే చంద్రునియందు నన్నుచూడు అన్నాడు. ఇప్పటికీ 'చంద్రునికో నూలుపోగు' అని మాట ఉంది. చంద్రుడికి తర్పణాలు ఇవ్వడం ఉన్నది. అలా క్రమంగా చెప్తూ ఉత్తములైన తపస్వులయందు చూడు. అలా చిట్టచివరకు అందరిలో చూసేస్థితి అప్పటికి వస్తుంది అంటాడు. పరమాత్మ సర్వవ్యాపకుడు అయినప్పటికీ అయన స్పష్టంగా కనబడే విభూతిస్థానాలు కొన్ని ఉంటాయి. అందులో సూర్యమండలం ఒకటి.



ఈ భూమిని సృష్టించింది అతడే. బ్రతికిస్తున్నది అతడే. లయం చేసేది అతడే.

విజ్ఞానపరంగా ఆలోచించినా ఇదే నిజం. కనుక సృష్టి స్థితి లయలు ఆయనవల్లే జరుగు తున్నాయి. ఈశ్వరకృత్యములైన సృష్టి, స్థితి, లయలు సూర్యమండలంలో మనకు కనబడుతున్నాయి. భూమి తన చూట్టూ తాను తిరగడం వల్లే పగలు, రాత్రి ఏర్పడుతున్నప్పటికీ, భూమి తన చుట్టూ తాను సూర్యుని ద్వారా పొందిన ఆకర్షణ శక్తి వల్లనే తిరుగుతున్నది. 'భూమి తనలో తాను తిరగడం ఆత్మప్రదక్షిణ, సూర్యుని చుట్టూ తిరగడం పరమేశ్వర ప్రదక్షిణ, అని భక్తుని భావం. గ్రహమండలంలో కూడా భక్తునికి పూజే కన పడింది. భూమి కూడా సూర్యనారాయణునికి ప్రదక్షిణ చేస్తోంది. వేదంలో వర్ణించిన విష్ణువు, శివుడు సర్వం సూర్యభగవానుడే.

అయితే సూర్యుడు, చంద్రుడు, అగ్ని అని మూడు ఉన్నా చూస్తే మూడూ ఒక్కటే. చంద్రుడు – చంద్రుడిలో ప్రకాశం నాదే అని తెల్సుకో అన్నాడు. చంద్రునికి స్వయం ప్రకాశం లేదు. సూర్యుడి వల్ల ప్రకాశిస్తాడు. అగ్ని – వైజ్ఞానికంగా ఆలోచించినా అగ్ని కూడా సూర్యసంబంధమైనదే. అగ్ని, చంద్రుడు వేరుగా కనబడుతున్నా వాటియందు ఉన్నది ఈయన ప్రకాశమే.

భవిష్యోత్తరపురాణంలో కృష్ణపరమాత్మ అర్జునుడితో చెప్పిన మాట-

**దేవదేవం నమస్కృత్య ప్రాతరుత్థాయచార్జున**
**విఘ్నాన్యనేక రూపాణి నశ్యంతి దర్శనాదపి**
**తస్మాత్ సర్వ ప్రయత్నేన సూర్యమారాధయేత్ సదా**

'దేవా' అంటే ప్రకాశస్వరూపుడు. ప్రకాశమైన వాటికి ప్రకాశమిచ్చేవాడు దేవదేవుడు. భూమి అంతా కాంతివంతంగా కనబడుతోంది.

వీటి వెలుగుకు కారణం దేవదేవుడైన సూర్యుడు. **'దేవదేవం నమస్కృత్య ప్రాతరుత్థాయ'** - ప్రొద్దున్నే లేచి ఎవరైతే సూర్యునికి నమస్కరిస్తారో వారికి 'విఘ్నాన్యనేక రూపాణి నశ్యంతి' - వాడికి వాడి కార్యాల్లో వచ్చే విఘ్నాలు తొలగిపోతాయి. 'దర్శనాదపి' - చూచినప్పటికీ, 'తస్మాత్ సర్వప్రయత్నేన సూర్యమారాధయేత్ సదా' - కనుక ఎల్లవేళలా సూర్యుని ఆరాధించాలి అంటాడు.

భారతంలో ధర్మరాజుతో అరణ్యవాసానికి వచ్చే యాజ్ఞికులు, వేదవేత్తలు, ధార్మికులు అందరూ కూడా మేమూ మీతో అరణ్యానికి వస్తాం అంటారు. వద్దని చెప్తే వాళ్ళు "ధర్మం కలవాడు పదవిలో లేకపోయినా, మేధావులు వానినే అంటి పెట్టుకోవాలి" అంటారు. "నీకోసం మేం తపస్సులు, యజ్ఞాలు, యాగాలు చేస్తాం. మాకు తిండి పెట్టాల్సి వస్తుందని బెంగ నీకు వద్దు. మా తిండి మేం చూసుకుంటాం. నీతోపాటు ఉంటే చాలు" అని అంటారు. అది వాళ్ళ ఔదార్యం.

వాళ్ళు అలా అనుకున్నా తనదగ్గర ఉన్నవాళ్ళకి లోటు లేకుండా చూడవలసిన బాధ్యత గృహస్థుది.

ధర్మరాజంటేనే ధర్మస్వరూపుడు కనుక 'వీళ్ళందరూ నన్ను ఆశ్రయించారు. వీళ్ళని ఎలా చూడాలి' అనుకుంటుంటే అప్పుడు ధౌమ్యుడు కొంతసేపు ధ్యానంచేసి "కృష్ణుని అనుమతి అయ్యింది", అని భావనచేసి సూర్య అష్టోత్తర శతనామాలు ఉపదేశించాడు.

దీనితో నువ్వు సూర్యభగవానుని ఉపాసించు అని ఆదేశించాడు. ఆ నామాలు ఉపాసన చేస్తే సూర్యుడు ప్రత్యక్షమై ఆయనకు అక్షయపాత్ర ఇచ్చాడు. దానితో చక్కగా వారందరికీ తనని ఆశ్రయించిన ఆ వందలాది వేదవేత్తలకి కూడా ఆయన నిత్యం సుష్టుగా భోజనం పెట్టేవాడు.

అన్నప్రదాత సూర్యుడు.

సృష్టిలో అందరికీ అన్నం ఇచ్చేవాడే ఆయన. ఆయన్ని అన్నప్రదాత అని ఉపాసిస్తే

అన్నానికి లోటుండదు.

మన గ్రంథాలు అన్నీ ఆదిత్య ఉపాసన ప్రాధాన్యాన్నే చెబుతున్నాయి.

> **రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం।**
> **పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్॥ (6)**

నిజానికి ఈ శ్లోకంలో మనం సూర్యనారాయణునికి చేసిన స్తోత్రం కనబడదు. 'పూజయస్వ' అన్నాడు అంటే 'పూజించవయ్యా ఓ రామా!' ఎవరిని? ఇదిగో ఆయన్ని. ఆయన ఎవరు?

**రశ్మిమంతమ్**

**'రశ్మిమంతమ్'** - రశ్మిమంతుడైన అతడిని పూజించు. మొట్టమొదట ఈ మాట చెప్పడంలో ఒక అద్భుతం ఉంది. రశ్ములు అంటే కిరణాలు. రశ్మిమాన్ అనగా కిరణాలు కలవాడు. సూర్యుడు మనకు ముందు కనబడడు ఆయన కిరణాలు ముందుగా కనబడతాయి. ఆ కిరణాలే ముందు తగులుతాయి. ప్రభాతకాలంలో భూమిని తాకుతున్న కిరణాలు చూస్తూ ఆయన్ని చూస్తాం. ఆయన ఎలా ఉన్నాడంటే 'సముద్యంతం' అన్నారు



**సముద్యంతమ్**

చక్కగా ఉదయించినవాడు. సంపూర్ణంగా ఉదయించిన బింబాన్నే మనం ఆరాధన చేస్తాం.

సూర్యోదయాత్పూర్వం నిద్ర లేవాలి. ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చూడరాదని శాస్త్రం చెప్తున్నది. ఉదయం తరువాత ఆ లేత సూర్యుని చూసి నమస్కరించాలి, అర్ఘ్యప్రదానం చెయ్యాలి. అయితే మనమే నమస్కరిస్తున్నామా అంటే 'దేవాసుర నమస్కృతం' అన్నారు.

**దేవాసుర నమస్కృతమ్**

అలా ఉదయిస్తున్న సూర్యునికి దేవతలు, అసురులు నమస్కారం చేస్తున్నారు. దేవతలు దండం పెడుతున్నారంటే ఒప్పుకుంటాం కాని అసురులు వచ్చి దండం పెడతారా? సృష్టిలో అందరూ దండం పెడతారు. తెలివైనవాడు నమస్కరించకుండా ఊరుకోడు.

దేవతలు, అసురులు వీరు ఉభయుల్లో కూడా భగవదుపాసకులు ఉన్నారు. ఈ సృష్టిలో దేవశక్తులు, అసురశక్తులు అందరూ సూర్యుని ఉపాసిస్తారు. సూక్ష్మభూమికలో జరిగేది మన కంటితో చూడగలగాలే గాని సూర్యోదయ సమయంలో సూర్యాంతర్వర్తియైన నారాయణుని గగనమండలం నుంచి భువనమండలం వరకు బారులు తీరి దేవతలు నమస్కారం చేస్తూ ఉంటారు.

సూర్యభగవానుని ఎవరెవరు నమస్కరిస్తారో పురాణాలలో కన్పిస్తున్నది. వేదములలో కొన్ని మంత్రాలలో కూడా గోచరిస్తున్నది. ఈ విషయాన్నే ఆదిత్యస్తోత్రరత్నంలో అప్పయ్య దీక్షితులు వివరిస్తూ...

**ఆదిత్యైరప్సరోభి ర్మునిభి రహివరైర్గ్రామణీ యాతుధానైః**
**గన్ధర్వైర్వాలఖిల్యైః పరివృతదశమాంశస్య కృత్స్నం రథస్య**
**మధ్యం వ్యాప్యాధితిష్ఠన్ మణిరివ నభసో మణ్డలశ్చణ్డరశ్మేః**
**బ్రహ్మజ్యోతిర్వివర్తః శ్రుతినికరఘనీభావరూపః సమిన్ధే**

ఇది ఆదిత్యమండల వర్ణన. ఆదిత్యులు, అప్సరసలు, మునులు, సర్పములు, గ్రామణులు, రాక్షసులు, గంధర్వులు అనే ఏడు గణాలు, వాలఖిల్యులు సూర్యమండలం చుట్టూ పరివేష్ఠితులై ఉంటారు.

ఏడు గణాలలో ఒక్కొక్క గణానికి 12 మంది చొప్పున మొత్తం 84 మంది పరివార దేవతలు ఉంటారు. వీళ్ళంతా సూర్యుడు ఉదయించేటప్పుడు నమస్కరించేవారు.

ఆదిత్యులు అనగా సూర్యుని నుంచి వచ్చిన ద్వాదశాదిత్యులు.

**ఆదిత్యగణాలు:** ధాత, అర్యముడు, మిత్రుడు, అంబుపుడు(వరుణ), వాసవుడు (ఇంద్రుడు), వివస్వంతుడు, పర్జన్యుడు, పూష, అంశువు, గభస్తిమాన్, త్వష్ట, విష్ణువు.

**అప్సరసలు:** 12 మంది ఉన్నారు. వీరి పేర్లు కృతస్థల, పుంజికస్థల, మేనక, సహజన్య, ప్రమ్లోచంతి, శుచిస్మిత, ఘృతాచి, విశ్వాచి, ఊర్వశి, పూర్వచిత్తి, తిలోత్తమ, రంభ. అప్సరసలు అనగా కేవలం రసప్రధానమైన దేవశక్తులు. వైజ్ఞానిక పరిభాషలో చెప్పాలంటే వీళ్ళందరూ కూడా విధినిర్వహణచేసే సౌరశక్తి విశేషాలు. దేవతాపరిభాషలో చెప్పాలంటే వీరు దేవతలు.

**సూర్యభగవానుని కొలుచుకునే మునులు:** పులస్త్యుడు, పులహుడు, అత్రి, వసిష్ఠుడు, అంగిరసుడు, భృగువు, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, క్రతువు, జమదగ్ని, కౌశికుడు.

**నాగజాతి:** వీరు 12 మంది. ఈ నాగజాతినే మనం నాగదేవతలుగా పూజిస్తాం. అంతరిక్షమండలంలో చుట్టూ ఉన్న నాగజాతుల పేర్లు వాసుకి, కంకరీకుడు, తక్షకుడు, నాగుడు, ఏలాపుత్రుడు, శంఖపాలుడు, ఐరావతుడు, ధనంజయుడు, అగ్రమహాపద్ముడు, కర్కోటకుడు, కంబలుడు, అశ్వతరుడు.

**గ్రామణులు:** ఒక ప్రత్యేకవర్గం సూర్యుని కొలుచుకుంటూ ఉంటారు. వారు రథకృత్,

రథౌజస్సు, రథచిత్రుడు, రథస్వనుడు, స్రోతుడు, అరుణుడు, సుషేనుడు, సేనజిత్, తార్క్ష్యుడు, అరిష్టనేమి, రథజిత్, సత్యజిత్. వీరు యక్షజాతీయులు.

**యాతుధానులు:** అనగా అసురులు. సృష్టి నిర్వహణలో ఉత్తమ రాక్షసగణాలు కూడా పాత్రవహించి ఉంటారు. వీరు కూడా సౌరశక్తి విశేషాలే. వారు రక్షోహేతి, ప్రహేతి, పౌరుషేయుడు, వధుడు, సర్పుడు, వ్యాఘ్రుడు, చాపుడు, వాతుడు, విద్యుత్, దివాకరుడు, బ్రహ్మోపేతుడు, యజ్ఞోపేతుడు.

రాక్షసులనగానే దుర్మార్గులు అనుకోరాదు. ప్రహ్లాదుడు, విరోచనుడు, బలిచక్రవర్తి వీరంతా రాక్షసులే. వీరిలో కూడా ఉత్తములు ఉంటారు. కృష్ణపరమాత్మ గీతలో రాక్షసులలో ప్రహ్లాదుడను నేనే అని చెప్పాడు. వారు కూడా భగవత్సృష్టి నిర్వహణకై వచ్చినవారు.

**గంధర్వులు:** 12 మంది ఉంటారు. వీరు తుంబురుడు, నారదుడు, హాహా, హూహూ, విశ్వావసువు, ఉగ్రసేనుడు, వరరుచి, సర్వావసువు, చిత్రసేనుడు, ఊర్ణాయువు, ధృత రాష్ట్రుడు, సూర్యవచస్సు.

ఇక వాలఖిల్యులు మాత్రం లెక్కలేనంత మంది ఉన్నారు. వీరు ప్రత్యేకమహర్షులు. వీళ్ళు తపస్సుద్వారా ఆ సూర్యమండలంలో ఉండే శక్తిని సంపాదించుకొన్నారు.



ఈ ఏడు గణాలలో గణానికి ఒకరు చొప్పున ఒక్కొక్క మాసంలో క్రమంగా ద్వాదశ మాసాలు సూర్యుని సేవిస్తున్నారు. వాలఖిల్యులు వేల సంఖ్యలో కొలుచుకొనే మహర్షులు.

**'దేవాసుర నమస్కృత'** అన్నమాటకి శాస్త్రప్రమాణం కనిపిస్తున్నది. శ్రీనాథమహాకవి ఆదిత్యమండలంలో వున్న సూర్యభగవానుని వర్ణిస్తూ

**సిద్ధాంత సంసిద్ధి సిద్ధ సంఘంబును**
**విధ్యుక్త పరిపాటి విబుధకోటి**
**చాటుధారప్రౌఢి జారణవ్యూహంబు**
**కిన్నెర వ్రాతంబు గీతసరణి**
**ఖచర సంఘము విశృంఖల వచో వైచిత్రి**
**యాతుధాన శ్రేణి యధికభక్తి**
**గరుడలోకము నమస్కార వాక్యంబున**
**నేకాగ్రమతి దందశూక సమితి**
**ప్రతిదినంబును బ్రాతరారంభవేళ**
**నిర్ణి బంధన నిరుపాధి నిరవగాధ**

**నిర్విరోధ నిరాఘాట నిరుపమాన**
**భక్తి సంభజియింతురీ పద్మబంధు(కాశీఖండం)**

ఇందులో అనేక దేవజాతులు చెప్తున్నాడు. ఈ దేవజాతులందరూ సూర్యభగవానునికి నమస్కరిస్తూ ఉంటారు. ఈ పృథ్వినించి అంతరిక్షం వరకు ఉన్న రోదసి అంతా ఈ దేవగణములతో ఉంటూ ప్రతిదినం ప్రాతఃకాల వేళ ఉదయిస్తున్న సూర్యభగవానుని నమస్కరిస్తూ ఉంటారు. వారికి ఈ మండలాంతరగతమై పరమపురుషుడు దర్శనమిస్తూ ఉంటాడు.

**ఆకాశమధ్యస్థమగు భాను బింబంబు**
**విను లక్షయోజన విస్తృతంబు**
**తన్మధ్యమందున ధవళాంశు శేఖరు**
**నుద్గీథ విద్యా ప్రయోగ సరణి**
**హైమరూపుడు హిరణ్యశ్మశ్రుకేశుడు**
**హస్తప్రముఖ హిరణ్యావయవుండు**
**గాగభావించి యా కమలలోచనుడుండు (కా.ఖ)**



ఆ లోపల ఉన్న పరమపురుషునే ఉపనిషత్తు వర్ణిస్తూ **'ఆప్రణఖాత్ సర్వఏవ సువర్ణః '** అన్నది. ఆదిత్యమండలంలో కాలి గోరు మొదలుకొని పైన ఉన్న కేశాల వరకూ బంగారు రంగు కలిగిన పరమపురుషుని ధ్యానించాలి. ఆయన్నే 'హిరణ్మయ వపుః' – బంగారు రంగు కలిగిన వాడు అన్నారు.

ఆయన శివుడా! విష్ణువా! బ్రహ్మదేవుడా అంటే అన్ని దేవతల సమిష్టి స్వరూపుడైన హిరణ్మయ శరీరుడు. ఆదిత్యమండలాంతర్వర్తి అయిన పరమపురుషుడు. ఆయననే ధ్యానించాలి. ఈ ధ్యానించాల్సిన ప్రక్రియ అంతా క్రమంగా ఇందులో తెలియజేయ బడుతుంది. ఇదే చిట్టచివరకు ఉపనిషత్తులు ప్రతిపాదించిన అద్వైతవేదాంత విజ్ఞానంలోకి పర్యవసిస్తుంది.

ఇందులో చెప్పబడ్డ ఈ ధ్యానప్రక్రియ మంత్రశాస్త్రాల్లో, ఉపనిషత్తుల్లో చెప్పిన విద్య. ఉపనిషత్తులు ఆత్మవిద్యను బోధిస్తాయి. ఆ ఆత్మవిద్యను బోధించిన ఉపనిషత్తే సూర్య మండలాంతర్వర్తియైన పరమపురుషుని ఉపాసించాలని అనేకచోట్ల శాసించింది.

'అహరహః సంధ్యాముపాసీత'–ఇది ఉపనిషత్తు శాసనం. ప్రతిదినం సంధ్యాకాలంలో సూర్య మండలాంతర్వర్తియైన ఆ పరమపురుషచైతన్యాన్ని 'సోహం భావేన పూజయేత్'

– 'నేను' అనే భావనతో అర్చన చేయాలి అని చెప్తున్నది. దీన్నే శ్రీనాథమహాకవి చెప్తూ

**అతడు యేనని సదాధ్యాన పరత**

**విమల మానసుండగుచు భావింపవలయు**

**బ్రహ్మవిద్వాంసుడగువాడు ప్రాహ్ణవేళ**

అంటారు. నా రుద్రో రుద్రమర్చయేత్ – రుద్రుడు కాని వాడు రుద్రుని పూజించకూడదు. ఆయనేదో గొప్పవాడు, నేనేదో తక్కువవాడిని, తక్కువ వాడినైన నేను ఆయన ఎలా అవుతాను! అని మనకి సందేహం కలుగుతుంది. అంతేకాదు భవిష్యోత్తరపురాణములో కృష్ణపరమాత్మ అర్జునుడితో చెప్తూ–

**సూర్యాద్భవన్తి భూతాని సూర్యేన పాలితాని తు।**

**సూర్యేలయం ప్రాప్నువంతి యత్సూర్యః సోహమేవచ॥**

ఎవడైతే సూర్యుడుగా ఉన్నాడో ఆయనే నేను. ఇదే ఉపాసన. లలితాసహస్రం ప్రారంభ శ్లోకంలో 'అహమిత్యేవ విభావయే భవానీం' అదే 'సోహం భావేన' అని చెప్పబడుతున్నది. 'నేను' అనగానే ఈ పరిమితి గలిగిన శరీరమెక్కడ ఆదిత్యమండలాంతర్వర్తి అయిన పరమపురుషుడు ఎక్కడ? ఇది ఏమైనా సమంజసమా? అని సందేహం కలుగుతుంది. కాని మనలో 'నేను' అనబడే చైతన్యం ఏదైతే ఉన్నదో... అది సాక్షాత్తు ఆదిత్యస్వరూపమే.



ప్రతివారిలో 'నేను' అనబడే చైతన్యం ఉంది. ప్రతివాడు 'నేను' ధనవంతుడిని, 'నేను' పేదవాడిని అంటుంటారు. ఇందులో ధనిక, పేద మారారు గాని 'నేను' మారలేదు. 'నేను' అనబడే స్ఫురణ ఎక్కడుంటుంది? ఎక్కడ చైతన్యం ఉంటే అక్కడ ఉంటుంది. చైతన్యం ఎవడు? ఆ చైతన్యస్వరూపుడు ఆదిత్యుడే.

ఆదిత్యమండలాంతర్వర్తియైన పరమ చైతన్యమే విశ్వమంతా వ్యాపించి యుంది. కనుక ఆదిత్యమండలాంతర్వర్తియైన చైతన్యం సాక్షాత్తు పరబ్రహ్మ. ఆ దృష్టితో మనం చూస్తే ఆ బ్రహ్మమే మనయందు కూడా ఉన్నది. ఈ రెండూ అనుసంధానం చేసి ఉపాసన చేస్తే ఇదొక ప్రక్రియ.

చెయ్యగలగాలే గాని ఆదిత్య ఉపాసనలో మధురమైన ప్రక్రియలు చాలా ఉన్నాయి. రమణమహర్షి ఆశ్రమంలో ఒక సంఘటన జరిగింది. రమణ మహర్షి దగ్గరికి ఎవరు వెళ్ళినా 'నేను'ని తెల్సుకో' అనేవారు.

జగదీశన్ అనే శిష్యుడు ఆయన దగ్గర ఉండేవాడు. ఆయన ఎవర్నీ 'శిష్యుడు' అని అనరు కాని ఆయనని అందరూ 'గురువు' అనేవారు. 'గురుత్వం' తాను ఆరోపించుకో

వల్సిందికాదు 'శిష్యుడు' స్వీకరించవల్సింది. ఆయన యందు కేవల భక్తితో ఉన్నవారు కొందరైతే, ఆయన తత్త్వం తెల్సుకొని దాన్ని అనుసరించేవారు కొందరుంటారు. ఎవరైనా ఆయనను ఆశ్రయించిన వారందరూ ధన్యులే. జగదీశన్ ఆయనకు కావల్సిన ఏర్పాట్లు అవీ చూసేవాడు.

ఒకరోజు గ్రీష్మకాలం మధ్యాహ్నం వేళ ఉన్నట్టుండి రమణమహర్షి లేచి శిష్యునితో "పద అరుణాచలం ప్రదక్షిణ చేద్దాం" అన్నారు.

"ఇంత మధ్యాహ్నం ఎలాగ? కష్టమండి" అన్నాడు శిష్యుడు.

"మరి నేను వెళ్ళడం లేదా" అన్నారు.

"కాళ్ళకి చెప్పులు లేకుండా వెళ్ళగలమా" అన్నాడు శిష్యుడు.

"నేను చెప్పులు వేసుకోను" అన్నారు రమణమహర్షి

శిష్యుడు "మీరు గొప్పవారు" అని అంటే...

"ఆయన నాకు మాత్రం నీలాగ దేహం లేదా?" అన్నారు.

నేనూ నీలాంటి వాడినే అంటే అర్థం రమణమహర్షి అని చెప్పబడుతున్న నాలో ఏ చైతన్యముందో జగదీశన్ అని చెప్పబడుతున్న నీలోనూ అదే చైతన్యముంది. చైతన్యం ఇద్దరిలోనూ సమంగా ఉంది. కాబట్టి నేను బయలుదేరుతున్నాను నువ్వు బయల్దేరు అన్నారు.



ఇద్దరూ బయలుదేరారు.

కొండచుట్టూ ఆయన చకచకా నడుస్తున్నారు, శిష్యుడు కొద్దిసేపు వెళ్ళేటప్పటికల్లా చతికిల పడిపోయాడు. "మహానుభావా! కాళ్ళు కాలిపోతున్నాయి, పై నుంచి సూర్యతాపం తగుల్తోంది, కొద్దిసేపు ఇలాగ నడిస్తే నా తల పగిలిపోతుందని అనిపిస్తోంది. నా వల్ల కాదు తలనొప్పి పెరుగుతోంది." అంటే అయన "ఒకసారి ఆ సూర్యమండలాన్ని చూడు అక్కడ ఉన్నదేదో ఇక్కడున్నది అదే అని భావించి 'సూర్యోస్మి' అని పదిమార్లు చెయ్యి" అన్నారు.

**సూర్యోస్మి**– అస్మి అంటే 'అయివున్నాను' అని అర్థం. 'సూర్యోస్మి' అంటే ఆ సూర్యుడు నేనే అనుకోమన్నారు. ఆయన అలా అనుకోగానే కాళ్ళకి, ఒంటికి వేడి తెలియలేదు, మొత్తం గిరి ప్రదక్షిణ అంతా చేసాడు.

"అప్పటినుంచి 'సూర్యోస్మి' నిత్యం చేస్తున్నాను నేనిప్పుడు ఏ ఎండలో అయినా ఏ ఊళ్ళో అయినా, ఎక్కడైనా కాళ్ళకి చెప్పుల్లేకుండా ఎంత దూరమైనా హాయిగా నడవగలను"

అని ఆయన తన అనుభవాన్ని పుస్తకంలో రాసుకున్నాడు. ఈ 'అహం బ్రహ్మాస్మి' అనే భావన చాలా సులభంగా మనం తెచ్చుకోగలగాలి.

గీతలో కృష్ణపరమాత్మ కూడా 'అహం, అహం' అని ఎన్నోమార్లు చెప్తూ

**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఖిలం।**
**యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకమ్॥**

అంటాడు. నా తేజస్సే ఆయన అన్నాడు. విష్ణువు సర్వవ్యాపకుడు అని ఒప్పుకున్నప్పుడు మనలో మాత్రం లేదా! అందుకే 'అతడే నేను' అని ఉపాసన చెయ్యాలి. ఆ ఉపాసనే నిజమైన ఉపాసన. **'సోహం భావేన పూజయేత్'** చేతకాకపోతే మొదట నమస్కారం చెయ్యడం నేర్చుకొని క్రమంగా ఈ ఆలోచన పెంపొందించుకోవాలి.

**'యః సూర్యః సోహమేవచ'** అని భవిష్యోత్తర పురాణంలో చెప్పడమే కాకుండా అధర్వణ వేదంలో సూర్యోపనిషత్తులో సూర్యుని ఉపాసించవల్సిన విధానం చెప్పారు. దేవతతో మనం అభిన్నమైపోవాలి. అంటే నేనే ఆయన అనుకోవడం. దీన్ని మరోరకంగా 'తాదాత్మ్యం' అని చెప్తారు.



తాదాత్మ్యమే ఉపాసన. మరొకటి కాదు. తన్మయత – తాదాత్మ్యత అంతే. ఆ సూర్య భగవానునితో తన్మయులమైపోయి మనమే ఆయన తేజస్సు కావాలి. సూర్యభగవానుని యందు పరమాత్మను ఆరాధించేవారు తేజోవంతులవుతారు.

సిద్ధుల గురించి చెప్తూ కృష్ణపరమాత్మ భాగవతంలో ఇది ఒకరకమైన సిద్ధి అని చెప్పారు. మన హృదయ మండలంలో సూర్యమండలాన్ని భావించి, దానిలో పరమాత్మని ధ్యానిస్తూ ఆ పరమాత్మే మనహృదయంలో ఉన్నాడని తెల్సుకొంటే ఈ రెండింటికి అభిన్నతని క్రమంగా సాధించి విశ్వవ్యాపకమైన బ్రహ్మముతో తాదాత్మ్యం చెందుతాం. దేహంతో తాదాత్మ్యం చెందిన అహం కాకుండా బ్రహ్మముతో తాదాత్మ్యం చెందిన అహం అలా సిద్ధిస్తుంది. ఇది ఉపాసనా ప్రక్రియ.

మరొక సిద్ధి చెప్తూ సూర్యుడే దృష్టిదేవత. ఆ సూర్యమండలాన్ని ధ్యానిస్తూ మన నేత్ర మండలాన్ని ధ్యానిస్తూ అక్కడ ఉన్న పరమపురుషుని, మన కంటిలో ఉన్న పరమపురుషుని ఈ రెండింటి తాదాత్మ్యాన్ని సాధించాలి. మన కంటిలో ఆ పరమపురుషుడే ఉన్నాడు... భావిస్తే భావనే సిద్ధి అవుతుంది.

భావిస్తే భోజనం దొరకదేమో కాని భావిస్తే భగవంతుడు దొరుకుతాడు. ఆయన కొత్తగా ఉన్న వస్తువుకాదు, అక్కడ ఉన్న వస్తువు. ఉన్న వస్తువుని మనం భావనతో

పట్టాం. అంతే! దీనినే ఉపనిషత్తు 'అక్షివిద్య' అని చెప్పింది. దీన్నే 'దక్షిణాక్షి విద్య' అని కూడా అంటారు.

మన కుడికంటియందు ఉన్న సూర్య తేజస్సుని, అక్కడున్న సూర్యతేజస్సుని, నీ హృదయమండలంలో ఉన్న సూర్యతేజస్సుని మూడింటిని కలిపి మూడింటిలో ఉన్నది ఒక్కటే 'పరమపురుషచైతన్యం' అని ఉపాసించడమే ఉత్తమవిద్య. ఇది గాని చేస్తే కొంత కాలానికి దూరదర్శన శక్తి వస్తుందని కృష్ణుడు చెప్పాడు. ఎక్కడున్న వస్తువునైనా ఇక్కడినుండి చూడగలిగే శక్తి వస్తుంది.

ఇలాంటి విద్యలు, ఇలాంటి సిద్ధులు చాలా మనకి గ్రంథాల్లో కన్పిస్తాయి. సూర్యోపాసన వల్ల సర్వమూ సిద్ధిస్తుంది. కిరణములు కలిగి చక్కగా ఉదయిస్తూ దేవాసురులచేత నమస్కరింపబడుతూ ఉన్న సూర్యుడు-

**వివస్వంతం:**

**'వివస్వంతం'** -

వివస్వాన్ ఆయన పేరు. వివస్వాన్ ద్వితీయావిభక్తిలో 'వివస్వంతమ్' అవుతోంది. సూర్యునికి ఉన్న పేర్లలో వివస్వాన్ అనే పేరు ఒకటి. ఇవన్నీ వైదికమైన పేర్లు. వేదాలందు చెప్పబడ్డ సూర్యనామాలే ఇందులో చెప్పబడ్డాయి.

'వివస్తే' అనే శబ్దానికి కప్పుట అని అర్థం. **'వివస్తే ప్రభయా ఆచ్ఛాదయతి ఇతి వివస్వాన్'** అన్నారు. ఆయన ఈ ప్రపంచాన్నంతటిని తన కాంతితో కప్పుతాడు అంటే తన కాంతిని విస్తరింపజేసి దానిలో ఇదంతా వెలిగిపోయేట్లు చేస్తాడు. అందుకు ఆయన పేరు వివస్వాన్.

**భాస్కరం-**

భాస్కరుడు- ప్రకాశస్వరూపుడు. సర్వలోకాలకు కాంతిని ఇచ్చువాడు. వివస్వంతుడైన సూర్యభగవానుడే భాస్కరుడు. భాస్కరః - భా అంటే కాంతి, కరుడు అనగా కలిగించు వాడు. కాంతిని కలిగించువాడు. భౌతికంగా కాంతిని ఇస్తే, ఉపాసకులకి జ్ఞానమనే కాంతిని ఇస్తాడు. ఇది ఉపాసనాపరమైన అర్థం.

**భువనేశ్వరమ్-**

ఆయన భువనాలకు ఈశ్వరుడు కనుక భువనేశ్వరుడు. ఈశ్వరుడు అంటే శాసకుడు, నియంత, పాలకుడు, ఐశ్వర్యవంతుడు ఇన్ని అర్థాలు ఉన్నాయి.

సమస్తభువనాలకు ఐశ్వర్యాలను ప్రదానం చేసేవాడు, సమస్తభువనాలకు పాలకుడైన

ఆ భాస్కరుని **'పూజయస్వ'**.

రశ్మిమంతుడుగా, వివస్వానుడిగా, భాస్కరుడిగా, భువనేశ్వరుడిగా ఉన్న సూర్యభగవానుని తెలిసికొని పూజించు అని చెప్తున్నాడు. ఈశ్వరుడు అంటే సృష్టి, స్థితి, లయకర్త. ఈయన దేవతల్లో ఒకడు కాదు. అందరి దేవతల సమిష్టి స్వరూపం ఇతడు. సమస్త భువనానికి ఈశ్వరుడు. ప్రపంచానికి అంతటికి ఒకడే ఈశ్వరుడు ఉంటాడు.

ఏకః ఈశ్వరః – ఆ ఒక్క ఈశ్వరుడే పనులను బట్టి మూడవుతాడు.

సృష్టిలో మూడే పనులుంటాయి. అవి సృష్టి, స్థితి, లయ. ఈ మూడు పనులు ఒక్కడే చేస్తాడు. ఒక్కొక్క పని చేస్తున్నప్పుడు ఒక్కొక్క పేరు ఆయనకి అంతే. మామూలుగా ఒక ఇంటాయన ఆఫీసుకెళ్తే ఆఫీసర్, ఇంట్లో తోటపని చేసినపుడు తోటమాలి. ఆ పని చేస్తున్నప్పుడు వాడిని అలాగే చూడాలి.

అలాగే పరమేశ్వరుడు కూడా సృష్టి చేస్తున్నప్పుడు ఆయన బ్రహ్మ, స్థితి చేసేటపుడు విష్ణువు, లయ చేసేటపుడు రుద్రుడు. మన వేదాలు, పురాణాలు, భాగవత రామాయణాలు ఇదే మాట చెప్తున్నాయి.



ఈ భావాన్ని స్పష్టపరుస్తూ తరువాత వస్తున్న మాటలో

> **సర్వదేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మిభావనః।**
> **ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః (7)**

> **ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కన్దః ప్రజాపతిః**
> **మహేన్ద్రో ధనదః కాలో యమః సోమో హ్యపాంపతిః (8)**

## సర్వదేవాత్మకో హ్యేషః...

'ఏషః' అంటే 'ఇతడే' అని అర్థం. ఈ 'ఏషః' అన్న మాట ఆదిత్యహృదయంలో ప్రారంభ సమయంలో మూడుమార్లు వచ్చింది.

మళ్ళీ చిట్టచివరికి శ్లోకాలలో ఏడు మార్లు 'ఏషః' శబ్దం వస్తుంది.

మొత్తం ఏడు, మూడు కలిపితే పది మార్లు 'ఏషః' అనే మాట వచ్చింది. ఈ కూర్పు అంతా కాకతాళీయంగా కాకుండా ఒక క్రమమైన పద్ధతిగా ఉంది. అలా ఉంది కనుకనే ఇది మంత్రమైంది.

వేదంలో సూర్యభగవానుని గురించి వర్ణించిన అనేక మంత్రాల్లో రెండే రెండుపదాలు ఎక్కువ మార్లు వాడారు. ఒకటి 'అసౌ', ఇంకొకటి 'ఏషః'. 'ఏషః' శబ్దం వేదంలో అనేక

మార్లు వాడబడింది. అయితే ప్రతిసారీ సూర్యపరంగానే ఉపయోగించింది.

సంధ్యావందనంలో **'అసా ఆదిత్యోబ్రహ్మ'** అని ఒక మంత్రం ఉన్నది. 'అసౌ' అంటే ఇదిగో ఈయనే అని అర్థం. ఇంచుమించు 'అసౌ' అంటే అర్థం ఏమిటో 'ఏషః' అంటే అదే అర్థం. 'ఏషః' అంటే ఇతడే, 'అసౌ' అంటే ఇదిగో. 'ఇదిగో' అని, 'ఇతడే' అని కనిపించేవాడి గురించే చెప్పగలం కానీ కనిపించనివాడి గురించి చెప్పలేం.

మనం శివుడు, విష్ణువు, అమ్మవారు అని వర్ణించేటప్పుడు ఏషః, అసౌ అనలేం. ఎందుకంటే వాళ్ళు ఈ కంటికి కనిపించరు. ఆ కారణం చేత కైలాసమందు శివుడు, వైకుంఠమందు విష్ణువు, మణిద్వీపంలో అమ్మవారు ఉన్నారని ధ్యానించండి అనగలం గాని చూపించి చెప్పగలమా? చూపించి 'ఇదిగో' అని చెప్పగలిగే దేవుడు సూర్య భగవానుడొక్కడే.

వేదం ఈ ఆదిత్యుడే బ్రహ్మమని ఎలుగెత్తి చాటింది. ఇతడే బ్రహ్మము.

బ్రహ్మమనే శబ్దానికి అర్థం **'బృహత్వాత్ బృంహణత్వాత్ ఇతి బ్రహ్మ'** – అన్నిటికంటే ఏది ఉత్కృష్టమైనదో అది బృహత్, బృంహణము అంటే వ్యాపకము. ఏది అన్నింటి యందు వ్యాపించి ఉన్నదో అది బ్రహ్మము.

**ఆదిత్యోబ్రహ్మేతి ఉపాసనీయః** – ఆదిత్యుడే బ్రహ్మమని ఉపాసింపదగిన వాడు అని స్పష్టంగా శాస్త్రం చెప్తున్నది. ఈ బ్రహ్మమే సర్వజీవుల యందు ఆత్మ.



శరీరానికంతటికి ఒక ఆత్మ ఉంది. శరీరంలో ఒక అవయవమున్నట్టు ఇంకోటి ఉండదు కాని అంతా వేరని చెప్తే మనం ఒప్పుకోం. కన్ను ఉన్నట్టు కాలు ఉండదు, కన్ను చేసే పని కాలు చెయ్యలేదు, ఏ ఇంద్రియం పని దానిదే. కన్ను, కాలు, చెవి అని వేరు వేరు అయినా మొత్తం శరీరమంతా పట్టుకొని 'నేను' అనే భావం ఒకటే. విడివిడిగా కన్పిస్తున్నా వీటన్నింటి యందు 'నేను' అనే ఏకత్వాన్ని ఎలా సాధిస్తున్నామో, అలా ఈ జగత్తులో విడివిడిగా అన్నీ కన్పిస్తున్నా వీటన్నింటిలో ఒకే ఏకత్వం ఉన్నది.

**'సూర్య ఆత్మా జగతస్తుషశ్చ'** – జగతః – జగము అంటే కదిలేది. తస్థుషః– అంటే కదలకుండా ఉండేది. ఒకటి జంగమం, ఇంకొకటి స్థావరం. సృష్టిలో కదిలేవి, కదలనివి రెండే ఉంటాయి. కదిలేవాటికి, కదలనివాటికి కూడా ఆత్మ అతడే. విశ్వానికంతటికి ఆత్మ అయినవాడు అతడే. ఆ బ్రహ్మమునే సూర్యమండలము నందు ఆత్మస్వరూపంగా ఉపాసన చెయ్యాలి.

భారతంలో సూర్యుని గురించి చెప్తూ **'త్వంభానో జగతశ్చక్షుః త్వమాత్మా సర్వదేహినాం'** అన్నారు. నువ్వు జగత్తుకి ఆత్మవి, చక్షువువి. మనకు ఎంత కన్ను ఉన్నా బయట సూర్యుడనేవాడు లేకపోతే ఏదీ చూడలేం. సూర్యమండల కాంతిలో అతడే. కాంతిని చూడగలిగే కాంతిగా మన కంటి యందున్నవాడు అతడే.

కనుక సూర్యుడు జగచ్చక్షువు, కర్మసాక్షి అని చెప్పబడతాడు.

ఈ మధ్య కాలంలో కేరళలో జరిగిన సంఘటన– ఒక వ్యక్తికి సుమారు 70 యేళ్ళు. ఏనాడూ అన్నం తినలేదు. కానీ శరీరంలో రోగం రాలేదు. ఇప్పటికీ బలంగా ఉన్నాడు ఆయన. ఆయన చెప్తాడు "నాకొక్కటే తెల్సు. ప్రాతఃకాలంలో సూర్యునికి ఎదురుగా నిలబడి ఒక ప్రక్రియతో ఆయన్ని చూస్తానన్నాడు" ఏకాగ్రంగా సూర్యుని చూస్తాడు.

సూర్యునినుంచి మనందరం వెలుగొస్తుందని అనుకుంటున్నాం. ఆ మహానుభావుడు "ఆ కిరణములనించి అమృతం వస్తోంది" అన్నాడు.

రహస్యం చూడాలి. కిరణాల్లో వెలుగుతో పాటు అమృతం ఉంటుంది. ఆ అమృతమే మనందరం తాగుతున్నాం. అయితే మనం పరోక్షంగా తాగుతాం, ఆయన ప్రత్యక్షంగా తాగడానికి ప్రయత్నించాడు.



సూర్యునిలో ఉన్న కాంతినే వృక్షాదులన్నీ పత్రహరితం 'క్లోరోఫిల్'అనే ప్రక్రియద్వారా ఆహారంగా పొందుతాయి. దాన్ని మనం పొంది మళ్ళీ ఆహారాన్ని తెచ్చుకుంటున్నాం. పరోక్షంగా సౌరశక్తినే అన్నంగా మనం తింటున్నాం. ఋగ్వేదంలో దాని గురించి చాలా అద్భుతమైన ప్రక్రియ ఉంది. దాన్ని మనం సాధ్యం చేసుకొని జీవించగలం కాబట్టి దీన్ని 'సూర్యపానము' అనే ప్రక్రియగా అతడు ఒక రచనగా రాయడం జరిగినది.

సూర్యుడు జడపదార్థం కాదు చైతన్యపదార్థం. చైతన్యవంతమైన ఏ పదార్థమైనా స్పందిస్తుంది..

పశువుని ప్రేమగా నిమిరితే అది వశమౌతుంది. చైతన్యవంతమైన వస్తువు అది. ఒక చెట్టుని, పుట్టనీ కూడా ప్రేమగా నిమిరితే చెట్టు, పుట్ట కూడా నీ పట్ల ప్రేమని ప్రక టించగలవని జగదీశ్‌చంద్రబోస్ ఋజువు చేసాడు. కనుక సృష్టి అంతా మనం తప్ప అంతా జడం అనుకోవడమే మొదటి అజ్ఞానం.

మనం ఎంత చైతన్యవస్తువులమో, ఈ జగమంతా అలా చైతన్యవస్తువే. చైతన్యం కాని వస్తువు ప్రపంచంలో లేదు. సర్వం చైతన్యమయం. ఇంత చైతన్యానికి మూలం ఆ మహానుభావుడు. మరి మనకు చైతన్యం ఇచ్చిన ఆయన ఎంత చైతన్యవంతుడో చూడాలి.

అందుకు సూర్యుడు ఒక మండుచున్న అగ్నిగోళము, జడపదార్థం అనుకోవడం పాపం, అజ్ఞానం. ఆయన చైతన్యమూర్తి.

చైతన్యమూర్తి పరమేశ్వరుడు అని భావన చేసి ఒక్కసారి నమస్కరిస్తే అంతదూరం నుంచి మన భావం ఆయన చూడగలడు. ఆయనకంటే దగ్గరైనవాళ్ళు లేరు. మనం ఆయనని తాకకపోయినా ఆయన కిరణాలు మనదాకా వచ్చి మన ఒంటిని నిమురుతున్నాయి. ఈ భావనతో సూర్యుని చూడాలి. ఆయన మనల్ని తాకుతున్నాడని ఒక్కసారి తలంచుకొంటే ఆ ప్రేమకు ప్రతిఫలంగా ఒక్క నమస్కారం చేస్తే చాలు.

**'నమస్కార ప్రియః సూర్యః'** వినయంగా ఒక్క నమస్కారం చేస్తే ఆ మహానుభావుడు మనల్ని అనుగ్రహిస్తాడు.

మహాదాత సూర్యభగవానుడు. అందుకు 'ఏషః' అని చెప్పినప్పుడు ఇతడే అని అంత ప్రత్యక్షంగా చెప్పాడు. ఆ 'ఇతడే' అని చెప్పడంలోనే అందమంతా ఉన్నది. దగ్గరికి చూపించి చెప్తున్నాడు. ఇతడే అని చెప్పాల్సి ఎందుకొచ్చింది? ఇతడు కనిపిస్తున్నప్పటికీ నీ కంటికి కనిపిస్తున్నంత సామాన్యుడు కాదు. ఈయన అసామాన్యుడు. అందుకే తరువాత విశేషణాలన్ని. ఇతడు ఎవరనుకున్నావు? ఈయన 'సర్వదేవాత్మకః' ఇతడు సామాన్యుడు కాదు సర్వదేవాత్మకుడు.



ఆత్మ అనే శబ్దానికి అసలు అర్థం **'ఆతనోతి వ్యాప్నోతి ఇతి ఆత్మ'**. వ్యాపించిన లక్షణము కలది ఆత్మ. కనుక ఈయన సర్వదేవాత్మకుడు. ఆత్మ అనేది స్వరూపమనే అర్థములో, వ్యాపకమనే అర్థములో చెప్పబడుతుంది.

కనుక ఇతడు సర్వదేవతాస్వరూపుడు. సూర్యోపాసన చేసేటప్పుడు ఈ దృష్టి ఉండాలి.

కొంతమంది అంటారు మీ హిందువులకి ఎక్కువమంది దేవుళ్ళండి అని. అవును మనకి చాలా ఎక్కువ మంది దేవుళ్ళు. అదే మనకి బలం. కాని మనకి చాలా మంది మనుషులు అండగా ఉన్నారు అన్నప్పుడు మనం ఆనందపడతామా లేదా! ఎక్కువ మంది ఉండడం సుగుణం. ఎవరూ లేకపోవడం ఉన్నవాడొక్కడే అన్నప్పుడు అది లోపమే! ఎక్కువ మంది ఉన్నారు అంటే బలగం ఎక్కువ అని అర్థం.

హిందువులకి ఎక్కువమంది దేవుళ్ళు కారు. దేవుళ్ళు హిందువులకి కొందరు, ఇంకొకళ్ళకి కొందరు ఉండరు.

దేవతలు ఎప్పుడూ ఉంటారు. వాళ్ళు ఉన్నారన్న జ్ఞానం కలిగిన మతం హిందూమతం.

వేదంలో చెప్పబడ్డ సమస్త దేవతా వర్గాలు మనకు ఆదిత్యహృదయంలో వస్తారు.

తరువాత వాళ్ళ వరుస వస్తుంది.

**'సూర్యోవై సర్వేషాం దేవానాం ఆత్మా'** సూర్యుడు సర్వదేవతలకి ఆత్మ. ఇది వేదం చెప్పిన మాట.

సర్వదేవతలకి ఆత్మ ఆయన. ఒకటే అన్నింట్లో వ్యాపించి ఉన్నది. అలాగే సర్వదేవతలలో వ్యాపించిన చైతన్యస్వరూపుడు ఈయనే.

సూర్యునినుంచి అనేక కిరణాలు వచ్చినట్లే ఆ పరమాత్మనుంచి అనేక దేవతలు వచ్చారు. కిరణాలు అనేకం, బింబము ఏకమే. అలాగే దేవతలు అనేకం, పరమాత్మ ఏకం. ప్రతికిరణములో సూర్యుని శక్తి వుంది, ప్రతి దేవతలో ఆ దేవదేవుడైన పరమాత్మ యొక్క శక్తి ఉంది. అన్ని కిరణాలు ఒకటికాదు, కాని మనకి ఒకేలా కనిపిస్తాయి. ఆ కిరణాల్లో చాలా రకాలు ఉన్నాయి. అది తెలియాలంటే శాస్త్రీయ పరిజ్ఞానం ఉండాలి.

కిరణాలలో రకరకాల శక్తులు ఉంటాయి. ఈ రకరకాల శక్తులున్న కిరణాల్ని ఈ ప్రకృతిలో ఉన్న రకరకాల జీవజాలమంతా ఒక్కొక్క రకంగా పుచ్చుకుంటూ ఉంటుంది. ఇది విజ్ఞానశాస్త్రపరంగా మనం ఆలోచిస్తే తెలుస్తుంది మామూలుగా అయితే తెలీదు. స్థూలమైన నేత్రానికి అన్నీ ఒక్కటే. సూక్ష్మమైన నేత్రానికే భేదం తెలుస్తుంది. స్థూలమైన నేత్రానికి రక్తం ఒక్కటే. సూక్ష్మమైన పరిశీలనకే రక్తంలో గ్రూపులు కనిపిస్తాయి. అదే విధంగా సూర్యుని నుంచి వచ్చిన కిరణాలన్నీ కలిపి మనమీద ముద్దగా ఒక కాంతి పడిపోతోంది. కాని సూర్యకిరణాల్లో చాలా రకాలు ఉన్నాయి. ఇవి రకరకాలుగా భూమి మీదకి వస్తాయి. వాటిలోనే రకరకాల దేవతాశక్తులు ఉన్నాయి.

**'చిత్రం దేవానాముదగాదనేకం చక్షుర్మిత్రస్యవరుణస్య అగ్నేః'** ఇది వేదమాత చెప్తున్న మాట. చిత్రం దేవానాం – అవి దేవనములు. ఆ కిరణములకే దేవతలని పేరు. ఈ కిరణములు కలిగిన సూర్యభగవానుడు దేవదేవుడు. అందుకే దేవతలందరికి కూడా ఆదిత్యులు అని పేరున్నది. అదితి పుత్రులు ఆదిత్యులు. ఈ ఆదిత్యులు వాళ్ళయితే ఆదిత్యుడు ఈయన. 'ఆదిత్యులు' అని వాళ్ళని బహువచనంగా చెప్పారు. ఈయన్ని మాత్రం ఆదిత్యుడు అని ఏకవచనంగా చెప్పారు. దేవతలందరినీ కలిపి 'ఆదిత్యులు' అంటారు. ఈయన ఒక్కడే 'ఆదిత్యుడు'. ఇప్పుడు ఈయన సర్వదేవాత్మకుడు అయ్యాడు. ఒక్కొక్క కిరణంలో ఒక్కొక్క రకమైన శక్తి ఉంటుంది. ఆ కిరణాన్ని ప్రత్యేకంగా పట్టుకొని గ్రహించే విజ్ఞానం మనకి ఉంటే ఆ కిరణాలు రకరకాలుగా ఉన్నాయి. సూక్ష్మమైన కిరణశక్తులు, వర్ణశక్తులు ఉన్నాయి. సప్తవర్ణములు సూర్యకాంతిలో ఉన్నాయి.

విశ్లేషిస్తే సప్తవర్ణములు కనపడతాయి. సప్తవర్ణములు హఠాత్తుగా మన కంటికి కనబడక పోయినా సప్తవర్ణములకి కారణశక్తులు అందులో ఉన్నాయి.

కనుక సృష్టిలో మనం చూస్తున్న ప్రతిరంగు సూర్యకిరణముల వల్ల సంక్రమించినదే.. సైన్సు బాగా తెలిస్తే హిందూమతం గొప్పతనం అర్థమవుతుంది. సైన్సు అభివృద్ధి చెందుతున్న కొద్దీ హిందూమతం గురించి సులభంగా చెప్పవచ్చు.

ఇప్పుడున్న భౌతికవిజ్ఞానం ఇంకా ఎదగాలి. ఎదిగితే వేదము చెప్పిన సౌరవిజ్ఞానం ఇంకా ఇంకా అర్థమౌతుంది. చిత్రం అనే మాటకు అర్థం ఏమిటంటే ఆశ్చర్యము, అద్భుతం. ఆ కిరణాల్లో ఆశ్చర్యకరమైన శక్తులున్నాయి కనుక **'చిత్రం దేవానాం'** అన్నారు. అంతేకాదు చిత్రం అంటే **'చీయంతే అనేక వర్ణాన్ ఇతి చిత్రం'** అని అర్థము చెప్పారు. చిత్రం అంటే అనేక రంగులని కలిగించునది.

వర్ణాలు ఏడు అని చెప్పుకున్నా వాటిలో భేదాలు, గాఢతలు కూడా మనం తీసుకున్నట్లయితే వర్ణములు అనేకాలుగా కన్పిస్తాయి. వర్ణములు ఎన్నైనా మళ్ళీ అన్నింటికి మూలమైన ఆయన మాత్రం ఏ వర్ణము లేని తేజస్సే. భిన్నత్వంలో ఏకత్వమనేది సూర్యుడిలోనే మనకి కనిపిస్తుంది. పరమాత్మ గురించి, పరమేశ్వరుడు గురించి చెప్పే మాటలన్నీ సూర్యుని వైపు చక్కగా అన్వయించబడుతూ ఉంటాయి. ఇన్ని వర్ణములకు మూలమైన ఆయనకి ఏ వర్ణము లేదు. అలాగే రకారకాల వికారములతో త్రిగుణాత్మకమైన ఈ జగత్తుని కలిగిస్తున్న పరమాత్మకి ఏ గుణములేదు ఏ వికారమూ లేదు. మొత్తానికి అనేక వర్ణములు, అనేక శక్తులే దేవతలు. అవి కలిగించువాడు కనుక ఇక్కడ స్వామిని 'రశ్మిభావనః' అని తరువాత నామంలోకి తీసుకువెడుతున్నారు.



**తేజస్వీ**

తేజస్సు అంటే ప్రకాశం. ప్రకాశం కలవాడు ఆయన. తేజస్సు అంటే బీజశక్తి. సర్వ జగత్తుకి కావల్సిన బీజములు ఆయన దగ్గర ఉన్నాయి. ఎందుకంటే ప్రారంభంలో చెప్పున్నాడు సర్వదేవాత్మకమైన పరమాత్మ!

ఈ జగత్తునంతటిని సృష్టించగలిగిన బీజములు ఆయన దగ్గర ఉన్నాయి. ఆ బీజములని ఈ ప్రకృతిలో ఆయన వ్యాపింపచేసి రకరకాలుగా వ్యక్తం చేయిస్తున్నాడు.

విత్తనాల్లోనే వృక్షం ఉంటుందిగాని కనిపించదు. అదే విధంగా సృష్టి వ్యక్తంగాని దశ బీజదశ. వ్యక్తమైన దశ వృక్షదశ. అదేవిధంగా ఈ సృష్టి అంతా వ్యక్తం కాకముందు ఆ పరమాత్మ సర్వదేవాత్మకుడుగా ఉన్నాడు. ఆయన ఈ ఆదిత్యమండలం ద్వారా ఈ

సృష్టినంతటిని వ్యక్తం చేసాడు. వ్యక్తం కాకముందు ఇవన్నీ ఆయనయందు బీజస్థితిలోనే ఉన్నాయి.

ఆయనవల్లే కలిగి, ఆయనవల్లే పెరిగి, ఆయనలోనే మళ్ళీ లీనం అవుతున్నాయి. కనుకనే 'సర్వబీజములను కలిగినవాడు' అని అర్థం కూడా దీనికి ఉన్నది.

**రశ్మిభావనః**

రశ్ములు అంటే కిరణాలు. కిరణాలను కలిగించువాడు.

తరువాత వాక్యంలో **'గభస్తిభిః'** – అంటే మళ్ళీ కిరణములే, తన కిరణాలతో ఈయన **'ఏష దేవ అసురగణాన్ లోకాన్ పాతి'** – పాతి అంటే పాలిస్తున్నాడని అర్థం. ఇతడు తన కిరణాలతో దేవాసురగణాలని, లోకాలని కూడ రక్షిస్తున్నాడు. మాటిమాటికి కిరణాలను, చెప్పడం దేనికి? సూర్యుడు మనకు అందడు, కాని సూర్యకిరణాలు మనకు అందుతాయి. ఆయన కిరణాల ద్వారా చాలా దగ్గరవాడు, మండలంగా చాలా దూరంవాడు.

**'తద్దూరే తద్వదంతికే'** అని ఈశావాస్యోపనిషత్ చెప్తోంది. దూరంగా ఉన్నవాడు ఆయనే, దగ్గరగా ఉన్నవాడు ఆయనే'. అందనంత దూరంలో ఉన్నవాడు అందరికీ కాంతిరూపంలో అందుబాటులోకి వచ్చాడు. కిరణాలే మనకు ఆయనకు ఉన్న బాంధవ్యాలు.



మన ఋషుల అపూర్వవిజ్ఞానం వేదజనితమైనది. ఇది సనాతనం, గుహ్యం అయినది గనుక అది వేదంలో చెప్పబడ్డది. ఆదిత్యహృదయాన్ని మనలో ఉన్న ఆత్మచైతన్యంగా దర్శించాలి. దీన్నే ఉపాసనా భాషలో పిండాండం, బ్రహ్మాండం అని చెప్పవచ్చు. మనచుట్టూ ఉన్నది బ్రహ్మాండం. బ్రహ్మాండంలో ఏముందో పిండాండం(మనలో)లో అదే ఉంది. సముద్రంలో ఏముందో కెరటాల్లో అదే ఉంది. బ్రహ్మాండమనే మహాసముద్రంలో పిండాండాలన్నీ కెరటాలే. సముద్రంలో, కెరటంలో ఒకే నీరు ఉన్నట్లుగా ఈ బ్రహ్మాండంలో పిండాండంలో కూడా ఒకే పరమాత్మ చైతన్యం ఉన్నది. ఆ సమన్వయం చేసుకోవాలి.

మండలం నుంచి వచ్చే రశ్ములు అంటే కిరణములు. ఇది అందరికీ తెల్సినది.

అసలు రశ్ములు అనే మాటకి వేదం ప్రశ్నోపనిషత్‌లో చెప్తూ **'యఃసర్వం ప్రకాశయతి తేన సర్వాన్ ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే'** అన్నది.

**'సూర్యస్య రశ్మిభిః యజమానం వహంతి'** అన్నారు – యజ్ఞఫలదాత ఈశ్వరుడు. సూర్యరశ్ముల ద్వారా యజ్ఞం చేసిన వారిని కాపాడుతుంటాడు. సూర్యరశ్ములు అక్కడ

శక్తిని ఇక్కడ దించడానికి ఎంత పనికొస్తున్నాయో, ఇక్కడ భక్తిని అక్కడికి చేర్చడానికి అంతే పనికొస్తాయి. మనకి ఆయనకి  ఇవే మాధ్యమాలు. సూర్యకిరణాలు జీవులు ప్రయాణించడానికి మార్గాలు. ఎవరైతే సూర్యోపాసన చేస్తారో వారు కాంతిమార్గం గుండా శరీరపతనానంతరం ఊర్ధ్వలోకాలకే చేరుకుంటారు. **'సూర్యమండలం భిత్వా'**- అని శాస్త్రం చెప్తున్నది. సూర్యోపాసన చేసినవాడు సూర్యమండలం ఛేదించుకుని పరమాత్మలోకి చేరుతాడు.

సూర్యుని ఉపాసనాదృష్టితో చూడనివాడు పశుపక్ష్యాదులవలె పుడుతూ చస్తూ ఇక్కడే తిరుగుతాడు. సూర్యుని చూడగలిగేవాడు మాత్రమే ఉన్నతికి వెళ్తాడు. లేనివాళ్ళందరూ నరకాదులకో ఇంకా కిందలోకాలకో వెళ్తారు. ఇది భక్తిపరమైన ఉపాసనా పరమైన అంతరార్థం.

'మంత్రపుష్పంలో **'తిర్యగూర్ధ్వమథశ్శాయీ రశ్మయః తస్య సంతతాః సంతాపయతి స్వందేహమాపాదతల మస్తకః'** - ఆయన నుంచి వచ్చే రశ్ములు తిర్యక్-అడ్డంగా, ఊర్ధ్వ- పైకి, అధః - క్రిందికి వెళ్తున్నాయి అన్నారు. అంతా వ్యాపించిపోతుంది. అలాగ రశ్ములు పాదతలం మొదలుకొని మస్తకము వరకు మొత్తం వ్యాపించి ఉన్నాయి.



వీటినే ప్రాణములు అంటారు.

**శరీరపరంగా రశ్ములు అంటే ప్రాణములు. మండలపరంగా  రశ్ములు అంటే కిరణ ములు. ఇక పరమాత్మ పరంగా రశ్ములు అంటే శక్తులు.**

ఆయన్నించి విశ్వము వైపు ప్రసరించిన అనంతశక్తులతోనే లోకాలు నడుస్తున్నాయి. అంతేకాదు సూర్యభగవానుడు వేదపురుషుడు.

**రశ్ములు అంటే వేదమంత్రాలు.** వేదమంత్రాలన్నీ రశ్ములైతే ఇవి పుట్టడానికి మూలమైన ఓంకారస్వరూపుడైన పరమపురుషుడు సూర్యస్వరూపుడు.

ఈ దృష్టితో ఉపాసన చేస్తే సూర్యకిరణాలు వేదస్వరూపంగా గోచరిస్తాయి. వేదవేద్యుడైన పరమాత్మయే సూర్యమండలాంతర్వర్తి అయిన నారాయణుడు అన్నది వేదం.

**'త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే। విరించినారాయణశంకరాత్మనే'** త్రయీ అంటే వేదం. ఋగ్ యజుస్సామాత్మకమైన వేదరాశే ఈయన.

మనకు ఆదిత్యహృదయంలో కొంతదూరం వెళ్తే 'ఋగ్యజుస్సామపారగః' అనే నామం వస్తున్నది. దీని అర్థం సూర్యుడు వేదవిద్యాస్వరూపుడు.

సూర్యుడు అనగానే కేవలం కాంతి ఒక్కటే కాదు. ఈ చెవికి వినపడక పోవచ్చుగాని

ప్రాణశక్తిలో నాదం దాగి ఉంటుంది. లోపల ప్రాణం ఉంది గనుకనే మనలో నాదం ఉంది. జగత్తంతా నాదం ఉన్నది. ఇంత నాదాన్ని ప్రాణశక్తిని సూర్యకిరణాల్లోంచి ప్రకృతి పొందుతోంది.

సూర్యకిరణాలలో వేదస్వరూపమైన శబ్దశక్తి దాగియుంది. ఈ రహస్యం యాజ్ఞవల్క్య మహర్షికి, హనుమంతునికి తెలుసు. అందుకే వాళ్ళు సూర్యుని నుంచే విజ్ఞానం అంతా నేర్చుకున్నారు.

వేదంలో సూర్యునికి గోపతిః, గోవిందః, గోపాలః - అని మూడు పేర్లు ఉన్నాయి. దేవతల పేర్లు అన్నీ సూర్యుని వైపు అన్వయించుకోవచ్చును. సూర్యమండలాంతర్వర్తియైన ఒక్క పరమపురుషుని గురించే వేదం వర్ణించింది. ఆ పరమపురుషుడే లోకాన్ని ఉద్ధరించ డానికి కృష్ణమూర్తిగా అవతరించినపుడు ఆ పేర్లన్నీ ఆయనకి వాడుతున్నాం. పరమాత్మ కృష్ణునిగా అవతరించక ముందే వేదములో పేర్లు ఉన్నాయి. 'గోపతిః' అనే మాట కృష్ణావతారానికి పూర్వమే వేదంలో ఉంది.

గో - అనే మాటకి ప్రాణములు, వేదమంత్రములు, కిరణములు అని అర్థం. వేదంలో ఒకచోట వర్ణిస్తూ ఈ కిరణాలన్ని భూమి మీదకి రంగు రంగుల ఆవులు దిగుతున్నట్లు దిగుతున్నాయి అన్నారు. ఆవుల్ని తోలుకుంటూ మందకి వెళ్తాడు గోపాలుడు. అలాగ కిరణాలనే మందలను తోలుతూ సూర్యుడనే గోపాలకుడు పైన కన్పిస్తున్నాడు అని అద్భుతంగా వర్ణించింది వేదం.



ఎందుకలా వర్ణించింది? కిరణాలని గోవులతో ఎందుకు పోల్చింది? గోవుల పొదుగు లోంచి మనం ఆహారాన్ని ఎలా పొందుతున్నామో ఈ కిరణాల్లోంచి ప్రాణశక్తి అనే అమృతాన్ని అలా పొందుతున్నాం. అందుకు వాటిని గోవులతో పోల్చింది. వీటినన్నింటిని తోలుతూ నడిపిస్తున్నవాడు ఆయన. తన నుంచి వచ్చిన గోవుల్ని తానే నడుపుతున్నాడు. కిరణాలు ఆయన్నుంచే వచ్చాయి. కిరణాల దృష్టితో అనేకం, బింబం దృష్టితో ఏకం. కనుక గోవిందుడు ఎవరు? గోపాలకుడు ఎవరు?రశ్మిపాలకుడే గోపాలకుడు 'గోపతిః' అని చెప్పింది. కనుక **గభస్తిభిః** తన కాంతి కిరణాలతో ఈ జగత్తుని పోషిస్తున్నాడు.

**ఏషదేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః**

తన కాంతి కిరణాలతో ఎవరిని పోషిస్తున్నాడు? **దేవ అసురగణాన్ లోకాన్** - దేవాసురగణ లోకాలు అనడంతో అందరు వచ్చారు, దేవాసురులను ప్రత్యేకించి చెప్పారు. ఇందులో అంతరార్థం జాగ్రత్తగా గమనిస్తే ముందు 'దేవాసురనమస్కృతం' అని ఇక్కడ

దేవాసురగణాన్ అని అన్నారు. అసలు ప్రపంచమంతా దేవాసురగణాలే మరొకటి లేవు. ఈ మాట అర్థం కావాలంటే భగవద్గీతలో దైవాసురసంపద్విభాగ యోగం చూడాలి. దైవీ గుణాలు ఎవరి దగ్గర ఉంటాయో వాళ్ళు దేవతలు. అసుర గుణాలు కలవాళ్ళు అసురులు.

కేవల అసుర గుణాలు ఉన్నవాళ్ళు, కేవల దైవ గుణాలు ఉన్నవాళ్ళు విడివిడిగా లేకుండా కలిసే ఉంటారు. మనలో రజోగుణ తమోగుణ వికారాలు అసురప్రవృత్తులు. సత్వగుణవికారాలు దైవీ ప్రవృత్తులు.

ఈ మూడు అందరిలో వివిధ స్థాయిలలో ఉంటాయి. కొందరిలో రజో గుణం ఎక్కువగా ఉంటే, కొందరిలో తమో గుణం ఎక్కువ. ఉంటుంది. ప్రతివాడిలో మూడు ఉంటాయి. సత్త్వగుణం పెంచుకొని, రజోగుణం, తమోగుణం తగ్గించుకోవాలి. గాని తీసిపారేయ వలసినవి కావు. ఏ సమయంలో ఏది ఎంతమేర ఉండాలో అది ఉండాలి. లేకపోతే ప్రపంచం నడవదు. సర్వప్రపంచం త్రిగుణాత్మకం. కనుక ఈ త్రిగుణాత్మకమైన ఈ లక్షణాలతో ఉన్న జగత్తే 'దేవాసురమ్'. దీనిని పాలించేవాడు భగవానుడు.

**గభస్తిభిః**

దేవాసురాత్మకమైన సర్వలోకములను తన కిరణములతోనే స్వామి పాలిస్తూ ఉంటాడు. కిరణాల బట్టే సూర్యుని తెల్సుకుంటాం. గోవుల మందబట్టి గోపాలకుని పోల్చుకుంటాం. గోవింద అంటే గోవుల వలన తెలియబడువాడు అని అర్థం. గోవులు పుష్టిగా ఉన్నాయంటే మంచి పాలకుడు ఉన్నాడని అర్థం. మనకు పరిచయం గోవులే, గోవిందుడు కాదు. కనుక కిరణాలని బట్టే సూర్యుని అర్థం చేసుకోవాలి. మనలో ప్రాణాన్ని బట్టే మనలో ఉన్న ఆత్మచైతన్యాన్ని అర్థం చేసుకోవాలి. మనలో ఉన్న అఖండ ఆత్మచైతన్యమే ప్రాణము లుగా శరీరమంతా వ్యాపించి ఉన్నది.

***ప్రాణశక్తులని ప్రసరింపజేసే ఆత్మచైతన్యాన్ని తెలుసుకోవాలి. కిరణశక్తులని ప్రసరింప జేసే ఆదిత్యమండలాన్ని తెలుసుకోవాలి. సర్వజగత్తువైపు శక్తుల్ని ప్రసరింపజేసే పరమే శ్వరుని తెలుసుకోవాలి, వేదరూప కిరణాల్ని ప్రసరింపజేసే ప్రణవస్వరూపుడైన పరమా త్మను తెలుసుకోవాలి. ఇది రశ్మిభావనః, గభస్తిభిః - అనే మాటలలో అర్థములు.***

పైగా కిరణాలకున్న శక్తి రకరకాలు. **'రశ్మీనాం ప్రాణానాం రసానాంచ స్వీకరణాత్ సూర్యః'** ఈ రశ్మల ద్వారా ప్రాణాలు ఇస్తాడు, ప్రాణాలు తీసుకుంటాడు. రశ్మల ద్వారా సృష్టికి శక్తిని ఇస్తాడు, శక్తిని లాగేసుకుంటాడు. రెండూ చేయగలడు.

సూర్యుడు తనకిరణాల ద్వారానే వర్షాదులను కురిపిస్తాడు, కురిపించిన వాటిని తిరిగి

కిరణాలద్వారానే లాక్కుంటాడు.

వేసవికాలంలో బయటకి వచ్చామంటే ప్రాణశక్తి హరించుకుపోతుంది. కాని ఆయన రాకుండా ఉంటే బాగుండును అనుకుంటే అసలు ప్రాణాలు ఉండవు. రెండూ చెయ్య గలడు. అక్కడే సృష్టి స్థితి లయలు కన్పిస్తున్నాయి. అడుగడుగునా సూర్యుడు నేనే సృష్టి, స్థితి, లయకర్తని అని చూపిస్తున్నాడు. ఈశ్వర కృత్యం కనిపిస్తున్నప్పుడు ఈశ్వరుడు అని తెలుసుకోవాలి.

మనకు కనిపిస్తున్న ఈశ్వరకృత్యం అంతా ఆయన యందు ఉన్నది. **'అగ్నౌ ప్రాస్తాహుతి సమ్యక్ ఆదిత్యముపతిష్ఠతి। ఆదిత్యాత్ జాయతే వృష్టిః వృష్టేరన్నాః తథా ప్రజాః'** అంటోంది మనుస్మృతి.

అగ్ని యందు ఇవ్వబడిన ఆహుతులు కిరణముల ద్వారా ఆదిత్యునికి వెళ్తాయి.

ఇంద్రాయస్వాహా, వరుణాయస్వాహా, రుద్రాయస్వాహా, విష్ణవే స్వాహా మనం ఏ దేవతను ఉద్దేశించి ఆహుతులు వేసినా ఇవన్నీ తీసుకువెళ్ళి అగ్నిదేవుడు ఆదిత్యమండలంలోకి వెళ్ళగానే ఆదిత్యాంతర్వర్తులైన సర్వదేవతలు తృప్తి చెందుతారు. వాళ్ళు తృప్తి చెందగానే వృష్టి కురుస్తుంది. ఆ వృష్టి వల్ల మళ్ళీ జీవకోటి అభివృద్ధి చెందుతుంది. ఇది యజ్ఞవిజ్ఞానం. ఈ విజ్ఞానాన్ని ఇచ్చింది హిందూ ధర్మం.



ఇది అర్థం చేసుకోవడానికి నేటి భౌతిక విజ్ఞానం ఇంకా ఎదగాలి. సూర్యభగవానుడు అగ్ని హోత్రంలో వేసినవన్నీ స్వీకరిస్తాడు. ఆయనలోకి వెళ్ళి ఆహుతులు వెయ్యలేం కనుక ఆయన స్వరూపంగా అగ్నిని తీసుకొని, సౌరాగ్నినే మనం ఉపాసన చేసి దాని యందు వేస్తున్నాం.

పోలెండ్ నించి ఒక విజ్ఞానశాస్త్రవేత్త వచ్చి భారతదేశ యజ్ఞ సంస్కృతిపై పరిశోధన చేసాడు. యజ్ఞంలో మనం వాడే ఓషధీద్రవ్యాలు (పలాశ, అశ్వత్థ, మోదుగ, జమ్మి) ఆవు నేతితో కలిపి ఆహుతుల రూపంలో అగ్ని యందు వేస్తే ఇవి క్రమంగా సూర్యకిరణాల ద్వారా వాయుమండలంలోంచి రోదసిలోకి ప్రసరిస్తాయి.

జగత్తులో సూర్యుని వల్లనే వాయుమండలం కూడా ఏర్పడుతుంది. ఇది విజ్ఞానవేత్తలకి సులభంగా తెలుస్తుంది. అగ్ని యందు ఆహుతులతో పాటు ఉద్దేశపూర్వకమైన మంత్రగత శబ్దశక్తి కూడా కలుస్తుంది. ఈ రెండిటి ద్వారా అది ఏ దేవతను ఉద్దేశించామో ఆ దేవతను చేరడానికి సూర్యమండలం ద్వారా సర్వదేవాత్మకుడైన ఆయనకు చేరుతుంది.

దేవతలు అందరూ తృప్తి పడితేగాని జగత్తుకి వృష్టి రాదు. వృష్టి అంటే వర్షం మాత్రమే

కాదు. పై నుండి కురిసేది వర్షం. ఏది మనకు రావాలన్నా పైనుండే రావాలి. ఏది ఇచ్చినా మనకి 'పై వాడే' ఇవ్వాలి. ఆ పై నున్న దేవతలు అనుగ్రహిస్తేనే ఐశ్వర్యాదులు అన్నీ మనకి వస్తాయి.

సూర్యుని నుంచే ఐశ్వర్యాదులు వస్తున్నాయి. అన్నం ఒక్కటే కాదు. ధాతు నిర్మాణం, రత్న నిర్మాణం ఆయన వల్లే జరుగుతోంది. ఏ కిరణాలవల్ల ఏ నిర్మాణం జరుగుతుంది? రత్ననిర్మాణాలు ఎలా జరుతాయి? ఏ సూర్య కిరణం వల్ల ఏ గ్రహం ఏ శక్తి పొందుతుంది? ఆ గ్రహసంబంధమైన కిరణం భూమిలోకి ప్రసరిస్తే ఏ రత్నం, ఏ కిరణ శక్తిని పొంది ఏ రత్నంగా మారుతుంది మొదలైనవి వేద విజ్ఞానం చెప్తోంది. .

సూర్యకిరణాలలో 'సహస్రకిరణః' అని వెయ్యి కిరణాలను చెప్పారు. సహస్రకిరణ అంటే అనంతమైన కిరణాలు కలవాడని ఒక అర్థం. వేదం వెయ్యి కిరణాలు లెక్కకట్టి చెప్పింది.

ఆ వెయ్యి కిరణాల గురించి భారతంలో, మత్స్యపురాణంలో, మార్కండేయపురాణంలో వర్ణించారు.

అవి వృష్టిసర్జన కిరణాలు 400. వాటిలో మళ్ళీ 100 చెప్పున నాలుగు రకాలుగా ఉండి వర్షాన్ని కురిపించే కిరణాలు ఎన్ని రకాలుగా ఉంటాయో చెప్పారు. ఘర్మసర్జన కిరణాలు 300. ఘర్మము అంటే తాపం, ఉడకపోత ఇవి కలిగించే కిరణాలు. హిమసర్జన కిరణాలు 300 అనగా మంచును కలిగించే కిరణాలు. ఇలా 'వెయ్యికిరణాల వాడు' అంటే లెక్కకట్టి సహస్రకిరణ స్వరూపుడైన ఆదిత్యుని వర్ణన చెప్తున్నారు.

వీటి వలన వాతావరణంలో ఈ మూడు లక్షణాలు ప్రవేశింపజేసి వర్షాన్ని, ఘర్మాన్ని, హిమాన్ని కూడా వర్షిస్తున్నాడు. వర్ణకారక కిరణాల గురించి ముందు వివరించుకున్నాం. ఇవన్నీ రశ్ముల భేదాలు. ఆయన కిరణములతో చేస్తున్న పనులు ఎన్నో కనుక ఇన్ని కిరణాలు కలిగిన మహానుభావుడు సర్వజగత్తుని వాటితోనే పాలిస్తున్నాడు. 'ప్రాణాన్ రశ్మిషు సన్నిధత్తే' – ఆ కిరణాల ద్వారానే జీవకోటికి ప్రాణాలిస్తున్నాడని ప్రశ్నోపనిషత్ మంత్రం.

దేవతల గురించి ఇక్కడ్నుంచి రెండు శ్లోకాలలో వివరిస్తున్నాడు. హిందూమతంలో ఉన్న దేవతల క్రమాన్ని వివరిస్తున్నాడు.

**ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః స్కందః ప్రజాపతిః**
**మహేంద్రో ధనదః కాలో యమః సోమోహ్యాపాం పతిః** (8)

శాస్త్రంలో **'సాక్షాత్ దేవో దివాకరః'** అన్నారు – సాక్షాత్తు అంటే 'నేరుగా' అని అర్థం. సాక్షాత్ దేవుడు, ప్రత్యక్షదేవుడు ఈయనే. ఇంతకంటే దుర్నిరీక్ష్యమైన మహాతేజస్సుతో కనిపించే సాక్షాత్ దేవుడు ఎవరుంటారు?. సర్వజగత్తుని పాలిస్తున్న ఆ దైవం సాక్షాత్తు

**ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివః –** బ్రహ్మ, విష్ణువు, శివుడు.

నిజానికి ఉన్నది ఒకడే పరమేశ్వరుడు. జగన్నిర్వహణకోసం ముగ్గురై బ్రహ్మవిష్ణు రుద్రులుగా మారతాడు. ఈ ముగ్గురిని మహేశ్వరులు, మహాదేవులు అంటారు. వాళ్ళ వల్లనే సృష్టి, స్థితి, లయలు జరుగుతున్నాయి.

ఆ ముగురు వేల్పులు– ఏషః ఈయనే అన్నారు. విడిని చూపిస్తూనే ఏకత్వాన్ని చెప్తున్నారు.

మనం ఏ దేవతను ఉపాసించినా ఈ భావనతోనే ఉపాసించాలి.

దేవతాదృష్టితో ఉపాసిస్తే కోరికలు తీరతాయి. దేవతను పరమాత్మ దృష్టితో ఉపాసిస్తేనే జ్ఞానం, తద్వారా మోక్షం లభిస్తుంది. ఇది సగుణ బ్రహ్మోపాసన. కనుక మనం ఉపాసించే దైవం 'బ్రహ్మవిష్ణు శివాత్మకం ' అని తెలుసుకోవాలి.



బ్రహ్మ అంటే పెద్దవాడు. ఉత్కృష్టుడు. పెద్దవాడంటే పెద్దశరీరం ఉన్నవాడని కాదు మనకంటే అన్ని విధములా పెద్దవాడు. విష్ణు శబ్దానికి **'వేష్టి వ్యాప్నోతి ఇతి విష్ణుః'** తన శక్తితో సర్వత్రా వ్యాపించడమే విష్ణులక్షణం. ఇలా వ్యాపించిన విష్ణువునే 'శివః' అన్నారు. అంటే త్రిగుణాలకు అతీతమైనవాడు, మంగళ స్వరూపుడు.

దీనినే శాస్త్రంలో ఉదయం, మధ్యాహ్నం, సాయంకాలాదుల యందు బ్రహ్మ, మహేశ్వర, విష్ణు రూపాలతో ఉన్న సూర్యునకు నమస్కారం అన్నారు.

**ఉదయే బ్రహ్మణోరూపం**
**మధ్యాహ్నేతు మహేశ్వరః**
**అస్తమానే స్వయం విష్ణుః**
**త్రయీమూర్తిః దివాకరః**
**నమో భగవతే తుభ్యం విష్ణవే ప్రభవిష్ణవే.**

భవిష్యోత్తరపురాణం ఆదిత్యహృదయంలో కృష్ణపరమాత్మ అర్జునుడితో చెప్తూ–

**యదాదిత్యమయం తేజో మమతేజః తథార్జున**

**ఆదిత్యం యే ప్రపశ్యంతి మాం పశ్యంతి న సంశయః**

ఆదిత్యునిలో ఏ తేజం ఉందో నాలో అదే ఉంది. నాలో ఏ తేజస్సు ఉందో అది ఆదిత్యునిలో ఉంది. ఆదిత్యుని చూసినవాడు నన్నే చూస్తున్నాడు అన్నాడు.

**ధ్యేయః సదా సవితృమండల మధ్యవర్తీ**

**నారాయణః సరసిజాసన సన్నివిష్టః**

**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటి**

**హారీ హిరణ్మయవపుః ధృతశంఖ చక్రః**

ఆదిత్యమండలంలో శంఖచక్రగదాధారియైన నారాయణుని ధ్యానించాల్సిన విధానాన్ని చెప్పారు. విష్ణుభక్తులు ఆదిత్యునిలో విష్ణువుని ధ్యానిస్తారు. శివభక్తులూ ఆయన్నే ధ్యానించాలి.

ఒకప్పుడు దేవతలందరూ కైలాసానికి వెళ్ళి అందరూ నిన్ను ఎలా ఉపాసిస్తే నువ్వు సంతోషిస్తావో చెప్పమని పరమశివుని అడిగితే 'నా స్వరూపం చూపిస్తాను' చూడండి అని ఆదిత్యమండలంగా మారి అందులో గోచరించాడు. లింగము నందు, విగ్రహము నందు ఆరాధించినా నాకు సంతోషం. కానీ ఆదిత్యమండలంలో ఆరాధిస్తే ఎక్కువ సంతోషిస్తాను అని చెప్పాడు.



భవిష్యోత్తరపురాణంలో కృష్ణుడు మరొకచోట అర్జునునికి చెప్తూ

**ఆదిత్యంచ శివం విద్యాత్ శివమాదిత్య రూపిణం।**

**ఉభయోరంతరం నాస్తి ఆదిత్య స్య శివస్యచ॥**

ఆదిత్యునే శివుడు అని తెల్సుకో. శివునే ఆదిత్యుడు అని తెల్సుకో. ఇద్దరి మధ్య భేదం లేదు అంటాడు.

**సౌరమండల మధ్యస్థం సాంబం సంసారభేషజం।**

**నీలగ్రీవం విరూపాక్షం నమామి శివమవ్యయం॥**

సూర్యమండలంలో అంబాసహితుడు, నీలకంఠుడు ఐన శివుని ధ్యానించాలి అని చెప్పారు.

పద్మపురాణంలో శివుడు స్వయంగా చెప్పిన మాట – "ఎవరైతే సూర్యమండలంలో ఉన్న నన్ను భావన చేస్తూ నా మంత్రమైన పంచాక్షరీ చేస్తారో వారు నన్ను చేరతారు", అన్నాడు. అంటే అర్థం ఈశ్వరుడిలో ఐక్యం అవుతారు. అదే కదా జీవితానికి గమ్యం.

మనం ఏ మంత్రం చేసినా సూర్యమండలంలో మన ఇష్టదేవతను ధ్యానిస్తూ ఆ మంత్రం జపించితే తొందరగా సిద్ధిస్తుంది.

**'యద్గత్వానివర్తంతే తద్ధామ పరమం మమ'** అని స్వామి చెప్పినట్లుగా ఆ పరమాత్మలో లీనమైతే మరి వెనక్కి రాము. శివుని సూర్యమండలంలో ఉపాసించేవాడు ఆయనలో ఎలా చేరతాడో చక్కని ఉపమానం ద్వారా చెప్తూ 'గృహం గృహపతిర్యథా' అన్నారు.

తన ఇంటిలోకి ఇంటి యజమాని చొరవగా వెళ్ళినట్లుగా 'నాలోకి ఆ భక్తుడు వస్తాడు' అన్నాడు. పురుషసూక్తం, శ్రీసూక్తం, రుద్రనమకం ఈ మూడింటికి లోకంలో ఉన్న అభిప్రాయం పురుషసూక్తం అంటే విష్ణువుది, శ్రీసూక్తం అంటే లక్ష్మీదేవిది, రుద్రం అంటే శివునిది అని అనుకుంటాం. కాని వేదం మాత్రం మూడింటిలో ఒకే పరమాత్మని వర్ణించింది. రుద్రాభిషేకం చేసేటప్పుడు పురుషసూక్తంతో అభిషేకం చెయ్యడం ఉన్నది. విష్ణువుని రుద్రమంత్రాలతో పూజించడం ఉన్నది. శ్రీసూక్తంతో లలితాదేవిని, లక్ష్మీదేవిని పూజిస్తాం.

దేవతోపాసనలో ఏకత్వంలోకి వెళ్తేనేగాని ప్రయోజనం లేదు. అనంతత్వాన్ని తెల్సుకొని దాన్ని మన ఇష్టదైవంగా ఉపాసించుకోవాలి.



రుద్రాధ్యాయం న్యాసంలో–

**'అస్యశ్రీ రుద్రాధ్యాయప్రశ్న మహా మంత్రస్య, అఘోర ఋషిః, అనుష్టుప్ ఛందః, సంకర్షణ స్వరూపో యోసావాదిత్యః పరమపురుషః సయేష రుద్రోదేవతా'** అని చెబుతారు.

ఇందులో **అసౌ ఆదిత్యః** వచ్చింది. ఆదిత్యమండలాంతర్వర్తియైన పరమేశ్వరుడే రుద్రాధ్యాయానికి దేవత.

రుద్రనమక మంత్రాల్లో **'అసౌ యో వసర్పతి నీలగ్రీవో విలోహితః, ఉతైనం గోపా అదృశన్నదృశన్ను దహార్యః, అసౌ యస్తామ్రో అరుణ ఉతబభ్రుస్సుమంగళః, యేచేమాగ్ం'** అని వస్తున్నది.

అసౌ అని ఎక్కడొచ్చినా సూర్యుడే అని మనం ముందే చెప్పినట్టుగా రుద్రనమకంలో అసౌ – ఈయనే, యో – ఎవడైతే, 'తామ్రః అరుణః బభ్రుః' – తామ్రః అంటే ఉదయించి నప్పుడు బాగా ఎఱ్ఱగా ఉంటాడు. క్రమంగా అరుణః కొంచెం తగ్గి కొంచెం లేత ఎఱుపు రంగు వస్తుంది. దాని తరువాత 'బభ్రుః' – గోరోచన వర్ణం అంటే పసుపు, ఎరుపు కల్సిన రంగు ఇది మూడవ దశ. సుమంగళః – పరమ మంగళ స్వరూపుడు.

ఆయన వస్తేనే మంగళం.

సూర్యుడు వస్తూనే క్రిములు, చీకట్లు, మంచు, అమంగళములు అన్నీ తొలగి ధ్యానిస్తే హృదయంలో కల్మషాల్ని కూడా కడిగేస్తాడు. ఆధి, వ్యాధి రెండూ తొలగించగలిగేవాడు ఆయన. ఆ కారణం చేతనే సుమంగళః ఇక్కడ పూర్తి సూర్యపరమైన అర్థం ఉంది.

**'అసౌ యో వసర్పతి నీలగ్రీవో విలోహితః'** - ఆ నీలకంఠుడు **'విలోహితః'** - బాగా ఎరుపుగా మారిపోయి ప్రొద్దుట పూట ఆకాశమంతా తిరుగుతూ ఉంటాడు. తిరుగు తాడు అంటే అర్థం తన కిరణాల్ని ఆకాశమంతా ప్రసరింపజేస్తాడు. గమనం అంటే ప్రసరణ. సూర్యగమనమంటే సూర్యకాంతి ప్రసరణ.

**'ఉతైనం గోపా అదృశన్నదృశన్ ఉదహార్యః**
**ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృదయా తినః'** - వేదం ఈయన్ని అందరూ చూడవచ్చు అన్నది. నిర్గుణ నిరాకారమైన పరమాత్మని ఏ సిద్ధులో, యోగులో 'అహం బ్రహ్మాస్మి' అనే స్థితికి చేరినవారు 'పశ్యంతి మాం సన్నిహితం గుహాయాం' అని చెప్పినట్లుగా హృదయ గుహలో ఆ నిరాకార, నిర్గుణ చైతన్యమైన పరమాత్మని దర్శిస్తారు.

పరమాత్మని ఉపాసించే విధానాలు నిర్గుణ నిరాకార, సగుణ నిరాకార, సగుణ సాకార అని మూడు విధాలు.



మొదటిది నిర్గుణం నిరాకారం అంటే ఏ గుణం, ఏ ఆకారం లేదు కేవల చైతన్య స్వరూపమైన సత్ చిత్ స్వరూపం. ఇది చెప్తే అర్థం కాదని కృష్ణుడే చెప్పాడు. ఇది అందు కోవడం మహా కష్టం అన్నాడు.

**'క్లేశోధిక తరస్తేషాం అవ్యక్తాసక్తచేతసాం'** - ఈ అవ్యక్తమైన నిర్గుణ నిరాకార రూపం అందరికీ అందదు. కాని **'కశ్చిద్ధీరఃప్రత్యగాత్మానం'** కొందరికి అందుతుంది.

**'దేహవద్భిః'** - దేహం ఉన్న వాళ్ళకి మహాకష్టం అన్నాడు.

దేహం ఉన్న వాళ్ళు పొందలేరు అంటే, దేహమే నేను అనే భ్రాంతి ఉన్నవాళ్ళు ఆ అవ్యక్త తత్త్వాన్ని తెల్సుకోలేరు. ఎందుకంటే ఎన్నో జన్మలనుంచి దేహమే నేను, దేహమే అనడం అలవాటైపోయింది. దేహాభిమానానికి అవ్యక్తం దొరకదు కనుక దొరకబుచ్చు కోవడం కోసం అవ్యక్తమే వ్యక్తమై వచ్చిందని ఉపాసించాలి.

అప్పుడు వచ్చింది రెండవది- సగుణనిరాకారం. వాళ్ళు భగవంతునికి ఆకారం లేదు కాని అనంత కళ్యాణగుణాలతో సృష్టి చెయ్యగలిగే అద్భుతమైన శక్తులు అన్ని ఉన్నాయని ఉపాసిస్తారు. కనుక వీళ్ళు సగుణ నిరాకారవాదులు.

మూడవది - సగుణ సాకారం. ఆయనకి అద్భుతమైన గుణాలు ఉన్నాయి, అద్భుతమైన

ఆకారం ఉందని ఉపాసించేవాళ్ళు. ఈ మూడింటిలో ఏ ఉపాసన శ్రేష్ఠం? అంటే ఎవరు ఏది చేస్తే అదే శ్రేష్ఠం. మనం సగుణసాకారం పట్టుకున్నా ఆయనే మనల్ని నిర్గుణనిరాకారంలోకి తీసుకువెళతాడు.

పరమేశ్వరుని నిర్గుణనిరాకారతత్త్వాన్ని యోగులు హృదయగుహలో దర్శిస్తారు. ఉపాసకులు పరమాత్మని కైలాసాదులలో, వైకుంఠాదులలో ఉన్న పరమమంగళ విగ్రహంగా దర్శిస్తారు.

ఈ ఇద్దరే పరమాత్మని చూడగలరు.

మొదటి వాళ్ళు నిరాకారంగా, రెండవవాళ్ళు సాకారంగా పరమాత్మని దర్శిస్తారు.

**'ద్వే బ్రహ్మణీ వేదితవ్యే మూర్తంచ అమూర్తంచ'** -అని శాస్త్రవాక్యం. బ్రహ్మమును అమూర్తిగాను, మూర్తిగాను కూడా ఆరాధన చేయవచ్చు. వీరిద్దరూ ధన్యులు.

వీరిద్దరే కాక మిగిలిన అందరూ ఆయననే చూస్తున్నారు అన్నాడు. 'ఉతైనం గోపా అదృశన్నదృశన్ ఉదహార్యః' పొలానికి వెళ్ళేవారు, నీళ్ళు పట్టుకొనేవాళ్ళు ప్రొద్దున్నే బయల్దేరతారు. వాళ్ళకి పూజలు, అనుష్ఠానాలు ఉండవు. వీళ్ళకసలు ఉపాసనా దృష్టికాదు ఏ దేవతా దృష్టి ఉండదు. అలాంటి వాళ్ళు కూడా చూస్తున్నారు.



ఏ పరమాత్మనైతే యోగులు హృదయంలో దర్శిస్తున్నారో, ఏ పరమాత్మనైతే ఉపాసకులు సగుణసాకారంగా చూస్తున్నారో ఆ పరమాత్మని ప్రతివారు (సామాన్యులు సైతం) ఆకాశమండలంలో సూర్యునిగా చూస్తున్నారు. కాబట్టి పరమాత్మ అందరికీ కనపడ్డానికి ఆకాశంలోకి వచ్చాడని వేదం చెప్పింది.

ఇలా **'ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః'** – ఆయనే సాక్షాత్తు బ్రహ్మ, విష్ణువు, శివస్వరూపుడు అని చూపించారు.

ఆయనే అమ్మ. సందేహం లేదు. శ్రీసూక్తం మహాలక్ష్మిని వర్ణిస్తోంది. లక్ష్మికి మరోపేరు శ్రీ, ఐశ్వర్యం, శోభ, కాంతి, శుభము.

సూర్యభగవానుడు వస్తూనే లక్ష్మి ముందు కనపడుతుంది. ముందు లక్ష్మి తరువాత ఆయన. ముందు అమ్మ తరువాత అయ్య. లక్ష్మీ అంటే కాంతి అని అర్థం తీసుకొంటే ఆ కాంతి ఉదయాన్నే కన్పిస్తుంది. కనుకనే 'హిరణ్యవర్ణాం' అని ప్రారంభించారు. ఆ కన్పిస్తున్నది బంగారురంగుతో కన్పిస్తోంది.

ఆ బంగారు వర్ణపు సూర్యకాంతే లక్ష్మి.

మనకు కనపడే ఆయన కాంతి అమ్మ. కాంతి, ఆయన వేరు కాదు.

ఇదే **'శివఃశక్త్యా యుక్తః'** అనే మాటకు అర్థం. ఆ కాంతిలోనే సర్వైశ్వర్యాలు ఉన్నాయి. సూర్యకాంతి బంగారుమయం. 'సువర్ణరజతస్రజాం' అన్నట్లుగా అన్ని కాంతులకి, వర్ణాలకు, రత్నాలకి మూలమైనది అదే. అదే జగత్తుకి పోషకం. పుష్టిని, ఐశ్వర్యాన్ని ఇచ్చేది అదే. మనల్ని ఏది పోషిస్తుందో అదే ఐశ్వర్యం. సూర్యుని కిరణాలు మనల్ని పోషిస్తున్నాయి కనుక ఐశ్వర్యం.

అన్నాన్ని అవే ఇస్తున్నాయి కనుక ధాన్యలక్ష్మీ అన్నపూర్ణ. 'ఆదిత్యవర్ణే తపసోధిజాతో'- అమ్మవారిని పూజించాలంటే సూర్యమండలంలో ఆరాధించాలి. ఈ మాట శ్రీసూక్తంలోనే కాదు, శ్రీవిద్యలో కూడా చెప్తారు. ఇదొక ఉపాసన. సూర్యమండలం ఒక శ్రీచక్రం. ఇది పెద్ద రహస్యం.

శ్రీచక్రాన్ని సూర్యమండలంలో భావించు, నీ హృదయమండలంలో భావించు, విశ్వమంతా అదే కన్పిస్తుంది అనే భావంతో చెప్తారు

**'సూర్యమండల మధ్యస్థాం మహాత్రిపురసుందరీం**
**పాశాంకుశ ధనుర్బాణాన్ ధారయంతీం త్రిలోచనాం'**

అమ్మవార్ని ఎలా ధ్యానించాలో చెప్పారు.



**'అరుణాం కరుణాతరంగితాక్షీం'** - అమ్మ పేరే అరుణ. అరుణుడు అంటే సూర్యుడే. అరుణోపనిషత్తు అంతా అమ్మ గురించే చెబుతుంది.

సూర్యమంత్రాలకి 'అరుణ'మని పేరు ఉన్నది. అమ్మే అరుణం. మన శాస్త్రాలన్నింటికి ఒక సమన్వయం తెచ్చుకొని ఆ సమన్వయం పట్టుకుంటే భేదంలేదు. అన్నింటిని మించి ఉన్నది ఒక్కటే. ఆ ఒక్కటినే విష్ణువన్నప్పుడు విష్ణువుని మించింది లేదు, శివుడన్నప్పుడు శివుని మించింది లేదు అంటారు. ఇది సమన్వయం. ఈ సమన్వయమే వేదహృదయం. ఈ సమన్వయమే సనాతనం. ఈ సమన్వయమే అచ్చమైన హిందూమతం.

దీనికి విరుద్ధమైనదంతా అవైదికం, నాస్తికం. ఆ సమన్వయంలోకి మనం వెళ్ళిపోవాలి. సూర్యుడు సమన్వయం చేస్తున్నాడు.

**'సర్వదేవాత్మకః'** అనగానే సమన్వయం అయిపోయింది.

కృష్ణపరమాత్మకి, జాంబవతికి ఒక కొడుకు ఉన్నాడు. అతని పేరు సాంబుడు. ఆయన ఒకసారి ఏదో తప్పు చేస్తే ఋషులు శపించారు. దానితో సాంబునికి కుష్ఠువ్యాధి వచ్చింది. కృష్ణుని కొడుక్కే వచ్చిందా! పుణ్యం చేసుకొంటే కృష్ణుని కొడుకయ్యాడు.

కృష్ణుని కొడుకులందరూ కృష్ణులైపోరు. ఏదో పుణ్యవశాత్తు ఆయన పుత్రుడయ్యాడు

గాని ఆయనకి పుత్రుడు ఎవడు? ఆయనకి తండ్రి ఎవరు? అంతా కూడా లీల.

సాంబుడికి కుష్ఠువ్యాధి వచ్చింది. నాన్న దగ్గరకి వచ్చి దుఃఖపడ్డాడు. ఆయన 'సూర్యుని ఉపాసించు' అని చెప్పాడు. పశ్చాత్తాపంతో సూర్యుని ఉపాసన చేసాడు. ఉపాసిస్తే సూర్యభగవానుడు ఆయన్ని అనుగ్రహించాడు. రోగంనుంచి బయటపెట్టాడు. సాంబుడు సూర్యోపాసన నుంచి క్రమక్రమంగా తత్త్వవేత్తయై పరబ్రహ్మతత్త్వాన్ని గ్రహించాడు.

ఆయన చేతులలోకి సూర్యమండలంలోంచి సూర్యభగవానుడు కొన్ని భూర్జపత్రములు పడేలా చేసాడు. ఆ పత్రాలలో శ్లోకాలు ఉన్నాయి. వానిలో ఆర్యాదశకం, ఆర్యాద్వాదశి, ఆర్యాసప్తకం, ఆర్యానవకం ఉన్నాయి. ఆర్యా అంటే ఛందస్సు పేరు. ఆర్యాఛందస్సు సూర్యునికి చాలా ఇష్టం.

**ఉద్యన్నద్యవివస్వాన్ ఆరోహన్నుత్తరాందివం దేవః**
**హృద్రోగం మమ సూర్యో హరిమాణం చాఽఽ ఽశు నాశయేదఖిలం**

వేదమంత్రాన్నే శ్లోకాలలోకి దించారు. వేదమంత్రం చదవాలంటే స్వరం తప్పితే కష్టం. ఇది అక్షరాలు తప్పులేకుండా చదువుకుంటే చాలు. అందరూ చదువుకోవచ్చు.

12 అద్భుతమైన శ్లోకాలు వాటిని వ్యాఖ్యానిస్తే మరో ఆదిత్యహృదయం అవుతుంది.

**'త్వచిదోషా హృదిదోషా దృశిదోషా యేఽఽ ఖిలేంద్రియజదోషాః**
**తాన్ పూషా హతదోషః కించిత్ రోషాగ్నినా దహతు'**



నా శరీరంలో చర్మగతమైన దోషాలు, దృష్టిగతమైన దోషాలు, గుండెకు సంబంధించిన దోషాలు, ఇక మిగిలిన ఇంద్రియాల్లో ఉన్న దోషాలు, రోగాలు అన్నీ కూడా సూర్య భగవానుడు కాస్త రోషంతో కూడిన తన చూపుతో నశింపజేయుగాక! అని చెప్తాడు.

చిట్టచివర సూర్యునికి శరణాగతి.

**'త్వం మాతా త్వం శరణం త్వం ధాతా త్వం ధనం త్వం ఆచార్యః**
**త్వం త్రాతా, త్వం హర్తా విపదామర్క ప్రసీద మమభానో'**

త్వం మాతా! – ఓ సూర్యభగవాన్! నువ్వు నాకు అమ్మవయ్యా అన్నాడు. సూర్యుడు అమ్మ. అమ్మలో ఎలా వాత్సల్యం ఉందో, ఎలాగైతే కనిపెట్టి అన్నం పెడుతుందో, పోషిస్తుందో, రక్షిస్తుందో అవన్నీ చేస్తున్నాడు కనుక 'త్వం మాతా'.

కాంతిపుంజమైన సూర్యుడు అచ్చం ఒక మహా 'అగ్నిలింగం'లా కనిపిస్తున్నాడు, ప్రతి రోజు ఆకాశంలో తూర్పుదిక్కున 'సూర్య శివలింగం' వస్తోంది.

అలా చూడాలి. శివలింగంలోనే అమ్మ కనబడుతోంది. ఆవిడ 'త్వం మాతా'. అంతేకాదు

**'త్వం శరణం'.** నువ్వు నా దిక్కు నువ్వు నాకు దాతవి. ఏది ఇచ్చినా నువ్వే ఇచ్చేవాడివి.

**'త్వం ఆచార్యః'** – నువ్వు నాకు గురువు అంటే అన్నీతానై కాపాడతాడు.

**'త్వం త్రాతా'** నువ్వు రక్షకుడివి.

**త్వం హర్తా విపదాం** – నా విపత్తులన్నింటిని హరించేవాడివి.

**'అర్క ప్రసీద మమ భానో'** – ఓ అర్కుడా! నా యెడల అనుగ్రహించు అని శరణువేడితే సూర్యభగవానుడు ఆయనకి రోగాన్ని పోగొట్టి జ్ఞానాన్ని ఇచ్చాడు. రోగాలు పోవడం బయట ప్రయోజనం, జ్ఞానాన్ని ఇవ్వడం అసలు ప్రయోజనం.

ఆ జ్ఞానం వచ్చాక సాంబుడు సూర్యునిపై 50 శ్లోకాలు రచించాడు. సూర్యమండలం నుంచి పడినవి అర్థమౌతాయిగాని ఈయన రచించిన 50 శ్లోకాలు కష్టపడితే గాని అర్థంకావు. దాని పేరు 'సాంబ పంచాశికా'.

మండలంలో ఉన్న సూర్యుడే మనలో ఉన్న చిత్సూర్యుడు.

చిత్సూర్యునిగా మనలో చిచ్ఛక్తిని ప్రసరింపజేస్తున్న పరమాత్మస్వరూపాన్ని విశ్వంలో అనంతప్రాణశక్తిని ప్రసరింప జేస్తున్న సూర్యస్వరూపాన్ని, కలిపి అద్భుతమైన రచన చేసాడు. అక్కడ సూర్య సంపద మనలో చూపిస్తాడు.

సాంబపంచాశిక కాశ్మీరదేశంలో రచింపబడింది. ఇప్పుడు ఆ గ్రంథం దొరకడం లేదు. కాశ్మీరశైవ సిద్ధాంతంలో ఉన్న కాశ్మీరపండితులు దీన్ని కాపాడారు. కాశ్మీరదేశంలో చాలా మంది ఎన్నో గ్రంథాలు రచించారు. సాంబ పంచాశికకి క్షేమరాజు అనే కాశ్మీర పండితుడు అద్భుతమైన వ్యాఖ్య రచించాడు.

కాశ్మీరంలో అపూర్వమైన పండితులు ఉన్నారు. నాట్య శాస్త్రానికి భాష్యం రచించిన అభినవగుప్తుడు అక్కడివాడే. కాశ్మీరం భారతదేశానికే ఒక ప్రాణపీఠం లాంటిది.

మన కాశ్మీరదేశం గొప్పతనం మనకే తెలియటం లేదు. అనేక గ్రంథాలు, ఆనాటి ప్రాచీన విశ్వవిద్యాలయాలు ఇతర మతస్థులచేత నేలపాలయ్యాయి. పాకిస్థాన్ విభజన జరిగిన తరువాత పాకిస్థాన్‌లో ఉన్న వేలాది సంస్కృత విశ్వవిద్యాలయాలు ధ్వంసం అయ్యాయి.

కాశ్మీరంలో అనేకమైన విద్యాసంస్థలు ధ్వంసం అయ్యాయి. పండితులు ఊచకోత కోయబడ్డారు.

నశించిపోతున్న మనదైన విజ్ఞానం మనం తెలుసుకోలేకపోతున్నాం. మిగుల్చుకున్న వాటికంటే పోగొట్టుకొన్నవే చాలా ఎక్కువ.

**శివరూపాత్ జ్ఞానమహం త్వత్తోముక్తిం జనార్దనాకారాత్**
**శిఖిరూపాదైశ్వర్యం త్వత్తశ్చారోగ్యమిచ్ఛామి**

నీవే ఐశ్వర్యం, జ్ఞానం, మోక్షం నాకిస్తావు. ఇన్ని ఇవ్వడానికి నువ్వే ఎన్నో దేవతల రూపాలుగా అయ్యావు అన్నాడు. అన్ని దేవతల రూపంలో తన కిరణాల ద్వారా ఆయనే అనుగ్రహిస్తున్నాడు.

కనుకనే **'ఏష బ్రహ్మేచ విష్ణుశ్చ శివః'** ఇంతవరకూ బ్రహ్మ విష్ణు మహేశ్వరుల శక్తిని చెప్పారు.

దేవీభాగవతంలో

**'ఆదిత్యమండలస్థానా పరబ్రహ్మస్వరూపిణీ**
**ఛందోమయీచ గాయత్రీ మాం రక్షతు సనాతనీ'**

ఆదిత్యమండలంలో ఉన్న ఆ తల్లినే గాయత్రిదేవి అంటున్నాం.

**'సవితా'** అంటే సూర్యుడు సృష్టికర్త.

సూర్యుని శ్రేష్ఠమైన మహాతేజస్సు 'భర్గః'. ఆ భర్గమును నేను ఉపాసిస్తున్నాను. ఉపాసిస్తున్న ఆ తేజస్సు సర్వజీవుల బుద్ధులకి చైతన్యాన్ని ఇచ్చే ఆత్మ స్వరూపం. సర్వ జీవులలో ఆత్మస్వరూపంగా, బుద్ధికి చైతన్యాన్ని ఇచ్చే ఆత్మగా సూర్యమండలంలో ఉన్న **వరేణ్యమైన భర్గం**. తన్మంత్రాధి దేవతయే గాయత్రి.



ఆవిడే త్రిపదా. ఆ త్రిపదా స్వరూపమే త్రిపురసుందరి.

లలితా **'గాయత్రీవ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా'**.

సూర్యుడు శ్రీవిద్యాస్వరూపుడు. ఆయనే విష్ణువిద్యాస్వరూపుడు, ఆయనే శివవిద్యా స్వరూపుడు, ఆయనే బ్రహ్మవిద్యాస్వరూపుడు. సర్వం ఆయనే. **ఏష బ్రహ్మేచ విష్ణుశ్చ శివః** అని చెప్పి తరువాత స్కందః అని మొదలుపెడుతున్నాడు.

స్కందునికి సౌరశక్తికి సంబంధం ఉంది. హిందూమతంలో దేవతావిజ్ఞానం హృద్యంగా, మనోహరంగా ఉందని గ్రహించి దానిని అనుష్ఠిస్తే అది **జీవనసాఫల్యం**. ఆ సాఫల్యాన్ని ఇచ్చేదే ఆదిత్యహృదయం.

**రశ్మిభావనః** అంటే కిరణాలను కలిగించువాడు. తన కిరణాలు రెండు లక్షణాలు కలిగి ఉన్నాయి. 'గ' అంటే 'గమనం', 'భ' అంటే ప్రకాశం. గమనము అంటే వ్యాపకత్వం. వ్యాపకత్వం(గ), ప్రకాశం(భ) కలిగినవి కిరణాలు. అలాంటి కిరణాలతో సర్వలోకాలని పాలిస్తున్నాడు. లోకములో ఉన్న దేవాసుర గణాలని కూడా రక్షిస్తున్నాడు. ఇతడు

సర్వదేవాత్మకుడు అని చెప్తూ విశేషంగా ఒక్కొక్క దేవతాస్వరూపాన్ని చెప్తున్నారు. 'బ్రహ్మా చ విష్ణుశ్చ శివః' అంటే ఇతదు త్రిమూర్త్యాత్మకుడు. 'త్రయీమూర్తిర్దివాకరః' అనే మాట ఉన్నది. త్రిమూర్త్యాత్మకుడు.

వేదంలో ఆదిత్యమండలంలో ఉన్న శివుని ధ్యానించడం కోసం అనేక మంత్రాలు ఉన్నాయి. కాని అందరూ జపించుకోవడానికి అనువుగా ఒక చక్కటి మంత్రాన్ని చెప్పాడు. అది శివుడు దేవతలకి చెప్పిన మంత్రం.

**నమశ్శివాయ సాంబాయ సగణాయాదిహేతవే।**
**రుద్రాయ విష్ణవే తుభ్యం బ్రహ్మణే సూర్యమూర్తయే॥**

ఇందులో పంచాక్షరీ ఉంది. సాంబాయ - అమ్మతో సహా ఉన్నవాడు. 'సగణాయ' - గణములతో ఉన్నాడు. ఈ గణాలు ప్రమథగణాలు లేదా ముందు వివరించుకున్న దేవతలు, ఆదిత్యులు, అప్సరసలు, మునులు, నాగులు ఈ గణాలన్నింటితో ఉన్నవాడు గనుక **'సగణాయ'. 'ఆదిహేతవే'** - మొదటి కారణమైనవాడు. 'రుద్రాయవిష్ణవేబ్రహ్మణే' - బ్రహ్మవిష్ణురుద్రాత్మకుడైన పరంజ్యోతిగా ఉన్నవాడు. ఇందులో విష్ణు మంత్రం, బ్రహ్మ మంత్రం, రుద్రమంత్రం ఉన్నవి.



అందుకే **'రుద్రాయ విష్ణవే తుభ్యం బ్రహ్మణే సూర్యమూర్తయే'** - ఇది సూర్యమూర్తి అయిన శివుని మంత్రం. పంచాక్షరీ విద్యతో కూడి ఉన్నది కనుక ఇది మహామంత్రంగా కూడా చెప్పబడుతున్నది. దీనిని మనం జపంగా చెయ్యవచ్చు. దీనితో అర్ఘ్యప్రదానం, నమస్కారం కూడా చెయ్యవచ్చు. 'సర్వదేవాత్మకః' అన్నప్పుడు శివస్వరూపాన్ని చెప్పుకున్నాం.

సూర్యమండలానికి గణపతి స్వరూపంగా కూడా వర్ణన ఉన్నది. గణపతి ఆగమాలు పరిశీలిస్తే గణపతికి గణపతిగాయత్రితో సూర్యోదయ సమయంలో అర్ఘ్యం ఇవ్వడం ఉన్నది. **'సూర్యమండలస్థాయ శ్రీమహాగణపతయే ఏషోర్ఘ్యఃస్వాహా ఇతి త్రిభిః కృత్వా'** - అని గణపతి ఆగమాలలో కనిపిస్తున్నది. సర్వగణాలకు పతి అతడే. శైవం, వైష్ణవం, సౌరం... సూర్యుడు దగ్గరకు వచ్చేటప్పటికి అందరూ కలిసిపోతున్నారు.

వైష్ణవులు సూర్యనారాయణ అంటారు. సూర్యుని కాదంటే ఏదీ మిగలదు. సౌరం మనకున్న షణ్మతాల్లో ఒక మతంగా వ్యాప్తిచెందింది.

వేదమతాలు అంగీకరించిన ఆరు మతాలు శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, సౌర, స్కాందాలకి భిన్న భిన్న సంప్రదాయాలు ఉన్నాయి. ఈ ఆరు మతాలు ఉత్కృష్టములే. ఈ ఆరు మత సంప్రదాయాల్లో ఏ సంప్రదాయానికి చెందినవారు వారి దైవాన్నే పరమంగా

అనుకుంటారు. భారతదేశములో ఈ షణ్మత సంప్రదాయములు విస్తరిల్లాయి.

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క సంప్రదాయము విస్తారంగా కన్పిస్తుంది. తెలుగు ప్రాంతాలలో ఎక్కువగా శైవం, వైష్ణవం, శాక్తేయం కనబడుతుంది. తమిళనాడు ప్రాంతాలకి వెళ్తే వీటితో పాటు స్కాందం కూడా కనబడుతుంది. సౌరం వీటిలో అంతర్భాగంగా కల్సి ఉంటుంది. కాని కేవలం సౌరమతం ఇప్పుడు కనబడదు. కాని చరిత్ర ప్రకారంగా సౌరాష్ట్రం (సౌర రాష్ట్రం) అని చెప్పబడే గుజరాత్ అంతా సౌరమత విస్తృతి చాలా ఉన్నది. సూర్యసంబంధమైన దేవాలయాలు ఇప్పటికీ చాలా ఉన్నాయి.

గుజరాత్ రాష్ట్రంలో ఇప్పటికీ సూర్యమతావలంబకులు ఉన్నారు. సూర్యుడు కనబడక పోతే ఆ రోజు భోజనం చెయ్యరు వారు. సూర్యుడు కనపడితేనే భోజనం. అసలు సూర్యుడు కనబడని రోజుని మన సంప్రదాయంలో 'దుర్దినం' అంటారు. ముసురు పట్టి ఆ రోజు మొత్తం మీద సూర్యుని చూడలేకపోతే దుర్దినం అంటారు. ఇదీ శాస్త్రపరిభాష. సౌరమతావలంబకులకే కాదు ఎవరికైనా ఆ రోజు దుర్దినమే. అంటే సూర్యశక్తి వల్ల కొన్ని సానుకూల శక్తులు ఆ ఉదయము లోంచి మనకి లభిస్తాయి.



సౌర ఉపాసకులు సూర్యుడు కనపడని రోజున భోజనం చెయ్యరు.

దీనికి 'పొద్దునియమం' అని మన ప్రాంతాల్లో వాడుక. ఇప్పటికీ గుజరాత్‌లో కొన్ని ఇళ్ళల్లో రోగగ్రస్తులైన వృద్ధులు అన్నం తినకపోతే శరీరానికి అస్వస్థత వస్తుంది అని సూర్యుని విగ్రహాన్నో, యంత్రాన్నో ఇంట్లో ప్రతిష్ఠ చేసుకొని, సూర్యుని చూడలేకపోతే ప్రత్యామ్నాయంగా దానికి నమస్కారం చేసుకొని భుజిస్తారు.

ఇలా ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో మతం విస్తారంగా కనబడుతుంది.

గాణపత్యం మహారాష్ట్రలో విస్తారంగా ఉన్నది. వారికి గణపతియే పరబ్రహ్మం. ప్రత్యేకించి గాణపత్యం కేరళ, తమిళనాడు ప్రాంతాలలో మరొక విధానంగా ఉన్నది. ఇలాగ షణ్మతాలకి భారతదేశంలో ఆదరణ ఉన్నది.

షణ్మతాలు ఆరు కొమ్మలు అనుకుంటే ఈ కొమ్మలకి చెట్టు వేదం. అందుకు నా కొమ్మే గొప్పది, నీ కొమ్మ గొప్పది అని ఆ కొమ్మ నరకదానికి మనం ప్రయత్నించామా చెట్టు దెబ్బతింటుంది. కనుక శైవ వైష్ణవాలన్నీ కొమ్మలు, చెట్టు మాత్రం వేదధర్మం. ఎప్పుడూ కూడా వీటి మధ్య సమన్వయాన్నే చెప్పుకోవాలి.

అదే నిజమైన వేదదృష్టి. అదే నిజమైన ఆస్తికదృష్టి.

సూర్యోదయం నుంచి సూర్య అస్తమయం వరకూ మనం ఎన్ని శ్వాసలు తీసుకొంటామో

మన యోగశాస్త్రం లెక్కపెట్టింది. సూర్యుని కిరణాల ప్రసారానికి, మనలో ఉన్న ఆలోచ నలకి, ప్రాణాలకీ అనుబంధం ఉన్నది. సూర్యుడు కనబడకుండా ఉంటే మానసికంగా రుగ్మతలు వస్తాయి.

సూర్యకిరణాలు సోకకపోతే ఆధి, వ్యాధి రెండూ వస్తాయి. క్రిములు మొదలైనవి పెరిగి, రోగకారక క్రిములు పెరిగి శారీరకమైన వ్యాధులు వస్తాయి, మానసికంగా నిరు త్సాహం ఉంటుంది. సూర్యకిరణాలలో మనకు తెలియని కొన్ని స్పందనాత్మక శక్తులు ఉన్నాయి. అవి మనమీద ప్రభావం చూపిస్తాయని భారతీయ ఋషి ఏనాడో దర్శించి ఆ కిరణాల్నే స్తోత్రం చేసాడు.

మానసిక వికాసానికి, సూర్యోదయానికి సంబంధం ఉన్నది. సూర్యుడు ఉదయించడం దగ్గర్నించి శరీరంలో, బుద్ధిలోపల అణువులు వికసించడం ప్రారంభమౌతాయి. ప్రకృతి సూర్యోదయంతో వికసించడం, సూర్యాస్తమయంతో ముడుచుకోవడం జరుగుతుంది. పక్షులు కూడా సూర్యుడు ఉదయిస్తేనే రెక్కలు అల్లార్చుతూ, కిలకిలా రావాలు చేస్తూ తిరుగుతూ ఉంటాయి. సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు అవి సద్దుమణిగి వెళ్ళిపోతాయి.

సూర్యునికి ప్రకృతికి ఉన్న అనుబంధం చూడాలి.



సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు సర్వజీవకోటిలో కొన్ని శక్తులు ఉదయిస్తాయి. ఉదయి స్తున్నవాటిని మనం నిద్రపుచ్చకూడదు. ఇది రహస్యం. ఆ ఉదయిస్తున్నవాడితో పాటు మనం లేచి ఆ ఉదయిస్తున్న సూర్యునితో అనుసంధానం చేసుకొంటే కొన్ని అద్భుతమైన విశేషాలు మనం పొందగలం.

ప్రకృతిలో మిగిలినవి అన్నీకూడా సూర్యుని అనుసరించి అలా వెళ్ళిపోతుంటాయి. ఒక్క మానవుడికి మాత్రమే ప్రకృతిలా కదిలిపోకుండా స్వతంత్ర బుద్ధి ఇచ్చాడు భగవంతుడు. ప్రకృతిలో ఇతర జంతువులు అన్నీ సూర్యునినుంచి వచ్చే భౌతిక శక్తులు మాత్రమే పొందగలవు. కాని సూర్యునిలోని దేవతాశక్తిని పొందగలిగే శక్తి మానవుడి బుద్ధికి మాత్రమే పెట్టాడు భగవంతుడు. మానవుడు సూర్యోదయాత్పూర్వమే నిద్రలేచి ధ్యానాదుల ద్వారా ఉదయిస్తున్న సూర్య విజ్ఞానాన్ని తన ఉపాసనా బలంతో, ధ్యాన బలంతో అందుకోగలిగితే వాడు సూర్యునిలో ఉన్న దివ్యశక్తిని పొందుతాడు.

ఈ విజ్ఞానాన్ని భారతీయ ఋషులు అనాది కాలంలోనే అందించారు. యోగం, సంధ్యావందనం, ధ్యానం. బ్రాహ్మీముహూర్తం, ఉషఃకాలం ఇలాంటి మాటలు భారతీయ యోగవిజ్ఞానంలోనే కనపడతాయి. అది మన అదృష్టం. దాన్ని తెల్సుకోలేకుండా బ్రతకడం

దురదృష్టం. ఉషఃకాలంలో జాగృతం చెందిన బుద్ధిశక్తులు, ప్రాణశక్తులు ఇవన్నీ సూర్యశక్తితో కలిసి ప్రేరణ చెంది మనలో అద్భుతమైన దివ్యశక్తులను జాగృతపరచుతాయి. అప్పుడు మనం కేవలం మానవుడిగా కాకుండా యోగిగా, జ్ఞానిగా సిద్ధిపొందగలం. సూర్యునికీ, యోగసాధనకీ, ప్రకృతిజీవనానికీ ఉన్న అనుబంధం ఇది.

యోగశాస్త్రం కాలాన్ని విభజన చేసి సూర్యోదయకాలం నుంచి సూర్యాస్తమయం వరకూ ఆరోగ్యవంతుడైన మనిషి తీసుకోనే శ్వాసలు 21,600 అని నిర్ధారించింది. సూర్యుడు ఉదయించిన దగ్గర్నించి 40 నిమిషాల సేపు 600 శ్వాసలు తీసుకుంటాం. ఈ శ్వాసలకి అధిపతి గణపతి. ఆ సమయంలో మనం గణపతి మంత్రజపమో, గణపతి తర్పణమో, గణపతి ధ్యానమో చేసినట్లయితే గణపతి శక్తి మనలో జాగృతం చెందుతుంది. సూర్యశక్తి విశేషాలే దేవతలు. సర్వదేవాత్మకుడు అనే భావం వేదంలో ఒక మంత్రం కనిపిస్తుంది .

**ఇంద్రమ్ మిత్రమ్ వరుణమగ్ని మాహురథోదివ్యస్య సుపర్ణో గరుత్మాన్**
**ఏకం సత్ విప్రా బహుధా వదంత్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః**

ఏకం సత్ విప్రా బహుధా వదంతి - ఈ మాట అందరూ వాడుతూ ఉంటారు. చికాగోలో స్వామి వివేకానంద భారతీయ సంస్కృతి సమన్వయ సిద్ధాంతాన్ని ప్రతి పాదించినప్పుడు దీన్ని ఉటంకించాడు.

**'ఏకం సత్'**- సత్ అంటే ఉన్నవాడు, ఉనికి అయిన వాడు. 'ఏకం సత్' అంటే ఉన్నవాడు ఒక్కడే.

ఆయననే **'విప్రాః బహుధా వదంతి'** - విప్రులు అనేక రకాలుగా చెప్తున్నారు.

విప్రాః - విప్రులు అంటే విశేషప్రజ్ఞ కలవారు. ఇందరు దేవతలు కాదు ఉన్నది ఒక్కడే. ఆ ఒక్కడినే విశేషప్రజ్ఞ కలవారు అనేకమందిగా చెప్తున్నారు. సామాన్యులు కారు వాళ్ళు, అసామాన్యులు! మనది మామూలు ప్రజ్ఞ. ఇంద్రియాలకి, బుద్ధికి సంబంధించిన ప్రజ్ఞ ఉన్నవాళ్ళందరూ మానవులు.

ఇంద్రియాతీతమైన ఒక ప్రజ్ఞని 'ఋతంభర ప్రజ్ఞ' అంటారు. ఇది సృష్టి రహస్యాన్ని తెల్సుకోగలిగే ప్రజ్ఞ. ఈ ప్రజ్ఞ మన లోపల నిద్రాణమై ఉంటుంది. తపస్సు చేత మేల్కొలిపితే ఆ ప్రజ్ఞ మేల్కొంటుంది. ఈ ప్రజ్ఞకి సృష్టి రహస్య విజ్ఞానం అందుతుంది. ఆ విజ్ఞానం అందుకొనే ప్రజ్ఞ కలవారు ఋషులు. ఏకంగా కనబడేవాటిలో ఉన్న అనేక రకాల శక్తులు అలాంటి ఋషులకే తెలుస్తాయి.

విప్రులు ఆ ఏకంగా ఉన్నవాడినే ఇంద్రమ్, మిత్రమ్, వరుణమ్, అగ్నిమ్ ఇలా చెప్తూ సుపర్ణః, గరుత్మాన్, యమమ్, మాతరిశ్వాన మాహుః అని బహుధా చెప్పారు. ఆయన్నే యముడు, ఇంద్రుడు, అగ్ని, సుపర్ణుడు, గరుత్మంతుడు అని చెప్తున్నారు. ఆయనలో ఉన్న రకరకాల శక్తులని వాళ్ళు రకరకాల నామాలతో వ్యవహరిస్తున్నారు. ఆ నామం ద్వారా ఆ శక్తి చెప్పబడుతున్నది.

సూర్యుని సుపర్ణో గరుత్మాన్ అన్నారు. ఈయనే గరుత్మంతుడు, సుపర్ణుడు. గరుడ వాహనారూఢుడైన నారాయణుడు కూడా ఈయనే.

**'హగ్ం సశ్శుచిష ద్వసురంతరిక్ష స ద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్'** అని చెప్తూ సూర్యుని హంస స్వరూపంగా చెప్పారు. సూర్యునికి వృషభుడు అని పేరున్నది. 'వృషభో లోహితాక్షః సూర్యోవిపశ్చిన్మనసా పునాతు' – వేదంలో మంత్రం. ఎర్రని కళ్ళున్న వృషభం ఈయన అన్నారు. సూర్యుని వృషభముగా, గరుత్మంతునిగా పోల్చారు. వృషభవాహనా రూఢుడైన శివుడు ఈయనే. గరుడవాహనారూఢుడైన విష్ణువు ఈయనే. సూర్యకిరణాలకి రెక్కలు అని భావము. పర్ణములు అనే మాటున్నది. సుపర్ణములు– మంచి పర్ణములు కలవాడు అని అర్థం.

పర్ణము అంటే ఆకులు, కిరణాలు, రెక్కలు అని మూడర్థాలు ఉన్నాయి. పక్షి పరంగా చెప్తే పర్ణాలు కలది. వృక్ష పరంగా చెప్తే **'ఛందాంసి యస్యపర్ణాని'** కనుక పర్ణశబ్దం ఎక్కడ వాడారో తెలియాలి. చెట్టుకి ఆకులు ఎలా ఉంటాయో సూర్యునికి కిరణాలు అలా ఉంటాయి అన్నారు. 'హరికేశః' అనే మాట వేదంలో కనపడుతుంది.



పక్షి రెక్కలు ఉన్నట్లుగా ఆయనకి కిరణాలు ఉన్నాయి. పక్షికి అనేకమైన చిన్న చిన్న రంగు రంగులైన ఈకలు చాలా కలిసి రెక్క అవుతుంది. అలాగే సూర్యభగవానుడు తన చుట్టూ కాంతి అనే రెండు రెక్కలతో ఆకాశంలో ఎగురుతున్న పక్షిలా కనపడతాడు అన్నారు. ప్రతి కిరణం ఒక్కొక్క ఈక వలె ఉంటూ వేలకొలది ఈకలతో కూడిన ఒక అద్భుతమైన మహాపక్షిలా గోచరిస్తున్నాడు.

సు–పర్ణములు. సు అంటే మేలైన, మంచిని కల్గించేవి. ఆయన కిరణాలు ఎప్పుడూ జగత్తుకి మంచినే కల్గిస్తాయి. అవి రోగహరణములు, ఉత్తేజకరములు, ఉద్దీపనములు, శక్తిప్రదాయకములు, ప్రాణదాయకములు. అంతకంటే 'సు' మరొకటి ఉండదు. అందుకే 'సుమంగళః ' – 'సుమంగళుడు' అంటే సూర్యభగవానుడే.

ఇవే గరుత్తులు. గరుత్తులు అంటే రెక్కలు. మాన్ అంటే రెక్కలు కలవాడు అని

అర్థము. గరుత్మంతుడు అంటే రెక్కలు కలవాడు అని అర్థం. వేదపరంగా చూస్తే 'ఛందాంసి యస్య పర్ణాని' అని అన్వయించుకుంటే...... వేదమంత్రము ఛందస్సు అంటారు. ఈ ఛందస్సు రెక్కలుగా గల వేదపురుషుడు గరుత్మంతుడు. సూర్యుడు వేదమయుడు. రెండు వైపుల విస్తరించిన కిరణజాలమంతా కలుపుకుంటే అవే రెక్కలు, అవే వేద మంత్రమయములు. సూర్యకిరణాల్లో వేదశక్తి ఉంది.

గరుత్మంతుడు అంటే మామూలుగా మనకు తెల్సిన గరుదాళ్వార్ ఇదొక అర్థం. మరొక అర్థంలో వేదమంత్రములే రెక్కలుగా కలిగిన వేదపురుషుడు. ఇంకొకఅర్థంలో కాంతి కిరణములే రెక్కలుగా కలిగినవాడు.

అందుకు ఇక్కడ సూర్యునే 'గరుత్మాన్ సుపర్ణః' అని వేదం చెప్తోంది.

కాంతిమయమైన సూర్యస్వరూపాన్ని రెక్కలతో కూడిన గరుత్మంతుడు అని భావిస్తే, సూర్యమండలంలో అధిష్ఠించి ఉన్న పరమపురుషుడు... గరుత్మంతునిపై కూర్చున్న నారాయణుడులా కనబడుతున్నాడు. గరుడవాహనారూఢుడైన నారాయణుడు సూర్యుడే!

వేదమంత్రములన్నింటితో కూడిన వేదపురుషుడే గరుత్మంతుడు. ఈ మాటకూడా వేదంలో కనబడుతుంది.



వేదమంత్రాలు పరమాత్మ గురించి చెప్పడానికి వచ్చాయి.

**'వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః వేదాంతకృత్ వేదవిదేవచాహం'** - భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ మాట.

వేదపురుషుడు గరుత్మంతుడు అయితే వేదములచే తెలియబడే పరమాత్మ దాన్ని అధిష్ఠించి ఉన్నవాడు. గరుడవాహనారూఢుడు అంటే గరుత్మంతుని ద్వారా మనం విష్ణువుని చూస్తున్నాం. అదే విధంగా ఈ కాంతి ద్వారా సూర్యనారాయణుని చూస్తున్నాం. వేద మంత్రాలు అనే కాంతుల ద్వారా వేదవేద్యుడైన పరతత్త్వాన్ని దర్శిస్తున్నాం.

ఈయన్నే వృషభవాహనారూఢుడిగా వర్ణించారు. సూర్యకిరణములకి వృషభములని పేరు. 'వర్షతీతి వృష'భా ప్రకాశే'-వృషభము అంటే వర్షించే లక్షణము కలిగి ప్రకాశించునది. సూర్యకిరణాలకి వర్షణస్వభావం ఉంది. వర్షించుట అంటే కురియడం. సూర్యకిరణాలు కాంతిని కురిపిస్తున్నాయి. సూర్యకిరణాల వల్లే వర్షాదులు మనకి లభిస్తున్నాయి.

ఉత్పత్తికి మూలమైన తేజస్సుని తన నుంచి వర్షిస్తుంది కనుక 'వృషభము' అని పేరు దాని కొచ్చింది. అశ్వం, వృషభం, గరుత్మంతుడు ఈ పేర్లని వేదము సూర్యునిపరంగానే వాడింది.

కనుక వర్షించే స్వభావంగల ఈ కాంతిపుంజాలన్నింటిని వృషభము అంటాం. తన నించి వచ్చిన కాంతిని తానే అధిష్ఠించి ఉన్నప్పుడు వృషభవాహనారూఢుడైన శివుడు ఆయనే. కనుక 'ఏకం సత్ విప్రా బహుధా వదంతి' అనే మాట ఇంత అందంగా చెప్పబడుతున్నది.

**స్కందః**

స్కందుడంటే సుబ్రహ్మణ్యుడు, ఇక్కడ బ్రహ్మ, విష్ణు, శివుడు తరువాత స్కందుడని ఎందుకు చెప్పారు?

స్కందుడు యజ్ఞాగ్నిస్వరూపుడు, దేవసేనాని. అందుకే ఏష బ్రహ్మా చ విష్ణుశ్చ శివః తరువాత స్కందః అని చెప్పడం. దేవసేనాని – అంటే దేవతల సేనలకి అధిపతి ఇతడు. భగవద్గీత విభూతియోగంలో శ్రీకృష్ణపరమాత్మ **సేనానీనాం అహం స్కందః** – సేనానుల్లో స్కందుణ్ణి నేనే అన్నాడు.

స్కందః స్కందధరో ధుర్యో వరదో వాయువాహనః – విష్ణుసహస్రం. దేవగణానికి సేనాని అంటే చెదిరిపోతున్న దేవతాశక్తులన్నింటిని ఒకచోట సమీకరించి అసురశక్తులని దునుమాడాడు. దేవతలందరూ గొప్పవాళ్ళే, కానీ చెదిరిపోయారు, చెదిరిపోయిన వాళ్ళని సమీకరించి ఒక తాటిని నడిపి ఈ సేనాపతి అసురశక్తులని నాశనం చేశాడు. దేవతా శక్తులన్నింటిని సమూహపరచి ఒక అద్భుతమైన దివ్యశక్తిని జాగృత పరచి, అసుర శక్తులని, నశింపజేసి, శాంతిని స్థాపించాలి అంటే స్కందుని అనుగ్రహం ఉండాలి.



ఆ కారణంచేతనే రామచంద్రమూర్తి అవతారకార్యం కోసం బయలుదేరినప్పుడు విశ్వామిత్రుడు సుబ్రహ్మణ్యస్వామి కథను చెప్పాడు. చెల్లాచెదురైపోయిన సుగ్రీవుడు, హనుమంతుడు ఇలాంటి దేవశక్తులన్నింటినీ సమీకరించి అసురశక్తులను దునుమాడమని చెప్పడం దీనిలో ఉన్న అంతరార్థం.

ఇలాంటి కథే మహాభారతంలో అరణ్యపర్వంలో మార్కండేయమహర్షి ధర్మరాజుకి చెప్తాడు. కురుక్షేత్రంలో కృష్ణపరమాత్మ చేసింది ఈ అనుకూలశక్తులన్నింటిని సమీకరించి అసురశక్తులని కొట్టాడు. అన్నింటిలో ఒకదానికొకటి సంబంధం అంత గట్టిగా ఉంటుంది. కాబట్టి స్కందుడు అంటే అనుకూలశక్తులన్నింటిని ఒకచోట సమీకరించి అసురశక్తులని నశింపచేసేవాడు. అగ్నేయుడు అనే పేరు సుబ్రహ్మణ్యస్వామికి ఉంది.

యజ్ఞంవల్లే దేవసేనలన్నీ బలం పుంజుకొంటున్నాయి కనుక యజ్ఞాగ్ని స్వరూపమే సుబ్రహ్మణ్యుడు అని చెప్పబడుతున్నాడు. ఇవన్నీ నిజానికి ఆ సూర్యభగవానుడే అని

చెప్పబడుతున్నది. ముగ్గుర్ని చెప్పిన వెంటనే స్కందుని ఎందుకు చెప్పారంటే సర్వదేవతల్ని ఏకతాటిని నడిపే స్కందుని అనుగ్రహం మనకి కావాలి కనుక స్కందరూపుడు కూడా ఆదిత్యుడే అని చెప్పారు.

స్కందశబ్దానికి వ్యాకరణపరంగా ఉన్న అర్థం **'స్కందిర్గతిశోషణయోః'** అనే ధాతువు ప్రకారంగా స్కందుడు అంటే గమనం చేయువాడు, శోషింప చేయువాడు అని రెండు అర్థాలు.

గమనం చేయువాడు అంటే నడిచేవాడు, శోషింపజేయువాడు అంటే ఎండగట్టేవాడు. ఈ రెండూ సూర్యునికి ఉన్నాయి. ఆయన గమనం చేస్తాడు అంటే తన కాంతితో ప్రసరిస్తాడు. పైనున్నవాడు క్రిందదాకా గమనం చేస్తున్నాడు. జారివస్తున్నాడు. 'స్కందుడు' అంటే 'జారివచ్చినవాడు', 'స్కన్నమై' వచ్చినవాడు.

శివతేజస్సు స్కందమై భూమిదాకా వచ్చి అక్కడ్నించి క్రమక్రమంగా పంచభూతాలతో, శరవణంతో కలసి కుమారస్వామిగా రూపుదాల్చింది కనుక ఆయన 'స్కందుడు'. సూర్యుడి తేజస్సు, కాంతి ఆకాశంలో కూర్చోకుండా మనకోసం ఎంతో దూరం నుండి జారివచ్చింది. పరమాత్మ మనకోసం జారి వచ్చాడు. ఈ జారి రావడం ఎలాంటిదంటే తన మానాన తను చేతులు కట్టుక్కూర్చున్న తల్లి తన పిల్లవాడిని ఎత్తుకోవడం కోసం తన చేతిని క్రిందకి జార్చి పిల్లవాడిని ఎత్తుకున్నట్లుగా ఆ సూర్యభగవానుడు తన కిరణాలనే చేతుల్ని మనవైపు జార్చి మనల్ని తాకి మనకి ప్రాణాల్ని, శక్తిని ప్రదానం చేస్తున్నాడు.
తన కిరణాల ద్వారా తన శక్తిని మనవైపు జార్చుతున్నాడు. అలాగే సృష్టిని శోషింపజేసే లక్షణం కూడా కనపడుతుంది.



**ప్రజాపతిః**

ప్రజలకి పతియైనవాడు. స్కందుడు అంటే తన తేజోరూపంతో దిగివస్తున్నవాడు. ఆ తేజస్సుకి సృష్టించగలిగే శక్తి ఉన్నది. తన నుంచి సృష్టింపబడిన సర్వజీవకోటికి తానే పతి, పాలకుడు. ప్రజా అంటే జీవులు. ప్రజలు అంటే జననధర్మం కలిగినవారు, జీవకోటి. ఈ జీవకోటికంతటికి పతి ప్రజాపతి. అంతేకాదు దేవతల్లో ప్రజాపతులు అనే ఒక వ్యవస్థ ఉన్నది. దక్షుడు, మరీచి, అంగిరసుడు, పులహుడు, పులస్త్యుడు వీళ్ళందర్ని ప్రజాపతులు అంటారు. కనుక వీళ్ళందరు కూడా సృష్టి విస్తారానికి సహకరించేవాళ్ళు. ఈ నామంలో సృష్టి జరగడం, దాని విస్తారం క్రమంలో చెప్తున్నారు. తనచేత విస్తరింప బడుతున్న సర్వజగత్తుకి తానే పాలకుడిగా ఉన్నవాడు.

**మహేంద్రః**

మహేంద్రుడు ఇతడే. ఇంద్రుడన్నా, మహేంద్రుడన్నా, దేవేంద్రుడన్నా ఒకే అర్థంలో మనం వాడుతుంటాం.

వేదం చెప్పిన ప్రకారంగా ఇంద్ర అనే శబ్దం రెండు ధాత్వర్థాల వల్ల వచ్చింది. 'ఇంద్రదీప్తౌ', 'ఇది ఐశ్వర్యే' అని రెండు ధాతువులు. ఇంద్రదీప్తౌ అంటే ప్రకాశం, దీప్తి అని అర్థం. ఆ ధాతుజన్యమైన ఇంద్ర అంటే దీప్తిస్వరూపుడు, స్వయంప్రకాశస్వరూపుడు అని అర్థం. పరమాత్మ ప్రకారంగా మనం చెప్పాలంటే సృష్టిలో అన్నీ జడములే. పరమాత్మ వల్లనే అవన్నీ చైతన్యాన్ని పొందుతున్నాయి.

అలాగే ఈ జగత్తు జడమైతే దీన్ని ప్రకాశింపజేసే స్వయంప్రకాశ స్వరూపుడు పరమాత్మ, పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుని, మనలో ఆత్మని కూడా మనం సూర్యమండలంలో అన్వయించుకోవచ్చు.

అలాగే 'ఇది ఐశ్వర్యే' అనే ధాతువునించి కూడా ఇంద్రశబ్దం ఉత్పన్నమైంది. 'ఇది' అనే ధాతువుకి ఐశ్వర్యం అని అర్థం. ఇంద్రుడు అంటే ఐశ్వర్యములు కలవాడు అని అర్థం. ఐశ్వర్యాలన్ని ఎవరిదగ్గర ఉన్నాయో వాడు ఈశ్వరుడు. ఈ సృష్టి అంతా ఐశ్వర్యాలతోనే ఉంది. అవి లేకపోతే మనం బ్రతకలేం.



**ధనమగ్నిర్ధనం వాయుః ధనం సూర్యో ధనం వసుః** – అగ్ని ధనం, వాయువు ధనం, నీరు ధనం, నీరు, అగ్ని, వాయువు ఇవి మనం కొంటే వచ్చాయా? ఇలా జగత్తంతా ఐశ్వర్యం.

ఈ ఐశ్వర్యాలన్ని ఎవరివల్ల వచ్చాయో ఆయన ఈశ్వరుడు. కనుక ఇంద్ర అంటే ఈశ్వరుడు. మామూలు ఈశ్వరుడా! ఈయన్ని మించిన ఐశ్వర్యవంతుడు లేడు, ఈయన్ని మించిన ప్రకాశస్వరూపుడు లేడు కనుక మహేంద్రః– ఇది అర్థం. అయితే ఈ ఐశ్వర్యాలన్ని తన దగ్గర దాచిపెట్టుకోకుండా ఈ ధనములు అందరికీ పంచుతున్నాడు కనుక ఆయనే ధనదః– అని తరువాతి నామం చెప్తున్నది.

**ధనదః**

ధనదః అంటే ధనములను ఇచ్చువాడు. ధన్యతని పొందించేది ధనం. బాగా ఆకలి వేస్తున్నప్పుడు అన్నం తింటే ధన్యులమౌతాం కాబట్టి అప్పటికి అదే ధనం. అది సమృద్ధిగా సమకూర్చుకోవడానికి మనకి కావల్సింది మళ్ళీ ధనం.

అనుకున్నది సాధించుకోవడానికి, కావల్సింది పొందడానికి ఏది సహకరిస్తోందో అది

ధనం. ఐశ్వర్యములే ఈ ధనములు. ఈ ధనములను ఆయన దగ్గరే పెట్టుకోకుండా అందరికీ పంచుతున్నాడు కాబట్టి ఆయన ధనదః.

**కాలః**

ఈ ధనములు ఇస్తున్నాడంటే ఎలాపడితే అలా ఇస్తాడా! లోకంలో అందరికీ ఒకే సమయంలో ధనం రావట్లేదు. ఒక్కొక్కరికి ఒక్కో సమయంలో వస్తోంది. అంటే అక్కడ సమయం అనేది ఒకటి ఉంది. ఆ సమయం బట్టి ఎవడికి ఎప్పుడు ఎలా ఇవ్వాలో ఆయనకి తెల్సు. ఆ సమయ స్వరూపుడు కాలః. కాలస్వరూపుడై ఇస్తున్నాడు. ఆ ఇచ్చే టప్పుడు ఎవరికి ఎంత ఇవ్వాలో నియమం కూడా ఆయనకి ఉన్నది. ఆ నియమం ప్రకారం ఆయన ఇస్తాడు.

సృష్టిలో నియమించేశక్తి కాలానికే ఉంది. ఆ కాలస్వరూపుడై ప్రతిదాన్ని నియమిస్తాడు. పరిణామాన్ని కలిగించే ఈశ్వర శక్తికి 'కాలం' అని పేరు.

**యమః**

దేన్ని ఎక్కడ ఎంతకాలం ఎలా నిర్వహించాలో ఆయనకి తెల్సు. అందుకే 'నియమో యమః' అని విష్ణుసహస్రంలో అన్నారు. నియమించేవాడు, యమించేవాడు. యమము అంటే 'నిగ్రహించుట' అని అర్థం. ఆలోచిస్తే సృష్టంతా ఒక పద్ధతి, నియమం కనపడు తున్నాయి. సముద్రం ఉంది, కెరటాలు ఉప్పొంగాయి ఎంతవరకూ? దానికో హద్దుంది. వాయువుకో హద్దు ఉంది.



ప్రకృతిలో ప్రతిదానికి ఒకహద్దు ఉంది. ఈ హద్దులన్ని ఎవరు పెట్టారు? ఇచ్చిన హద్దుల్లో బ్రతుకుతున్నాం గానీ హద్దుని మనం ఏర్పరుచుకోలేదు. ఎవరు పెట్టారు దీన్ని? ఆ సృష్టి అంతా వ్యాపించిన ఈశ్వరశక్తే నియమరూపంలో యమిస్తున్నది.

అందుకే **'మహేంద్రో ధనదః కాలో యమః'.**

ఇంతవరకూ సూర్యుడు అనగానే మనకు కాంతిపుంజం మాత్రమే కనిపిస్తోంది. ఈయన ఎంతవేడో అంత చల్లనివాడు. ఆయన వల్లనే పగలు, రాత్రి రెండూ ఏర్పడుతున్నాయి. భౌతికశాస్త్రవేత్తలు ఆయన ఉదయించడు, అస్తమించడు అని చెప్పారు. మనం పూర్వీకులకి, ఋషులకి జ్ఞానం లేదు కనుక వాళ్ళు అలాగే అనుకొని సూర్యుడు అస్తమించి వెళ్ళిపోయాడు, చీకటైపోయింది అంటారు, అని నేటి ఆధునికయుగంలో కొందరు అనుకుంటారు.

కాని వేదంలో సూర్యుడు ఉదయించడు, అస్తమించడు అని స్పష్టంగా చెప్పారు. ఇంకా

ఇతరదేశాల నాగరికతల్లో ఈ జ్ఞానం రాక ముందే వేదమంత్రాల్లో సూర్యుడు ఉదయించడు, అస్తమించడు అనే మాట ఉన్నది.

ఐతరేయబ్రాహ్మణంలో **'కదాచనాస్తమేతినోదేతి'– ఇతడు ఎప్పుడూ అస్తమించడు, ఎప్పుడూ ఉదయించడు అని చెప్తోంది.**

భూమి గమనం బట్టి ఉదయం, అస్తమయం మనం చెప్పుకుంటున్నాం కాని భూమికి ఈ ఆకర్షణశక్తి సూర్యుడి వల్లనే వచ్చింది. సూర్యుడినుంచి ఈ సమస్తగ్రహాలు రావడం అనేది 'మార్తాండ' అనే నామంలో వివరంగా వస్తుంది.

తన నుంచి వచ్చిన భూమి, తన నుంచి వచ్చిన ఆకర్షణశక్తితో తన చుట్టూ తిరుగుతోంది. ఇలా భూమి తన చుట్టూ తాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ తిరగడానికి కారణం సూర్యుని శక్తే మూలం కనక పగలు, రాత్రి సూర్యుని వల్లే ఏర్పడుతున్నాయి. రాత్రివేళల్లో ఆయన చల్లదనం ఇస్తున్నాడు. ఆయనకి సమయం తెల్సు కనుక ఏ సమయంలో ఏదివ్వాలో అది ఇస్తున్నాడు.

ఒక పద్ధతిగా ఒక ఆఫీసు ఉంటే ఆహా! అధికారి ఎంత గొప్పవాడో అంటాం. ఈ విశ్వాన్ని ఇంత పద్ధతిగా నడిపేవాడు ఎంత గొప్పవాడో అని తెల్సుకొనే ప్రయత్నం చేయాలి. ఈ పద్ధతిని సూర్యభగవానునిగా పరమాత్మ చేస్తున్నాడు.



**సోమో అపాంపతిః**

సోమః అంటే చంద్రుడు. రాత్రికి అధిపతి చంద్రుడు. చంద్రునికి నిశాకరుడు అని పేరు. రాత్రికి అధిపతి అయిన చంద్రుడు కూడా సూర్యుడే. మనం చంద్రకాంతి ఎంత బాగుందో అనుకుంటాం. ఆ కాంతి సూర్యుడు ప్రసరిస్తేనే వచ్చింది. కనుక చంద్రునిలో మనకు కనపడుతున్న ఆహ్లాదకరమైన రసలక్షణం సూర్యుడే. సోమము అంటే రసము. సృష్టిలో ఉన్న తేమ(ఆర్ద్రత) సూర్యభగవానుని వల్లనే వచ్చింది.

**'సోమో భూత్వా రసాత్మకః'** – నేనే సోమస్వరూపుడినై ఓషధుల్ని పండిస్తున్నాను అనే మాట గీతలో స్వామి చెప్పాడు. కనుక సోముడు సూర్యుడే. ఆర్ద్రతకి అధిపతి సోముడు. అంతేకాదు ఈ ఆర్ద్రత వల్ల జలం కలుగుతుంది. ఈ జలములకి అధిపతి వరుణుడు. అందుకే 'అపాంపతిః' – అపాం అంటే జలము. 'అపాంపతిః' అంటే వరుణుడు. అన్నీ సూర్యపరంగా అర్థమౌతున్నప్పుడు, ఇవన్నీ సూర్యుడని తెల్సినప్పుడు సర్వం ఏకమని, ఏకం సత్ అని అంగీకరిస్తామా! లేదా!.

అంతేకాదు దీనిలో మరొక అందం ఉంది. అగస్త్యమహర్షి ఎంత తెలివిగా కూర్చాడో

ఇందులో మనకి తెలుస్తుంది. **మహేంద్రుడు** – ఇంద్రుడు తూర్పుదిక్కుకి అధిపతి. దాని తరువాత **ధనదః** – ధనదుడు అంటే కుబేరుడు. ఈయన ఉత్తరదిక్కుకి అధిపతి. **'కాలో యమః'**– యముడు దక్షిణదిక్కుకి అధిపతి. **సోమో హ్యాపాంపతిః** – వరుణుడు పడమర దిక్కుకి అధిపతి. నాలుగుదిక్కులకి అధిపతి అయిన సూర్యునికి నమస్కారం అని అర్థం.

మహేంద్ర అన్నప్పుడు తూర్పు, ధనదః అన్నప్పుడు ఉత్తర. తూర్పు, ఉత్తర మాంగళిక దిక్కులు రెండు చూపించారు. దక్షిణ, పశ్చిమ రెండు చూపిస్తున్నాడు. దక్షిణంలో 'కాలః యమః' – కాలుడు అన్నా, యముడు అన్నా ఒకరే. అతనిలో ఉన్న రెండు లక్షణాల్ని రెండునామాల్లో చూపించారు. 'అపాంపతిఃసోమః' – జలానికి అధిపతి వరుణుడు. అతను పశ్చిమ దిక్కుకి అధిపతి.

సూర్యుడు లేకపోతే దిక్కులకే దిక్కులేదు. ఆయన ఉదయంతో ఒకదిక్కు ఏర్పడగానే మిగిలిన దిక్కులు తెలుస్తాయి. అంటే ఆయన ఉదయంతో దిక్కులు ఏర్పడతాయి. ఈ రహస్యాన్ని రుద్రనమకంలోని రెండవ అనువాకం ప్రారంభంలోనే చెప్పింది.

**'నమో హిరణ్యబాహవే సేనాన్యే దిశాంచపతయే నమః'** – దిక్కులకి పతియైన ఓ పరమేశ్వరా! నీకు నమస్కారం. కనుక నాలుగుదిక్కులు ఏర్పరచినవాడు నాలుగుదిక్కుల్లో ఒక్కలాగ లేడు. ఒక్కొక్క దిక్కులో ఒక్కొక్కరకమైన శక్తితో ఉన్నాడు. పరమాత్మ గొప్పతనం అదే. అంతటా వ్యాపించిపోతాడుగాని అంతటా ఒక్కలా ఉండడు. ఒక్కొక్కచోట ఒక్కొక్కరకంగా పనిచేస్తాడు. అలా పనిచేస్తేగాని ప్రపంచం నడవదు. నాలుగు దిక్కుల్లో నాలుగు లక్షణాలతో ఉన్న తత్త్వరూపాన్నే ఇక్కడ దిక్పాలకులుగా చెప్పారు. (వేదంలో ఒక లెక్క ప్రకారం 'సోముడు' ఉత్తర దిక్కున ఆరాధింపబడే దైవం) ఎంత అద్భుతమైన ఔచిత్యం ఉందో ఆదిత్యహృదయంలో చూడండి. ఆదిత్యహృదయంలో ఒక పకడ్బందీ నిర్మాణం ఉన్నది.

**'సోఽ ర్యమా స వరుణః స రుద్రః స మహాదేవః'** అని మనకి శాస్త్రముల యందు కనబడుతున్న మాట. సృష్టి స్థితి లయకారకులైన బ్రహ్మవిష్ణురుద్రులు, యజ్ఞస్వరూపుడైన స్కందుడు, సర్వజీవకోటి ఉత్పత్తికి కారణమైన ప్రజాపతి, దిక్కులంతటా వ్యాపించిన సూర్యతేజస్సు ఒక పద్ధతిగా చెప్తూ అటు తర్వాత దేవతలందర్నీ కలిపి ఒక్కశ్లోకంలో చెప్తున్నాడు.

సృష్టిలో అనేకమంది దేవతలు ఉంటారు. దేవతలంటే విశ్వనిర్వహణ శక్తులు లేదా ప్రకృతిశక్తులు. మనకి ప్రకృతి కనబడుతోంది కాని ప్రకృతిని నిర్వహించిన దేవతలు

కనబడకపోవచ్చు.

మన ఇంట్లో పంపు తిప్పితే నీళ్ళు వస్తున్నాయి, స్విచ్ వేస్తే కరెంట్ వస్తోంది. ఇంట్లో పిల్లలకి ఎలావస్తోంది కరెంట్ అంటే స్విచ్ వేస్తే వస్తుంది అని చెప్తారు. అంతకు మించి వాళ్ళకి తెలీదు. కనుక ఇక్కడ సప్లయి చెయ్యడానికి ఒక ఆఫీస్ ఉంది అని తెలియక పోయినా వాళ్ళ వల్లే ఇక్కడవరకూ కరెంట్ వస్తోంది.

స్విచ్ వేసిన ప్రతిసారి మనకి ఎలక్ట్రిసిటీ ఆఫీస్ కనబడకపోయినా, వినియోగించే విద్యుచ్ఛక్తిని బట్టి కనబడని ఆఫీస్ ఉన్నదని ఎలా తెల్సుకుంటున్నామో ప్రకృతిశక్తుల్ని బట్టి దాన్ని నియమించే దేవతలున్నారని తెల్సుకోవాలి.

దేవతానుగ్రహం పొందితే ప్రకృతిశక్తులు మనకు అనుకూలిస్తాయి అనే రహస్యాన్ని కనిపెట్టినవారు భారతీయ ఋషులు. ఈ యజ్ఞసంస్కృతి ద్వారా వాళ్ళు చెప్పారు మనకి ఈ రహస్యం. అలాగ దేవతలు అనేకమంది జగత్తులో ఉన్నారు. ఆ దేవతావ్యవస్థని ఇక్కడ చూపిస్తున్నారు–

**పితరో వసవస్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః**
**వాయుర్వహ్నిః ప్రజాప్రాణః ఋతుకర్తా ప్రభాకరః** (9)



ఈయనే పితరులు. పితృదేవతాస్వరూపాన్ని ఇక్కడ చెప్తున్నారు. దేవతావ్యవస్థలో పితృదేవతలు ఒక వ్యవస్థ. పితృదేవతలంటే వాళ్ళతండ్రి, వాళ్ళ తాత అని కొంతమంది అనుకుంటూ ఉంటారు. కాని పితృదేవతలు వేరు.

మనకి లోకంలో తల్లి, తండ్రి అనే మాటలు వేరు. రెండింటికి విశేషం ఉన్నది.

పితృదేవతా వ్యవస్థలో ముగ్గురు ప్రధానమైన దేవతలు ఉంటారు. వాళ్ళు వసు, రుద్ర, ఆదిత్యులు. ఈ సూర్యభగవానుడే మూడు గణములుగా ఉంటాడు. వీళ్ళనే అగ్ని, వాయు, సూర్యులని కూడా శ్రుతి మనకి చెప్తున్నది. వీళ్ళు పితృదేవతలు. పితరులు అంటే 'బీజశక్తి కలిగినవారు'.

కృష్ణపరమాత్మ గీతలో 'తాసాం బ్రహ్మమహద్యోనిః అహం బీజప్రదఃపితా'– బీజప్రదుడైన తండ్రినినేనే అన్నాడు. పిత అంటే బీజప్రదాత అని అర్థం. సృష్టి అంతటికి బీజములు తనలో దాచుకొని, ఈ బీజములు ప్రకృతిలో ఉత్పన్నం చేస్తున్నాడు కనుక ఆయనే పితరుడు. అంతేకాదు సూర్యకిరణశక్తుల్లో పితృదేవతా వ్యవస్థ ఉన్నది.
ఒక జీవి శరీరాన్ని త్యజించిన తరువాత వాడి కర్మ ఏమిటో వ్యవస్థ చేస్తారు. వాడి కర్మకి

అనుగుణమైన లోకములు, ఉపాధులు వీళ్ళు చూసుకొంటారు.

మనకి ఇక్కడ శరీరం వదిలెయ్యడమే తెల్సుగాని మరొకటి ఏం పొందాలో తెలీదు. మనకి కర్మ చేసుకుపోవడం ఒక్కటే తెల్సు. దానికి ఏమివ్వాలో తెల్సిన వ్యవస్థ ఒకటుంది అది ఈశ్వరవ్యవస్థ. ఆ ఈశ్వరుడు ఏర్పరిచిన వ్యవస్థలో పితృదేవతా వ్యవస్థ ఒకభాగం. ఈ పితృదేవతలు అనబడేవారు ప్రధానంగా మూడుగా చెప్పబడుతున్నా మూడు నుంచి వచ్చిన పితృదేవతల గురించి వేదం **పితృమాన్ యమ అగ్నిష్వాత్తాన్ సోమః కవ్య వాహనాదయః** అన్నది. వీళ్ళని పితృదేవతలు అంటారు.

ఈ పితృదేవతలు ప్రతిజీవి యొక్క గమనాగమనాలు, వారికి కావల్సిన ఉపాధులు నిర్ణయిస్తారు. అందుకు ఈ లోకంలో ఉన్న తల్లిని, తండ్రిని, తాతల్ని తలంచుకొంటూ తిథులు పెట్టిన భావనని ఈ పితృదేవతలు చూసి సంతోషించి మనల్ని ఆశీర్వదిస్తారు.

ఆ పితృదేవతలు ఆశీర్వదించడం చేత వంశం వృద్ధి జరుగుతుంది. మనకి క్షేమం కలుగుతుంది. ఇది పితృదేవతావ్యవస్థలో ఉన్న విషయం. కనుక అనుగ్రహిస్తున్నది వసు రుద్రాదిత్యమయమైన అగ్నిష్వాత్తు సోమః పితృమాన్ మొదలైనవారు. సూర్య మండలవ్యవస్థలో సమస్తదేవతా గణములతో పాటు వీళ్ళు ఎప్పుడూ ఉంటారు. ప్రతిజీవి యొక్క రాకపోకలు నిర్ణయించేది వీళ్ళే. కనుక ఈ పితృదేవతల్ని నిరంతరం తలంచుకోవాలి. వీళ్ళకి ప్రత్యేకమైన పూజకాదు, మన పితరుల్ని తలంచుకుంటే వీళ్ళు సంతోషిస్తారు. ఒక అర్థపరంగా అందరికీ బీజప్రదాత కాబట్టి పితృస్వరూపుడు, మరొకటి పితృదేవతా రూపంగా ఉన్నవాడు ఈయనే.



**వసవః**

వసు అంటే సంపద. ఈ భూమిలో సంపద అనే దాన్ని నిక్షిప్తం చేయడానికి వ్యవస్థ ఒకటున్నది. వాళ్ళకి వసువులు అని పేరు. ఈ వసువులు ఎనిమిది మంది. వాళ్ళ పేర్లు ధృవ, ధర, సోమ, అప, వైశ్వానర, అనిల, ప్రత్యూష, ప్రభ. అష్టవసుదేవతా నామాలు స్మరిస్తే ఆ దేవతాస్వరూపాలు కూడా మనల్ని అనుగ్రహిస్తారు. మనకి కొన్ని పేర్లు సామాన్యంగా కనబడతాయి. ఒకదాంట్లో ఉన్న పేర్లు మరొక దాంట్లో కనపడతాయి. పితృదేవతల్లో సోమ ఉంది, మళ్ళీ ఇక్కడ సోమ ఉన్నాడు. ఇద్దరా అంటే ఒకే మంత్రికి ఆర్థికశాఖ, రక్షణశాఖ ఇచ్చినట్లే ఉంటాయి.

అతనికి ఇక్కడా అక్కడా కూడా కొన్ని అధికారాలు ఉన్నాయి. కనుక ఆ నామాలు వచ్చినప్పుడు తికమక పడకుండా ఇలాగ అన్వయించుకోవాలి.

అష్టవసువులు చూసే వ్యవస్థలు అగ్ని, పృథ్వి, వాయు, అంతరిక్ష, సూర్యమండల, దివి, చంద్ర, నక్షత్ర అనే ఎనిమిది. అంటే ఒక్క సూర్యుడే ఎనిమిది రూపాలతో ఇవన్నీ నడుపుతున్నాడని అర్థం.

**సాధ్యాః**

తపస్సు చేత, సాధన చేత మాత్రమే తెలియబడే వాళ్ళు సాధ్యులు. సూర్యుడిని కూడా మనం సాధ్యుడు అని అనవచ్చు. ఎందుకంటే అనుష్ఠానంచేత, భక్తిచేత, తపస్సుచేత మాత్రమే ఆయన తత్త్వాన్ని తెల్సుకోగలం కాని మన భౌతికమైన బలంతో తెల్సుకోలేం, కనుక సాధ్యుడు.

అంతేకాదు 'సాధ్యులు' అని దేవగణాలు కొన్ని ఉన్నాయి. వీళ్ళు బ్రహ్మదేవుడి ముఖం నుంచి వచ్చారు. ముఖము అంటే శబ్దస్థానం. ఎవరైనా మంత్రసాధన చేస్తూ ఉంటే వాళ్ళ సాధన సరిగ్గా ఉందా లేదా? వీళ్ళసాధనకి ఏం ఫలం ఇవ్వాలి? అనే దాన్ని చూసుకొంటూ ఉంటారు సాధ్యులు.

వీళ్ళు 'సాధనాత్ప్రాప్యాః' – సాధన ద్వారానే దొరుకుతారు. సాధ్యులు మొత్తం పన్నెండు మంది. వారి పేర్లు మను, మంత, ప్రాణద, చేతయాన, వీర్యవాన్, విత్తి, జయ, నయ, హంస, నారాయణ, ప్రభవ, విధు.



ఈ సృష్టి అంతా ఒక పద్ధతి కలిగిన వ్యవస్థ. ఈ వ్యవస్థలో అనేక విభాగాలు ఉన్నాయి. పితృదేవతావ్యవస్థ, వసుదేవతావ్యవస్థ, సాధ్యదేవతావ్యవస్థ.

**అశ్వినౌ** అశ్వనీదేవతలు. కొంతమంది హిందువులు 33 కోట్ల దేవతలు అని అనుకుంటారు. ప్రధాన దేవతలు 33 కోట్లు. ఇంకా చాలామంది ఉన్నారు.

ఏకాదశరుద్రులు– ఒక పరమేశ్వరుడు 11 రూపాలై ఏకాదశరుద్రులయ్యాడు. ఇవే 11 ప్రాణశక్తులు. అందుకే 'ప్రాణావావ రుద్రాః' అన్నారు. రుద్రవ్యవస్థ చాలా ఉన్నది. తరువాత 12 మంది ఆదిత్యులు, 8 మంది వసువులు, ఇద్దరు అశ్వనీదేవతలు.

వీళ్ళు ప్రధానమైన వాళ్ళు.

వీళ్ళకి సహకార శక్తులు 'కోటి' అంటే 'సమూహం' అని అర్థం. ఒక కార్యాలయంలో ఉద్యోగులు చాలామంది ఉన్నట్లే, ఈ 33 దేవతాశక్తులకి సహకారశక్తులు. సమూహములు, కోట్లు, 33 కోట్లు అంటే వీళ్ళే.

పురాణం ఎప్పుడూ కూడా సామాన్యులకి జ్ఞానమివ్వడం కోసం కథల రూపంలో చెపుతుంది. ఎందుకంటే మనకి అర్థమైన భాషలో చెప్పుకుంటేనే దానిలో ఆంతర్యం

బాగా అర్థమవుతుంది. అశ్వనీదేవతలు – అశ్వము అంటే గుఱ్ఱం. గుఱ్ఱానికి అశ్వము అని పేరు ఎలావచ్చిందంటే 'అశు' లేదా 'ఆశు' – మహావేగంగా, శీఘ్రంగా గమనం చేసే దానికి అశ్వము అని పేరు. సృష్టిలో మహాశీఘ్రంగా వెళ్ళగలిగేది కాంతి. ఆ కాంతి సూర్యభగవానుని కిరణములే. అందుకు అశ్వములు అనగా కిరణములే.

తన కిరణాలలోంచి ఆయన రోగహరమైన శక్తుల్ని రెండు రకాలుగా పంపిస్తాడు. ఆ రెండు రకాల కిరణజన్యవైద్యశక్తులే అశ్వనీదేవతలు. ఈ అశ్వనీదేవతల పేర్లు నాసత్య, దస్ర. వైద్యంలో రెండు రకాలు ఉంటాయి.

న – అసత్య – నాసత్య అనగా అసత్యం లేనిది. దస్ర అనగా తొలగించుట. వైద్యంలో రెండు రకాలు. మొదటిది రోగాన్ని గుర్తించడం, రెండవది చికిత్స చేయడం.

ఎక్కడా అసత్యం లేకుండా ఉన్నది ఉన్నట్లు తెల్సుకోగలగడం అనగా రోగనిర్ధారణ ఇది నాసత్య. దస్ర – రోగానికి తగ్గ చికిత్స. ఈ రెండు రకాల వైద్యశక్తులే అశ్వనీదేవతలు. అశ్వనీదేవతల అనుగ్రహం ఉంటే రోగాలు రావు. రోగం వచ్చినా సరియైన చికిత్స జరుగుతుంది.



**మరుతః**

మరుత్తులు అనగా ప్రాణశక్తిని కలిగించే వాయువులు. సృష్టిలో ప్రాణశక్తిని వ్యాపింపచేసే వాయువులు. జగత్తులోనూ వాయువు ఉంది. మనలోనూ వాయువు ఉంది. ఈ ప్రాణశక్తులు మొత్తం ఏడు రకాలుగా ఉంటాయి. మన నుంచి అంతరిక్షం వరకూ పరచుకున్న రోదసిలో వాయుమండలం ఏడు భాగములుగా ఉంటుంది.

1. **ఆవహ** – భూమికి మేఘమండలానికి నడుమ ఉంటుంది.
2. **ప్రవహ** – మేఘమండలానికి రవిమండలానికి నడుమ ఉంటుంది
3. **అనువహ** – రవిమండలానికి చంద్రమండలానికి నడుమ ఉంటుంది (సూర్యమండలం పై నున్న రసస్థానం).
4. **సంవహ** – చంద్రమండలానికి నక్షత్రమండలానికి నడుమ ఉంటుంది.
5. **వివహ** – నక్షత్రమండలానికి గ్రహమండలానికి నడుమ ఉంటుంది.
6. **పరావహ** – గ్రహమండలానికి సప్తఋషి మండలానికి నడుమ ఉంటుంది.
7. **పరివహ** – సప్తఋషి మండలానికి ధ్రువమండలానికి నడుమ ఉంటుంది.
   అనంత విశ్వంలోని వాయువుల లక్షణాలననుసరించి మన ప్రాచీనవిజ్ఞానం పెట్టిన పేర్లివి. –(విష్ణువిద్యగ్రంథం)

వీటిని సప్తమరుత్తులు అంటారు. వీటిలో మళ్ళీ ఒక్కొక్క దాంట్లో ఏడేసి విభాగాలు ఉన్నాయి. అలా మొత్తం నలభైతొమ్మిది మంది మరుత్తులు ఉన్నారు. ఆ సూర్యభగవానుడి వాయుశక్తే ఈ మరుత్తుల రూపంలో సూర్యమండలం నుంచి భూమిదాకా వ్యాపించి ఉంది. పంచభూతములు సూర్యుని నుంచే మనకి లభిస్తున్నాయి.

మరుత్తుల పేర్లు - 1. ఏకజ్యోతి 2.ద్విజ్యోతి 3.త్రిజ్యోతి 4.జ్యోతి 5.ఏకశక్రుడు 6.ద్విశక్రుడు 7.త్రిశక్రుడు 8.మహాబలుడు 9.ఇంద్రుడు 10.గత్యద్రుశ్యుడు 11.పతిసక్రుత్పరుడు 12.మిత్రుడు 13.సమ్మితుడు 14.సుమితుడు 15.మహాబలుడు 16.ఋతుజిత్తు 17.సత్యజిత్తు 18.సుషేణుడు 19.ఫేనజిత్తు 20.అంతిమిత్రుడు 21.అనమిత్రుడు 22.పురుమిత్రుడు 23.అపరాజితుడు 24.ఋతుడు 25.ఋతువాహుడు 26.ధర్త 27.దరుణుడు 28.ధృవుడు 29.విదారణుడు 30.దేవదేవుడు 31.ఈద్రుక్షుడు 32.అద్రుక్షుడు 33.వ్రతిసుడు 34.ప్రసద్రుక్షుడు 35.సభరుడు 36.మహాయశస్కుడు 37.ధాత 38.దుర్గోధితి 39.భీముడు 40.అభియుక్తుడు 41.అపాత్తు 42.సహుడు 43.ఘుతి 44.ఘువుపు 45.అనాయ్యుడు 46.వాసుడు 47.కాముడు 48.జయుడు 49.విరాట్టు.



**మనుః**

14 మంది మనువులు ఉన్నారు. వారి పేర్లు 1.స్వాయంభువమనువు, 2.స్వారోచిష మనువు, 3.ఉత్తమ మనువు, 4.తామసమనువు, 5. రైవత మనువు, 6. చాక్షుష మనువు, 7. వైవస్వత మనువు, 8. సూర్యసావర్ణి మనువు, 9. దక్షసావర్ణి మనువు, 10. బ్రహ్మసావర్ణి మనువు, 11. ధర్మసావర్ణి మనువు, 12. రుద్రసావర్ణి మనువు, 13. దేవసావర్ణి మనువు, 14. ఇంద్రసావర్ణి మనువులు కాలకర్తలు.

మనకి మానవులు అని పేరు ఉన్నది. మరోకోణంలో 'మనుః' అంటే సూర్యకిరణాల్లోంచి వచ్చే ఒక శక్తి. 'మన అవబోధనే' అనే ధాతువు నుంచి 'మనువు' వచ్చింది. 'మన...' అంటే ఆలోచన, బుద్ధి, చింతన ఇవన్నీ చెయ్యగలిగే శక్తికి పేరు. సృష్టిలో ఆలోచించగలిగే శక్తి, నిశ్చయించగలిగే శక్తి ఎవరికి ఉందో వారి పేరు మానవ. ఈ మనురూపమైన శక్తులు మొత్తం పద్నాలుగు రకాలుగా ఉంటాయి.

ఈ పద్నాలుగు రకాల మనుశక్తులు సూర్యుడి నుంచే లభిస్తున్నాయి. కనుక మనువుల రూపంలో ఉన్నవాడు సూర్యుడు.

**'విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠస్థవిరో ధ్రువః'** - విష్ణుసహస్రం. సర్వదేవతాత్మకమైన

పరమాత్మనే విష్ణుసహస్రంలో వర్ణిస్తున్నారు.

**వాయుః**

ఇక్కడ మళ్ళీ ప్రధానంగా వాయువుని చెప్పారు. వాయువు అంటే ఇక్కడ అర్థంలో 'గతిశీలన లక్షణము కలవాడు' అని తీసుకోవాలి. వాయువుకి ఎటైనా వెళ్ళగలిగే శక్తి ఉంది. ఆ గతిశీలనా లక్షణము కలిగిన వాయువు సూర్యుడే.

**వహ్నిః**

అనగా అగ్ని. వహించువాడు వహ్ని. హోమములో మనం వేసిన ఆహుతులు వహిస్తాడు కనుక అగ్నిహోత్రుడికి వహ్ని అని పేరు.

వాక్యనిర్మాణాన్ని పరిశీలిస్తే **'వాయుః వహ్నిః ప్రజాప్రాణః'** అని చెప్పబడింది. మరుత్తులు అన్నప్పుడు వాతావరణంలో ఉన్న మరుత్తులు చెప్పబడ్డారు. వాయువులు అన్నప్పుడు బయట ఉన్నవే కాకుండా ప్రాణరూపంలో ప్రతివారిలో సంచరించే వాళ్ళని చెప్తున్నాడు. ఇక్కడ పరిశీలిస్తే వహ్నిని ప్రాణానికీ, వాయువుకీ మధ్యలో పెట్టాడు. వహించువాడు వహ్ని. ఈ ప్రాణశక్తి కూడా సర్వమునూ వహిస్తున్నది, భరిస్తున్నది. కనుక ఇక్కడ వాయు పరంగానూ, అగ్నిపరంగానూ అన్వయించవచ్చును. పైగా 'వాయోరగ్నిః' అని ఉపనిషత్తు చెప్తున్నది. వాయువు నుంచే అగ్ని శక్తి ఉత్పన్నమైంది.



**ప్రజాప్రాణః**

ప్రజలకి ప్రాణమైనవాడు. మనకి ప్రాణం సూర్యుడే. ఇది భావనకాదు సత్యం. ప్రతివాడిలో ప్రాణరూపంలో సౌరశక్తియే ఉన్నది. సూర్యుడు లేకపోతే ప్రాణమనేది లేదు. సూర్యకిరణాలలోంచే సర్వజగత్తు ప్రాణశక్తిని పొందుతోంది. ఈ మాట ఇప్పుడు శాస్త్రములు అంగీకరిస్తున్నాయి. ఆనాడు ఉపనిషత్తుల్లో దీన్ని చాలా చక్కగా వివరించారు.

ప్రశ్నోపనిషత్తులో చెప్పిన మంత్రాన్ని పరిశీలిస్తే–

> **'అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేన శ్రద్ధయా**
> **విద్యయాఽఽత్మాన మన్విష్యాఽఽదిత్య మభిజయన్తే,**
> **ఏతద్వై ప్రాణానామాయతన మేతదమృతమభయ**
> **మేతత్పరాయణమేతస్మాన్న పునరావర్తంత'**

'ఆయతనం' అంటే నివాసం. ఇతడే సర్వప్రాణములకు నివాసం, ఆధారం, ఆశ్రయం. సర్వప్రాణములకు ఆయన ఆధారం. ఇతడే అమృతస్వరూపుడు. ఇతడే అభయస్వరూపుడు, ఇతడే ప్రాణస్వరూపుడు. కనుక సూర్యుడు 'రశ్మిభావనః' అన్నప్పుడు కిరణాలను

కలిగిస్తాడని అర్థంతో పాటు 'ప్రాణాలను కలిగించువాడు' - అని చెప్పుకున్నాం.

మండలరూపంలో ఉన్న సూర్యుడు, పరమేశ్వర రూపంలో ఉన్న సూర్యుడు, మనలో ఆత్మరూపంలో ఉన్న సూర్యుడు కూడా ప్రాణములనే నిర్వహిస్తూ ఉన్నాడు. కనుక ప్రజాఃప్రాణః -సర్వజీవులకు ప్రాణస్వరూపుడైనవాడు.'ఈశానఃప్రాణదఃప్రాణో జ్యేష్ఠఃశ్రేష్ఠః ప్రజాపతిః'- విష్ణుసహస్రం. వేదంలో మరొకచోట 'ఆదిత్యోహవైప్రాణః' - ఆదిత్యుడే ప్రాణమని స్పష్టంగా వేదవిజ్ఞానం చెప్తోంది.

**ఋతుకర్తా**

ప్రాణస్వరూపుడైన సూర్యభగవానుడే అగ్నిస్వరూపుడై, వాయుస్వరూపుడై ఈ పంచ భూతములని నిర్వహిస్తూ ఋతువులని కలిగిస్తున్నాడు. ఋతువులు ఆరు అని చెప్పింది మన సంస్కృతే, కాని వేదంలో స్పష్టంగా ఐదు ఋతువులే అని చెప్పారు. పంచ అని చెప్పడంలో అర్థం పంచభూత లక్షణాలు పంచఋతువులలో ఉంటాయి. చివర ఋతువు రెండుగా విభజింపబడి కనిపిస్తుంది. కనుక వేదం చెప్పిన ఐదు నిజమే, ఆరు కూడా నిజమే.

సౌందర్యలహరిలో **'క్షితౌ షట్పంచాశ ద్విసమధికపంచాశదుదకే'** అని చెప్పబడిన 360 రోజుల కాలస్వరూపానికి, ఋతుచక్రానికి ఉన్న సంబంధాన్ని జాగ్రత్తగా పరి శీలించాలి. ఆరు ఋతువులని చెప్పారు. లెక్కకడితే 360 డిగ్రీలు సరిగ్గా వస్తుంది. 365లో ఐదు అనేది మనం సంవత్సరగణనకి సౌలభ్యంకోసం తీసుకున్నాం గాని ప్రధానంగా 360 రోజులే. 360 సంపూర్ణసంఖ్య. ఒక వృత్తానికి 360 సంపూర్ణసంఖ్య. కాలచక్రం కూడా సంపూర్ణత్వాన్ని తెలియజేస్తుంది.



సంవత్సరస్వరూపుడు ఆదిత్యుడు. సూర్యుడే సంవత్సరాలని కలిగిస్తాడు. ఎప్పుడు, ఎంత దూరంలో భూమిని ఉంచాలో సూర్యునికి తెలుసు. అలా భూమిని దూరంలో ఉంచి దాన్ని బట్టి ఋతువులని ఏర్పరుస్తున్నాడు. సూర్యుడు లేకపోతే ఋతువులు ఏర్పడవు. ఒక్కొక్క ఋతువుకి అధిపతిగా సూర్యుడే ఉంటాడు. ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క పేరుతో ఉంటాడు. కాని అన్ని పేర్లు ఈయనవే.

వసంతఋతువుకి **అగ్ని** అధిపతి. గ్రీష్మఋతువుకి **ఇంద్రుడు** అధిపతి. వర్షఋతువుకి **విశ్వేదేవతలు** అధిపతులు. శరదృతువుకి **మిత్రావరుణులు** అధిపతులు. మిత్రావరుణులు సూర్యుడి రూపమే. హేమంత ఋతువు, శిశిర ఋతువు ఒకటిగానే చెప్పబడుతుంది. దీనికి అధిపతి **బృహస్పతి**. ఈ పేర్లు ఎందుకు పెట్టారు అన్నదానిలో చాలా విజ్ఞానం

దాగి ఉంది. కనుక సంవత్సరాత్మకుడైన సూర్యభగవానుడే ఋతువులని కలిగించువాడు.

**ప్రభాకరః**

ప్రభని ఇచ్చువాడు అనగా సామాన్య అర్థములో కాంతిని ఇచ్చువాడు. లోకంలో ఎవరైనా మంచికీర్తిని కలిగినపుడు వారిని మనభాషలో 'వెలిగిపోతున్నాడు' అని అంటాం.

వెలిగిపోవడం అంటే ఉత్కృష్ట స్థితి. ఆ కాలస్వరూపుడైన పరమాత్మ తన ఉపాసకులకి ఉత్కృష్ట స్థితిని ఇస్తాడు. కనుక ప్రభాకర అనగా ఉత్కృష్టస్థితిని ఇచ్చువాడు.

**ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్**
**సువర్ణసదృశో భానుర్హిరణ్యరేతా దివాకరః (10)**

**ఆదిత్యః**

ఇక్కడ ఆదిత్యహృదయం పేరులో గల ఆదిత్య నామం వచ్చింది. ఇంతవరకూ 'ఆదిత్య' అనే నామానికి అర్థం చెప్పుకోలేదు. 'దితి' అంటే ఛేదింపబడేది. ముక్కలు అవగలిగేది, ఖండము చేయగలిగేది. ముక్కలు అయ్యే లక్షణం కలది దితి. ముక్కలు చెయ్యలేనిది, ముక్కలు కానిది ఏదో అది అదితి. అనగా 'అఖండము' అని అర్థం. ఆ అదితి చైతన్యమే ఆదిత్య అనగా 'అఖండ తేజఃస్వరూపుడు' అని అర్థం.



సూర్యభగవానుడు సంపూర్ణుడు. ఆయన్ని భాగములుగా విడదీయలేం. ఆదిత్యుడు మహాకాంతి. కాంతిని ఎవరూ ముక్కలు చేయలేరు. ఇది ఆదిత్యనామానికి మండలపరమైన అర్థం.

దీనికి పరమేశ్వరపరంగా అర్థం చెప్పుకుంటే అఖండ పరిపూర్ణమైన ఆ పరమాత్మని భాగాలుగా ఎవ్వరూ చూడలేరు. ఇంకొక అర్థంలో కృష్ణపరమాత్మ గీతలో చెబుతూ...

**అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ**
**నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః** -అన్నాడు

ఈ ఆత్మ ఛేదించడానికి వీలులేనిది. మన శరీరం ముక్కలు కావచ్చు, మన ఆలోచనలు ముక్కలు కావచ్చు గాని మన ఆత్మ ముక్కలు కాదు. అఖండమైన ఆత్మయే మనలో 'నేను' అనేది. కనుక మనలో ఆత్మస్వరూపంగా అఖండంగా ఉన్నవాడు, జగత్తుకి పరమేశ్వర పరమాత్మస్వరూపంగా అఖండముగా ఉన్నవాడే ఆ మండలస్వరూపుడైన ఆదిత్యుడు.

'అత్తి' అంటే తినుట అని అర్థం. కనుక ఆదిత్యుడు అంటే తినువాడు అని అర్థం. జగత్తునందు అన్నింటిని తినువాడు.'అగ్నిర్ముఖం' అని సూర్యుడికి పేరు ఉన్నది. ఈయన

అగ్నిస్వరూపుడై భూమి యందు ఉన్న సర్వరసాలను మ్రింగుతున్నాడు. నిరంతరం తింటూ ఉంటాడు. తన కిరణాలద్వారా ఎంత తింటాడో జగత్తుకి అంత తిండి పెడతాడు.

ఆదిత్యుడు అంటే తినువాడు, తిండి ఇచ్చువాడు అని రెండు అర్థాలు చెప్పారు.

సృష్టి అంతా 'ఆదాన ప్రదాన' వ్యవస్థ ఉన్నది. ఇవ్వడం, తిరిగి పుచ్చుకోవడం అనేది సృష్టిధర్మం. కనుక ఎవరు ఇస్తారో వారికే పుచ్చుకొనే అర్హత ఉంటుంది. కాబట్టి పుచ్చుకోవడం, ఇవ్వడం అనే యజ్ఞవ్యవస్థ నిరంతరం జరుగుతూ ఉంటుంది.

యజ్ఞంలో ఆహుతులు ఇచ్చి ఫలితాలు ఎలాగైతే పొందుతామో అలా సూర్యభగవానుడు కూడా ఈ సర్వజగత్తులో నిరంతరం ఆహుతులు మ్రింగుతూ, వర్షాది రూపాలతో తిరిగి ఇస్తూ ఉంటాడు.

**సవితా**

ఈయనకే సవిత అని పేరు. సవము – ప్రసవము అనేమాట మనకి తెల్సు. సవము అనే మాటకి సృష్టి చేయుట, పుట్టించుట. కనుక సవితా అంటే సృష్టికర్త అని అర్థం.

'సవము' అంటే 'యజ్ఞం' అని కూడా అర్థం. యజ్ఞస్వరూపుడే 'సవితా'.

**సూర్యః**



మన నిత్యం వాడుతున్న నామం సూర్యుడు. సూర్య అనే శబ్దానికి –

**'సరతి గచ్ఛతి వా సువతి ప్రేరయతి వా తత్తద్వ్యాపారేషు కృత్స్నం జగత్ ఇతి సూర్యః'**
సరతి ఇతి సూర్యః అనగా సరణము, ప్రసరణము – ప్రసారం ఔతాడు. కాంతిరూపంతో నిరంతరం ప్రసరిస్తూ ఉంటాడు. 'షూజ్ ప్రేరణే 'అనే ధాతువు ప్రకారంగా ప్రేరేపించువాడు అని అర్థం. సృష్టిని ప్రేరేపిస్తాడు. సూర్యుడు ప్రేరేపిస్తేనే ఈ జగత్తు అంతా నడుస్తోంది. అందుకే 'ధియోయోనః ప్రచోదయాత్' ఆయనే.

సూర్యకిరణాలలో జగత్తుకి ప్రచోదనం కలిగించే శక్తి ఉన్నది. మనకి తెలియకుండా మనలో ప్రచోదనం కలిగిస్తాయి.

సర్వప్రకృతి కూడా సూర్యుడు ఉదయించగానే లేచి తన పని తాను చేసుకుంటూ ఉంటుంది. కనుక సృష్టి అంతటిని ప్రేరేపించువాడు సూర్యభగవానుడే. ఆయనే ప్రేరకుడు. సూర్య అనే శబ్దానికి ప్రేరకుడు అని అర్థం చెప్పబడుతున్నది.

**'సుష్ఠు ఈర్యతే విశేషేణ వర్షాది వ్యాపారేషు ప్రేర్యతే'** – మనల్ని ప్రేరేపించడమే కాదు సృష్టిలో ప్రతి పనిని ఆయనే ప్రేరేపిస్తున్నాడు. జగత్తులో గల సర్వప్రకృతి ఆయన ప్రేరణ వల్లనే జరుగుతున్నది.

**ఖగః**

'ఖగ' అంటే లోకంలో పక్షి అనే అర్థంలో వాడతారు.

'ఖం' అంటే ఆకాశం, 'గ' అంటే గమనము చేయువాడు.

**'ఖే గచ్ఛతి ఇతి ఖగ'** – సూర్యుడు స్థానం ఆకాశము నందు కనుక ఆకాశమునందు గమనము చేయువాడు. అనంత ఆకాశంలో సంచరించేవాడు కాబట్టి 'ఖగః' అని సూర్యునికి పేరు.

**పూషా**

'పుష్ణాతి ఇతి పూషా' – పోషించేవాడు. తన కిరణములచే సర్వజగత్తుని పోషించువాడు.

**గభస్తిమాన్**

గభస్తిమాన్ అనగా కిరణములు కలిగినవాడు.

ఈ మాట ఇక్కడ కూర్చడంలో ఉన్న అందాన్ని పరిశీలిస్తే ముందు చెప్పిన 'మహేంద్రో ధనదః కాలో యమస్సోమోహ్యాపాంపతిః' దగ్గర దిక్కులు చూపించారు.

**'ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్'** ఇవన్నీ పగటికి సంబంధించిన సూర్యుని తేజస్సుని వివరిస్తున్నారు.



వేదంలో ఏ సమయంలో సూర్యభగవానుని ఏ పేరుతో పిలవాలో చెప్పారు. దీనికి ప్రమాణవాక్యం 'ఉదయాత్పూర్వభాగ సవితా ఉదయాస్తమయవర్తీ సూర్యః' సూర్యబింబం పూర్ణభావంతో కనబడకుండా ఉండే పూర్వస్థితిలో ఉన్న సూర్యతేజస్సుకి పేరు సవిత. దానికంటే పూర్వపుస్థితి అనగా బ్రాహ్మీముహూర్తం అని అంటాం. ఆ స్థితిలో సూర్య భగవానుడికి 'ఆదిత్య' అని పేరు. ఇలా సూర్యభగవానుడికి అర్ధరాత్రి వరకూ పేర్లు ఉన్నాయి.

ఇక్కడ సాయనాచార్యులు చెప్పిన ప్రకారం **'ఉదయాత్ పూర్వభాగీ సవితా ఉదయాస్త మయ మధ్యవర్తీ సూర్యః'** – ఈయన ఉదయం నుంచి సాయంత్రం వరకూ ఆకాశము నందు సంచరిస్తున్నాడు కనుక ఖగః. ఆకాశములో సంచరిస్తూ ఈ జగత్తుని పోషిస్తున్నాడు కనుక 'పూషా'. ఈ పనిచేసే కిరణాలు కలవాడు గభస్తిమాన్.

దినాభిమాన దేవతలు అని ముగ్గురు ఉంటారు. వీరు పగటిని అధిష్ఠించి ఉన్న దేవతాశక్తులు. వీరి పేర్లు మిత్రా, వరుణ, పూషా. అందుకే మనం సంధ్యాకాలంలో ఉదయం మిత్రోపస్థానం, మధ్యాహ్నం పూషా, సాయంత్రం వరుణోపస్థానం అని చేస్తాం. సాయంకాలం సూర్యభగవానునికి 'వరుణుడు' అని పేరు. ఆర్ద్రత అనే గుణం అప్పుడు

వస్తుంది కనుక ఆయన పేరు వరుణుడు. కాబట్టి సాయంకాలం వరుణోపస్థానం.

**పూషా గభస్తిమాన్** అనే మాటలో ఇది చెప్పబడుతున్నది.

సూర్యునికి 'మిత్రుడ'ని పేరు ఉన్నది. సూర్యుడి ద్వాదశనామాల్లో మొట్ట మొదటి నామం 'మిత్రాయనమః'. ఇన్ని పేర్లు సూర్యునికి కేవలం వైదిక సంస్కృతిలో తప్ప ఇంకెక్కడా లేవు.

దీన్ని బట్టి మన ఋషులు సూర్యుని ఎన్ని రకాలుగా దర్శించారో తెలుసుకోవచ్చు.

మిత్రుడు అనగా స్నేహితుడు. ఆయన లేకపోతే జగత్తుకి హితం లేదు. కనుక జగత్తుకి హితం కలిగించే నిజమైన స్నేహితుడు సూర్యుడు. సూర్యుడు మిత్రుడని చెప్పిన భారతీయ సంస్కృతి ఎంత ఉదాత్తమైనదో, ఎంత ఔచితీమంతమైనదో మనం పరిశీలించవచ్చును. మిత్రుడు ఇవ్వవలసినవన్నీ సూర్యుడు జగత్తుకి ఇస్తున్నాడు.

మిత్రశబ్దానికి మరియొక అర్థం – జిడ్డుని కలిగించే లక్షణం కలవాడు. సూర్యకిరణాలలో నీటిని పుట్టించే లక్షణానికి 'వరుణ' అని పేరు. ఆ సూర్యకిరణాలలోనే ప్రాణశక్తిని ఇచ్చి పోషించే లక్షణానికి 'పూషా' అని అర్థం. సూర్యకిరణాలలో జిడ్డుని కలిగించే లక్షణము ఉంది. కనుక మిత్రరూప కిరణముల ద్వారా సూర్యుడు జీవకోటిలోకి ప్రవేశించి జిడ్డుని కలిగిస్తాడు.



మనలో సప్తధాతువులను నిర్మాణం చేసేది సౌరశక్తియే. ప్రాణరూపమైన సూర్యుడు మనలో జిడ్డు అనబడే ద్రవ్యాన్ని ఎప్పుడూ ఇస్తూ ఉంటాడు. మనం వాడే పరికరాలకి, వాహనాలకీ కూడా సరిగా పనిచేయడానికి జిడ్డు పదార్థాలు వాడుతాం. చేస్తూ ఉంటాం. మనలో ఉన్న ఎముకలు మొదలైనవి అరిగిపోకుండా జీవితాంతం పనిచేయడానికి కారణమైన మిత్రరూప కిరణాలతో సూర్యుడు మనల్ని పోషిస్తున్నాడు.

కొన్ని పువ్వుల్లో, కొన్ని గింజల్లో కూడ నూనె ఉంటుంది. భూమిలో కూడా నూనె నిక్షిప్తమై ఉంది. దాని వల్లే ఎడారి దేశాలు కూడా బ్రతుకుతున్నాయి. ఈ నూనెలో తిరిగి కాంతిని, మంటని ఇవ్వగలిగే శక్తి ఉన్నది. అదే సౌరశక్తి విశేషం. చూడడానికి ద్రవములా కనపబడుతున్నా అది మండించే లక్షణము కలది.

మిత్రరూపకిరణముల వలన సృష్టిలో నూనె తయారవుతుంది. కనుక సృష్టిలో నూనె తయారు చెయ్యగలిగే సౌరకిరణశక్తికి 'మిత్ర ' అని పేరు పెట్టారు. అందుకే స్నేహితునికి కూడా 'మిత్రుడు' అనే పేరు పెట్టారు. ఎందుకంటే ఆ సంబంధం జిడ్డులా వదలకుండా నిరంతరం కొనసాగుతూ ఉంటుంది కాబట్టి మిత్రుడు అన్నారు.

తెలుగులో కూడా స్నేహం అనగా 'నెయ్యము' అనే అంటారు. నెయ్యం అనేది నెయ్యిలోంచి వచ్చిందే, అంటుకుంటే వదలనిదే. కనుక సూర్యుని మిత్రుడు అని ఒక అర్థంలో చెప్పిన వేదం, మిత్రలక్షణం కలిగిన దినాభిమానదేవతగానే ఈయన్ని చెబుతున్నది.

ఇక్కడ గమనించినట్లయితే ముందు దిక్పాలకులు, తరువాత దేవతలు, అటుపై దినాభిమానదేవతలను ఉదయం నుంచి సాయంకాలం వరకూ ఉన్న సూర్యుని యొక్క పేర్లుగా ఈ శ్లోకంలో ఆవిష్కరించారు.

**సువర్ణసదృశోభానుః స్వర్ణరేతా దివాకరః**

ఆ కనపడుతున్న సూర్యభగవానుడు సువర్ణసదృశః - బంగారంలా ఉన్నాడు. సూర్యభగవానుడు 'హిరణ్మయవపుః' బంగారము లాంటి దేవుడు. పగలంతా ఆయన బంగారములాగే కనపడతాడు. భానుః - 'భా' అనగా కిరణములను, 'నుదంతి' - విస్త రింపజేయువాడు. పగలంతా ఆయన కిరణశక్తులను విస్తరిస్తాడు. 'స్వర్ణరేతా' ఇక్కడ కొంతమంది 'హిరణ్యరేతా' అని చదువుతారు కాని అది ఛందోభంగం అవుతుంది.



స్వర్ణరేతా - తన కిరణాల నుంచి బీజశక్తిని ఉత్పన్నం చేస్తాడు. ఆయనే 'దివాకరః' - అనగా పగటిని కలిగించువాడు. పగటిస్వరూపంలో ఉన్న సూర్యుని అంతటిని ఈ శ్లోకంలో అగస్త్యులవారు పెట్టారు. పగటి రూపంలో ఉన్న సూర్యుని రకరకాల శక్తులని చూపిస్తున్నారు.

ఈ శ్లోకం మొట్టమొదట చెప్పిన 'ఆదిత్యః సవితా' తెలియాలంటే సూర్యోదయాత్పూర్వమే నిద్రలేవాలి. 'సవితర్విత్ఞుర్వరేణ్యం' మనకు కావాలి. ఆ సమయంలోనే సంధ్యని ఉపాసించాలి. సంధ్యావందనం ఆ సమయంలోనే చెయ్యాలి.

**కాలలోపంబు జేయవలదు. కాలంబున కదా ఓషధులు ఫలించు** అని శ్రీనాథమహాకవి చెప్పారు. మనకి సకాలంలో వర్షాలు పడాలి, సకాలంలో పంటలు పండాలి. మనకి సమయానుకూలంగా అన్నీ జరగాలి. మనం మాత్రం సకాలంలో అనుష్ఠానం చెయ్యం. కాని సకాలంలో అనుష్ఠానం చేసిన వాడికే సకాలంలో ఫలితం ఆశించే అర్హత ఉంటుంది. ఇవ్వని వాడికి పుచ్చుకొనే అర్హత లేదు. అందుకే మనం ప్రాతఃకాలంలో ఆయనకి నమస్కారం చేసి, అర్ఘ్యం సమర్పించాలి.

వేదం చెప్పిన అందమైన భావాలు పరిశీలిస్తే

**'సుప్తే అస్మిన్ అస్తమేతి సుప్తే అస్మిన్ ఉదేతి చ అనభ్యుదితాః'**

– సూర్యభగవానుడు ఉదయిస్తున్నప్పుడు ఎవరు నిద్రపోతారో, ఆయన అస్తమిస్తున్నప్పుడు ఎవరు నిద్రపోతారో వాడికి అభ్యుదయం ఉండదు. వాడికి వేదం ఇచ్చిన పేరు 'అనభ్యుదితాః' – ఉదయాన్ని చూడనివాడికి అభ్యుదయం ఎక్కడ ఉంటుంది? అభ్యుదయం అంటే అభివృద్ధి. వాడి జీవితంలో అభివృద్ధి చెందలేదు. కాదండి వాళ్ళకే సంపదలొస్తున్నాయి అనుకుంటే అది వారి పూర్వపుణ్యములవల్ల వచ్చాయి కాని తరువాత ఎటువంటి అభ్యుదయం ఉండదు. అందుకు సూర్యభగవానుడు ఉదయిస్తున్నప్పుడే ఆయన్ని తలంచుకొనే వారి గురించి మళ్ళీ వేదమే చెప్తూ...

**'విశ్వాహోత్వ సుమనః సుచక్షవః ప్రజావంతః అనామీవా అనాగసః'**

– ఎవరైతే సర్వవ్యాపకుడైన సూర్యభగవానుని ప్రాతఃకాలం ఉపాసిస్తారో వారిని 'సుమనస్సులు' అంటోంది వేదం. సుమనస్సు అనగా మంచి మనస్సు కలవారు.

**'సుష్టు మన్యంత ఇతి సుమనసః'** – వాళ్ళు చక్కగా పరమాత్మని మననం చేస్తున్నారు కాబట్టి సుమనస్సులు. త్రికరణశుద్ధిగా పరమాత్మని ధ్యానిస్తారు. వాళ్ళవే అసలైన కళ్ళు అన్నారు. సూర్యోదయాన్ని చూడని కన్ను కన్నుకాదు. అనగా సూర్యోదయాత్పూర్వం కళ్ళు తెరుచుకొన్నవారి కళ్ళకి ఏ జబ్బులు రావు అని దీని అర్థం.

'ప్రజావంతః' – వాళ్ళకే సత్సంతానం కలుగుతుంది. వాళ్ళు 'అనామీవా అనాగసః' – 'అనామీ' అంటే రోగరహితులు. సూర్యోదయాత్పూర్వం నిద్రలేచి సూర్యభగవానుని ఆరాధించేవాళ్ళు రోగరహితులు అవుతారు. 'న ఆగసః' అంటే వాళ్ళకి అపరాధములు ఉండవు, పాపములు ఉండవు అని చెప్తున్నారు.

సూర్యభగవానుడు ఉదయించక ముందు, ఉదయిస్తున్న సమయానికి ఉన్న మధ్య కాలానికి ఉషఃకాలమని లోకంలో వ్యవహారం ఉంది. ఉష శబ్దానికి అర్థం ఉషఃకాలం. 'ఉష రుజాయాం ఉష దాహే' అంటే రోగాలని నశింపజేసే కాలము అని అర్థం. ఆ ఉషఃకాలంలో ఎవరైతే లేచి అనుష్టానం చేస్తారో వారు ఆ ఉదయిస్తున్న సూర్యభగవానుని తేజస్సులో ఉన్న దివ్యత్వాన్ని పొందగలరు.

ఉషఃకాలము అనగా రోగహరణకాలము. ఆ ఉషఃకాల విశేషంతో 'ఆదిత్యః సవితా'......అని ప్రారంభించి చిట్టచివరకి సంధ్యాసమయం వరకూ వివరించి చూపించారు. దినస్వరూపంగా, పగటిరూపంగా దివాకరుడు. దివము అంటే పగలు. పగటిని కలిగించే సూర్యభగవానుని అద్భుతంగా వర్ణించారు. ఈ నామాల్లో సూర్యుడు త్రిమూర్త్యాత్మకుడు, యజ్ఞస్వరూపుడు. మనలో ఉన్న యోగస్వరూపుడు. దేవతలని సేనగా

నడిపించేవాడు. సమస్తమైన ప్రజలకి పతి అయినటువంటివాడు. దిక్కులంతటా వ్యాపించి వ్యవస్థ చేయువాడు. దేవతావ్యవస్థగా ఉండి జగతిని నడుపువాడు.

ఆయనయే పగటిరూపంగా ఉండి మనల్ని అనుగ్రహిస్తున్నాడు అని ఇప్పటివరకు చెప్పిన ఈ శ్లోకాలలో ఉన్న భావం.

ఆదిత్యహృదయంలో ఒక చక్కని కవిత్వం ఉన్నదని మనకు స్పష్టంగా అర్థమవుతుంది. కవిత్వమంటే ఔచితీమంతంగా చెప్పిన మాటే కవిత్వం.

**'ఔచిత్యమేవ రసః'** అని శాస్త్రం చెప్తున్నది. ఔచిత్యంగా మాట్లాడగలిగితే అదే రసోత్పత్తిని కలిగిస్తుంది. అందుకు రసవంతమైన కవిత్వం ఇందులో కనిపిస్తున్నది అనేది పరిశీలిస్తే స్పష్టమౌతుంది. 'సర్వదేవాత్మకోహ్యేషః' అన్న శ్లోకం దగ్గర నుంచి 'స్వర్ణరేతాదివాకరః' అనే శ్లోకం వరకు ఒక క్రమపద్ధతి ఉన్నది.

**'మహేంద్రో ధనదః కాలో యమస్సోమోహ్యపాంపతిః'** అని వరుసగా నామాలు చెప్పినట్లు అనిపించినా అందులో దిక్కుల్ని ఎంత క్రమంగా వర్ణించారో చూపిస్తున్నారు.

అటు తరువాత **'పితరోవసవస్సాధ్యాహ్యశ్వినో మరుతోమనుః'** అన్నప్పుడు దేవతా వ్యవస్థని అంతటిని ఒక్కశ్లోకంలో చూపించి సర్వదేవతాత్మకమైన పరమేశ్వరుడు ఒక్కడే అనే ఏకత్వప్రతిపాదన ఎంత చక్కగా చేసారో తెలుస్తోంది.



సూర్యస్తుతి– అంటే సూర్యమండలం ద్వారా పరమేశ్వరస్తుతి ఇందులో కనిపిస్తున్నది. సర్వజగత్కారణమైన పరమాత్మనే ఇందులో స్తుతిస్తున్నారు. కనుకనే మూడు కోణాల్లో ఆదిత్యహృదయాన్ని దర్శించాలని అది మండలాంతర్గతమైన తేజస్సు, మనయందు ఉన్న ఆత్మతేజస్సు, సర్వజగత్కారకమైన పరమేశ్వరతేజస్సు. ఈ మూడింటి సమన్వయం ఆదిత్యహృదయంలో కనపడుతున్నది. ఆ సమన్వయం దర్శించినవాడే సిద్ధిపొందుతాడని ఉపనిషత్తు చెప్పిన ప్రకారంగా ఆ దర్శనమే ఇందులో అడుగడుగునా కనిపిస్తుంది.

**ఆదిత్యః సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్**
**సువర్ణసదృశోభానుః స్వర్ణరేతా దివాకరః**

పగటికి సంబంధించిన సూర్యతేజస్సే ఈ శ్లోకమంతా కూడా చెప్పబడుతున్నది. సూర్యుని ప్రథమమైన స్థితిని 'ఆదిత్య' అంటారు. తరువాత సరిగ్గా ఉదయ ప్రారంభస్థితిని 'సవితా' అంటారు. ఉదయించిన దగ్గర నుంచి అస్తమించే వరకూ 'సూర్య' అని ఒక క్రమం చెప్పబడుతున్నది.

ఆదిత్య అనగా అఖండమైన జ్యోతి, ఖండింపబడని వాడు, ఖండించుటకు వీలులేని

వాడు, అఖండము అని అర్థం. జ్యోతి ఖండింపబడదు, శక్తి ఖండింపబడదు. శక్తికి ఖండం లేదు అది పరిపూర్ణం. కనుక అఖండమనే భావంలో ఆదిత్య వాడబడుతూ ఉంటుంది.

పరమాత్మని గురించి చెప్పినప్పుడు 'ఆదిత్యవర్ణం తమసఃపరస్తారా' అని పురుష సూక్తంలో, 'ఆదిత్యవర్ణే తపసోధిజాతో' అని శ్రీసూక్తంలో చదువుకుంటున్నాం.

ఇక్కడ ఆదిత్యం అనే మాటకు అఖండం అని అర్థం.

'ఆదిత్య' అనగా అన్నింటిని ఆరగించువాడు. తన కిరణములతో సర్వరసములను గ్రహిస్తాడు కనుక ఆదిత్యుడు. అందరికి అన్ని ఆరగింపులను సమకూర్చుతాడు. సూర్యుడు ఆహారప్రదాత.

'ఆదిత్య' అనగా ఆది యందు ఉన్నవాడు. ఇవన్ని శాస్త్రోక్తమైన నిర్వచనాలు. 'ఆదిత్య సంజ్ఞాభగవత్ ఆదౌ ఏవ యతోభవత్' అని శాస్త్రవాక్యం. ఆది యందే ఉన్నవాడు కనుక ఆదిత్య. సర్వజగత్తుకి ఆది యందు ఉన్నవాడు. సృష్టికి పూర్వమే ఉన్న పరంజ్యోతి. ఆయన్నుంచే సృష్టి అంతా జరిగింది అంటే అర్థం సృష్టికి పూర్వమే ఆయన ఉన్నాడు.

**'ఆదిత్యోవై తేజ ఓజో బల యశశ్చక్షుః శ్రోత్రే ఆత్మా మనః'** అని అథర్వవేదంలో గల సూర్యోపనిషత్తులో చెప్పబడుతున్నది. ఆదిత్యుడే తేజస్సు, ఆదిత్యుడే ఓజస్సు, ఆదిత్యుడే బలం. జగద్విధారణ సామర్థ్యమే ఓజస్సు అని శంకరభగవత్పాదులవారు భగవద్గీతా భాష్యంలో చెప్పిన మాట.



సర్వజగత్తుని భరించగలిగే ఈశ్వరశక్తిని ఓజస్సు అంటారు. ముఖ్యప్రాణశక్తిగా సర్వజీవుల యందు ప్రసరింబడుతున్నది ఓజస్సే. ఇంద్రియాదుల పుష్టికి బలమని పేరు. ఆదిత్యుడే తేజస్సు, ఓజస్సు, బలము, యశస్సు, చక్షుః (దృష్టి), శ్రోతః(శబ్దశక్తి). ఇటీవల పెరుగుతున్న విజ్ఞానశాస్త్రంలో ఆదిత్యుడే శబ్దశక్తిఅని తెలియబడుతున్నది. వేదంలో ఆదిత్యుని శబ్దశరీరునిగా వర్ణించారు.

శబ్దాన్ని ఉత్పత్తి చెయ్యగల నాదచైతన్యమే ఆదిత్యుడు. ఆ శబ్దశక్తి భౌతికమైన మన చెవులకి వినబడేదికాదు. ఋషులకి దివ్యమైన వేదశబ్దములన్నీకూడా తపస్సుద్వారా ఆదిత్యమండలం నుంచే వినిపించాయి.

**'త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే'** అని ఆదిత్యుడికి పేరు.

'త్రయీమయాయ' అనగా వేదమయుడు, శబ్దమయుడు, జ్ఞానమయుడు అని అర్థం. ఆయన చక్షుఃస్వరూపుడు, శ్రోత్రస్వరూపుడు, మనఃస్వరూపుడు. సర్వేంద్రియములకు

చైతన్యప్రదాత అని ఆదిత్యపరంగా పరమాత్మని వర్ణించారు. అధర్వణవేదంలోగల సూర్యోపనిషత్తులో-

**ఆదిత్యాద్వాయుర్జాయతే**
**ఆదిత్యాద్భూమిర్జాయతే**
**ఆదిత్యాదాపో జాయన్తే**
**ఆదిత్యాజ్జ్యోతిర్జాయతే**
**ఆదిత్యాద్వ్యోమదిశో జాయన్తే**
**ఆదిత్యాద్దేవాః జాయన్తే**
**ఆదిత్యాద్వేదాః జాయన్తే**

అని వర్ణించారు. ఆదిత్యుడు నుంచే పృథ్వీ, జలము, ప్రకాశము, ఆకాశము, దిక్కులు, దేవతలు, వేదములు ఉద్భవించాయి. దేవ-వేద రెండు శబ్దాలకి చాలా అనుబంధం ఉంది. వేదమంత్రాల ద్వారా ప్రతిపాదింపబడేవారే దేవతలు. ఆ దేవతలను ప్రతిపాదించేదే వేదము.



**హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిః మరీచిమాన్**
**తిమిరోన్మథన శ్శంభు స్త్వష్టామార్తాండ అంశుమాన్** (11)

సూర్యకిరణ విజ్ఞానాన్ని ఈ శ్లోకంలో నిక్షిప్తం చేసారు. కిరణాలన్నీ కలసి మనకు ముద్దగా కనపడినప్పటికీ వాటిల్లో చాలా రకాలు ఉంటాయి. వేదశాస్త్రము చెప్పిన ఈ విషయాన్నే ఆధునికవిజ్ఞానశాస్త్రం ధృవీకరించింది. ఇస్రో(అంతరిక్షపరిశోధనా సంస్థ) విడుదల చేసిన పత్రికలో సూర్యకిరణాలలో లెక్కలేనన్ని శక్తులున్నాయి అని తెలియచేసారు. సూర్య కిరణాలలో ఉన్న రకరకాల శక్తులను బట్టి వాటికి వేదము రకరకాల పేర్లని పెట్టింది. ఇవన్నీ పర్యాయపదాలు కావు. అంశుమాన్, గభస్తిమాన్, మరీచిమాన్ వీటన్నిటి అర్థాలు కిరణాలు కలిగి ఉన్నవాడు అని చెప్పినప్పటికి వీటిల్లో భేదాలు ఉంటాయి.

**హరిదశ్వః**

'ఆకుపచ్చని గుఱ్ఱములు కలవాడు' అని స్థూలమైన అర్థం. సూర్యుని రథానికి పూన్చ బడిన గుఱ్ఱములకు ఆకుపచ్చని గుఱ్ఱములని వర్ణన ఉన్నది. అది ఎలాంటి ఆకుపచ్చ అంటే **'శుకసమవర్ణ హయఃప్రథితః'** - చిలకాకు పచ్చగుఱ్ఱములు అని చెప్పారు.

భౌతికదృష్టి వేరు, ఉపాసనాదృష్టి వేరు. ఆ దర్శనశక్తి ఉపాసన వల్ల లభిస్తుంది.

భౌతికంగా చూసేది మామూలుగా చూస్తాం. భౌతికదృష్టికి, ఉపాసనాదృష్టికి మధ్యలో వైజ్ఞానికదృష్టి ఉంది. భౌతికదృష్టి, వైజ్ఞానికదృష్టి కంటే ఉపాసనాదృష్టి తపస్సుతో కూడుకున్నది. ఆ ఉపాసనాదృష్టికి సూర్యభగవానుడు ఆకుపచ్చని గుఱ్ఱాల రథంపై గోచరించి ఉండవచ్చును.

ఆకుపచ్చ అని పేరు పెట్టడానికి ఋగ్వేదంలో **'భద్రా అశ్వా హరితస్సూర్యః'** – సూర్యుని అశ్వము 'హరితః భద్ర' – అది భద్రమైనది, హరితవర్ణం కలది అన్నారు.

క్షేమంకరములైనవి. ఆకుపచ్చని వర్ణములు కలిగినవి. సూర్యకిరణములలో ఆకుపచ్చ దనం కలిగించే శక్తిగల కిరణాలని ఇందులో పేర్కొంటున్నారు. అవి లోకానికి క్షేమం కలిగించేవి.

అందుకే **'సప్తాశ్వా హరితో వహంతి దేవ సూర్యా'** – సూర్యభగవానుని రథానికి హరితములైన అశ్వములు పూన్చబడి ఉన్నవి.

సాధారణంగా వృక్షాల యందు ఉన్న ఆహారాన్ని పత్రహరితం (క్లోరోఫిల్) అని అంటారు. వృక్షాదులన్నీ సూర్యరశ్మి ద్వారా ఆహారాన్ని పొందుతాయి. ఆహారాన్ని ఇవ్వగలిగేశక్తి ఆయన కిరణాల్లో ఉన్నది. ఆ శక్తిని పొంది ఆహారాన్ని తయారుచేసుకొంటాయి. అవి పొందిన ఆహారాన్ని మనం వాటిద్వారా తిరిగి పొందుతున్నాం. ఇది విజ్ఞానము. ఈ హరిద్రూపమైన ఆయన కిరణాల గురించి అథర్వణవేదంలో చెప్పబడింది.

**'అవిర్వై నామదేవ తత్తేణాస్తే పరివృత తస్యారూపేణమే వృక్షాః హరితా హరితస్రజః'** – వృక్షాలు హరితవర్ణము పొందడానికి కారణం సూర్యకిరణములే.

**'అవిర్వై'** – ఇది సంస్కృతభాషలో 'అవి'. అవనము అనగా రక్షణ అని అర్థం.

**'అవిర్వైనామ'** అనగా సూర్యకిరణములు రక్షణస్వరూపాలు అని అర్థం. పోషకత్వం, రక్షకత్వం సూర్యుని హరిద్రూపకిరణములలో ఉన్నవి.

హరిదశ్వ అనగా ఆకుపచ్చని కిరణాలు కలవాడు.

**'అశువ్యాప్తౌ'** – అను ధాతువు నుంచి 'అశ్వ' అను పదం ఉత్పన్నమైనది.

'అశు' అనగా వ్యాపించుట. సూర్యకిరణాలు మహాశీఘ్రముగా వ్యాపిస్తాయి. 'అశ్వము' అనగా శీఘ్రంగా వ్యాపించు కిరణాలు. 'హరిదశ్వ' – ఆకుపచ్చదనాన్ని కలిగించే వ్యాపక లక్షణం కలిగిన కిరణములు కలవాడు. పత్రహరితకారణమైన సూర్యకిరణాలను చెప్పడం వల్ల ఆయన సర్వజగత్తుకి 'అన్నప్రదాత' అనే విషయం చెప్పబడుతున్నది.

మనం భౌతికంగా ఒక ప్రక్రియ ద్వారా సూర్యకిరణాల్ని ఆహారంగా పొందుతున్నాం.

కాని సూర్యకిరణాల ద్వారా అన్నాన్ని పొందడం అనే విషయం మనకి పురాణాలలో చాలా చోట్ల కనబడుతుంది. దానిని మనం జాగ్రత్తగా గమనించి వైజ్ఞానికంగా అన్వయించ గలిగితే ఎప్పుడైనా మనం మరికొన్ని అద్భుతాలు సాధించగలం.

స్కాందపురాణంలో కాశీని దివోదాసుడు అనే రాజు పాలన చేస్తున్నప్పుడు ఒక కారణం చేత ఇంధనం కొరత ఏర్పడుతుంది. అగ్ని ఉత్పత్తికి ఇబ్బంది ఏర్పడుతుంది. దాని ద్వారా ఆహారపచనానికి అవకాశం లేక **'ఆరగించె దివోదాసుడు అర్క కిరణ తాప పక్వంబులగు పదార్థమ్ము లెలమి'** (శ్రీనాథుడు, కాశీఖండం) అంటారు.

వేదమునందు ఈ విజ్ఞానాన్ని సూచించే ప్రస్తావన ఉన్నది.

అన్నప్రదాత సూర్యభగవానుడు అనే మాట హరిదశ్వ శబ్దంలో కనపడుతుంది. అన్నప్రదానమైన కిరణాలతో సూర్యభగవానుడు జగత్తుని రక్షిస్తున్నాడు. అందుకు ఆయనని ఉపాసన ద్వారా పొందినట్లయితే అన్నానికి లోటు లేకుండా చూస్తాడు. ఆ ప్రక్రియను ఉపయోగించినవాడు ధర్మరాజు.

**సహస్రార్చిః**



అర్చి అనగా జ్వాల. (సహస్ర)అనంతమైన జ్వాలలు కలవాడు. కిరణాలు కూడా అగ్నిమయములే కాబట్టి జ్వాలలవలే భాసిస్తున్నాయి. సహస్ర అనే శబ్దానికి అనంతము అని అర్థం. 'సహస్ర అర్చి' అనగా లెక్కపెట్టి 'వెయ్యికిరణాలు కలవాడు అనవచ్చు.

వేదంలో వెయ్యికిరణాలకు లెక్క ఉన్నది. అవి 1.వృష్టిసర్జన కిరణాలు - 400 - ఇవి వర్షాన్ని కలిగించే లక్షణం కలిగినవి. 2.ఘర్మసర్జన కిరణాలు - 300 - ఇవి వేడిని, తాపాన్ని కలిగించే లక్షణం కలిగినవి. ఘర్మము అనగా ఉడకపోత అని అర్థం 3.హిమసర్జన కిరణాలు - 300. - ఇవి మంచును సృష్టించగల లక్షణం కలిగినవి.

వృష్టిసర్జన కిరణాలు(400) 4 రకాలుగా ఉంటాయి. అవి 1.ఆనందనాః అని 100 కిరణాలు. ఇవి సౌందర్యలక్షణాన్ని కలిగి ఉంటాయి. 2. మేధాః అని 100 కిరణాలు. మథనం కలిగించే శక్తి ఉండడం వలన వీటికి మేధ్యా అని పేరు వచ్చింది. 3. నూతనాః అని 100 కిరణాలు. మథనం ప్రారంభించేటప్పుడు నూతన జలములను ఉత్పత్తి చేస్తాయి కనుక నూతనాః అన్నారు. 4) పూతనాః అని 100 కిరణాలు. మథనం ద్వారా ఉత్పత్తి అయిన జలములు అన్నింటిని పవిత్రం చెయ్యడం కోసం శుద్ధికోసం తయారైన కిరణాలకే పూతనాః అని పేరు. ఇలా 400 కిరణాలు వృష్టిసర్జన కిరణాలు.

ఘర్మసర్జన కిరణాలు(300) 3 రకాలుగా ఉంటాయి. అవి. 1.రుద్రాః రుద్రరూప

కిరణాలు 100 కిరణాలు. 2.విశ్వహుత కిరణాలు అని 100 కిరణాలు. 3.ఖకుహ కిరణాలని 100 కిరణాలు.

హిమసర్జనకిరణాలు(300) 3 రకాలుగా ఉంటాయి. అవి 1. మేష్యః అని 100 కిరణాలు. 2. ఓష్యః అని 100 కిరణాలు. 3.హ్లాదిన్యః అని 100 కిరణాలు.
ఋగ్వేదంలో దీని గురించి 'యుక్తాయస్య హరయః శతాదశౌ' – ఆయన హరులు వెయ్యి అని చెప్పారు. 'యస్య రశ్మి సహస్రేషు' అని మహాభారతంలో శాంతిపర్వములోని మాట. వేదం ఏమి చెప్పిందో భారతం అదే చెప్పింది. అందుకే మహాభారతానికి పంచమ వేదం అని పేరు ఉన్నది.

హరిదశ్వ అన్నప్పుడు హరించే లక్షణాలు కలవి అని మరొక అర్థంలో చెప్పారు. సూర్యభగవానుడు వస్తూనే చీకటిని హరిస్తాడు. క్రిములు, మంచు మొదలైన వాటినన్నిటిని హరించగలిగే శక్తి సూర్యకిరణాలయందు ఉన్నది.

'మరీచిమాన్'కి 'హరిదశ్వ'కి సంబంధం ఉన్నది. భక్తితో ఉపాసిస్తే మనలో ఉన్న ఆధివ్యాధులను కూడా హరిస్తాడు. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని శ్రుతివాక్యం. సూర్యుడు ఆరోగ్యప్రదాత. **'సుఖార్థీ దినేశం యజేత్'** – సుఖం కావాల్సిన వారు సూర్యుని ఉపాసించాలి అని చెప్పారు.

**'తేజస్కామో విభావసుం'** – ఐశ్వర్యం, వర్చస్సు కావాలంటే సూర్యుని ఆరాధించాలి. అజ్ఞాననాశకుడు, ఆధివ్యాధులను హరించువాడు కనుక ఆయన కిరణాలకు 'హరిదశ్వ' అని పేరు వచ్చింది. **'హరయః శతాదశః'** అనగా హరులు ఆయన దగ్గర శతాదశ ఉన్నాయి.

హరించే లక్షణము కలవాడు సూర్యనారాయణుడు. ఆయన కిరణాలతో హరిస్తాడు. అందుకే ఆయన పేరు హరి. సూర్యాంతర్వర్తియైన పరమాత్మునే మనం నారాయణుడని, శివుడని అంటున్నాం. హరి అన్నా, హరుడు అన్నా ఒక్కరే. హరుడు శివుడు, హరి నారాయణుడు. గుడి మారింది తప్ప లక్షణాలు మారలేదు. హరించడమే లక్షణం. మనలో దుఃఖాన్ని, దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్ని, రోగాన్ని అన్నింటిని హరించే వాడు. తన కిరణాలతో ఆ పని చేస్తున్నాడు స్వామి.

హరిదశ్వకి ఉన్న లక్షణములే **'సహస్రార్చి'** లేదా **'సహస్రాక్షః'**. కొన్ని గ్రంథములలో 'సహస్రాక్షః' అని కూడా ఉంది. జగత్తులో బాగా వ్యాప్తి చెందిన విజ్ఞానానికి ఒక్కొక్క పండితునికి దొరికిన పాఠములలో చిన్న చిన్న మార్పులు ఉంటాయి.

'సహస్రాక్షః' అనగా వేల కన్నులు కలవాడు. పురాణకథలు ఆధారంగా వేల కన్నులు కలవాడు ఇంద్రుడు. ఇంద్రుడు సూర్యుడే. ఇంద్రశబ్దానికి సూర్యపరంగా అర్థం చెప్పుకుంటే వెయ్యి కన్నులు కలవాడు. వేదంలో రుద్రనమకంలో 'నమఃసహస్రాక్షాయ మీఢుషే' - సహస్రాక్షుడైన పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరునే ఆదిత్యరూపంతో చూస్తున్నాం.

అక్షి అంటే కన్ను అనే ఇంద్రియం కాదు. అక్షి అనగా దర్శనశక్తి. చూడగలిగే శక్తి. మన కన్నులకి కొన్ని పరిమితులు ఉంటాయి. కాని సూర్యభగవానుని దర్శనశక్తి, కాంతి శక్తి అన్నిటా వ్యాపించి, అన్నిటిని దర్శిస్తోంది. సర్వమునూ దర్శించువాడు.

అనంత దర్శనశక్తి సంపన్నుడు. అన్ని దిక్కులను తన కిరణములచే ప్రకాశింప జేయువాడు. సర్వకాలములను, సర్వదేశములను, సర్వజీవులను గమనిస్తాడు. సాక్షాత్తు విష్ణువు నేత్రమని చెప్తారు. విష్ణువు యొక్క దర్శనశక్తిగా చెప్తున్నారు. సర్వజగత్తుకి సూర్యుడు సాక్షి. అనంతమైన కన్నులతో ఆయన మనల్ని నిరంతరం కాపాడుతున్నాడు. అలాంటి భావనతో ఉపాసించేవారికి ఎప్పుడూ ఆయన రక్షణ ఉంటుంది.

**సప్తసప్తిః**

'సప్తి' అనగా గుఱ్ఱము అని శాస్త్రార్థం. సప్త శబ్దానికి 'నడుచునది' అని అర్థం. సప్తసప్తి అనగా ఏడు గుఱ్ఱములు కలవాడు.



**సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజమ్**
**శ్వేతపద్మధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్**

సప్తసప్తి గురించి వేదంలో చాలా రకాలైన భావనలు ఉన్నాయి. ఒక్కొక్క భావనకు చాలా విజ్ఞానం ఉన్నది.

**సప్తయుఞ్జన్తి రథమేక చక్రమేకో అశ్వోవహతి సప్తనామా**
**త్రినాభిచక్రమజర మనర్వయత్రేమా విశ్వాభువనాధితస్థుః**

**'ఏకో అశ్వో వహతి సప్తనామ'** - ఆ రథాన్ని నిజానికి ఒక గుఱ్ఱమే లాగుతోంది. దానికే సప్త అని పేరు. ఒకటే ఏడు అయ్యింది.

ఏడుగా వ్యవహరించినప్పటికి అది ఒకటే. కాంతిని విశ్లేషిస్తే సప్తవర్ణములుగా వస్తుంది. సప్తవర్ణములుగా కనబడినప్పటికీ నిజానికి ఏ వర్ణములేని ఏక కాంతి స్వరూపం. సూర్యుని నుంచి వస్తున్న కాంతి ఏకస్వరూపమైనప్పటికి ఏడు రకాలుగా విశ్లేషించబడుతున్నది కనుక దానికి 'సప్తనామ' అన్నారు. దీన్ని కాంతి పరంగా వాడారు.

సూర్యుని నుంచి అనేక రకాలైన శక్తులు వస్తాయి. కొన్ని మన మామూలు కంటికి

కనబడతాయి, కొన్ని సూక్ష్మమైన యంత్రపరికరాలకు దొరుకుతాయి. కొన్ని కేవలం తపోదృష్టికి మాత్రమే దొరుకుతాయి. దేనికి దొరికినా అన్నీ అక్కడే ఉన్నాయి. ఇప్పుడు వర్ణించిన మంత్రాన్ని అంతటికి కలుపుకుంటే సప్తయుఙ్జన్తి రథం – ఏడింటితో కూడిన రథం ఏదైతే ఉన్నదో అది ఏడు అని చెప్పినా, ఏక అశ్వముతోనే కూడినది. దానికి ఒకటే చక్రం.

'రథమేక చక్రం' – ఆ చక్రమే కాలం. కాలనిర్ణయం సూర్యుడి వల్లనే జరుగుతోంది. సూర్యుని ఉదయాస్తమయములని బట్టే దినమును నిర్ణయిస్తున్నారు.

**'ఉదయాత్ ఉదయం'**-మన భారతీయ సంస్కృతిలో దినము ఉదయంతో ఆరంభ మౌతుంది. ఉదయం నుంచి ఉదయం వరకూ ఒక రోజు. పగలు, రాత్రి కలిపి ఒక దినమని చెప్తున్నాం.

పగలు, రాత్రిగాను ఉండేదే సంవత్సర స్వరూపం. కాలం ప్రధానస్వరూపమైన కాల చక్రాన్ని అనేకరకాలుగా వర్ణిస్తూ ఆ కాలానికి 'త్రినాభి చక్రం' అన్నారు. మూడు నాభులు ఉన్నాయి. నాభి అనగా నడుమభాగము అని అర్థం.

'పంచారం' – ఐదు అరలు ఉన్నాయి. అరలు అనగా ఆకులు. బండి చక్రానికి ఆకులు ఉంటాయి. ఐదు ఋతువులే ఐదు ఆకులుగా ఉన్నాయి. సాధారణంగా బండి చక్రానికి ఒక నాభి మాత్రమే ఉంటుంది. కాని కాలమనే చక్రానికి భూత, భవిష్యత్, వర్తమానమనే మూడు నాభులు ఉన్నాయి. త్రినాభి చక్రానికి వేదం మరొక అర్థం చెప్తూ ప్రాతః, మధ్యాహ్న, సాయం సంధ్యలుగా చెప్పింది. ఇలా ఏకచక్రముపై సప్తాశ్వములు లాగుతుంటే సూర్యభగవానుడు వస్తున్నాడు.

'కిరతి' అంటే వెదజల్లుట. సూర్యునినుంచి కాంతి వెదజల్లబడుతూ వస్తున్నాయి కనుక సూర్యకాంతికి 'కిరణములు' అని పేరువచ్చింది. కాంతి, కిరణము ఒకటే. కిరణము ఒకటే సప్తవర్ణములుగా ఉన్నది. మళ్ళీ ఆ సప్తవర్ణములలో తేడాలు ఉన్నాయి. సూర్యుని సువర్ణస్వరూపుడిగా చెప్పారు. సువర్ణం అంటే బంగారురంగు అనే అర్థంలోనే కాకుండా మేలు కలిగించే వర్ణములని కలిగించేవాడు.

కాంతివల్లనే వర్ణాలు ఏర్పడుతున్నాయి. మన సంస్కృతి ఒక్కొక్క వర్ణానికి ఒక్కొక్క లక్షణం చెప్పింది. దీన్ని ఆధారంగా చేసుకొని ప్రకృతిశాస్త్రంలో వర్ణచికిత్స చేయడం అనేది ఉన్నది. రకరకాల రంగులు రకరకాల రోగాలను పోగొడతాయి. దీనికోసం ఒక అద్భుతమైన శాస్త్రం ఉన్నది.

రకరకాల వర్ణములుకల నీటిని తీసుకొని వాటిని గాజుపాత్రల యందు ఉంచి సూర్య కాంతి ద్వారా ఆ గాజుపాత్రలో ఉన్న వర్ణాల యొక్క కిరణాలు రోగిపై పడేటట్టుచేస్తే దానిద్వారా కొన్నిరోగాలు పొగొట్టబడతాయి. ఒకే వర్ణము కలిగిన కాంతిని గదినిండా ప్రసరింపజేసి దానిలో సూర్యకాంతి ప్రసరించేటట్టు చేయడం వలన కొన్ని రకాల రోగాలు పోతాయి.

నీలం శాంతికి చెప్తారు. ఆకుపచ్చ రంగు ఆహ్లాదానికి ఉపయోగిస్తారు. ఈ రంగు మనస్సుకి ఉత్సాహాన్ని పుట్టిస్తుంది. మానసికశాస్త్రంలో కూడా మనస్సుకి, వర్ణములకు అనుబంధం ఉన్నది. వర్ణములు మన మనస్సుపై, శారీరక అవయవములపై ప్రభావం చూపిస్తాయి.

దేవతలలో కూడా రకరకాల వర్ణములు కలిగిన దేవతలు ఉంటారు. అంటే ఆ రంగులు ఒక్కొక్క తత్త్వాన్ని తెలియచేస్తాయి. లలితాదేవిని వర్ణిస్తే అరుణవర్ణం, సరస్వతిని వర్ణిస్తే తెల్లని రంగు, లక్ష్మీదేవిని బంగారపు రంగు, కాళీమాతని నీలంరంగుతోను వర్ణిస్తారు. ఇన్ని వర్ణములుగా కనిపిస్తున్నప్పటికీ ఏ వర్ణములేని తత్త్వం ఒక్కటే. ఒక్క వర్ణమే, జగత్తు రక్షణ కొరకు అనేక వర్ణములుగా వచ్చింది.



అదేవిధంగా ఇన్ని రూపాలుగా కనిపిస్తున్న జగద్రక్షకుడైన పరమాత్మ ఒక్కడే అయినప్పటికీ అనేకరూపాలు ధరించి ఒక్కొక్క రంగు, ఒక్కొక్కరూపం, ఒక్కొక్క మంత్రం ద్వారా ఉపాసకులను ఒక్కొక్క విధంగా అనుగ్రహిస్తున్నాడు.

సూర్యునికి ఉన్న దివ్యరథమును చూడాలంటే ఉపాసనాదృష్టి ఉండాలి. రథం అంటే 'రంహణశీలత్వాత్ రథః' - రంహణస్వభావం కలది రథం అన్నారు. 'రంహణము' అంటే ప్రయాణించగలిగేది. కదలగలిగే శక్తి దేనికి కలదో అది రథం. శరీరాన్ని కూడా రథమని వ్యవహరిస్తారు. ఇది ఉపనిషత్తుల్లో కనబడుతుంది.

ఆయన కాంతి ప్రయాణ గమనాన్ని రథంగా, అశ్వాలుగా భావన చేస్తారు. చక్రంగా చూపిస్తున్నది కాలచక్రం. కాలము ఆవృతి అవుతుంది కాబట్టి దానిని చక్రంగా భావిస్తారు. కాలచక్రానికి అధిపతి సూర్యభగవానుడే. దిక్కులు, కాలము రెండూ కలిగించేవాడు ఆయనే.

సూర్యమండలంలో ప్రణవస్వరూపం ఉన్నది. ఆ ప్రణవస్వరూపమే ఋక్కులు, యజుస్సులు, సామములుగా ఆవిర్భవించాయి. ఈ వేదమంత్రాల గమనానికి ఛందస్సు అని పేరు. ఛందస్సులు వేదశాస్త్రములో చాలా ఉన్నాయి.

ఏడు ఛందస్సులు ప్రధానంగా ఉన్నాయి.

సూర్యభగవానుని వేదస్వరూపునిగా చూసినప్పుడు ఏడు ఛందస్సులనే గుఱ్ఱములతో సూర్యుడు వేదస్వరూపుడిగా భాసిస్తున్నాడు. గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి అనే ఏడు ఛందస్సులే ఏడు గుఱ్ఱములుగా కలిగినవాడు.

ఒక్కొక్క గ్రహం వైపు సూర్యుని ఒక్కొక్క కాంతి లక్షణం ఉంటుంది. ఒక్కొక్క గ్రహంలో ఒక్కొక్క సూర్యుని కాంతి శక్తి ప్రవేశిస్తుంది.

పృథ్వి సూర్యుని అన్ని రకాల శక్తులను పొందుతుంది. మిగిలిన గ్రహాలలో సూర్యుని కిరణములు ఒక్కొక్క గ్రహంలో ఒక్కొక్క రకంగా ఉంటాయి.

ప్రపంచమంతా ఏ వస్తు సముదాయంతో తయారయ్యిందో ప్రతివస్తువు యందు ఆ సముదాయమే ఉన్నది. నవగ్రహలక్షణాలు కూడా ప్రతి అణువులోనూ ప్రసరిస్తాయి. ఈ నవగ్రహకారక కిరణాలను భూమిపై కొన్ని కొన్ని రాళ్ళు, గింజలు పొందుతాయి. ఏ గ్రహకాంతివల్ల ఏ విత్తనం తయారవుతుందో దానికి ఆ గ్రహం పేరు పెట్టారు. నవధాన్యాలు ఆ విధంగా ఉత్పన్నం అయ్యాయి.

సూర్యునికి గోధుమలు, చంద్రునికి బియ్యం అలా ఒక్కొక్కరికి ఒక్కొక్కరకంగా ఉంటాయి. ఇందులో విశేషం సూర్యునికి సంబంధించిన శక్తి ఆ ధాన్యంలో ఉంటుంది. అలా ఆ గ్రహానికి, ఆ ధాన్యానికి సంబంధం ఉంటుంది. అది మనదేహంలో కూడా ఉంటుంది. మన దేహంలో పాదం నుంచి శిరస్సు వరకూ ఏ గ్రహం ఏ స్థానంలో ఉన్నదో వర్ణింపబడుతోంది.

విశ్వనిర్మాణంలోనే నవగ్రహశక్తి ఉంటుంది. ప్రత్యేకించి గ్రహాలు వేరుగా ఉన్నప్పటికీ సూర్యకిరణాలలోనే నవగ్రహకారకశక్తులు ఉన్నాయి. మన మీద ప్రభావం చూపించే నవగ్రహాలకి సౌరమండలమే ప్రధానం. దానికీ సూర్యుడే అధిపతి. ఆయన చుట్టూ సంచరించే గ్రహాలన్నీ ఆయన ఆకర్షణ వల్లనే ఆయన చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

సూర్యుడు ఒక్కొక్క గ్రహంవైపు ఒక్కొక్క రకమైన కిరణాలను పంపుతాడు. అలాగే ఒక్కొక్క కాంతిని పొంది తన వర్ణాన్ని, లక్షణాన్ని పొందే రాళ్ళను రత్నాలుగా చెప్పి ఆ గ్రహానికి సంబంధించిన రత్నాన్ని మనం ధరిస్తున్నాం.

వజ్రం శుక్రునికి, పుష్యరాగం గురునికి, పగడం కుజునికి చెప్పబడ్డాయి. అన్ని రత్నాలకి మూలమైన మహారత్నం సూర్యభగవానుడే.

సూర్యుని నుంచి సుషుమ్న అనే కిరణం ద్వారా చంద్రశక్తి వస్తుంది. సంవర్ధననామక

కిరణం కుజగ్రహానికి మూలం.

**ఉదన్వసు, సంపద్వసు** అనే రెండు పేర్లు కూడా సంవర్ధకనామక కిరణానికి వున్నాయి. విశ్వకర్మ అనే కిరణం నుంచి బుధగ్రహం, ఉదావసు అనే కిరణం బృహస్పతి (దీనికే అర్వాగ్వసు, అశ్వభూతా అనే రెండు పేర్లు.) విశ్వవ్యచస్సు శుక్రగ్రహానికి కారకం, **స్వరాట్** శని గ్రహానికి కారణం. హరికేశ సూర్యగ్రహానికి కారకం. (అనగా నక్షత్ర కారకం)

నక్షత్రాల యందు అంతటా వ్యాపించిన కాంతికి హరికేశము అని పేరు.

**'నమో హరికేశాయోపవీతినే పుష్టానాం పతయే నమః'** – ఏ దీప్తి సూర్యునియందు వ్యాపించిఉందో ఇతర నక్షత్రాల యందు కూడ అదే దీప్తి వ్యాపించి ఉంది.

అనేకమంది సూర్యులు మనకి ఉన్నారు అంటే ఒకప్పటి వైజ్ఞానికశాస్త్రం ఒప్పుకోలేదు. సహస్రాదిత్యులు, కోట్ల ఆదిత్యులు అని వర్ణన పురాణాలయందు ఉన్నది.

**'దివిసూర్య సహస్రశ్చ భవేద్యుగపదుత్థితా'** – అని గీతావాక్యం. వేలకొలది ఆదిత్యులు ఉన్నారని ప్రమాణం మనకి వేదంలో కనబడుతున్నది.

**'ఏతయేవ వృతా సహస్రసూర్యతాయా'** – అనంతసూర్యులు ఉన్నారు అని వైశంపాయనుడు అనే వేదర్షి చెప్పారు. అప్పుడు ఆధునిక వైజ్ఞానికశాస్త్రం దీనిని నిందించింది. ఇప్పుడు లెక్కలేనంత మంది సూర్యులు సౌరమండలంలో ఉన్నారు అని చెప్తున్నారు. ఈ అనంతమైన నక్షత్రాలలో వ్యాపించిన కాంతికి 'హరికేశ' అని పేరు. అనంత ఆకాశంలో అన్ని జ్యోతుల యందు వ్యాపించిన ఏకజ్యోతే సూర్యభగవానుడు. ఇవే ఏడు కిరణాలు.



ఏ కిరణాలను ఉపాసిస్తే ఏ ఫలితం వస్తుందో కూడా చెప్పబడుతున్నది. సుషుమ్నా కిరణ ఉపాసన వలన మనలో కుండలినీశక్తి జాగరణ అవుతుంది అన్నారు.

కుజగ్రహం – సంవర్ధనామక కిరణాల ఉపాసన వలన రక్తదోషాలు నశించి ఆరోగ్యం, ఐశ్వర్యం వృద్ధి కలుగుతుంది.

విశ్వకర్మ నామకమైన బుధగ్రహ కిరణాల వలన మానసిక ఆందోళనలు పోయి శుభం కలుగుతుంది. ఉదావసు, అశ్వభూత అని చెప్పబడే బృహస్పతి కిరణాల ప్రభావం చేత ప్రతికూలతలు తొలగి అనుకూలతలు కలుగుతాయి.

కిరణముల పేర్లు తెలియకపోయినా తద్రూపమైన బృహస్పతిని, తదధిదేవతను ఉపాసించినా ఆ లక్షణము పొందవచ్చును. విశ్వవ్యచస్ అనే దాన్ని ఉపాసించడం వలన వంశాభివృద్ధి కలుగుతుంది. స్వరాట్ అనే శనిగ్రహానికి మూలమైన కిరణముల ఉపాసన వలన అపమృత్యువులు తొలగిపోతాయి. హరికేశనామకమైన కిరణములు మనకి రక్షణగా

ఉపయోగపడతాయి. గ్రహముల యందు ఎలా కిరణాలు ఉన్నాయో అలా సూర్యకాంతిలో కూడా ఉంటూ మనల్ని రక్షిస్తూ ఉంటాయి.

పగలు, రాత్రి కలసి ఒక దినము. మాసం అనేది నిర్మాణం కావడానికి మొట్ట మొదట మూలం దినం.

అహోరాత్రములు కలిసి ఒక దినం. దానినే ఒక 'వారం' అంటాం. వారము అనగా మాటి మాటికి వచ్చేది అని అర్థం. నిన్నేం జరిగిందో ఈ రోజు అదే జరుగుతోంది. దీన్ని ఏడు రోజులుగా ఏడు పేర్లుగా చెప్పారు. కనుక ఏడు దినములనే గుణ్ణాలుగా కలిగిన కాలస్వరూపుడు. ఏడు రోజుల గుణ్ణాలకి, ఏడు రోజుల కిరణాలకి అనుబంధం చెప్పడంలో అర్థం ఇవి వ్యవహారనామాలు కావు అని తెల్సుకోవాలి.

ఆదివారానికి మరొక పేరు 'భానువారం' లేదా 'రవివారం'. ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా ఆ పేరే ఉంటుంది. సోమవారం చంద్రసంబంధమైనది. 'కాలకర్తామహేశ్వరః' ఒకేలా ఎప్పుడూ ఉంటే జగతిలో సృష్టి, స్థితి, లయలు జరగవు. పరిణామం అనేది కాలం లక్షణం. 'కలయతి నియతి ఇతి కాలః' – ఏది ఎప్పుడు ఎలా జరగాలనే నియమం ఏది ఉందో అదే కాలం. అందుకే 'కాలో యమః'.



సూర్యోదయ సమయంలో ఒక్కొక్క గ్రహ హోర ఉంటుంది.

'అహోరాత్రము' అనే పదంలో– అహో లో చివర అక్షరం. రాత్రిలో మొదటి అక్షరం తీస్తే హోర అవుతుంది. హోర సమయం ఎప్పుడూ ఒకేలా నిర్ణయింపబడుతుంది.

- సూర్యహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి ఆదివారము అని పేరు.
- చంద్రహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి సోమవారము అని పేరు.
- కుజహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి మంగళవారము అని పేరు.
- బుధహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి బుధవారము అని పేరు.
- బృహస్పతి హోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి గురువారము అని పేరు.
- శుక్రహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి శుక్రవారము అని పేరు.
- శనిహోరలో సూర్యోదయం జరిగినప్పుడు ఆ రోజుకి శనివారము అని పేరు.

ఆ హోరలో ఆయన ఉదయించాడు కనుక ఆ రోజంతా ఆ గ్రహప్రభావం దానిపై ఉంటుంది. అందుకు ఏడు రోజులకి తేడా ఉంటుంది. ప్రతిరోజు సూర్యునివల్ల ఏర్పడింది కనుక ప్రతిరోజు సూర్యునిదే. కాని తన హోరలో తాను ఉదయించిన రోజుకి మరింత ప్రాధాన్యం. ఆదివారం చాలా ముఖ్యమైన వారం అని శాస్త్రములయందు చెప్పబడుతున్నది.

భారతీయులకి ఆదివారం అనేది పవిత్రమైనది.

ప్రతిరోజు భగవంతుడి దినమే. ప్రతిరోజూ ఒక్కొక్క శక్తితో సూర్యనారాయణుడు వస్తూ ఉంటాడు.

ఏ రోజుకి ఏ అధిపతి ఉంటాడో చెప్పబడింది. గ్రహాలతో పాటు గ్రహాధిపతులు ఉన్నారు.

**ఆదివారం** – సూర్యుడు సూర్యగ్రహానికి అధిదేవత. రుద్రుడు–ప్రత్యధిదేవత. ఆదివారం శివునికి ప్రీతి.

**సోమవారం** ప్రత్యధిదేవత –గౌరీదేవి – లక్ష్మీదేవికి, గౌరిదేవికి ప్రీతి.

**మంగళవారం** – కుజగ్రహం అధిదేవత – సుబ్రహ్మణ్యుడు, మంగళస్వరూపుడైన ప్రత్యధి గణపతిని కూడా చెప్తారు. ఆయన సేనాపతి. ఈయన గణపతి. ఇద్దరూ ఏకస్వభావమే.

**బుధవారం** – నారాయణునికి చాలా ప్రీతికరమైన రోజు.

**గురువారం** – బ్రహ్మదేవునికి ప్రీతికరం –బ్రహ్మవిష్ణుశివాత్మకమైన భగవంతునే మనం పూజిస్తూ ఉంటాం. బ్రహ్మ మనందరికి గురువు. గురుస్థానీయుడు. వేదాలు అన్నీ ఆయన నుంచి మహర్షులకి లభిస్తే, మహర్షులనుంచి మనకి లభించాయి. కనుక బ్రహ్మదేవుని గురువుగా భావించాలి. ఆ బ్రహ్మకు ప్రతీకగా శాస్త్రవేత్తలను, గురుస్వరూపములను పూజించుకోవడం వచ్చింది. దక్షిణామూర్తి, హయగ్రీవుడు, శారదాదేవిలాంటి గురుస్వరూపాలను గురువారం పూజించవచ్చు.



**శుక్రవారం** – ఇంద్రునికి చాలా ప్రీతికరమైన రోజు. శుక్రగ్రహానికి ప్రత్యధిదేవత ఇంద్రుడు. ఇంద్రుడు మహాలక్ష్మీ భక్తుడు. ఇంద్రునికి ఆధిక్యం, ఐశ్వర్యం మహాలక్ష్మి ఆరాధన వల్ల లభించింది. సూర్యునిలో ఉన్న ఇంద్రశక్తే ఆ రోజుకి అధిపతి.

**శనివారం** – శనికి యముడు. యముడు అనేది సాక్షాత్తు భగవత్స్వరూపం.

విష్ణుసహస్రంలో 'నియమో యమః' అని ఉన్నది. మనల్ని అదుపులో పెట్టేవాడు ఆయన. ధర్మాధర్మాలు ఏం చేసామో మనకి తెలియకపోయినా ఆయన సేవకులు దాన్ని పదిలపరుస్తారు.

మనకు కనిపించకుండా భద్రపరచాడు కనుక **గుప్తంగా** భద్రపరచాడు. ఆశ్చర్యంగా భద్రపరచాడు కనుక **చిత్రంగా** భద్రపరచాడు, చిత్రంగా, గుప్తంగా భద్రపరచాడు కనుక చిత్రగుప్తుడు. యముని ప్రస్తావన చేస్తే అకాలమృత్యువు రాదు. శనివారం ప్రాతఃకాలంలో

నిద్రలేస్తూ ఈ నామాలని స్మరించాలి.

**సమవర్తినే నమః- యమాయనమః - ధర్మాయ నమః**

మహాభారతంలో ప్రధానమైన వాళ్ళలో మొదటివాడు కృష్ణుడు. రెండవవాడు యముడు. యముని ఉపాసించి యమునిద్వారా సిద్ధి పొందిన సావిత్రి కథ ఉన్నది. అరబిందోకి ఆ రహస్యం తెలిసే సావిత్రి అనే గ్రంథాన్ని రచించాడు. యముడు 'స్వరాట్' అనే కిరణరూపంలో శనిగ్రహానికి అధిపతిగా ఉన్నాడు.

ఇది ఏడు రోజుల విశేషం.

ఏడురోజులు భగవదారాధన చేసుకోవాలి. ప్రత్యేకించి ఆదివారమునకు మాత్రం ప్రాధాన్యం ఉన్నది కనుక ఆదివారం ఎక్కువ నియమాలు చెప్పారు.

**ఆదివారం ప్రాధాన్యం**

మన ఔన్నత్యం కోసం చారిత్రక ఆధారాలు పరిశీలిస్తే ఫ్రాన్స్ క్యూ మోంట్ అనే ప్రాశ్చాత్యచరిత్రకారుడు వ్రాసిన గ్రంథం, మరికొన్ని చారిత్రక గ్రంథాలు ఆధారంగా చూస్తే భారతీయవైదిక సంస్కృతి ఒకప్పుడు విశ్వమంతటా ఉండేది. పి.ఓక్. అనే భారతీయ చరిత్రకారుడు గ్రంథ రచన ప్రకారం ప్రపంచవ్యాప్తంగా హిందూమతం ఆనవాళ్ళు ఎక్కడెక్కడ ఉన్నాయో చెప్పారు.



రోమ్ దేశంలో ఎంతో బలంగా ఒక నాగరికత ఉండేది.

దానిపేరు మిత్రాయిజం. Franz Cumont అనే అతను మిత్రాయిజం, మిత్రారాధన గురించి చాలా పరిశోధన చేసి Oriental Religions in Roman Paganism అనే పుస్తకాన్ని రచించాడు.

Paganism అనగా ప్రకృతి ఆరాధన. ప్రాచీన నాగరిక రోమన్లది ప్రకృతి ఆరాధన. దాని గురించి ఆయన పరిశోధన చేస్తూ "Of all the Oriental cults none was so severe as Mithraism, none attained an equal moral elevation, none could have had so strong a hold on mind and heart."

మిత్రాయిజం చాలా బలంగా ఉండేది. అది చూపినంత ప్రభావం ఆ యూరప్‌దేశాలలో ఆ రోమన్‌ప్రాంతాలలో ఇంక దేనికీలేదు. ఇజం అంటే సిద్ధాంతం. మిత్ర సిద్ధాంతం అనగా సూర్యారాధన. 2,3 శతాబ్దాల వరకూ అక్కడ మిత్రసిద్ధాంతం చాలా వ్యాప్తిలో ఉండేది.

సుమారు కొన్ని వందల, వేల సూర్యాలయాలు ఉండేవి. ఆదివారం పరమపవిత్రంగా భావిస్తూ సూర్యారాధన చేసేవారు. మనం ధనుర్మాసం అని దేనిని వ్యవహరిస్తామో అలా వాళ్ళు ధనుర్మాసం ప్రకారం డిశంబరు 25న మిత్రజయంతి అని చేసేవారు. సూర్యభగవానునికి ఆ రోజు ప్రత్యేకించి ఆరాధన చేసేవారు. కాలక్రమంలో కొన్ని మతాలు ఈ మిత్రాయిజాన్ని నిర్మూలించాలని ప్రయత్నించి ముందుగా చక్రవర్తులను మార్చడానికి ప్రయత్నించాయి.

ముందు పాలకులు మారిపోతే ప్రజలలో ఈ మతవ్యాప్తిని సాధించవచ్చు అనే అభిప్రాయంతో రోమన్ చక్రవర్తులను మార్చడానికి ప్రయత్నించారు.

జూలియన్ అనే రోమన్ చక్రవర్తి Sing to Sun God - సూర్యభగవానునికి సంబంధించిన స్తుతిని రోమన్ లిపిలో రచించాడు.

అప్పటికే ఋగ్వేదంలో మిత్రశబ్దం కనబడుతున్నది. ఇప్పటి చారిత్రక పరిశోధన ప్రకారంగా మానవజాతి మొత్తానికి మొదటి సాహిత్యం ఋగ్వేదం. ఆ ఋగ్వేదంలో మిత్రశబ్దం అనేకమార్లు కనపడుతుంది. 133 సూర్యసంబంధమైన సూక్తాలు ఉన్నాయి. ఇలా సూర్యారాధన ఆనాడు విదేశాల్లో కూడా ప్రబలంగా ఉండేది.



చక్రవర్తులను మార్చినప్పటికి ప్రజలలో అలవాట్లు వదలలేదు. ఆదివారం పవిత్రమైనది, ఆ రోజు పవిత్రంగా ఉండాలి అనే భావాన్ని, డిశంబరు 25ని అక్కడివాళ్ళు వదులుకోలేక పోయారు. 'మన మతానికి ఆదివారమే పవిత్రమైనదినం క్రింద ప్రకటన చేసి, మన మతప్రవక్త జన్మదినం క్రింద డిశంబరు 25 ను మార్చివేద్దాం' అని మార్చి వేసారు.

దీనికంతటికి చారిత్రకమైన ఆధారాలు ఉన్నాయి.

మనం ఏ తల్లికి పుట్టామో చివర వరకూ ఆవిడే మన అమ్మ. మధ్యలో ఏ స్త్రీ అన్నం పెట్టినా అమ్మలా గౌరవిస్తాం గాని మన అమ్మ కాని ఆవిడను అమ్మా అని అనం. అమ్మని మార్చడం ఎంత పాపమో, మతాన్ని మార్చడం అంతపాపం.

మన ధర్మానుసారం మనం ఆదివారాన్ని ఆచరించాలి. ఆదివారం చాలా పవిత్రంగా గడపాలి. ఆదివారం ప్రాతఃకాలంలోనే సూర్యుని ఆరాధన చెయ్యాలి.

**ఆమిషం మధుపానం చ యః కరోతి రవేర్దినే**
**సప్తజన్మభవేద్రోగీ జన్మజన్మదరిద్రతా**
**స్త్రీ, తైల, మధుమాంసాని యే త్యజేత్ రవివాసరే**
**న వ్యాధి శోక దారిద్ర్యం సూర్యలోకం చ గచ్ఛతి**

ఆదివారం మాంసం తినరాదు. మధుపానం చెయ్యరాదు. స్త్రీసంగమం పనికిరాదు. ఆ రోజు గృహస్థులు కూడ నియమబద్ధంగా జీవించాలి.

మద్యపానం, మాంసాహారం అనేవి పాపం అని చెప్పారు. అనుష్ఠానపరులు, మంత్రా దులు చేసేవారు, భగవంతుని పొందాలనుకొనేవారు వీటిని విడిచిపెట్టాలి. కొన్ని వర్గాలకు మద్యం, మధువు రెండూ నిషేధం. ఎవరికి నిషేధం కలదో వారు ఎప్పుడూ పుచ్చుకో కూడదు.

నిషేధాలు లేని వర్గాలు కొన్ని ఉన్నాయి. ఇది తరతరాలుగా ఉన్నవాళ్ళకి వీటిని తీసుకోవడం దోషము లేదు. ఈ మాటలన్నీ భారతంలో భీష్ములవారు వివరించారు. వాళ్ళ జీవనరీతి, వాళ్ళ జీవలక్షణాల ఆధారరీత్యా దోషం లేదు కాని వాళ్ళు కూడా వీటిని మానివేస్తే అశ్వమేధాదియజ్ఞాలు చేసిన ఫలితం వస్తుంది అన్నారు.

మహాభారతంలో ధర్మవ్యాధుడిని దీనికి ఉదాహరణగా చెప్పవచ్చును. సురాపానం చేసినవాడి చుట్టూ సూక్ష్మభూమికలో కొన్ని దుష్టశక్తులు తిరుగుతూ వాడిని, వాడి వంశాన్ని నాశనం చేస్తాయి. మధుమాంసాదులు తీసుకోవచ్చు అనేవారు కూడా ఆదివారం తినరాదు.

ఎవరైతే ఆదివారం పవిత్రంగా ఉంటారో వారికి 'న వ్యాధి శోక దారిద్ర్యం' – వారికి వ్యాధులుండవు. దుఃఖాలు, దారిద్ర్యాలు ఉండవు. తిథులలో సప్తమి కూడా సూర్యారాధనకు చాలా ముఖ్యం.



✦ ✦ ✦

మన శరీరంలో ఏడుగుర్రాలు శరీరనిర్మాణపరంగా, యోగపరంగా, ఇంద్రియపరంగా చూడవచ్చును. మనలో సప్తధాతువులు ఉన్నాయి. సప్తధాతువులతో శరీరనిర్మాణమైనది. మాంసం, మజ్జ, అస్థి, ప్లీహము, రక్తం, మేదస్సు, శుక్రం మొత్తం ఏడు. ఈ సప్తధాతువు లతో మన శరీరం ఉంటేనే ఆరోగ్యం. ధాతువైషమ్యమే అనారోగ్యం. ధాతు సామరస్యమే ఆరోగ్యం.

ఆ ధాతువులకి సూర్యకిరణాలకి సంబంధం ఉన్నది. మనం చేసే పాపాలవలన ఈ ధాతువైషమ్యం ఏర్పడుతుంది. ఇప్పుడు తినే ఆహారాదుల దోషములు, గతజన్మ సంస్కారాల వల్ల వచ్చిన దోషాలు, వీటివల్ల శరీరంలో ధాతు వైషమ్యం ఏర్పడుతుంది. నియమంగా సూర్యభగవానుని ఉపాసన చేసినట్లయితే ఈ ధాతువైషమ్యాన్ని సూర్యభగవానుడు తనకిరణాలతో తొలగిస్తాడు.

ఏడు ధాతువులని కలిగించే శక్తి ఆయన కిరణాలలో ఉన్నది. మనలోపలున్న ఆత్మశక్తి స్వరూపుడు సూర్యుడు.

ఈ ఏడు ధాతువులనే గుర్రాలతో మన శరీరం నడుపుతున్నాడు. ఈ శరీరం సప్తాశ్వరథం. ఈ రథంలో కూర్చుని ఉన్నవాడే సప్తాశ్వరథారూఢుడు.

**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి।**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥**

అని కృష్ణభగవానుడు గీతలో చెప్పినట్లుగా ఈ శరీరమనే రథములో హృదయస్థానంలో కూర్చుని నడుపుతున్న ఆ పరమాత్మరూప చిత్సూర్యుని మన హృదయమండలంలో ధ్యానించాలి. అంతరింద్రియాల్లో బుద్ధికి, బాహ్యేంద్రియాల్లో కంటికి సూర్యుడు అధిదేవత. దృష్టి రెండు రకాలు. అది బాహ్యంగా ఉంటే నేత్రం. అంతరంగా ఉంటే బుద్ధి.

ఈ రెండు రకాల దృష్టులకి దృష్టివేల్పు అతడే. ఒక్కొక్క గ్రహాన్ని తన శక్తితో నడిపిస్తున్నా ఒక్కొక్కభాగం తీసుకొన్నా శరీరంలో తాను మాత్రం రెండింటిని తన అధీనంలో పెట్టుకున్నాడు. బుద్ధిని, కంటిని తన అధీనంలో పెట్టుకున్నాడు. బుద్ధి ఉండే శిరస్సుకు జ్ఞానేంద్రియస్థానమని పేరు.



తల జ్ఞానేంద్రియస్థానం. శిరస్సు నుంచి క్రిందిభాగం అంతా కర్మేంద్రియస్థానం. శిరస్సులో ఉన్న జ్ఞానేంద్రియాలు రథానికి ఉన్న అశ్వాలుగా ఉన్నారు.

**రెండు కళ్ళు, రెండు నాసికారంధ్రాలు, రెండు కర్ణాలు, ఒక ముఖం. ఈ ఏడు ఇంద్రియాలని బుద్ధిరూపంలో ఉన్న జ్ఞానస్వరూపుడైన సూర్యభగవానుడు నడుపుతూ ఉన్నాడు. ఇవి స్వప్తాశ్వాలు.**

యోగపరంగా మూలాధారం నుంచి సహస్రారం వరకు ఏడు యోగకేంద్రాలు ఉన్నాయి. ఈ ఏడు యోగకేంద్రాలలో కుండలినీస్వరూపంగా ప్రసరిస్తున్న పరమేశ్వరచైతన్యమే ఆదిత్యరూపంగా చెప్పబడింది. 'సప్తాశ్వరథమారూఢం' - ఈ సప్తాశ్వాలు, **శబ్దపరంగా**

**ఏడు స్వరాలు- సప్తాశ్వాలు:** సప్తధాతువులు, సప్తచక్రాలు మనలో, ప్రపంచంలో ఏడువారాలనే కాలం, ఏడు రంగుల కాంతి, ఏడుస్వరాల్లో వేదస్వరూపంగా ఏడు ఛందస్సులు - ఇవే సప్తాశ్వాలు.

సూర్యునికి తిథులలో సప్తమి. సంఖ్యలలో ఏడు చాలా ఇష్టం. ఏడు గ్రహాలు చెప్పారు. మరో రెండు గ్రహాలు ఛాయాగ్రహాలు అన్నారు. వాటికి కాంతి, కిరణాలు లేవు కనుక గ్రహసంఖ్యలో చెప్పబడవు. నీడ మాత్రమే కలిగి ఉంటాయి.

మనవాళ్ళు చెప్పిన ఛాయ అనే మాటకి, ఇప్పుడు ఖగోళశాస్త్రంలో గ్రహణమనే మాటకి సంబంధం ఉంది. గ్రహణం గురించి సూక్ష్మవిజ్ఞానం మనవాళ్ళు చెప్పారు. సూక్ష్మవిజ్ఞానం తెల్సుకోవాలంటే ఇంకా పరిణతి రావాలి. పైపైన చూసేది వేరు.

గ్రహణాదులలో ఆహారానికి, కొన్ని పదార్థాలకి, శరీరానికి కొన్ని దోషాలు సంక్రమిస్తాయి. ఆ దోషాలు మన మైక్రోస్కోపులకు, ప్రస్తుతం అభివృద్ధి చెందుతున్న విజ్ఞానమునకు దొరకవు. ఎప్పుడో పరిశీలించగా దొరకవచ్చు. కాని ఏనాడో తపస్సు చేసిన ఋషులు దీని గురించి చెప్పారు. ఈ సమయంలో తిన్నా(రోగగ్రస్తులు, వృద్ధులు తప్ప) ఆ దోషముల చేత వారి శరీరంలో మార్పు రావడమే కాకుండా పుట్టే సంతానం కూడా దోషం కలదై ఉంటుంది.

సప్తమి చాలా విశేషమైనది. సప్తమీవ్రతాలు చాలా వున్నాయి. అపరాజితా సప్తమి, కాంతి సప్తమి మొదలైన 36 రకాలు సప్తమీ తిథుల గురించి భవిష్యోత్తర పురాణం చెప్పింది. ఒక్కొక్క కోరిక కోసం ఒక్కొక్క సప్తమీవ్రతం ఉన్నది. అందులో ఒకటి రథసప్తమి.

ఆదివారానికి, సప్తమికి ఒకటే నియమం. ఒకవేళ ఆదివారం సప్తమి వస్తే అది మహాయోగం. ఈ సమయంలో చేసే సాధన అత్యధికంగా ఫలిస్తుంది. సప్తమి రోజున ఉషాదేవితో ఉన్న సూర్యుని ఆరాధించాలి అంటారు.



ఉషఃకాలంలో సూర్యభగవానుడు ప్రియురాలి కొంగుపట్టుకు వెడుతున్న ప్రియుడిలా ఉంటాడని శాస్త్రం చెప్పింది.

## సూర్యుని పత్నులు - పుత్రులు

సూర్యుని భార్యలు ఉషా, పద్మిని, ఛాయా, సంజ్ఞా. మనప్రకారంగా కాకుండా దేవతా ప్రకారంగా సంబంధాలు వేరుగా ఉంటాయి. ఈ సంబంధాలని భౌతికంగా అన్వయించ రాదు. దేవతాశరీరాలు తేజోమయం, మానవశరీరాలు పంచభూతమయమైనవి.

భార్య అనగా దేవతా పరిభాషలో ఆయనను వీడకుండా ఉండే సహాయకశక్తి. ఉషా అనగా రోగహరణ శక్తి. పద్మిని అనగా సర్వజగత్తుని వికసింపజేసే సూర్యునిశక్తి. పద్మిని శబ్దానికి గమనం అనికూడా అర్థం. ఛాయా అనగా కాంతి, నీడ అని అర్థం. వెలుగునిచ్చే ఆయనే నీడని కూడా ఇస్తాడు.

సంజ్ఞాదేవియే ఛాయగా మారిందన్న పురాణ కథ ఉంది. 'సంజ్ఞ' అనగా పోల్చుకో గలగడం.

సూర్యుడు వస్తేనే మనం దేనిని అయినా చూడగలం. అందుకే సూర్యకిరణాలకి

'కేతవః' అని పేరు ఉన్నది. వస్తుజ్ఞానం కలిగిస్తాయి కాబట్టి కిరణాలకి 'కేతవః' అని పేరు. ఆ వస్తువుని పోల్చుకొనే శక్తినే 'సంజ్ఞ' అంటారు. అలా వస్తువుని పోల్చుకొనే శక్తి వలన కాంతి, దాని వలన నీడ ఏర్పడుతుంది కనుక ఛాయా.

రోగహరణశక్తి, గమనశక్తి, వికసనశక్తి, ఛాయని ఏర్పరిచే శక్తి, పోల్చుకొనే జ్ఞానాన్ని ఇచ్చేశక్తి ఇవన్నీ సూర్యుని విడదీయలేని శక్తులు. సూర్యపుత్రులు అనగా ఆయన నుంచి కలిగినవారు. ఆయనలో ఒక శక్తిని తీసుకుని వచ్చినవారు. అశ్వనీదేవతలు, శని, యముడు మొదలైనవారు. పురాణకథలు భగవచ్ఛక్తిని ప్రతీకలుగా మనకి చూపిస్తాయి.

గ్రహాలకు కారణమైన సుషుమ్న, హరికేశం, విశ్వకర్మ, విశ్వవ్యచస్, సంపద్వసు, అర్వాగ్వసు, స్వరాట్ అను ఏడు రశ్ములు ప్రధానమైనవి.

సూర్య ఉపాసనకి సంబంధించిన కొన్ని ముఖ్యమైన అంశాలను మధ్యమధ్యలో చెప్పడం జరుగుతోంది. ఆదివారం తీరికగా ఉందని చెయ్యకూడని పనులను ఆ రోజే చేస్తాం. నిజానికి ఆ రోజుగాని చెయ్యరానివి చేస్తే 'సప్తజన్మదరిద్రతా' అని శాస్త్రం చెప్పింది.

ఈ జన్మలోనే కాకుండా తరువాత జన్మలకి కూడా పాపాలను నిల్వ ఉంచుకున్నవాళ్ళం అవుతాం.



ఆదివారం చాలా పవిత్రంగా ఉండాలని చెప్పారు.

ఆదివారం మాత్రం క్షురకర్మ చేయించుకోరాదు. ఇది దోషం.

## సూర్యశతక మహిమ

సూర్య ఉపాసకులలో చాలా ఉత్కృష్టమైనవాడు మయూరకవి. భారతీయ సంస్కృత సాహిత్యంలో ఈయన స్థానం కాళిదాసు మొదలైన వారితో సమానమైనది. పైగా సంస్కృత సాహిత్యం చదివిన వారికి మయూరుని సూర్య శతకం చదవకపోతే పూర్ణం కూడా కాదు.

మయూరుని సూర్యశతకానికి శ్రీనాథమహాకవి మొదలైనవారు కూడా చాలా ఆకర్షితులై వాళ్ళ గ్రంథములలో, కావ్యాలలో ఈ శ్లోకాలను అనువదించారు. మయూరునికి ఒకసారి వ్యాధి వచ్చినప్పుడు దాని నిర్మూలన కోసం తనని తాను ఒక తాడుతో బంధించుకుని సూర్యభగవానుని చూస్తూ ఆయన రథాన్ని, మండలాన్ని, సారథిని, కాంతిని, పురుషుని ఇలా ఒక్కొక్క దాన్ని కొన్ని శ్లోకాల చొప్పున నూరు శ్లోకాలతో స్తుతించాడు. ఆయన పది శ్లోకాలు చెప్పేటప్పటికి ఆ కట్లు ఒక్కొక్కటి వాటంతట అవి తెగడం మొదలు అయ్యాయి.

నూరు శ్లోకాలు పూర్తవగానే మొత్తం కట్లన్నీ తెగిపోయి ఆయన వ్యాధి నిర్మూలనమైంది. సూర్యశతకానికి ఉన్న విశేషం ఇది.

సూర్యశతకాన్ని పారాయణ చేసి దీర్ఘకాలికమైన రోగాలు పోగొట్టుకొన్న వారి అను భవాలు, చరిత్రలు పుస్తకరూపంలో కూడా ఉన్నాయి. ఈ మధ్యకాలంలో తమిళనాడులో దీనికి సంబంధించిన పుస్తకం ఆంగ్లభాషలో వచ్చింది. కంచిమహాస్వాములు శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారి మాట మేరకు ఒక భక్తుడు ఈ సూర్యశతకం పారా యణ చేసాడు. అది దొరకడం మహాకష్టమైతే గ్రంథాలయం నుంచి తెచ్చుకొని పారాయణ చేయించుకుని విన్నారు.

అతని కంటికి రోగం వచ్చినప్పుడు ఎన్ని ఆపరేషన్లు చేసినప్పటికి ఫలితం లేకపోవడవ వల్ల మహాస్వామివారు సూర్యశతకం పారాయణ చెయ్యమని చెప్పారు. ఆ శతకం చదవాలంటే నోరు తిరగాలి ఎందుకంటే అలా తిరిగితే ఆ శబ్దతరంగాల వల్ల ఆ సూర్య మండలంలో ఉన్న సూర్యుడే స్పందిస్తాడు. అవి అంత గొప్ప శ్లోకములు. స్వామివారి సూచన మేరకు అతడు ఆ శ్లోకాలని పారాయణచేయించి విన్న వెంటనే నేత్రదృష్టి మొత్తం సమకూరింది అని అతను తన అనుభవాన్ని తాను వ్రాసుకున్నారు.



సూర్యునికి సంబంధించిన అపారమైన సాహిత్యం మనకి ఉన్నది. ఆ సాహిత్యంలో ఈ మయూరకవి రచించిన సూర్యశతకం ప్రత్యేకించి కావ్యస్థానంలో ఉత్కృష్టంగా ఉంటుంది. అద్భుతమైన కవిత్వం ఇందులో ఉంది. ఆయన చెప్పిన ఉపమానాలు, అలంకారాలు కవితాపరంగా చాలా గొప్పవి. పాశ్చాత్యులు కూడ దీని గురించి కొన్ని విషయాలు రచించారు. అంత ఆకర్షణీయమైన కవిత్వం అందులో ఉంది.

మరొకవైపు సాంబుడు రచించిన 'సాంబపంచాశిక'. ఇవి 50 శ్లోకాలు. ఇది కూడా సూర్యసాహిత్యంలో గొప్ప విశేషమైనదిగా చెప్పుకోవచ్చు. అలాగే అప్పయ్యదీక్షితులు అనే మహానుభావుడు 16వ శతాబ్దానికి చెందినవారు. ఆయనను మళ్ళీ పుట్టిన శంకరాచార్య అంటారు. ఆయన మనకి చాలా ఉపకారం చేసారు.

మొత్తం 104 గ్రంథాలు రచించిన సిద్ధపురుషుడు. ఈ సిద్ధపురుషుడు మొత్తం సూర్య తత్త్వాన్ని పిండి పన్నెండుశ్లోకాలలో రచించారు. ఆ శ్లోకాల చివరలో ఒక ప్రతిజ్ఞావాక్యం వ్రాసాడు. ఈ పన్నెండుశ్లోకాలని నిత్యం చదువుకొనే వాళ్ళకి అనారోగ్యాలు, పాపాలు, అజ్ఞానం, అరిష్టాలు, గ్రహదోషాలు ఉండవని, జాతకంలో ఏమైనా గ్రహాలు దుస్థానంలో ఉంటే అవికూడా తొలగిపోతాయని చెప్పారు.

ఆయనది ఆర్షవాక్కు. ఇది అనుష్ఠానం చేసి తరించినవాళ్ళు చాలా మంది ఉన్నారు. ఆ పన్నెండుశ్లోకాలకి ఆయనే ఒక గ్రంథమంత వ్యాఖ్యానం వ్రాసారు. ఇలా మనకి ఋషుల మంత్రాలతో సమానమైన సూర్యసాహిత్యం ఒకవైపు ఉన్నది.

ఇక లౌకికంగా రచించిన వాళ్ళు చాలా మంది ఉండవచ్చును.

వీరందరూ ఉపాసనపరంగా సూర్యుని కేవలం కాంతిమండలం అని కాకుండా ఆయన పరమపురుషతత్త్వాన్ని అనుభవించి రచించినవారు. ఊహించి వ్రాయడం, చదివి వ్రాయడం కాకుండా అనుభవించి వ్రాసారు. భావనకు మించినది అనుభవం. వాళ్ళ అనుభవం అందులో ఉంది కనుక అవి అంత సత్యస్వరూపాలు అయ్యాయి.

✦ ✦ ✦

మయూరుడు కూడా తన సూర్యశతకంలో అనేక చోట్ల ఈ ఏడు గుర్రాల గురించి వర్ణించారు. అయితే ఈ ఏడు గుర్రాలకి ఏడు పేర్లు ఉన్నాయి. ఈ ఏడుపేర్లని భవిష్యోత్తర పురాణంలోని ఏడు అధ్యాయాల ఆదిత్యహృదయంలో కృష్ణపరమాత్మ అర్జునునకు చెబుతారు.



**జయోజయశ్చ విజయో జితప్రాణో జితశ్రమః।**
**మనోజవో జితక్రోధో వాజినః సప్తకీర్తితః॥**

జయ, అజయ, విజయ, జితప్రాణ, జితశ్రమ, మనోజవ, జితక్రోధ. ఇవి ఏడు. ఏడు గుర్రాలకి ఏడు పేర్లు కావచ్చు లేక ఉన్న అశ్వానికే ఏడు లక్షణాలు అనుకోవచ్చు. లక్షణానికి ఒక గుర్రం చూపించగలిగే శక్తి ఆదిత్యునికి ఉంది కనుక రెండు భావనలు కూడా సరిపోతాయి. కనుక ఇదొక 'సప్తసప్తి'.

మరొక సప్తసప్తి గురించి వేదం చెప్తూ సూర్య కిరణాలు ఏడు గ్రహములకి కారణమైన ఏడు విధాల కిరణాలు సుషుమ్నా, సురాట్, హరికేశ మొదలైనవి... ప్రళయ కాలంలో ఏడు మహామండలాల వలే భాసిస్తాయి. ఇది మనకి అనుభవానికి రావు. ఈ ఏడు ఆదిత్యులు ఒక్కసారి వస్తే అప్పుడు ఉత్పన్నమయ్యే ఉష్ణతగాని, అగ్ని గాని చాలా తీవ్రంగా ఉంటుంది. దానితో కల్పాంతం జరుగుతుంది. కనుక యుగాంతవేళలో ఏడు రకాలుగా వస్తాడు.

ఆ ఏడు పేర్లు కూడా మనవాళ్ళు చెప్పారు. అవి ఆరోగ, భ్రాజ, పతర, పతంగ, స్వర్ణర, జ్యోతిష్మంత, విభావస. ఇవన్నీ సూర్యునిలో దాగి వున్నాయి. సమయం చూసి తెస్తూ ఉంటాడు. ఇప్పుడు మనం పరిశీలిస్తున్న గ్లోబల్ వార్మింగ్ అని అంటున్నాం.

దానికి మనం చేసుకొన్న దోషములే కారణం. ఈ దోషముల చేత కూడా ఇందులో ఉన్న ఏడు లక్షణాలలో కొన్ని కొన్ని అయినా ఇప్పుడు మనకి కనిపిస్తూ ఉన్నాయి.

భావి రోజులలో కూడా కనిపించవచ్చును. కాని సూర్యుని యొక్క అనుగ్రహం ఉన్నవారికి సూర్యుని నుంచి ఎప్పుడూ వేదన ఉండదు. ఇది అనేకమందికి స్వానుభవం. దీనికి రమణమహర్షి, జగదీశన్‌ల రికార్డ్ మనకి సాక్ష్యం. కనుక సూర్యుని దైవంగా ఉపాసించే వారికి ఎప్పుడూ ప్రతికూలత వుండదు. ఇది ఋషి వాక్యం, ఘంటాపథం, సత్యం. సందేహం లేదు. కేవలం ఆయన మండుతున్న అగ్నిగోళం అనేవాడి బ్రతుకే అగ్నిగోళం.

ఉపాసనా దృష్టికి దేవత స్పందిస్తుంది. విశ్వమంతా దేవతామయం. మనతోనే ప్రారంభం అయ్యిందా విశ్వం? మన మేధస్సే గొప్పదా?

ఈ అనంత విశ్వం ఈశ్వర మేధస్సు.

ఆ ఈశ్వరస్వరూపమే సూర్యభగవానుడు.

ఆరోగ, భ్రాజ, పతర, పతంగ, స్వర్ణర, జ్యోతిష, విభావస అని ఏడు సూర్యుల పేర్లను చెప్పి వేదంలో **'తే అస్మై సర్వే కశ్యపాత్ జ్యోతిర్లభంతే'** ఈ ఏడుగురు కూడా ఈ కశ్యపుని నుంచే జ్యోతిని పొందుతున్నారు అన్నారు.



కశ్యపుడు అనగానే పురాణ కథలలో పరిచయం ఉన్న వారికి అదితీకశ్యపులు. వీరి సంతానం దేవతలు. దితి, కశ్యపుల సంతానం దైత్యులు. పురాణాలలో ఈ కథలు కన బడతాయి. కశ్యప ప్రజాపతికి అనేక మంది భార్యలు దితి, అదితి, దను, సరమ ఇలా మొత్తం అనేక మంది కనబడతారు. ఇదంతా సౌరశక్తికి సంబంధించిన విశేషణాలని రకరకాల పేర్లతో చెప్పారు.

సౌరశక్తి నించి ఈ విశ్వంలో అన్ని రకాల జాతులలోకి ప్రాణశక్తి ఎలా వస్తుంది అని చెప్పడం కోసం ప్రతీకవాదముగా ఇవన్నీ చెప్పడం జరిగింది. ప్రతీకలు సంకేతాలు. అంశాలు. పురాణ కథలలో సాకారము, సంకేతము అని రెండు ఉన్నాయి.

ఒక భావం ఒక ఆకారం ధరిస్తే ఎలా ఉంటుందో అనేది కొన్ని దేవతలలో కనిపిస్తుంది. ఆ సాకారసిద్ధాంతం అర్థమైతే మన దేవతా విజ్ఞానం మరింతగా అర్థం అవుతుంది. ఒక భావానికి ఒక ఆకారం ఉపాసిస్తూ ఉంటే ఆ భావశక్తి మనలో జాగృతి చెందుతుంది. ఏ ఆకారాన్ని ఉపాసిస్తే ఎలాంటి భావశక్తి జాగృతి అవుతుంది, ఏ భావశక్తి వల్ల జగతికి ఏ హితం కలుగుతుంది అనేది ఒక విషయం ఉన్నది.

భావానికి ఒక శక్తి ఉంటుంది. శక్తి ఉన్నప్పుడు అక్కడ ఒక దేవత ఉంటుంది. అదే విధంగా కశ్యప ప్రజాపతి, అతన్నించి వచ్చిన సంతానం ఇదంతా కూడా సౌరశక్తికి సంబంధించిన కొన్ని రహస్యములు. 'సౌర' అనగా సురలకు సంబంధించిన అనే అర్థం కూడా ఉంది.

ఆదిత్యుడు, ఆదిత్యులు అనే మాట మనకి ఉన్నది. ఆదిత్యులు అంటే దేవతలందరికి కలిపి బహు వచనం. ఆదిత్యుడు అని సూర్యుని ఒక్కరినే చెబుతారు.

అంటే సర్వదేవతాత్మకుడు అనే మాట మనకు 'ఆదిత్యుడు' అనే మాటలోనే కనిపిస్తోంది. అందువల్ల కశ్యప, అదితి... ఇవన్నీ కూడా ఈ సౌరశక్తి గురించి మనకు అర్థం అవ్వడం కోసం రకరకాల పాత్రల రూపంలో చెప్పినవే.

అయితే ఆ కథలు జరగలేదని మనం అనకూడదు. యుగాల క్రితం ఈ అనంతవిశ్వంలో దివ్యభూమికలలో జరిగిన కథలు మన మానవ భూమికలకు అర్థం కావు. మన భూమిక వేరు. వాళ్ళ భూమిక వేరు. ఈ భూమికలో ఉన్న ఆలోచనలు వేరు. ఆ భూమికలో ఉన్న ఆలోచనలు వేరు. అందుకే జరగలేదని మనం అనరాదు. కాని అందులో వున్న మాటలకి అర్థం తీస్తే ఇప్పుడు వైజ్ఞానికంగా మనం అనుకుంటున్న వాటన్నింటికీ ఒక ఖచ్చితమైన సంబంధం కనిపిస్తుంది. ఆ కారణం చేత వీటిని సంకేతంగా దర్శిస్తే మనకి కొన్ని విషయాలు తెలుస్తాయి.



సూర్యభగవానునికే కశ్యపుడని పేరుంది. మనం చూస్తున్న సూర్యమండల ఉత్పత్తికి మూలమైన ఒక తేజస్సు ఉంది. ఆ తేజస్సే సూర్యమండలం లోంచి మనకు కనిపిస్తున్నది. మనం సూర్యమండలం ద్వారా ఆ తేజస్సుని ఉపాసిస్తున్నాం. ఆ తేజస్సునే ఇక్కడ 'కశ్యపాత్ జ్యోతిర్లభంతే' అన్నారు.

ఈ ఏడు రకాల సూర్యులకు 'ఆరోగ, భ్రాజ ఇత్యాదులకు' ఈ సూర్యశక్తి లభించదానికి కారణం ఈ కశ్యపుడే అన్నారు. అయితే కశ్యప శబ్దానికి వేదం మంచి మాట చెప్తూ **'పశ్యకః కశ్యపో భవతి'** అన్నది. ఎవడు కశ్యపుడో వాడే పశ్యకుడు. పశ్యకః అనగా చూచువాడు. సూర్యుడు దర్శనశక్తి సంపన్నుడు. కనుక కశ్యపః అనగా దర్శన శక్తి సంపన్నుడైన ఆదిత్యుడు. దర్శన శక్తి అనగా కాంతి శక్తి. ఇదీ కశ్యప మాటలో అర్థం.

**మరీచిమాన్**

మరణం కలిగించే కిరణములు కలవాడు. మరణం అనగా 'నాశనం' అని అర్థం. మరీచిమాన్ అనగా నాశనం చెందించే కిరణాలు కలవాడు. సూర్యకిరణాలలో తాపాన్ని

గ్రహించి ప్రయోగించినట్లయితే అది అనేక వస్తుసముదాయాలను తగలబెట్టగలదు. సూర్యకిరణాలలో నశింపజేయగల శక్తికూడా ఉన్నది. అది కొంచెం వైజ్ఞానికంగా ఆలోచిస్తే మనకి అర్థం అవుతుంది.

'మరీచిమాన్' అనే నామానికి 'హరిదశ్వ' నామంతో సంబంధం పెట్టుకుంటే మరింత స్పష్టం అవుతుంది. అంధకారాన్ని, అజ్ఞానాన్ని మొదలైన వాటిని హరింపజేసేవాడు. ఇది మనకి అర్థంకావడానికి తరువాత తిమిరోన్మథనః అనే నామంలో లభిస్తోంది.

**తిమిరోన్మథనః**

ఉన్మథనం అంటే బాగా కలగబెట్టి తొలగింపజేయడం. తిమిరాన్ని ఉన్మథన చేస్తాడు. తిమిరము అనగా చీకటి. చీకటిని సంపూర్ణంగా తొలగించువాడు. ఆయన వస్తూనే ఆ చీకట్లని క్రమక్రమంగా హరింపజేస్తాడు. ఇది మండలపరమైన అర్థం.

మనలో ఆత్మచైతన్యం, సూర్యమండలంలో పరమేశ్వరచైతన్యం ఈ రెండింటిపరంగా చూడాలి. ఉపాసనా దృష్టిలో తిమిరోన్మథనః అనే శబ్దంలో రెండు విశేషాలు ఉన్నాయి. మనలో ప్రజ్ఞారూపుడుగా ఉండి సమస్తమైన అజ్ఞానాన్ని తొలగిస్తాడు. ఒక వస్తువుకి సంబంధించిన అవగాహన, తెలివి కలగడం వలన అజ్ఞానం అనే చీకటిపోతున్నది. మనలో ప్రజ్ఞానం ఆయనే. 'ప్రజ్ఞానంబ్రహ్మ' అని కేవల జ్ఞానస్వరూపంగా ఆయనే ఉన్నాడు. జ్ఞానరూపంగా అంతఃకరణంలో భాసించే పరమాత్మతేజస్సు ఇతడే. అందుకు తిమిరోన్మథనః.



ఇంకొక అర్థం సూర్యోపాసన వలన మనకి అవిద్య సంపూర్ణంగా తొలగుతుంది. పరావిద్య వేదాంతవిద్య. వేదాంతవిద్య చాలా ఉత్కృష్టమైనది. గీతలో కృష్ణపరమాత్మ

**సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున।**
**అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥**

అన్నారు. విద్యలలో అధ్యాత్మవిద్య నా స్వరూపం. కనుక అన్ని విద్యలలోకి అధ్యాత్మవిద్య గొప్పది. మనకు భౌతికవిద్యలను నేర్పిన వాడిని అధ్యాపకుడు, ఉపాధ్యాయుడు అని అంటాం కాని గురువు అనలేం. అధ్యాత్మవిద్య బోధించేవారిని గురువు అంటారు. ఈ అధ్యాత్మవిద్యా స్వరూపుడు ఆదిత్యుడు.

ఆదిత్యోపాసన వలన మనకి ఆధ్యాత్మవిద్య కలుగుతుంది. ఆదిత్యుని కిరణాలతో భౌతికప్రయోజనాలే కాకుండా ఉపాసించేవారికి ఆత్మజ్ఞానమనే గొప్ప ప్రయోజనం కలుగుతుంది. సృష్టిలో అందరూ అవిద్యలో ఉన్నవాళ్ళే. విశ్వం అంతా పరమాత్మమయమే

అయినా దానిని తెల్సుకోలేకపోవడమే అవిద్య.

పరమాత్మజ్ఞానం, పరమాత్మ అనుభవం లేకపోవడమే అవిద్య. ఆ అవిద్యను సూర్య భగవానుడు సంపూర్ణంగా తొలగిస్తాడు. కనుక ఆదిత్యహృదయం చదివేటప్పుడు ఈ భావంతో చదివితే తప్పకుండా మన అవిద్యను ఆయన నశింపచేసి శాంతిని కూడా ప్రసాదిస్తాడు. అవిద్య నశిస్తేనే శాంతి కలుగుతుంది.

**నాన్యః పంథా విద్యతే అయనాయ** – ఆ పరమాత్మకి సంబంధించిన విద్య ఉంటేనే శాంతి. పరమాత్మ తప్ప ఇంక ఏమితెల్సుకున్నా అది అశాంతే. కనుకనే శాంతికి మార్గం 'సశాంతి మధిగచ్ఛతి' ఉపనిషత్తు ఈ మాట చెబుతున్నది. భగవద్గీత ఈ మాటే చెబుతున్నది

**భోక్తారం యజ్ఞతపసా సర్వలోకమహేశ్వరమ్।**

**సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥**

సర్వభూత హృదయాంతర్వర్తియైన నన్ను ఎవరు తెలుసుకుంటున్నారో వారు మాత్రమే శాంతిని పొందుతారు. శాంతినే సంస్కృతంలో 'శం' అంటారు.

**శంభుః**



తిమిరోన్మథనం జరిగాక మనకి 'శం' కలుగుతుంది. 'శం' అనగా శాంతి, సుఖం, శుభం అని అర్థం. ఆ శుభాన్ని కలిగిస్తున్నాడు కనుక శంభుః. భౌతికదృష్టి ఉన్నవారికి లౌకికంగా మంచి జరిగితే శుభం. అంతేకాని దీనిని మించిన సుఖం ఒకటి ఉంది అంటే వారికి అర్థంకాదు. మనకి శుభం అని అంటే లౌకికంగా వివాహాలు ఇత్యాదులు. మనం రమణమహర్షిలాంటి బ్రహ్మజ్ఞానుల దగ్గరికి వెళ్ళి స్వామి శుభం అంటే ఏమిటి అని అడిగితే ఆయన 'నిన్ను నువ్వు తెల్సుకోవడం 'అదే శుభం' అంటారు.

అది మనకి అర్థం అవ్వక ఆయనకి ఒక నమస్కారం పెట్టి వచ్చేస్తాం. ప్రపంచాన్ని తెల్సుకోవడానికి పుస్తకం కొనుక్కుంటాం. 'నిన్ను నువ్వు తెలుసుకో' అంటే ఏం చెయ్యాలి. అసలు శుభం అనే మాటకు మనస్థాయిలో అర్థం వేరు, మహాత్ముల స్థాయిలో అర్థం వేరు. ఎవరిస్థాయిలో వారికి శుభం అనే మాటకు నిర్వచనం ఉంటుంది.

వ్యాపారం చేసుకొనే వారి దృష్టిలో శుభం అంటే వ్యాపార అభివృద్ధి. చిన్నపిల్లవాడి దృష్టిలో పరమార్థం అంటే చాక్లెట్లే. మనం చిన్నపిల్లవాడు అన్నాడని వేళాకోళంగా అనుకుంటాం.

మన దృష్టిలో వాడు చిన్నపిల్లవాడు అయితే, మనం జ్ఞానులదృష్టిలో చిన్నపిల్లలమే.

మనం ఆశించే లౌకిక శుభాలని జ్ఞానులు ఆ దృష్టితోనే చూస్తారు. అయితే పరమాత్మ

తండ్రిలాంటివాడు. ఏ శుభమైనా శుభాలు ఇచ్చేవాడు ఆయనే. అసలైన శుభం అయిన 'శుభం, శివం'. శాశ్వతగ్ం శివమచ్యుతం – ఆ శివమైన త్రిగుణాతీతస్థితి అయిన 'శం' శుభాన్ని, శాంతిని ఇచ్చేవాడూ ఆయనే కాబట్టి శంభుడు.

అంతేకాదు సూర్యుడు ఉదయిస్తూనే సర్వజగత్తుకి శుభాన్ని కలిగిస్తున్నాడు. తనకిరణాలతో చీకట్లను తొలగించడమే కాకుండా మనకి క్షేమాన్ని కలిగిస్తున్నాడు.

అందుకే ఆయనకి వేదంలో 'సుమంగళః' అని పేరు కూడా ఉన్నది.

ఇది రుద్రమంత్రంలో **'అసౌ యస్తామ్రో అరుణ ఉతబభ్రుస్సుమంగళః'** అని చెప్ప బడుతున్నది.

**సుమంగళః** –సు అనే శబ్దమే మంగళాన్ని సూచిస్తోంది. మరి సుమంగళ అని చెప్పడం లో దాని గొప్పతనాన్ని మరింత చెప్పడం. సూర్యుని భార్య ఉషాదేవి పేరు సుమంగళి. ఋగ్వేదంలో ఉషాదేవికి సంబంధించిన ఉషస్సూక్తం ఉన్నది.

ఆ ఉషస్సూక్తాన్ని పరిశీలిస్తే ఉషఃకాలానికి ఉన్న శక్తులను చూసి ఆశ్చర్యం కలుగు తుంది. ఆ శక్తులను కూడా మన ఋషులు దర్శించారు.

దీనిని బట్టి మన భారతీయ ఋషులు సూర్యుని సర్వకాలసర్వావస్థలలో ఎంత పరిశీలించారో తెలుస్తుంది. ఏకాగ్రంగా సూర్యుని పరిశీలిస్తే అదే ఉపాసన. అదే సిద్ధి. అంత పరిశీలించారు కనుకే సూర్యుడు దయతో తన రహస్యాలన్నీ వారి బుద్ధికి తెలిసేలా చేసాడు. ఆ ఋషులు దయతో మనకోసం ఆ రహస్యాలని మంత్రాలలో పెట్టారు. మనకి భాగ్యం ఉంటే అవి అర్థం అవుతాయి.



ఉషస్సూక్తంలో **'ఇదం శ్రేష్ఠః జ్యోతిషార్జ్యోతిరాగాచ్చిత్రః'** –సూర్యభగవానుడికి జ్యోతి ఎప్పుడూ ఉంది. ఉన్న జ్యోతులన్నిటికి **'ఇదం శ్రేష్ఠః'**– ఈ ఉషఃకాంతి శ్రేష్ఠమైనది. ఈ సమయంలో చేసే సాధనలే గొప్పవి. **'యథాప్రసూతా సవితుస్సవాయ'.**

సవనము అనగా యజ్ఞం. అంటే సత్కార్యం, లోకకార్యం. అలాంటి సత్కార్యాలను సృష్టించడానికి ఈ ఉషఃకాంతి చాలా శ్రేష్ఠం అన్నారు. యజ్ఞాదులకు ఈ కాంతి చాలా శ్రేష్ఠం. యజ్ఞం అనగా ధ్యానము, తపస్సు, జపము, ఆరాధన, సాధన ఇవన్నీ కూడా యజ్ఞములే. వాటికి ఈ ఉషఃకాల కాంతి చాలా శ్రేష్ఠం.

**'సుమంగలీ బిభ్రతీ దేవవీతి'** సుమంగళి అయిన ఆ తల్లిని కీర్తించారు. ఉషఃకాంతినే **'యచ్చిత్రమప్న ఉషసో వహంతి జానాయచేషమానాయభద్రం'** – ఇక్కడ భద్రమనే శబ్దం, పైన సుమంగళీ, శంభు నామాలు కలుపుకోవాలి.

ఆయన ఉదయించిన దగ్గర్నించి లోకానికి శుభాన్ని, శాంతిని, సుఖాన్ని దేని స్థాయిలో దాన్ని కలిగిస్తున్నాడు.

సృష్టిలో మనందరికే కాకుండ చెట్లు, చేమలు, పక్షులు, జంతువులు అన్నీ కూడా ఆయనని చూస్తూ పులకించి, పరవశిస్తూ ఉంటాయి. వికసిస్తాయి. సూర్యుని వల్ల స్పందిస్తున్న ప్రపంచాన్ని దర్శిస్తే ఇది అవగతమౌతుంది. వాటి స్థాయిలో అవి స్పందించి నపుడు బుద్ధిజీవులమైన మనం సూర్యుని పట్ల కృతజ్ఞత, ప్రేమ, భక్తిరూపంతో స్పందించాలి.

సూర్యుని వలన ఈ ప్రకృతి అంతా ఎలా శుభాన్ని పొందుతున్నదో తెలిస్తే కృతజ్ఞత అనే ధర్మంతో మనం ఆయనను తలంచుకొన్నా మన హృదయం కరిగి రెండు చేతులు ఎత్తి నమస్కరించాలి. ఆయన వల్లనే ఈ శుభాలు అన్నీ కలుగుతున్నాయి అనే తెలివి మనకు వస్తే చాలు, గుర్తిస్తే చాలు, నమస్కరించకుండా ఊరుకోలేం.

అందుకే ఋషులు ఆయనకి నమస్కారాలు పరంపరగా ఇచ్చారు కనుకనే **'నమస్కార ప్రియః సూర్యః'.** మనకి అన్నీ ఇచ్చే ఆ సూర్యభగవానునికి మనం ఏమి ఇవ్వగలం. ఒక్క నమస్కారం చేస్తే సంతోషిస్తాడు. శంభుడైన ఆ స్వామియే త్వష్ట.



**త్వష్టా**

దేవతలలో ఒకదేవతా విశేషానికి త్వష్ట అని పేరు ఉన్నది. ప్రజాపతులలో ఒక త్వష్ట ప్రజాపతి. దేవతలనగా సూర్యుని కిరణశక్తులు. అలా ఇక్కడ 'త్వష్ట' అనేది సూర్యునికి పేరుగానే చెబుతున్నారు.

**'తనూ కరోతి ఇతి త్వష్టా'** అని అర్థం చెప్పారు. రూపకారకుడు, తనువుని కలిగించే వాడు. తనువు అనగా రూపం. ఒక రూపాన్ని ఇచ్చేవాడు ఆయన.

**'త్వష్టా రూపాని పిగ్ం శత్'** అని వేదం చెబుతున్నది.

అలాగే **'త్వష్టా రూపాణాం ప్రభుః'** అని ఋగ్వేదం చెబుతున్నది. సూర్యుడు రూపాలకి ప్రభువు అనగా రూపకర్త.

**'త్వష్టా రూపానాం కర్తా'** అని నిర్వచనం చెప్పారు. రూపం అనగా ఒక ఆకృతి. సృష్టిలో ప్రతిదానికి నిర్దిష్టమైన ఆకృతి ఉంటుంది. మనిషికి ఒక ఆకృతి, చెట్టుకి ఒక ఆకృతి, రాయికి ఒక ఆకృతి. మళ్ళీ వీటిలో భిన్న భిన్న ఆకారాలు ఉన్నాయి. సృష్టిలో ప్రతిదాని ఆకారం బట్టి మనం దానిని పోల్చుకోగలుగు తున్నాం. కాని దానికి ఆకారం మనం తయారుచేసామా? ఈ ఆకారం తయారుచేసిన వాడు ఎవరు?

అది కూడా ఈ సౌరశక్తి విశేషం ద్వారానే ఏర్పడినది.

సూర్యమండలాంతర్వర్తియైన పరమాత్మయే జగత్తులో ప్రతిదానికి రూపాన్ని నిర్దేశించినవాడు.

**అఖిలరూపులు తన రూపులైనవాడు**
**ఆదిమధ్యాంతములు లేక అడరువాడు**
**భక్తజనముల దీనులపాలివాడు**
**వినడె చూడడె తలపడే వేగరాడె**

అని గజేంద్రుడు కీర్తించాడు. అఖిలరూపులు తనరూపమైన వాడు.

**'రూపం రూపం ప్రతిరూపం బభూవ'** – ఉపనిషత్తుల్లో మంత్రం. అనేక రూపాలుగా అయినవాడు ఆయనే. కనుక రూపకర్త. సృష్టిలో ప్రతిదాని రూపం ఆయన నిర్దేశిస్తాడు. ఆ రూపగతమై చైతన్యంగా ఆయనే అందులో ప్రవేశించి ఉన్నాడు. ఇలా పరిశీలించి నట్లయితే సూర్యకిరణాలు ప్రతిదానికీ రూపాన్ని ఇస్తాయి. సూర్యకిరణాలవల్లనే జగత్తులో రూపాన్ని తెల్సుకోగలుగుతున్నాం. జగత్తులో రూపం ఉండడం, ఆ రూపాన్ని తెలుసుకో గలగడం రెండూ ఆయన వల్లనే జరుగుతున్నాయి.



అలాగే సృష్టిలో ప్రతిదానికి రూపం పరమేశ్వరుడు సౌరశక్తి ద్వారానే ఇస్తున్నాడు అనేది మన విజ్ఞానం కనుక సూర్యునికే త్వష్ట అని పేరు ఉన్నది. మలచడం, తొలచడం ఈ రెండు చేసేవాడిని త్వష్ట అని అంటారు. అనగా వడ్రంగి పని. సూర్యుడు వడ్రంగివాడా? అన్నీ ఆయనే. మనం లోకంలో ఒక్కొక్కరివద్ద ఒక్కోరకమైన నైపుణ్యం చూస్తూ ఉంటాం. ఇవన్నీ కూడా మనందరికీ తండ్రియైన సూర్యభగవానుని నుంచి వచ్చినవి.

తండ్రిగారి నైపుణ్యమే వారసత్వంగా మనకి వస్తుంది. లోకంలో సాధారణంగా మన పూర్వీకుల నైపుణ్యం మనకి వస్తుంది. మనందరికి నిజమైన పితృమూర్తి సూర్యభగవానుడు. ఆయన తేజస్సుతోనే మనమందరం జీవిస్తూ ఉన్నాం కనుక ఆయన నైపుణ్యమే మనకి వస్తుంది.

ఏ జీవుడు ఏ నైపుణ్యానికి యోగ్యుడో వారి పూర్వకర్మవిశేషాన్ని బట్టి వాడికి ఆ నైపుణ్యాన్ని ఆయన ఇస్తాడు. ఈ రహస్యం మనకి రుద్రనమక మంత్రాల్లో కనపడుతుంది. ఒక్కొక్కడి నైపుణ్యాన్ని భగవంతుడి స్వరూపంగా ఉపాసించడం, పూజించడం కనపడుతుంది.

**'నమఃకులాలేభ్యః కర్మారేభ్యశ్చవో నమః**
**నమః పుంజిష్టేభ్యో నిషాదేభ్యశ్చవో నమః'**

కుమ్మరి రూపంలో ఉన్నవానికి నమస్కారం, కమ్మరి రూపంలో ఉన్నవానికి నమస్కారం. వేటగాళ్ళ రూపంలో ఉన్నవానికి నమస్కారం. వాణిజ్యవేత్తల రూపంలో ఉన్నవానికి నమస్కారం. వ్యవసాయదారుని రూపంలో ఉన్నవానికి నమస్కారం అని కనపడుతుంది. శివుని నమస్కరించమంటే వీళ్ళందరికి నమస్కరిస్తున్నారు అంటే అర్థం, ఆ పరమేశ్వర తేజస్సే వారిలో ఆ నైపుణ్యముగా ఉన్నది.

సృష్టిలో ఎవరు గొప్పవారు అంటే ఎవరి అవసరం వచ్చినపుడు వారే గొప్పవారు. మన అవసరం తీర్చగలిగే గొప్పతనం సృష్టిలో వాడికి ఇచ్చాడు. ఇలా సర్వజీవులలో ఒక్కొక్కరిలో ఒక్కొక్క నైపుణ్యాన్ని పెట్టినవాడు ఎవరో ఆలోచించాలి. ఈ నైపుణ్యాలు అన్నీ ఆయన పెట్టినవే.

ఒక మహామేధావి మేధాశక్తి ఆయనే. ఒక శిల్పిలో శిల్పకళాశక్తి ఆయనే.

అక్కడ ఆ శిల్పి ఏం చేసాడు? తొలచాడు, మలచాడు.



ఒక చెట్టులో తొర్ర అంతవరకూ పైకి పాకిన కాండం ప్రక్కలకి తిరిగి కొమ్మలుగా మారడం, దానికి ఒక చిన్న రెమ్మ, మళ్ళీ ఆకులు, పూవులు, ఫలమై ఇలా చూస్తూ ఉంటే ఆశ్చర్యకరమైన ఈ శక్తి పరివర్తన లోకంలో మనకి కనబడుతోంది. ఇంత అద్భుతమైన కర్మ చేస్తున్న ఆ పరమేశ్వరుడు సూర్యభగవానుడు త్వష్టగా రూపాన్ని కలిగించేవాడు, మలచువాడు.

**అంశుమాన్**

కిరణాలు కలవాడు. ఈ నామాలకి నిఘంటువు అర్థాలు చూస్తే అగస్త్యుడు చెప్పిందే చెప్పాడు అనిపిస్తుంది. ముందు నామాలలో 'రశ్మిమాన్' అని తరువాత 'మరీచిమాన్' ఇపుడు 'అంశుమాన్' అంటున్నారు. తరువాత 'గభస్తిమాన్' అని వస్తుంది. వీటన్నిటికి కిరణాలు కలవాడు అనే అర్థం. మరి ఒకటే పదాన్ని అన్నిచోట్ల వినియోగించాడా అంటే జాగ్రత్తగా పరిశీలించాలి.

కిరణాలకి 'అంశువులు' అనే పేరు వచ్చింది. లోపల, బయట కూడా వ్యాపించే లక్షణాలు కలవాటిని 'అంశువులు' అంటారు. అన్ని కిరణాలను అలా అనడానికి లేదు. కొన్ని కిరణాలు చంపేస్తాయి. వేసవికాలంలో మిట్టమధ్యాహ్నం ఉండే కిరణాలకు మరీచిమాన్ అని పేరు.

'అంశుమాన్' లోపలా, బయటా కూడా వ్యాపిస్తాయి సూర్యకిరణాలు. భూగర్భంలోకి కొన్ని సూర్యకిరణాలు ప్రవేశించి అక్కడ వివిధస్థాయిలలో ధాతునిర్మాణం, (తైల) ఇంధనముల నిర్మాణం జరుగుతుంది. అక్కడ ఏఏ కిరణాలు ఏఏ నిర్మాణం చేస్తున్నాయో వివరిస్తున్నాడు. ఇలా లోపల, బయట చేరి వ్యాపించిపోయి చైతన్యాన్ని కలిగిస్తున్నవాడు అని అంశుమాన్ అనే మాటకి అర్థం.

ఇదే పరమేశ్వరపరంగా **'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః'** – లోపల బయట అంతా వ్యాపించే నారాయణుడు. సౌరశక్తిపరంగా అందరికీ అనుభవంలో ఉన్న ఒక అర్థం. పరమేశ్వర పరంగా ఉపాసించవలసిన అర్థం. అంతేకాదు ఈ అంశువులు స్థూలదృష్టితో చూస్తే ముద్దలా ఉంటాయిగాని అనేకరకాలుగా చూస్తే ఒక్కొక్క దానికి ఒక్కొక్క ప్రత్యేకత ఉంటుంది. ఏ అంశువుని ఏలా గ్రహించాలి అనే విజ్ఞానం ఉపాసనా పరంగా, విజ్ఞానశాస్త్రపరంగా ఉన్నది.

సూర్యగమనం గురించి వేదంలో 'తరణిః' అనే మాట ఉన్నది. తరణి అంటే సూర్యుడు. వేగంగా దాటేవాడు, వేగంగా దాటించేవాడు. మనల్ని కష్టాలనుంచి దాటిస్తాడు. సంసారబంధం నుంచి కూడా దాటించి మోక్షమిస్తాడు కనుక 'తరణి' అయ్యాడు.



ఆయన కూడా చకచకా దాటేస్తూ ఉంటాడు. ఆయన అలా దాటుతూ ఉంటేనే వేగంగా ఉండటం వల్ల రోజులు దాటుతాయి, సంవత్సరాలు దాటుతాయి, యుగాలు దాటుతాయి, కల్పాలు దాటుతాయి. ఆయన దాటకపోతే ఏదీ దాటదు. అయితే ఈ మాట చెబితే సూర్యుడు కదలడం లేదు. భూమి కదులుతోందిగాని, 'మనవాళ్ళు అజ్ఞానంతో సూర్యుడు కదులుతున్నాడంటున్నా'రని, అంటారు.

సూర్యుడు ఉదయించడు, అస్తమించడు అనే మాట వేదంలోంచే మనం చెప్పుకున్నాం. కనుక సూర్యుడు కదలడని మనవాళ్ళకి తెలుసు. కానీ కదిలినట్టు కనిపిస్తున్నాడా? లేదా? మన అనుభవంతో సూర్యుడు ఉదయించాడు అంటాం. ఎంత విజ్ఞానశాస్త్రవేత్త అయినా సూర్యుడు ఉదయించాడు, అస్తమించాడు అనే అంటాడు. మనం ప్రత్యక్షంగా ఉన్న అనుభవాన్ని వ్యవహారంలో వాడుతున్నాం. కనుక కొన్ని చోట్ల వ్యవహారంగా శాస్త్రం చెప్పినంత మాత్రాన అది శాస్త్రదృష్టికాదు అనడానికి లేదు. అది వ్యవహారదృష్టే అని తీసుకోవాలి.

శాస్త్రదృష్టి సంపూర్ణంగా ఉంది అనడానికి– సూర్యుడు గమనం చేస్తున్నాడు అంటే 'సూర్యకాంతి గమనం' చేస్తోంది అని అర్థం. కాంతి గమనం అనగా ప్రసరణ. సాపేక్షంగా

చూసినట్లయితే మనం ఉన్న భూమికి సూర్యోదయం నుంచి సూర్యుడు కాంతివేగం గురించి వేదంలో చెప్పినదానికి సాయనాచార్యులవారు స్పష్టంగా భాష్యం వ్రాస్తూ పురాణాంతర్గతమైన ఆ శ్లోకాన్ని మనకి ఉటంకించారు.

**యోజనానాం సహస్రే ద్వే ద్వే శతే ద్వే చ యోజనే।**
**ఏకేన నిమిషార్ధేన క్రమమాణ నమోస్తుతే॥**

అని భవిష్యోత్తరపురాణంలోని శ్లోకం. దీనిని వేదంలో ఒక మంత్రానికి వ్యాఖ్యానం రాస్తూ సాయనాచార్యులు ఉటంకించారు. సూర్యభగవానుడు ఏకేన నిమిషార్ధేన -నిమేషం అంటే కనురెప్పపాటు కాలం.

తృటి, లవ, కాష్ఠ అనే చాలా సూక్ష్మమైన కాలగణన నుంచి అతిస్థూలమైన కల్పాల గణన వరకు కాలాన్ని విభజించి చెప్పిన ఏకైకజాతి భారతజాతి. ప్రాచీనకాలంలోనే సమయాన్ని ఇంత చక్కగా గణన చేసి చెప్పింది.

ఇదే భావాన్ని సాంబుడు చేసిన సూర్యస్తుతిలో-

**నిమిషార్ధేనైకేన ద్వే చ శతే ద్వే సహస్రే ద్వే**
**క్రమమాణ! యోజనానాం నమోఽస్తుతే నళిననాథాయ**



అంటే నిమేషంలో సగభాగంలో 2,202 యోజనాలని ఆ సూర్యభగవానుని కాంతి దాటుతుంది. యోజనం అనగా వరాహమిహిరుడి బృహత్ పరాశరసంహిత గ్రంథం ప్రకారం సుమారు 9 1/2 మైళ్ళ నుంచి 10 మైళ్ళ విస్తీర్ణం అని చెప్పారు. ఈ లెక్క ప్రకారం చూస్తే కొన్ని ఏళ్ళక్రితం కాంతివేగం గురించి విజ్ఞాన శాస్త్రవేత్తలు చెప్పింది మన వేదం చెప్పిన దానికి ఖచ్చితంగా సరిపోయింది. ఈ రికార్డు కూడా ఉంది.

ఇది సరిపోయిందంటే ఆనాటి ఋషులు ఏ యంత్రపరికరంతో చూసారు. సూర్యుని తెలుసుకోవడానికి వాళ్ళకి ఉన్న స్కోప్ ఏంటో మనకి అర్థం కాదు.

తపస్సు చేసిన వాడికే జ్ఞానం. లేనివాడికి లేదు. చదివితే కొన్ని తెలుస్తాయి. పెద్దవారితో మసలితే కొన్ని తెలుస్తాయి. వారి సాయంతో సాధన చేస్తే అన్నీ తెలుసుకోగలం. భూమి గోళాకృతిలో ఉంది అని మొట్టమొదట చెప్పిన దేశం భారతదేశం. ఇది చెప్పినవాడు ఆర్యభట్టు అనే జ్యోతిషశాస్త్రవేత్త. తన జ్యోతిర్విజ్ఞానానికి మూలంగా వేదాన్నే ప్రధానంగా తీసుకున్నారు.

భాస్కరభట్టు అనే జ్యోతిషశాస్త్రవేత్త సూర్యునికి సంబంధించిన అనేక పరిశోధనలు చేసాడు. ఆయన అనేక గ్రంథాలు రచించారు. కొన్ని శాస్త్రగ్రంథాలు పోయాయి, కొన్ని

తగలబెట్టారు, కొన్ని నశింపచేసారు. మనం పోగొట్టుకొన్నవి చాలా ఎక్కువ. కాని ఆ శాస్త్రాల పేర్లు మాత్రం కొన్ని గ్రంథాల యందు కనపడుతున్నాయి.

పురాణాలలో సోమకాసురుడు వేదాలను ఎత్తుకుపోయాడు అని చెప్పినట్టుగా సోమకాసురుడు లాంటి పరాయివాళ్ళ దాడిలో మన విద్యలు ఎన్నో ఎత్తుకుపోబడ్డాయి, ఎన్నో నశింపచేయబడ్డాయి.

కనుక ఇప్పుడు అభివృద్ధి చెందిన విజ్ఞానం వేదం యందు చెప్పబడినది. దానితో మనం పరిశీలించి పరిశోధించి ఇంకా తెలుసుకొనే ప్రయత్నం చేయాలి. ఈ భాస్కరభట్టు రచించిన 'అంశుబోధిని' అనే గ్రంథంలో అంశువులకు సంబంధించిన విజ్ఞానాన్ని ఇచ్చారు. ఇందులో అంతా కిరణాల గురించిన విజ్ఞానం చెప్పారు.

బృహద్విమానశాస్త్రంలో వివిధరకాలైన విమానరహస్యాలని అందించారు. కొంతమంది ఇది ఒట్టి కల్పన అని కొట్టిపారేసారు. కాని దానికి సంబంధించిన విమానాల వివరాలను ఇప్పటి వాటితో డీకోడ్ చేసి సరిగ్గా తెల్సుకోగలిగితే అనేక విమానాల రహస్యాలు తెలుస్తాయి అని ఈ మధ్య పరిశోధనలో తేలిన విషయం.

ఒక ప్రాచీనశాస్త్రవేత్త గురించి ఆ మధ్యకాలంలో సమాచారం ప్రకారంగా వాళ్ళు నిత్యం పరిశీలన చేసే గ్రంథాలయాల్లో భోజమహారాజు రచించిన 'సమరాంగణ సూత్రధార' అనే గ్రంథం ఉందన్న విషయం బయటపడింది.



మరొక రహస్యం, ఇందిరాగాంధి ప్రధానిగా ఉన్న రోజుల్లో జర్మనీదేశానికి రాయబారిగా వెళ్ళిన మన భారతీయునికి అక్కడ ప్రభుత్వానికి సంబంధించిన ఒక మ్యూజియంని చూపించారు. ఆ మ్యూజియంలో చక్కని వైదిక వేషధారణలో ఉన్న భారతీయుని చిత్రపటం కనబడింది. జర్మనీలో ఉన్న మ్యూజియంలో భారతీయుడి చిత్రపటం ఎలా పెట్టుకున్నారా అని ఆయన ఒక్క క్షణం ఆశ్చర్యపోయి– కూడా ఉన్న జర్మనులని ఈయన ఎవరు? ఈ చిత్రపటం ఇక్కడ ఎందుకు ఉంది? అని అడిగితే– హిట్లరు తీవ్రమైన మారణాయుధాల నిర్మాణం కోసం ప్రయత్నించి భారతదేశంనుంచి అతిగుప్తంగా, అతిరహస్యంగా తీసుకు వచ్చిన వేదపండితులలో ఈయన ఒకరు అని చెప్పారు.

యజుర్వేదానికి సంబంధించిన ధనుర్వేదంలో ఆయన నిష్ణాతుడు.

ఆయన పేరు దండిభట్ల విశ్వనాథశాస్త్రి. ఈయన ఆంధ్రప్రదేశ్ తూర్పుగోదావరిజిల్లాలోని రాజమండ్రికి చెందినవారు. వీటన్నిటికి ఆధారాలు ఉన్నాయి. దీనిని బట్టి మన వాళ్ళు చెప్పిన వేదాలలోని విషయాలు సత్యదూరములు కావు.

భాస్కరభట్టు 'సౌదామినీకళ' అనే పుస్తకంలో విద్యుచ్ఛక్తిని ఎన్ని రకాలుగా పొందవచ్చో వ్రాసారు. అప్పటి పదజాలాన్ని మనం అర్థం చేసుకోగలిగితే చాలా ఉపయోగపడతాయి. ఆయన ఆ గ్రంథంలో కొన్ని విద్యుత్తుల గురించి చెప్పారు. వారుణీవిద్యుత్ అనగా జలాన్ని ఆధారంగా చేసుకొనే హైడ్రోఎలక్ట్రిసిటి, దండావిద్యుత్, మహావిద్యుత్, రావిణీ విద్యుత్ అని నాలుగురకాల విద్యుత్తుల గురించి వర్ణించారు. అంశుమాన్ అనే నామానికి సంబంధమైన విషయాల అవగాహన కోసం ఇది చెప్పబడింది.

**మార్తాండః**

మార్తాండ అని సూర్యుని పేరు. 'మార్తాండభైరవారాధ్యా' అని లలితాసహస్రంలో వస్తుంది. ఈ మార్తాండ అని పేరు ఎందుకు వచ్చింది అనే దాని గురించి చాలా మీమాంస అటు వేదాలలోను, పురాణాలలోను కనిపిస్తోంది. వేదంలో దీనికి రెండురకాల అర్థం చెప్పారు. రెండు కూడా వైజ్ఞానికంగా చాలా చక్కగా సరిపోతాయి.

'మృతమైన దానిని జీవింపచేసేవాడు మార్తాండుడు'. అసలు మృతమైన దానిని ఎవరూ తిరిగి జీవింపచేయలేరు. మృతమైన దాని నుంచి తిరిగి పుట్టించడం, మృతమైన దానిని జీవింపచేయడం చేయగలవాడు మార్తాండుడు అని రెండు అర్థాలు చెప్పుకోవచ్చు.



మృతమైనది అనగా అచేతనము. అచేతనమైన దానికి కూడ చేతనత్వం కలిగించేవాడు మార్తాండుడు.

మయూరుడు సూర్యశతకంలో... రాత్రి అనే పాము చీకటి అనే విషాన్ని కక్కగానే మనుషులందరూ చచ్చినట్టు పడుకున్నారు. మళ్ళీ నువ్వొచ్చి నీ కిరణాలనే అమృతం వేయగానే చచ్చినవాళ్ళందరూ లేచి బ్రతికారు అంటాడు. ఇది చమత్కారంలా కనిపించినప్పటికీ నిజం. సహజంగా రాత్రి సృష్టి అంతా అచేతనమై ఉదయాన్నే చేతనత్వం పొందుతుంది. అచేతన జగత్తుకి చేతనత్వం కలిగించేవాడు అనే అనుభవం మనకు తెలుస్తున్నది.

ఈశ్వరపరంగా అయితే సర్వజగత్తుని లయావస్థలో లోపలకి లాగి మళ్ళీ కల్పారంభంలో బయటికి ప్రకటించేవాడు. ఇది వరకు ఏవి ఉన్నాయో అవి ఉన్నవి ఉన్నట్టు బయటికి వచ్చాయి. ఎలా వచ్చాయంటే 'సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్' అని వేదం చెబుతోంది.

సూర్య చంద్రాదులందరిని ఇదివరకటి కల్పములవలే మళ్ళీ బయటకి లాగాడు. ఇది వరకు కల్పాలలో పంచభూతాలు, సూర్యుడు, చంద్రుడు వేరు, తరువాత కల్పాలలో

వేరా! అవే మళ్ళీ బయటకు తెచ్చాడు. మొత్తం మృతం చేసి మళ్ళీ దాని నుంచి తిరిగి జీవింపచేసాడు ఇదే మార్తాండ అనేదానికి పరమేశ్వరపరమైన అర్థం.

ఇంకో అర్థం చూస్తే మృతమైన అండం నుంచి పుట్టినవాడు మార్తాండుడు. అండము అనగా గ్రుడ్డు. వైజ్ఞానికంగా, పురాణప్రకారంగా చూసినా ఈ జగత్తు అంతా నిర్మాణంకాక ముందు అండరూపంలో ఉన్నది.

అండరూపం అంటే ఒక వృత్తాకారంలో ఒక కణంగా ఉన్నది. అది హిరణ్మాయాండం అని వర్ణించారు. హిరణ్మయాండం అనగా మహాతేజోమయమైన ప్రకాశవంతమైన అండం. అది ఉన్నట్టుండి ఒక్కసారి మహాచైతన్యముతో స్ఫోటనం జరిగింది. దానిని బిగ్బ్యాంగ్ థియరీ అని అంటారు. అది ఎప్పుడు జరిగిందో 'ఏకోహం బహుస్యాం' ఒక్కటిగా ఉన్నది అనేకం అయినది. ఇలా అనేకమైనపుడు ఈ అండమునకు ఏది కేంద్రశక్తి అయి ఉన్నదో అది తన నుంచి విడివడిన ప్రతిభాగాన్ని తన అధీనంలో ఉంచుకుంది.

కనుకనే విడివడినవి అన్నీ కూడా ఒక కేంద్రాన్ని ఆధారం చేసుకొని ఒక క్రమపద్ధతి లోనే ఉన్నాయి. అంతేకాని పగిలిన రాయి ముక్కలవలె ఎక్కడపడితే అక్కడ పడకుండా ఇవన్నీ కూడా కేంద్రశక్తితో సంబంధం పెట్టుకొని ఒక క్రమపద్ధతిలో నడుస్తున్నాయి. కనుక మృతమగుట అనగా పగిలిపోవుట. అలా పగిలిపోయిన అండం నుంచి దానికి ఆధారశక్తిగా ఉత్పన్నమై లోపల వీటన్నిటిని కాపాడుతున్నవాడెవడో ఆయనకి 'మార్తాండుడు' అని పేరు. దీనికి పురాణపరంగా ఒక అద్భుతమైన కథ ఉన్నది. దీనిని కూడా ప్రమాణంగా స్వీకరించవచ్చు.



ఒకప్పుడు అసురశక్తులు బాగా విజృంభించి దేవతల శక్తి బాగా క్షీణించింది. రామాయణంలో, భారతంలో, లలితోపాఖ్యానంలో ఇలాంటి కథలు ఉంటాయి. అనంతకాలంలో అప్పుడప్పుడు అసురశక్తులు లేస్తూ ఉంటాయి. అవి లేస్తే ప్రపంచానికి ప్రమాదం. అప్పుడు దైవశక్తిని రక్షించడంకోసం ఆ పరమాత్మ ఏదో రూపంతో వచ్చి సత్వగుణసంపన్నులు అయిన దేవతలను కాపాడుతూ, రజోగుణ, తమోగుణవికారాలతో కూడిన అసురులను అణచుతూ ఉంటాడు. ఇది ఎప్పుడూ యుగాలలో జరుగుతూనే ఉంటుంది.

ఆ జరిగిన కథలని మనం మననం చేసుకుంటూ ఉంటాం. అదే కావలసిన ప్రయోజనం. అసురశక్తుల నాశనమే మనకి కావాలి.

మనలోపల అసురప్రవృత్తులు, బయట ప్రపంచాన్ని బాధించే అసురులు ఈ రెండూ నశించాలి. దాని కోసం ఒక చక్కటి కథని చెబుతున్నారు. ఎప్పుడైతే దేవతలందరి శక్తి

క్షీణించిందో దేవతలతల్లి అయిన అదితీదేవి బాధపడి కశ్యపుని దేవతల క్షేమంకోసం ప్రార్థింపగా ఆయన సూర్యోపాసన చెయ్యమని చెప్పారు.

అదితీదేవి సూర్యోపాసన చేస్తున్నప్పుడు సూర్యభగవానుడు తనలోంచి ఒక కిరణమును అదితీదేవి గర్భములోకి ప్రవేశింపచేసాడు.

అది **తతోరశ్మి సహస్రాత్తు సౌషుమ్నాఖ్యే రవేః కరః** – సౌషుమ్నా నామకకిరణమును ఆవిడ గర్భంలోకి పంపించాడు. అది లోపల చేరి క్రమంగా ఉత్పత్తికి తగ్గట్టు పిండాకృతిగా మారడం మొదలైంది.

అయితే ఈమె సూర్యుడు నాకు బిడ్డగా జన్మించబోతున్నాడని తెల్సుకొని సంతోషించి సూర్యుడు నాలో ఉన్నాడు కనుక నేను దీక్షగా ఉంటాను అని ఉపవాసాదులు చెయ్యడం మొదలుపెట్టి కఠినమైన నియమాలను పాటిస్తూ, తపస్సుని అవలంబించింది. కశ్యపప్రజా పతికి కొంచెం బాధ కలిగి అదితీదేవితో, సంతానం నీ కడుపులో పెరుగుతున్నప్పుడు నువ్వు తపస్సు చేయడం తగదు.

**'కిం మారయసి గర్భాండం ఇతి నిత్యోపవాసిని'** – నిత్య ఉపవాసాలతో, తపస్సులతో నీ గర్భాండాన్ని మరణింపచేస్తావా అంటాడు. అప్పుడు అదితీదేవి నవ్వి **'గర్భాండమేతత్ పశ్యేతి కోపిన నసిమారితం విపక్షాణాం మృత్యేరేతద్భవిష్యతి'** – నా కడుపులో పెరిగే గర్భాండం ఇది చావదు శత్రువులను చంపుతుంది.



శత్రువులని చంపే పిండమే తప్ప తను చచ్చే పిండం కాదు. మీరు పుట్టేవాడిని మరణింపచేస్తావా అన్నారు కనుక ఆ శబ్దంలోంచే ఇప్పుడు పుట్టేవాడికి కూడా మార్తాండ నామం వస్తుంది అని అదితీదేవి అన్నది.

ఇలా మాట్లాడుతున్నప్పుడే గర్భంలోంచి శిశురూపంలో కాకుండా గర్భంలోంచి హఠాత్తుగా అండం అండంగా బయటకి వచ్చింది. కశ్యపునిది ఋషివాక్కు కాబట్టి ఆయన నోటి మాటకి బయటకి వచ్చింది. పూర్తి ఆకారం తీసుకోకుండానే ఈయన ఈ మాట అనడంతో బయటకి వచ్చింది. అయితే ఈ రూపంతో ఎందుకు వచ్చింది అని అదితీదేవి ఆశ్చర్యపోతూ ఉంటే సాక్షాత్తు పరమేశ్వరతేజం కాబట్టి ఆ అండం క్రమంగా దివ్యమంగళ విగ్రహంగా మారి వీరికి దర్శనమిచ్చింది. అతడే మార్తాండుడు.

ఈయనకు పట్టాభిషేకం మొదలైనవి మార్కండేయపురాణంలో చాలా అద్భుతంగా వివరించారు. ఇది మార్తాండ ఉత్పత్తికి సంబంధించిన వృత్తాంతం.

హిరణ్యగర్భః శిశిరస్తపనోఽహస్కరో రవిః
అగ్నిగర్భోఽదితేః పుత్రః శఙ్ఖః శిశిరనాశనః (12)

**హిరణ్యగర్భః**

ఇది కూడా చాలా ప్రధానమైన నామం. రహస్యనామాలలో రహస్యనామం. ఆదిత్య హృదయానికి మూలమంత్రం. హిరణ్యగర్భః ఈ మంత్రాన్ని చెయ్యగలిగిన సంఖ్య చేసి అధమపక్షం 12 మార్లు లేదా 108 సార్లు జపం చేసి ఆదిత్యహృదయం చదివి మళ్ళీ జపం చేస్తే చాలా విశేషమని చెప్పారు. ఈ మంత్రాన్ని చెయ్యవలసిన విధానం **'శ్రీభగవతే హిరణ్యగర్భాయ నమః'**. మార్తాండ నామానికి ఈ నామానికి అర్థం సమన్వయం చేసుకోవచ్చు.

ఈ జగత్తు అంతా హిరణ్మయాండంగా, తేజోమయమైన అండంగా ముందు ఉండేది. ఆ అండమునకు గర్భమునందు అనగా లోపలభాగంలో ప్రధాన తేజస్సుగా ఉన్నవాడు ఇతడే. హిరణ్మయాండమునకు తేజస్సుగా ఉన్నవాడు కనుక హిరణ్యగర్భః – గర్భ అంటే లోపలి భాగం – హిరణ్యమునకు లోపల ఉండువాడు ఇది ఒక అర్థం.

మరొక అర్థంలో హిరణ్యాన్ని తన లోపల ఉంచుకున్నవాడు. హిరణ్యగర్భ అనే అంశం విశ్వనిర్మాణ విజ్ఞానాన్ని చెబుతుంది.

హిరణ్యం అనగా తేజోమయం. అది పదార్థమయం కాదు తేజోమయం. తేజస్సు అనగా పూర్తి శక్తి. ఇది సంపూర్ణమైన శక్తి.

తేజోమయమైన ఒక మహా అండానికి లోపల ఆయన ఉన్నాడు. ఈ మహాతేజోమయమైన హిరణ్యాండమే సూర్యుడు. హిరణ్యమైన, 'కాంతిమయమైన మండలం' లోపల ఉన్నవాడు హిరణ్యగర్భుడు.

భౌతికంగా తేజోమయమైన సూర్యమండలం లోపల ఉన్న పరమపురుషుడు అని అర్థం. **'ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః'** అని శ్రుతివాక్యం. ఆయన కాలిగోరు మొదలుకొని తలమీద వెంట్రుకకొన వరకూ బంగారమే. ఆయన నిండా ఉన్నది బంగారమే, ఆయన ఉన్నది బంగారంలోనే.

బంగారం అంటే ఇక్కడ 'సువర్ణసదృశో' అని చెప్పినట్లుగా బంగారపుకాంతి.

బంగారం అనే మాటకు వేదంలో హిరణ్యం అని చెప్పబడుతున్నది.

**'హిరణ్యవర్ణాం హరిణీమ్'** అని శ్రీసూక్తం. బంగారురంగు అనగానే తేజస్సు, ఐశ్వర్యము, శోభ, కాంతి మొదలైనవి ప్రకటింపబడుతున్నాయి. సర్వజగత్తుకి మూలమైన కాంతి,

తేజస్సులకు కేంద్రముగా ఉన్నాడు. కేంద్రమే శక్తి స్థానం. సర్వతేజస్సులకి ఆయన కేంద్రం. అలాగే ఆయన లోపల తేజస్సు ఉన్నది. తేజస్సు లోపల ఆయన ఉన్నాడు.

ఇంకో అర్థం అసలు సృష్టికి పూర్వపుస్థితి హిరణ్మయాండం. అందులోంచి ఈ కేంద్రశక్తి ఒక్కసారి స్పందించగానే అది అంతా ఈ జగత్తుగా పరిణమించింది అని హిరణ్య గర్భసిద్ధాంతం. కనుక సృష్టి పూర్వపుస్థితే హిరణ్యగర్భ. అందుకే బ్రహ్మగారికి హిరణ్యగర్భ అని పేరు పెట్టారు. హిరణ్యగర్భనామంలో సృష్టికర్తృత్వజ్ఞానం కనబడుతుంది.

హిరణ్యగర్భ అనేది బ్రహ్మదేవుని మంత్రం. కొందరికి బ్రహ్మని పూజించవచ్చా అని అనుమానం. బ్రహ్మని పూజించకపోతే మోక్షం కూడా రాదు. బ్రహ్మవిష్ణుమహేశ్వరాత్మక మైన తేజస్సునే మనం పూజించాలి. సృష్టి కర్తే లేనప్పుడు స్థితి ఎక్కడ, లయ ఎక్కడ? కనుక ఇక్కడ హిరణ్యగర్భనామం బ్రహ్మదేవుని పట్ల కనిపిస్తుంది.

**'హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్'** – బ్రహ్మనామాలు, విష్ణు నామాలు, శివనామాలు అనీ ఉండవు. అన్నీ ఒకే పరమేశ్వరుడి నామాలు. వాటిని మనం వ్యవహారంలో ఒక్కొక్క దేవత దగ్గర చెబుతూ ఉంటాం. హిరణ్యగర్భ అనేది ఆ పరమాత్మకు సంబంధించిన నామం. సర్వజగత్తుకి మూలమైన తేజస్సుకి కేంద్రమైన వాడు. సర్వజగత్తుకి మూలమైన తేజస్సు తనలో ఉన్నవాడు అని హిరణ్యగర్భ అనే నామానికి అర్థం. తేజస్సు అనగా కాంతిమాత్రమే కాకుండా శక్తి అనే అర్థంలో కూడా చెప్పబడుతుంది.



తేజస్సు అంటే మరొక అర్థం బీజశక్తి.

మన శరీరాదులకు మూలమైన తేజస్సు ముందు రేతస్సు రూపంలో ఉండి తర్వాత శరీరనిర్మాణం జరుగుతుంది. పరమాత్మ తేజస్సుని హిరణ్యతేజస్సు అంటారు.

శివసహస్రనామంలో హిరణ్యరేతా నామం కనబడుతుంది. సృష్టికి కారణమైన బీజశక్తిని హిరణ్యం అంటారు. ఆ బీజశక్తి తనలో ఉంచుకున్నవాడు హిరణ్యగర్భుడు. సృష్టి ఏర్పడక ముందు తనలోపలే దాచుకున్నాడు. గర్భం అంటే లోపల దాచుకోనడం. గర్భధారణ అనే మాటే సృష్టికి ముందు స్థితిని తెలియజేస్తుంది.

ఈ తేజస్సుని తన లోపల దాచి తరువాత ఈ జగత్తులో ఆ తేజస్సుని ఆయన విస్తరింప చేసాడు. **హిరణ్యగర్భః అంటే సృష్టికారణమైన బీజశక్తిని తనలో ఉంచినవాడు.** సర్వశక్తుల బీజాలు ఆయన వద్దే ఉన్నాయి. ఆయనలోకే వెళ్ళాలి ఆయనలోనే లీనమై తిరిగి ఆయన లోంచే రావాలి. బీజశక్తికి ఆధారమై సర్వజగత్తుయొక్క బీజశక్తిని ధరించువాడు.

ఉపాసనాపరంగా చూస్తే మనం తరించి మనలో ఉన్న ఆత్మచైతన్యాన్ని గ్రహించాలంటే తేజమై ఉన్న మన శరీరానికి మూలమై ఉన్నవాడు.

**'ఈశ్వరః సర్వభూతేషు హృద్దేశే అర్జున తిష్ఠతి'** ఆయనే హిరణ్యగర్భుడు. మనలో ఆత్మగా ఉన్నవాడే హిరణ్యగర్భుడు. మనలో ఉన్న హిరణ్యగర్భుడు తెలియాలంటే బయట ఉన్న హిరణ్యగర్భుడిని ఉపాసించాలని ఛాందోగ్యోపనిషత్తులోని మంత్రం చెబుతోంది.

**'య ఏష అంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే'** – దీనిని అంతరాదిత్య ఉపాసన అంటారు. అంతర అనగా లోపలి భాగం. ఆదిత్యుని లోపలభాగాన్ని ఉపాసించాలి.

హిరణ్మయమండలంగా గోచరిస్తున్న మహాతేజస్సు లోపల ఉన్న పరమపురుషుని మనం ఉపాసించాలి. ఇదే ఆదిత్య 'హృదయం'.

ఆదిత్యమండలంలో సూర్యుని దర్శించే పద్ధతిని చెబుతూ– అక్కడ ఒక పరమ పురుషుడు ఉన్నాడు.

**'ఆప్రణఖాత్ సర్వఏవ సువర్ణః', 'హిరణ్యబాహుః', 'హిరణ్యశ్మశ్రుః', 'హిరణ్యకేశః'** –

బంగారు భుజాలు, బంగారు గెడ్డం, బంగారు కేశాలు మొత్తమంతా బంగారమే. ఆ బంగారంగా ఉన్న ఆయన్ని ధ్యానించాలి. సూర్యధ్యానంలో...

**ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసన సన్నివిష్టః**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటిహారీ**
**హిరణ్మయవపుఃధృతః శంఖచక్రః**

ఇది హిరణ్మయమునకు గర్భం. అలాంటి పరమపురుషుని ధ్యానించాలి. ఆ పురుషుడు

**'ధృతపద్మద్వయం భానుం తేజోమండల మధ్యగం**
**సర్వాధివ్యాధిశమనం ఛాయాశ్లిష్టతనుం భజే'**

అని ఆదిత్యోపాసనలో చెప్తారు. రెండుపద్మాలు పట్టుకొని ఉంటాడు. బంగారురంగులో మెరిసిపోతూ ఉంటాడు. అలాంటి రూపాన్ని ధ్యానించిన వారికి మానసిక, శారీరక రోగాలు పోతాయి. దృష్టిశక్తి అభివృద్ధి చెందుతుంది. తరువాత ఆ సూర్యమండలంలో ఏముందో అదే మన హృదయమనే తేజోమండలంలో ఉంది అనే ప్రజ్ఞ కలుగుతుంది. బయట ఉండేది బాహ్యాకాశం.

మనలో ఉండేది దహరాకాశం. అమ్మవారికి దహరాకాశ రూపిణి అని పేరు. దహరాకాశరూపంలో తేజస్సు, చైతన్యం పూర్తి హిరణ్మయమై ఉంది.

దానికి కేంద్రమైనవాడు హృదయస్థానంలో **'తస్యాః శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః'** బాహ్యంలో చేస్తే అంతరంలో తెల్సుకోగలం. బాహ్యంలో ఉన్నదాన్ని అంతరం లో అనుసంధానం చెయ్యడమే ఉపాసన. అపుడు అందరిలో ఉన్న పరమాత్మ చైతన్యాన్ని మనం దర్శించగలం. అందువల్ల అంతరాదిత్య ఉపాసన క్రమంగా ముక్తికి హేతువు అవుతుంది. 'అంతర' అనగా మండలం లోపల, హృదయంలోపల ఉన్న ఆదిత్యుని తెలుసుకోవాలి. ఆదిత్యుడు అనగా ఛేదింపబడనివాడు.

**'నమోహిరణ్యరూపాయ హిరణ్యవర్ణాయ హిరణ్యబాహవే**
**హిరణ్యపతయే అంబికాపతయ ఉమాపతయే పశుపతయే నమోనమః'**

హిరణ్యరూపుడు, హిరణ్యవర్ణుడు, హిరణ్యబాహుడు, హిరణ్యపతి, ఉమాపతి అయిన అంబికాపతిని వేదం చెప్పింది. ఆ హిరణ్మయపురుషునే 'భర్గః' అంది. అనగా తేజోమయుడు. 'భర్జతీతి ఇతి భర్గః' – సర్వ అజ్ఞానాన్ని భర్జింప చేసే తేజస్సు–అది. 'సవితుఃవరేణ్యం భర్గః' – ఆ సృష్టికర్త యొక్క శ్రేష్ఠమైన రూపాన్ని భర్గ అన్నారు.

ఆ భర్గుడైన వానిని ఉపాసిస్తే బుద్ధిని ప్రేరేపించే ఆత్మదీప్తి మనకి తెలుస్తుంది. గాయత్రీమంత్రం పరమార్థం ఆదిత్యమండలాంతర్వర్తియైన తేజస్వరూపాన్ని చెప్పడమే.



**'ఆదిత్య మండలస్థానా పరబ్రహ్మస్వరూపిణీ ఛందోమయీచ గాయత్రీ మాం రక్షతు సనాతనీ– గాయత్రీ బ్రహ్మవిద్యా'**

**'భానుమండలమధ్యస్థా భైరవీ భగమాలినీ'**

ఆవిడే భానుమండల మధ్యస్థ అయిన శక్తి. బంగారపు ధాతువులో లక్ష్మీస్వరూపం ఉన్నది. అసలు హిరణ్యం అనే పదానికి వేదప్రకారంగా 'హర్యతే ఇతి హిరణ్యం' – అనగా అందరూ కోరుకునే దాన్ని హిరణ్యం అంటారు. అందరూ కోరుకునే సచ్చిదా నందతత్త్వమే హిరణ్యం.

**'హితమ్ రమ్యమ్ హిరమ్యమ్ హిరమ్యమేవ' 'హిరణ్యం'.** ఈ శబ్దంలో రెండు మాటలు ఉన్నాయి హితము, రమ్యము. హితమూ, రమ్యమూ ఏదో అది హిరమ్యం. దీనికి వైదిక భాషల ప్రకారంగా 'హిరణ్యం' అన్నారు. హితము అనగా మనకు మేలును కలిగించేది. రమ్యము అనగా చూడడానికి బాగా కనిపించేది.

సాధారణంగా లోకంలో రమ్యమైనవి హితంగా ఉండవు, హితమైనవి రమ్యంగా ఉండవు. సృష్టి అంతా ఇదే తీరుగా ఉంటుంది.

మనం రమ్యాల వెంటపడి హితాలను పోగొట్టుకుంటున్నాం. హితం వెంటపడి రమ్యం

పోగొట్టుకున్నా ఫరవాలేదుగాని, రమ్యం వెంటపడి హితాలని పోగొట్టుకోరాదు. ఇలా సృష్టిలో హితం రమ్యంగా ఉండదు, రమ్యం హితంగా ఉండదు. కాని సూర్యభగవానుడు హితము, రమ్యము రెండూ ఆయనే.

హిరణ్యబాహవే అనగా అర్థం కరములు అంటే కిరణాలు. ఆ కిరణాలన్ని హిరణ్య బాహువులే. ఆ కిరణాలతోనే హితము, రమ్యము రెండు ఇస్తున్నాడు. ఆ చేతులను తలంచుకొంటే అన్నమయ్య చెప్పినట్టు 'ఇందరికి అభయమ్ములిచ్చు చేయి కందువగు మంచి బంగారు చేయి' - సర్వజగత్తుకి హితాన్ని, రమ్యాన్ని ఇచ్చే పరమాత్మ చేతులే సూర్యభగవానుడి కిరణాలు. మనకోసం ఆయన తన చేతులను చాచాడు. ఆ చేతులు చాచినవాడికి మనం రెండు చేతులు ఎత్తి నమస్కారం చెయ్యాలి. అప్పుడు ఆయన తన చేతులతో మనలని నిమిరి అనుగ్రహిస్తాడు.

హిరణ్యబాహువులో-హిత, రమ్య తత్త్వమే హిరణ్యమ్. హితానికి, రమ్యానికి మూలమైనవాడు ఇతడు. సృష్టిలో ఏది హితం, రమ్యం కలిగిస్తోందో దానిలో హితం కలిగించే లక్షణంగా, రమ్యం కలిగించే లక్షణంగా ఉన్నవాడు ఆయనే. ఆయన వాటిలో ఉన్నాడు. హితరమ్యాలు అన్నీ ఆయనలో ఉన్నాయి. హిరణ్యగర్భ అంటే ఇంత విశేషం ఉంది. ఈ మంత్రం చేసేవానికి ఎప్పుడూ హితం, రమ్యం కలుగుతాయి.



అందుకే 'శ్రీభగవతే హిరణ్యగర్భాయనమః' అని నమస్కరిస్తూ తరువాతి నామంలోకి ప్రవేశిద్దాం.

**శిశిరః**

కొన్ని గ్రంథాలలో **శిశిరః** అని కొన్నింటిలో త్రిశిరః అని పాఠాంతరం ఉంది. రెండూ తీసుకోవచ్చు. శిశిరః అనగా చల్లనివాడు.

అంత హిరణ్యగర్భుడి తేజస్సుని లోపల ఉంచుకొన్న మహానుభావుడు **శిశిరుడు** కూడా, అంటే చంద్రుని రూపంలో ఉన్నవాడు. చల్లని కారుణ్యం కలవాడు.

త్రిశిరః - మూడు శిరస్సులు ఉన్నవాడు అని చెప్పుకోవచ్చు. అగ్ని ప్రధానంగా గార్హపత్యాగ్ని, ఆవహనీయాగ్ని, దక్షిణాగ్ని అని మూడు విధాలుగా ఉంటుంది. ఆయన దినకారకుడుగా ప్రాతఃసంధ్య, మధ్యాహ్నసంధ్య, సాయం సంధ్య అని మూడు విధాలుగా ఉంటాడు.

హిరణ్యగర్భమైన స్వరూపం ప్రణవస్వరూపమే. ఆయన ఓంకారస్వరూపుడు. అ కార, ఉ కార, మ కార మూలనే త్రిశిరస్సులతో ఉన్నవాడు.

**తపనః**

శిశిరుడు ఆయనే, తపనుడు ఆయనే. తపనః – తపింపచేయువాడు. వేడెక్కించేవాడు. సూర్యుడు కేవలం వేడినే ఇస్తాడు అని అనడానికి లేదు. ఆయనలో చల్లదనం, వేడి రెండు ఉన్నాయి. సూర్యునిలో కొన్ని చల్లని విభాగాలు ఉంటాయని విజ్ఞానశాస్త్రం కూడా ఇప్పుడు చెబుతోంది.

సూర్యుని నుంచి వచ్చే ఏడు కిరణాలలో మూడు జలసంబంధమైన కిరణాలు. మూడు అగ్నిసంబంధమైన కిరణాలు. నీలిరంగులో ఉన్న కిరణాలు జల సంబంధమైనవి. ఎరుపురంగులో ఉన్న కిరణాలు అగ్ని సంబంధమైనవి. మధ్యలో ఆకుపచ్చ కిరణములలో అగ్ని, జల లక్షణాలు రెండూ సమంగా కలిగి ఉంటాయి.

ఆకుపచ్చరంగు కిరణాలు తేజోలక్షణం, జల లక్షణం రెండూ కలిగి ఉంటాయి. అగ్నిలక్షణమైన ప్రచోదనం కూడా కలిగి ఉంటాయి.

**అహస్కరః**

'తపనః భాస్కరః రవిః' అని చదువుతారు గాని పాఠాంతరాలు పరిశీలిస్తే సరియైనది 'తపనోఽహస్కరో రవిః'. దీనిని విడిగా చూస్తే తపనః అహస్కరః అని వస్తుంది. అహస్సు అనగా పగలు. 'అహస్సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః'–విష్ణుసహస్రం.



అజ్ఞానమనే చీకటిని పోగొట్టే జ్ఞానమే అహస్సు అని శంకర భగవత్పాదులవారు వ్యాఖ్యానం వ్రాసారు. జ్ఞానమే అహస్సు. పగలు, రాత్రి చూస్తున్నా చూడవలసిన దాన్ని చూడకపోతే అది రాత్రే అవుతుంది.

**'యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ'** అని గీతలో స్వామి చెప్పాడు. అందరికి ఏది రాత్రో యోగికి అది పగలు. యోగికి ఏది పగలో అది అందరికి రాత్రి అన్నారు. యోగి మేల్కొన్నచోట మనం నిద్రపోతాం. మనం నిద్రపోయేచోట ఆయన మేల్కొంటారు. పరమాత్మ విషయంలో మనకి అజ్ఞానం. యోగికి జ్ఞానం. కనుక పరమాత్మ జ్ఞానమే పగలు, ఆ జ్ఞానం కలిగించేవాడు కాబట్టి 'అహస్కరః' అన్నారు.

**రవిః**

**'రూయతే స్తూయతే ఇతి రవిః'** – రవి అనగా స్తుతింపబడువాడు, పొగడబడువాడు, పొగడదగినవాడు. సృష్టిలో సూర్యునే పొగడాలి. దానికి కావలిసిన గుణాలు ఆయనలో ఉన్నాయి. సత్యాన్ని ఆవిష్కరించేదే భగవంతుని స్తుతి.

స్తుతిద్వారా భగవత్తత్త్వం, మహిమ, గుణం, లీలావైభవాలు ఆవిష్కరింపబడతాయి.

స్తోత్రమే దేవతాస్వరూపం.

అందుకే **'స్తుతి స్తోతా రణప్రియః'** స్తోత్రింపదగినవాడు అన్నారు.

స్తుతికి యోగ్యమైనవాడు కనుక 'రవిః'.

ఆయనని ఎప్పుడూ దేవాసురులు స్తుతిస్తూ ఉంటారు. ఎల్లవేళలా ఆ సూర్యభగవానుని రథం చుట్టూ దేవతలు మొదలైన వాళ్ళు సంఘాలుగా, గుంపులుగా స్తుతిస్తూ ఉంటారు. దేవతలు, ఋషులు మంత్రాలతో, గంధర్వులు గానంతో, అప్సరసలు నృత్యముతో అలా ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా ఆయన కీర్తిని చాటుతూ ఉంటారు. చారణులు కూడా ఆయనను కీర్తిస్తూ, స్తుతిస్తూ అక్కడ తిరుగుతూ ఉంటారు. ఇలా సర్వగణములచే స్తుతింపబడువాడు కనుక దేవాసురనమస్కృతః.

'రూయతే' అనగా 'శబ్దించువాడు' అని కూడా అర్థం. సూర్యుడు శబ్దస్వరూపుడు. సర్వమంత్రాలకు, ప్రణవానికి మూలమైనవాడు. 'ఓం' అని ఆదిత్యమండల స్వరూపాన్ని చూడాలన్నారు. ఉపాసకులకి ఆదిత్యమండలం నుంచి నిరంతరం ప్రణవం వినబడుతూ ఉంటుంది. ఋషులకు అ ప్రణవంలోంచి ఋగ్యజుస్సామాత్మకమైన వేదమంత్రరాశి వినబడుతుంది.

ఈ విషయం ఇటీవల అంతరిక్ష పరిశోధనా సంస్థ ధ్వనిముద్రిక ద్వారా తెలియజేస్తూ 'సూర్యునినుండి ఓంకారధ్వని' వస్తున్నదని ఋజువు చేయడం ఆర్షవిజ్ఞానంలోని సత్యాన్ని లోకానికి చాటి చెప్పింది.

**అగ్నిగర్భః**

అగ్ని అనగా తేజస్స్వరూపుడు. కాంతి, ఉష్ణత– ఇదే అగ్ని లక్షణం. సృష్టిలో అగ్నిని మనం దైవంగా ఆరాధించడం సంప్రదాయం. 'అగ్నిముఖావైదేవాః'. మనం విష్ణవేస్వాహా, రుద్రాయస్వాహా, ఇంద్రాయస్వాహా అన్నప్పటికీ అగ్నిహోత్రంలోనే అనాలి. అగ్నిహోత్రుడు ఆదిత్యుని స్వరూపమే. సౌరాగ్నికి ప్రతీకగానే మనకి అగ్నిహోత్ర ఆరాధన వచ్చింది. ఆ సూర్యునిలో మనం ఇవ్వలేం కనుక ఇక్కడ ఇస్తున్నాం.

సూర్యునిలో ఉన్న దేవతలందరికి ముఖం అనగా 'నోరు' అగ్ని. ఇంద్రియాలకి బలం కావాలంటే ఎలా మనం నోటిద్వారా గ్రహిస్తున్నామో అలా అగ్ని ద్వారా సర్వదేవతలకు అందుతుంది. ఆ సర్వదేవతలు సంతోషించి మనల్ని ఆనందింపచేస్తారు. ఏ అగ్ని వల్ల సంస్కృతి పరంగా భారతదేశం ఉన్నతమైన స్థితికి వెళ్ళిందో ఆ యజ్ఞసంస్కృతి క్రమక్రమంగా క్షీణించిపోయింది.

ఆ సూర్యభగవానుడు అనే అగ్నికి నమస్కారం అని ఆహుతి ఇస్తే అగ్నిదేవుడు సంతోషిస్తాడు. అగ్నికి గర్భం సూర్యభగవానుడు. అగ్నికి లోపల ఉన్నవాడు. తనలోపల అగ్నిని ఉంచుకున్నవాడు సూర్యభగవానుడే. అందువల్ల అగ్నిగర్భః

**అదితేః పుత్రః**

అదితీదేవికి పుత్రుడు. అదితి అనేమాటకు పృథ్వీ, ఆకాశం అని అర్థం. అదితికి ఆకాశం అనేపేరు అనేకచోట్ల కనబడుతుంది. 'ఆకాశమాది జననీం శరణం ప్రపద్యే' – ఆకాశమే అమ్మ స్వరూపంగా, పరాశక్తి స్వరూపంగా చెప్పారు – (అప్పయ్య దీక్షితులు). ఆకాశంలో 'కాశము' అనగా ప్రకాశం. 'ఆ' అనగా 'ఆ సమంతాత్' సమగ్రంగా ప్రకాశము కలది. ప్రకాశమనగా చైతన్యం. ఆ సమంతాత్ చైతన్యమే ఆకాశం'.

భారతీయసంస్కృతిలో ఆకాశం శూన్యం కాదు. అది చైతన్యస్వరూపం. చైతన్యం విస్తరించిన స్థలం. ఆకాశం అనగా పరచబడిన చైతన్యం. ఆ చైతన్యాన్ని ఎవరూ ముక్కలు చెయ్యలేరు. అలా ఆకాశమంతా అవ్యక్తమై వ్యాపించిఉన్న శక్తే వ్యక్తమై రూపం ధరించి వస్తే అది సూర్యమండలం.



శక్తితో కూడిన ఆకాశమందు కలిగినవాడు కనుక అదితేః పుత్రః అయ్యాడు. ఆకాశ మందు కలిగినవాడు కనుక ఆకాశమునకు కొడుకులాంటివాడే.

మన లౌకికవ్యవహారంలో గల తల్లీ కొడుకుల సంబంధం కాదు. పురాణప్రకారంగా అసురసంహారంకోసం అదితీదేవియందు ఉద్భవించి అనేకమంది అసురులను అవలీలగా సంహరించాడు ఆదిత్యుడు. ఆయన ఛేదింపబడడు, దుష్టశక్తులను ఛేదిస్తాడు.

అసురశక్తుల సంహారానికి 'ఆదిత్య' అనే నామమే చాలా ముఖ్యం. ఆ కారణం చేతనే ఇక్కడ అదితేః పుత్రః, హిరణ్యగర్భః, మార్తాండః అని ఆ కథకి దగ్గరగా తీసుకొస్తున్నాడు. ఈ ఆదిత్యహృదయం అంతా ఈ హిరణ్యగర్భ ఉన్న నామాల చుట్టూ ఉన్నది. అసుర శక్తులను దునుమాడడానికి అఖండమైన తేజస్స్వరూపంతో ఆదిత్యరూపనారా యణుడు ఉద్భవించాడు.

రావణాది అసురశక్తుల సంహారంకోసం అదితీదేవి స్వరూపమైన కౌసల్యాదేవి గర్భంలో ఉద్భవించిన ఆదిత్యరూపనారాయణుడే రామచంద్రమూర్తి. రామునికి అగస్త్యులవారు 'అక్కడ ఉన్నది ఇక్కడ ఉన్నది ఒక్కటే నాయనా' అని చెబుతున్నాడు.

రావణుడు కేవలం నరవానరుల చేతులలో చావాలి కనుక నారాయణుడు నరుడిగా దిగివచ్చి నరునిలా నటిస్తున్నాడు.

ఎంత శక్తిని ప్రదర్శిస్తున్నా ఆయనలో ఉన్న నారాయణస్వరూపాన్ని ఒక్కసారి అగస్త్యులవారు స్ఫురింపజేయాలి. అందుకు ఆయన వచ్చారు.

నరునివలే కనపడుతున్న రామచంద్రమూర్తిలో ఉన్న హిరణ్యగర్భుడు అనే నారాయణ తత్త్వాన్ని గుర్తు చేసాడు అగస్త్యులవారు. అలా గుర్తుచేయగానే అంధకారరూపమైన అసురశక్తులను అన్నింటిని కూడా ఆదిత్యమండలాంతర్వర్తియైన ఆ నారాయణబ్రహ్మము రామచంద్రమూర్తిగా త్వరలో సంహరించబోతోంది.

**శంఖః**

**'ఖం'** అనే మాట ఇంద్రియాలను తెలియచేస్తుంది. ఇంద్రియాలకు శాంతిని, శుభాలను కలిగించువాడు. ఇంకో అర్థంలో ఆయన ఎప్పుడైతే అదితి పుత్రుడుగా ఆకాశంలో ఉద్భవించాడో ఆకాశానికే ఒక శుభకరమైన శోభ వచ్చింది. శుభంకరమైన ఆకాశ స్వరూపుడు.

ఖననము- ఖ అనే మాటకు లోతు, గొయ్యి అని అర్థం. ఖననము చేయుట - గొయ్యి త్రవ్వుట. ఇది వేదంలో కొన్ని చోట్ల చెప్పబడుతున్నది.

సూర్యభగవానుడు గోతులు తవ్వుతాడు. ఇది చమత్కారంగా ఉంటుంది వినడానికి. కాని గోతులు లేకపోతే శక్తి ఉండదు. మన ఋషులు ఆకాశానికి 'ఖం' అని పేరు పెట్టారు. ఆకాశం పెద్ద గొయ్యి అన్నారు. అంటే అర్థం దాని లోతు ఎంతో మనకి తెలీదు. సముద్రపు లోతు మనకి తెలీదు. భూమి అంతా లోతు లేకుండా ఒకేలా ఉంటే ప్రమాదం. భూమికి అంత లోతు ఉంది కనుకనే అందులో ఎన్నో ఉన్నాయి.

సముద్రంలో లోతు లేకపోతే ఆ సముద్రంలో ఉన్న జీవులు ఎలా బ్రతుకుతాయి. ప్రతిదానిలో లోతు ఉంది.

లోతు లేకపోతే లోతు చేసుకొనే వీలు ఉంది. మన శరీరానికి కూడా భగవంతుడు లోతు పెట్టాడు. మన కళ్ళదగ్గర రెండు గోతులు, నాసికా రంధ్రాలు రెండు గోతులు, నోరు ఒక పెద్ద గొయ్యి. అది 'ఖం'. ము'ఖం'. ఇలా గోతులు లేకపోతే తలకి మహాప్రమాదం.

మన శరీరంలో కొన్ని చోట్ల లోతు ఉండాలి. శరీరనిర్మాణంలో కొన్ని లోతులు ముఖంలోను, ఎముకలలో కొన్ని లోతులు పెడతాడు. సృష్టిలో ఇలా త్రవ్వడాలు, పూడ్చడాలు ఇవన్నీ సౌరశక్తి విశేషాలు. ఇవన్నీ శుభం, సుఖం కోసం శాంతి కోసం చేస్తున్నాడు. అన్నీ మూసుకుపోతే 'శం' ఉండదు. కనుక శంఖః.

**శిశిరనాశనః**

చల్లదనాన్ని పోగొట్టువాడు అనగా జడత్వాన్ని పోగొట్టువాడు. శిశిర ఋతువులో చలిబాగా వచ్చినపుడు మనం గడ్డకట్టుకొని పోతాం. ఆ గడ్డ కట్టుకుపోవడాన్ని శిశిరం అంటారు. జడత్వాన్ని తొలగిస్తాడు. దేని చైతన్యం దానికి లేకపోతే అదే జడత్వం. కొంతమందికి బుద్ధి జాడ్యం చాలా ఉంటుంది. ఎంత చెప్పినా అర్థంకాదు. శిశిరం అనగా జడత్వం. అజ్ఞానపు జాడ్యాన్ని నశింపచేసేవాడు కనుక శిశిరనాశనః.

> **వ్యోమనాథస్తమోభేదీ ఋగ్యజుఃసామపారగః**
> **ఘనవృష్టిరపాం మిత్రో విన్ధ్యవీథీప్లవంగమః** (13)

**వ్యోమనాథః**

వ్యోమము అనగా ఆకాశం. నాథః అనగా దిక్కైనవాడు. ప్రభువైనవాడు. సూర్యుడు లేకపోతే ఆకాశం అనాథ అవుతుంది.

ఆకాశమునకు దిక్కు అయినవాడు. కనుక వ్యోమమునకే నాథుడు, ప్రభువు, దిక్కైనవాడు. ఆకాశమునకు రాజు. సృష్టిలో ఎన్ని సౌరకుటుంబాలు ఉన్నప్పటికీ మనం ఉండే ఈ సౌర కుటుంబంలో ఆకాశమునకు ఈయనే నాథుడు. అనంతవ్యోమంలో ఎన్ని సూర్యమండలాలు ఉన్నా అన్ని సూర్యమండలాలలో గల తేజస్సు మాత్రం ఒక్కటే పరమాత్మ. ఆయనే వ్యోమమునకు నాథుడు.



మన దహరాకాశంలో నాథుడుగా ఉన్న పరమాత్మ. వ్యోమం అనగా దహరాకాశం. హృదయంలో ఉండే చిదాకాశం. ఆ చిదాకాశానికి ప్రభువైన చిదంబరేశ్వరుడు ఈయన. హృదయంలో వ్యాపించిన చిచ్ఛక్తి. చిచ్ఛక్తి వ్యాపకంగా ఉంది కాబట్టి చిదాకాశం. చిదాకాశానికి మూలమైన నాథుడే ఇతడు.

దహర విద్య అని ఉపనిషత్తులో చెప్పబడుతున్నది.

అదే లలితా సహస్రంలో **'దహరాకాశరూపిణి'** అన్నారు. దహరాకాశాన్నే శ్రీచక్రం అంటారు. ఆ దహరచక్రానికి మూలమైనవాడు చిదంబర నటరాజస్వామివారు. అలాంటి వ్యోమనాథుని మనం తెల్సుకుంటే మన తమస్సు నశిస్తుంది.

మన వైదికసంస్కృతి ప్రకారంగా ఆకాశం శబ్దగుణకం. శబ్దం అనంతాకాశంలోంచి ఉత్పన్నమవుతుంది. అనంతాకాశంలో ఉన్న దివ్యశబ్దాన్ని కేవలం తపోదృష్టి ఉన్న ఋషులు మాత్రమే వినగలరు. అలా వాళ్ళు వినగలిగిన దివ్యశబ్దాన్ని మంత్రం అంటారు. దీన్ని

ఋషులు దర్శించారు. కనుక అనంతాకాశం నుంచి వచ్చిన దివ్యశబ్దమే వేదం. ఆ వేదస్వరూపుడు ఆదిత్యుడు. అందుకు వ్యోమనాథ అన్నప్పుడు అనంతాకాశమందు శబ్దబ్రహ్మస్వరూపంగా ఉన్నవాడు అని అర్థం.

**తమోభేదీ**

తిమిరోన్మథనకి దీనికి ఒకటే అర్థం చెప్పుకున్నా తేడా ఉన్నది. తమస్సు అనగా అజ్ఞానం. తమోగుణాన్ని నశింపజేయువాడు. లోకంలో ఉన్న తమస్సును ఆయన ఉదయంతో పోగొడుతున్నాడు. తమోగుణ లక్షణమైన నిద్రాదులను పోగొట్టి జ్ఞానాన్ని ప్రసాదించువాడు. అన్నింటికంటే పెద్ద తమస్సు అజ్ఞానం.

**ఇదమంధం తమకృత్స్నం జాయేతభువనత్రయం**
**యది శబ్దాహ్వయం జ్యోతిః ఆసంసారం న దీప్యతే**

శబ్దజ్యోతి అనగా శాస్త్రం. శాస్త్రమే లేకపోతే ఈ ప్రపంచమంతా చీకటిలో పడి కొట్టుకు పోతుంది. వేదాది శాస్త్రాలనే జ్యోతులే లేకపోతే ప్రపంచం అంధకారమే. వేదాలు, వేదాంతాలు జ్ఞానం అనే కాంతిని ప్రసరించడం వల్లనే తమస్సు నుంచి బయటపడగలం.

**అసతోమా సద్గమయ**
**తమసోమా జ్యోతిర్గమయ**
**మృత్యోర్మా అమృతంగమయ**

అనే ప్రసిద్ధి చెందిన శాంతి మంత్రాలు సూర్యసంబంధమైన మంత్రాలలో చెప్పబడ్డాయి. ఆయనే మనల్ని తమస్సు నుంచి జ్యోతి వైపు నడిపిస్తాడు.

అజ్ఞానం నుంచి జ్ఞానం వైపుకి నడిపించాలి. 'అజ్ఞాన భేదన కర్తయే తమోభేదీ'. అజ్ఞానాన్ని పోగొట్టే శబ్దజ్యోతి కాబట్టి ఆయనే ఋగ్యజుస్సామపారగః

**ఋగ్యజుస్సామపారగః**

ఋక్కులు, యజుస్సులు, సామములు...వీటి పారము తెల్సినవాడు. 'పారము' అనగా ఒడ్డు. లోకంలో వేదం గురించి తెలిసిన పండితుడు ఉండవచ్చు గాని ఆ వేదాన్ని పూర్ణంగా తెలిసినవాడు వేదస్వరూపుడైన పరమాత్మ ఒక్కడే.

కృష్ణపరమాత్మే చెప్తూ **'వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః వేదాంతకృత్ వేద విదేవచాహం'** వేదాలన్నింటిచే తెలియబడేవాడిని నేను. వేదాంతాలను ఏర్పాటుచేసినవాడిని నేను. వేదం తెలిసిన వాడిని నేను అన్నాడు.

అంటే వేదం సంపూర్ణస్వరూపం ఎవరికీ తెలియదు.

ఒకప్పుడు భరద్వాజ మహర్షి వేదం బాగా అధ్యయనం చేయాలని ఆయువు కోసం తపస్సు చేసాడు.

ఆ తపస్సు ద్వారా ఆయువును సంపాదించి వేదవిద్య చాలా నేర్చుకున్నాడు. అప్పుడు ఆయన ముందు ఇంద్రుడు ప్రత్యక్షం అయ్యాడు. ఇంద్రుడు అంటే సూర్యాంతర్వర్తియైన ఈశ్వరుడు.

ఓ భరద్వాజా! నువ్వు చాలా వేదం నేర్చుకొన్నావు. నీ ఆయువు అయిపోయింది. ఇంత వేదం చదువుకున్నావు కనుక చెప్పి తీసుకువెడదామని వచ్చాను అన్నాడు. అప్పుడే అయిపోయిందా ఇంకా చాలా వేదం నేర్చుకోవాలని ఉంది. నాకు కొంత ఆయువు కావాలి అన్నాడు భరద్వాజ మహర్షి. ఇంద్రునికి జాలి కలిగి, సరే ఇస్తున్నాను తీసుకో అని కొన్ని వందల సంవత్సరాల ఆయువు ఇచ్చి వెళ్ళిపోయాడు.

మళ్ళీ భరద్వాజుడు వేదవిద్య నేర్చుకున్నాడు. సమయం అవగానే మళ్ళీ ఇంద్రుడు రావడం, ఈయన మళ్ళీ ఆయువు అడగడం, ఇలా మూడు మార్లు ఆయువు తీసుకొని వేదాధ్యయనం చేసాడు భరద్వాజమహర్షి. ఈసారి ఇంద్రుడు రాగానే ఇప్పటి వరకూ నేను వేదంలో ఎంత అధ్యయనం చేసానో చూపించు అని అడిగాడు.



చదివినది ఏదో మనకి తెలుస్తుందికాని, చదవనిది ఎంత ఉందో మనకి ఏం తెలుస్తుంది. మనకి తెలిసినదే తెలిసింది అనుకుంటాం గాని మనకి తెలియనిది ఎంత ఉందో మనకేం తెలుసు. అదే ఇక్కడ ఇంద్రుడు చెబుతున్నాడు. ఇంద్రుడు ఒక మూడు కొండలలోంచి మూడు గుప్పెడుల మట్టి చూపించి 'ఇదే నువ్వు నేర్చుకున్న వేదం' అని చెప్పాడు. ఇది తెలిస్తే జ్ఞానం యొక్క విస్తారం మనకి అర్థం అవుతుంది. వేదం అంటే జ్ఞానమే. అది ఎప్పుడూ ఋగ్యజుస్సామాత్మకం.

ఋక్కులు, యజుస్సులు, సామములు అనగా ఆలోచనలు, కర్మలు, ప్రాణములు అని కూడా అర్థం చెప్పారు. జ్ఞానం మూడు విధాలు. ఆలోచన ప్రాణ కర్మరూపంగా ఉన్న జ్ఞానం అనంతమైనది. అనంతమైన వేదాన్ని తెల్సినవాడు పరమాత్మ. 'అనంతావైవేదాః' - జ్ఞానం యొక్క సమస్త స్వరూపం సూర్యభగవానుడే. ఆయన్ని ఉపాసిస్తే బుద్ధి శక్తి పెరుగుతుంది.

ఐహికజ్ఞానం మొదలుకొని పారమార్థిక జ్ఞానం వరకు ఆయనే ఇస్తాడు. వేదాలకు నిధి ఆయన. త్రయీమయుడు. సూర్యునిలో వేదాలు ఉన్నాయి. సూర్యుని మండలము ఋగ్వేదం. అందులో పురుషుడు యజుర్వేదస్వరూపుడు. కిరణాలు సామవేదస్వరూప

ములు. మరి అథర్వణవేదం ఎక్కడ వచ్చింది? నాలుగు వేదాలలో మంత్రాలు మూడే రకాలుగా ఉంటాయి. ఋక్కులు, యజుస్సులు, సామములు.

శ్లోకరూపంగా, పద్యరూపంగా ఉండే మంత్రాలు ఋక్కులు. గద్యరూపంగా ఉండే మంత్రాలు యజుస్సులు. గానరూపంగా ఉండే మంత్రాలు సామములు. ఈ మూడు రకాల మంత్రాలు నాలుగు వేదాలలో ఉంటాయి. ఈ మూడింటితో కూడుకున్నదే వేదరాశి. ఆ వేదస్వరూపుడే సూర్యభగవానుడు.

**ప్రాతఃస్మరామి ఖలుతత్సవితుర్వరేణ్యం**
**రూపం హి మండలమృచోఽథతనుర్యజూంషి**
**సామాని యస్యకిరణాః ప్రభవాదిహేతుం**
**బ్రహ్మాహరాత్మకమలక్ష్య మచింత్యరూపమ్॥**

–శంకర భగవత్పాదులవారు రచించిన సూర్యస్తుతి.

ఋగ్యజుస్సామమయుడు యొక్క– ఈ మూడు కూడా ఉపాసనా పరులు సూర్యకాంతి నుంచి గ్రహిస్తారు.

వేదము యొక్క పిండీభూతస్వరూపుడు ఈయన. దీనికి మార్కండేయ పురాణం ఒక అద్భుతమైన కథ చెప్పింది.

సృష్టికి పూర్వము బ్రహ్మదేవుడు విష్ణునాభికమలం నుంచి ఉద్భవించాక జగత్తు ఎలా నిర్మాణం చెయ్యాలి అనే జ్ఞానం కోసం తపస్సు చేస్తూ ఉంటే ఆయనలోంచి అప్రయత్నంగా ఈశ్వరప్రేరణ చేత తనంత తానుగా సృష్టికి మూలమైన 'ఓంకారం' అనే శబ్దము వచ్చింది. అటుపై నారాయణుని అనుగ్రహం వలన ఆయన్నించి క్రమంగా అనంతవేదరాశి బయటికి రావడం మొదలైంది.

ఓంకారం నించి ఋక్కులు, యజుస్సు, సామములు మూడు పుట్టాయి. ఈ వచ్చిన వేదములు, ఓంకారం చైతన్యమంతా అప్పుడున్న కేవల ఆకాశంలో ఒక పెద్ద పుంజంగా మారి బ్రహ్మగారికి ఎదురుగా కనబడింది.

రెండు చేతులు జోడించి ప్రార్థించగా అందులోంచి పరమాత్మ ఉద్భవించాడు. ఈ వేద మండలమే సూర్య మండలం, నేనే ఆ ఆదిత్య స్వరూపమైన పరమాత్మని అని ఆ బ్రహ్మదేవుని పరమాత్మ ఆశీర్వదించాడు. అటుతర్వాత విశ్వమంతా ఉద్భవించిందని వివరించారు. ఈ కథద్వారా వేదవిద్యా స్వరూపమే సూర్యమండలం అని గ్రహించాలి.

భాగవతంలో యాజ్ఞవల్క్య మహర్షి మహాసూర్యోపాసకుడు. ప్రతివారు ప్రాతఃకాలంలో

తలంచుకోవలసిన మహాత్ముడు. ఈయన గురువు వద్ద వేదవిద్య అంతా నేర్చుకొని, ఏదో చిన్న పొరపాటు వల్ల గురువు ఆగ్రహానికి గురియై, నేర్చుకొన్న విద్య మర్చిపోయి చాలా దుఃఖించాడు. పోనీ తిరిగిపొందుదామన్నా ఎలా పొందాలనే జ్ఞానం కూడా పోయింది. ఆయన అప్పుడు సూర్యుని చూసి దుఃఖిస్తూ 'స్వామీ నువ్వే శరణు' అని రెండు చేతులతో నమస్కరించగానే సూర్యభగవానుడు దయచూపి ప్రత్యక్షమై మర్చిపోయిన వేదం ఇవ్వడమే కాకుండా సర్వశాస్త్ర విద్యలనీ ప్రసాదించాడు.

అలా యాజ్ఞవల్క్యుని ద్వారా శుక్లయజుర్వేదం, మాధ్యందిన సంహిత వచ్చాయి. గురువులకే గురువైన జగద్గురువు ఆదిత్యభగవానుడు. ఆయన్ని తండ్రి అని 'హిరణగర్భా' అన్నాం. తల్లి ఆయనే, ఆచార్యుడు ఆయనే. ప్రాతఃకాలవేళ ఆదిత్యుని గురుస్వరూపంగా పూజించడం పసితనం నుంచి పిల్లలకు అలవాటు చేస్తే వాళ్ళకి బుద్ధిశక్తి పెరుగుతుంది. పూర్వం బాల్యంలోనే పిల్లలకు ఉపనయనాదులు చేసి సంధ్యావందనాదుల రూపంలో ఆదిత్యోపాసన చేయించేవారు.

అందరూ సంధ్యావందనం చెయ్యాలి. సంధ్యావందనం చెయ్యకపోతే పాపం. సంధ్యావందనం అంటే ఉపనయనాది సంస్కారాలు అయినవాళ్ళు ఆ సమయంలో ఉపదేశింపబడిన మంత్రాన్ని వాళ్ళు చేస్తారు. మిగిలినవారు వారికి గురువులు ఇచ్చిన మంత్రం చేసుకోవాలి. ఏ మంత్రం రాకపోతే భగవన్నామం చేసుకోవచ్చు. అదికాక పోతే ఆదిత్యహృదయం చదువుకోవాలి. అదే సంధ్యావందనం. వారి వారి పద్ధతులలో వారు చేయాలి. ఆదిత్య ఉపాసన వలన మేధాశక్తి బాగా పెరుగుతుంది. ఋగ్యజుస్సామపారగః – సంపూర్ణ వేదవిద్యాస్వరూపుడు. వేదం సమగ్రంగా తెల్సిన వేదపురుషుడు ఇతడే.



వేదం యొక్క పారం – అంటే వేదం ద్వారా పొందవల్సిన పరతత్త్వస్వరూపుడు ఇతడే. పారగః అనే దానికి మరొక అర్థం 'పారం గమయతి ఇతి పారగః' – పారమును పొందించువాడు. **వేద పారమైన వేదాంతజ్ఞానం, ఆత్మజ్ఞానం కలిగించువాడు ఋగ్యజుస్సామపారగః.**

వేదంలో అనేకమంది ఋషులు చెప్పబడుతూ ఉంటారు.

### ఉపాసన ద్వారా అనుగ్రహం

ఆ ఋషుల స్మరణ వల్ల ధన్యులమౌతాం. దేవతల్ని స్మరిస్తే ఎంత పవిత్రమో, ఋషులని స్మరించినా అంతే పవిత్రం. ఋషులు లేకపోతే దేవతలు లేరు.

ఋషుల వల్లనే దేవతాజ్ఞానం తెల్సింది కనుక ఋషి ఋణం తీర్చుకోవడం మహాకష్టం.

ఋషి ఋణం తీర్చుకోవాలి. జీవితం దానికి వినియోగించాలి. ఋషుల పేర్లని తలంచుకోవడం, వాళ్ళ గ్రంథాల్ని అధ్యయనం చేయడం, దాని ప్రకారం నడుచుకోవడం, ఋషుల జ్ఞానాన్ని చెప్పే గురువుల్ని ఋషిస్వరూపులుగా ఆదరించడం అనేది ఋషి ఋణం తీర్చుకొనే పద్ధతి.

ఆంధ్రప్రదేశ్ శ్రీకాకుళంజిల్లాలో ఉన్న హర్షవల్లి (అరసవల్లి)లో స్వామి స్వయంభూ మూర్తిగా, ఉపాస్యమూర్తిగా ఉన్నాడు. సూర్యవిగ్రహం, సూర్యయంత్రం, మంత్రం ఉన్నాయి. కనిపిస్తూ ఆయన ఉంటూ ఉంటే మళ్ళీ గుడి ఏమిటని మనకి అనిపించవచ్చు.

ఆ సూర్యుని తత్త్వాన్ని అంతటిని మంత్రం ద్వారా, యంత్రం ద్వారా ఉపాసన ద్వారా ఆకర్షిస్తే అక్కడున్న తత్త్వాన్ని ఇక్కడే మనం పొందగలం. ఋషులు వేదంలో చెప్పబడ్డ సూర్యతత్త్వానికి అంతటికి ఒక యంత్రం, మంత్రం, విగ్రహం ఇవన్నీ ఏర్పాటు చేసారు.

అలా మనం ఆ సూర్యశక్తిని ఉపాసన ద్వారా పొందాలి.

ఆదిత్యుని శిష్యుల్లో యాజ్ఞవల్క్యుడు, మరెందరో ఋషులు ఉన్నప్పటికీ ప్రధాన మైనవాడు ఆంజనేయస్వామి. ఈయన సూర్యభగవానుని శిష్యుడు. అతి బాల్యంలోనే ఆకాశంలోకి ఎగిరి సూర్యభగవానుని దగ్గరికి వెళ్ళాడు.

సూర్యమండలాంతర్వర్తియైన రుద్రస్వరూపుడే ఆంజనేయస్వామి. అక్కడికి వెళ్ళగానే సూర్యుడు ఈయనకి అనుకూలంగా మారాడు.

"నాకు మండే లక్షణం ఉంది కనుక నేను మండుతూ ఉంటాను" అని అనడు సూర్యభగవానుడు. తనని తాను నిగ్రహించుకొనే శక్తి కూడా ఆయనకి ఉన్నది. సూర్యభగవానుడు స్వతంత్రుడు. ఆ తరువాత ఇంద్రశక్తి విశేషం. ఇంద్రుడు కూడా బాలహనుమ దగ్గరకి రావడం కూడా జ్యోతిర్మండలానికి సంబంధించిన ఒక జ్యోతిర్వి జ్ఞానమే. సూర్యుని అనుగ్రహం అప్పట్నించే ఆంజనేయస్వామికి ఉన్నది.

తరువాత ఎవరి దగ్గర విద్యనేర్చుకోవాలా అని ఆలోచించి ఆంజనేయస్వామి 'నీ దగ్గరే విద్య నేర్చుకుంటాను' అని సూర్యభగవానునితో అంటే 'నా దగ్గర విద్య నేర్చుకోవడం మహాకష్టం నాయనా! ప్రొద్దున్నించి సాయంకాలం వరకూ తిరగడమే, నా పని, కూర్చుని పాఠం చెప్పేటంత తీరిక నాకు లేదు' అంటాడు.

'మీతో పాటు నేనూ తిరుగుతాను' – అంటాడు ఆంజనేయస్వామి. మంచి శిష్యుడి లక్షణమిది. అంతేకాని గురువుగారిని విద్య నేర్పమన్నాం కనుక నేను ఎలా చెప్తే అలా గురువుగారు వినాలని కాదు. విద్యకోసం గురువు వెంట పడాలి. శుశ్రూష అంటే ఇదే.

గురువు ఎటు వెళ్తూ ఉంటే అటు వెళ్తూ ఉండాలి. గురువు గాలి తగిలినా విద్య వస్తుంది. నిరంతరం గురువుకి అంతేవాసి అయినవాడు. అంతేవాసి అంటే సమీపంలో ఉండువాడు అని అర్థం. కనుక హనుమంతుడు గొప్ప శిష్యుడు.

గురువుగారు వద్దని చెప్పినా 'మీ వెంటే ఉంటాను' అన్నాడు. సూర్యభగవానుడంటే తిరగ్గలడుగాని ఆయనతో పాటు ఎవరు తిరగ్గలరు! ఆంజనేయస్వామి తిరగ్గలడు. ఆంజ నేయస్వామి అంత శక్తిమంతుడు. 'మీతో పాటు ఉదయం నుంచి అస్తమయం వరకూ మీ వెంటే నేను ఉంటాను' అంటాడు.

ఈ కథ చెప్పగానే 'మన పురాణాలన్నీ అసంగతం. సూర్యభగవానుడు అసలు గమనమే చెయ్యడు. హనుమంతుడు తిరగడం ఏమిటి' అని అనుకోవచ్చు. దీని సంగతాసంగతాలు గురించి మానవమేధతో మనం చెప్పలేం కాని ఇంకో విధంగా దీనికి అర్థం చెప్పుకోవచ్చు. ఉదయం నుంచి అస్తమయం వరకూ వివిధ దశల్లో సూర్యునికి ఒక్కొక్క నామం కూడా చెప్పబడుతున్నది. ఆదిత్యనామం నుంచి క్రమంగా అనేక నామాలు.

ఆ నామశక్తి విశేషమేదైతే ఉన్నదో ఆ సౌరశక్తి ప్రత్యేకతలను ఆంజనేయస్వామి ఉదయం నుంచి అస్తమయం వరకూ నిరాఘాటంగా ఉపాసించాడు అని అర్థం.



వివిధ సమయాల్లో హనుమంతుడు సూర్యభగవానుని ఆరాధన చేసాడు. ఆయన యందే చెక్కుచెదరకుండా దృష్టి పెట్టి ఉంచాడు అని అర్థం మనం చెప్పుకోవచ్చు. సంగతంగా అనిపించని వాళ్ళు ఇలా తృప్తి పడాలి. నిరంతరం సూర్యోపాసన చెయ్యడం చేత ఆయనకి తన అనుగ్రహం ద్వారా విద్యని ఇచ్చాడు.

సర్వవేదవిద్యలు ఆంజనేయస్వామికి సూర్యభగవానుని నుంచే వచ్చాయి. అందుకే రామాయణంలో ఆయన మహామేధావిగా ఉంటాడు. కిష్కంధకాండలో రామచంద్రమూర్తి అంతటి వారే లక్ష్మణునితో హనుమ గురించి చెబుతూ 'ఋగ్వేద యజుర్వేద సామవేదాల్లో పండితుడైనవాడు మాత్రమే ఇలా మాట్లాడగలడు' అంటాడు.

**నానృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః।**
**నాఽ సామవేద విదుషః శక్యమేవాభ్యభాషితుమ్॥**

అని హనుమని ప్రశంసిస్తారు.

హనుమ ఋగ్యజుస్సామపారంగతుడైన సూర్యోపాసకుడు. బహుశాస్త్రకోవిదుడు. అనేన బహుదాశ్రుతం-అనేక శాస్త్రాలు తెల్సినవాడు. అద్భుతమైన వాక్శుద్ధి, జ్ఞానశక్తి, హృదయ శుద్ధి ఉన్నవాడు. ఉపాసనాపరమైన మంత్రశాస్త్రాలలో సూర్యపుత్రికయైన సువర్చ లను

ఆంజనేయునికిచ్చి వివాహం చేసారు అని ఒక కథ ఉన్నది. దీనిని సంకేతవాదం అంటారు.

ఒక విద్యను చక్కగా నేర్చుకోవడం వలన ఆ విద్య అధిదేవత అనుగ్రహిస్తుంది. విద్యలు జడ పదార్థములు కావు. ఆ దేవతా అనుగ్రహంతో ఒక వర్చస్సు వస్తుంది. ఆ వర్చస్సుకు బ్రహ్మవర్చస్సు అని పేరు. బ్రహ్మము అనగా వేదం. వేదమంత్రాల వలన వచ్చిన తేజస్సుని బ్రహ్మవర్చస్సు అంటారు. అలా సూర్యుని కృప వల్ల వేదవిద్యా వర్చస్సు హనుమకి వచ్చింది. అదే సు-వర్చస్సు. ఆ సువర్చస్సే ఆంజనేయుని శక్తి.

ఉపాసనా సంప్రదాయాలలో శక్తి సహితంగా ఉపాసిస్తే కొన్ని ఫలితాలు శీఘ్రంగా వస్తాయి. ఆ సువర్చస్సుకు 'సువర్చలా' అని పేరు. ఆ సువర్చస్సు అనే శక్తికి కొన్ని బీజాక్షరాలు పెట్టి తద్బీజాక్షర సహితంగా ఆంజనేయుని ఉపాసించినపుడు సువర్చలా సమేత ఆంజనేయస్వామి. ఇది మన వ్యవహారంలో భార్యాభర్తల బంధంగా చూడరాదు. శక్తిమంతుడైన పరమేశ్వర భావనతో ఉపాసించాలి. సుందరకాండలో హనుమ సముద్ర లంఘనం చేసినప్పుడు ముందుగా గురువుగారికి నమస్కారం చేస్తాడు.

**స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే।**
**భూతేభ్యశ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్॥**

సూర్యునికి, మహేంద్రునికి, పవనునికి, స్వయంభువునకు నమస్కారం అంటే ఇంత మంది స్వరూపుడైన ఆదిత్యునికి నమస్కారం అని రహస్యం చూపిస్తున్నారు. ఈ రహస్యాన్నే కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు రామాయణకల్పవృక్షంలో హనుమంతుడు చేసిన సూర్యస్తుతిగా అద్భుతంగా రచించారు.

**వెలుగు మరొక్క పేరఖిల విద్యలకున్ పరమార్థభూతమై**
**వెలుగులు తన్నుమించి**
**మరి విశ్వమునందున వేరుచోట లేవు**
**అలఘుడు శిష్యవత్సలుడు, అంబుధిశోషణదాహమూర్తి**
**వెల్గుల నిధికిన్ గురూత్తమునకున్ జగదక్షునకున్ నమస్కృతుల్**

భారతీయతత్త్వాన్ని వంట బట్టించుకున్న ఋషి వంటి కవి మాత్రమే ఇలాంటి రచన చెయ్యగలరు. విశ్వనాథవారు అలాంటి కవి. వెలుగు మరొక్కపేరు అఖిల విద్యలకున్ - సూర్యుడు కాంతి స్వరూపుడు. కాంతిని విద్యలకు పేరుగా మనం వాడుతూ ఉంటాం. విద్య, జ్ఞానం అనే దానికి కాంతినే ప్రతీకగా చెబుతాం.

కాంతిని జ్ఞానంతోనూ, అంధ కారాన్ని అజ్ఞానంతోనూ పోల్చడం శాస్త్రమందు సహజమే.

వెలుగు మరొక్కపేరు అఖిలవిద్యలకున్ - సర్వవిద్యలకు వెలుగు అని పేరు. పరమార్థ భూతమై - ఆ వెలుగులకు ఈతడే పరమార్థస్వరూపుడు. వెలుగులు తన్నుమించి మరి విశ్వమునందున వేరుచోట లేవు - ఈ సూర్యభగవానుని మించిన వెలుగులు ఈ విశ్వంలో మరెక్కడా లేవు. ఈయనే సాక్షాత్తు విద్యల స్వరూపుడు. వెలుగుల నిధికిన్ - ఈయనే ఆ వెలుగుల నిధి. అలఘుడు - ఈయన తేలికవాడు కాదు. లఘువు కాదు అంటే అర్థం గురువు అని చెప్పడం. ఛందస్సు తెల్సినవాడే ఇలా చెప్పగలరు. అంటే ఈయనే మా గురువుగారు అని చెప్పడం.

శిష్యవత్సలుడు - శిష్యులపై వాత్సల్యం, ప్రేమ ఎక్కువ ఉన్నవాడు. అంబుధిశోషణ దాహమూర్తి - ఆయన సముద్రాన్ని ఎండగట్టగలడు అన్నారు. హనుమంతుడు దాటబోతున్నది సముద్రం.

మా గురువుగార్ని నమ్ముకుంటే సముద్రాన్నే సులభంగా దాటగలను అనుకున్నారు హనుమ. గురువుగారి మరో రూపమైన రామచంద్రమూర్తి అంత పని చేసారు. వెలుగులనిధికిన్ గురూత్తమునకున్ జగదక్షునకున్ నమస్కృతుల్- జగత్తుకు నేత్రమైన సూర్యభగవానునికి నమస్కారం అని చెప్పారు హనుమ.



అప్పయ్యదీక్షితులువారు 'ఆదిత్యస్తోత్రరత్నం'లో- **'బ్రహ్మజ్యోతిర్వివర్తః శ్రుతినికర ఘనీభావరూపః సమిన్థే'** అని చెప్తారు. పరబ్రహ్మ జ్యోతియే ఈ రూపంలో ఉన్నది అన్నారు. శ్రుతినికర అనగా వేదసమూహాలు. అవి ఘనీభవిస్తే సూర్యునిలా ఉన్నాయి అన్నారు. కాంతి రూపమంతా ఘనీభవించి ఎదురుగా కన్పిస్తోంది.

వ్యాసదేవుడు మార్కండేయపురాణంలో **తతస్తన్మండలీభూతం ఛాందసం తేజ ఉత్తమం** అన్నారు. ఆ మండలంగా కనబడుతున్న ఆయన ఛాందస తేజం. ఛందస్సు అనగా వేదమంత్రం అని అర్థం. ఛాందసము అనగా వేదమయమైనది. (మన బ్రతుకులన్నీ ఛాందసం కావాలి. ఛాదస్తం కావాలి).

ఛాందసతేజము అనగా మంత్రమయ తేజం. సర్వమంత్రాల రాశి ఆయన. ఒక్కసారి ఆయనకి నమస్కరిస్తే అన్ని మంత్రశక్తులు మనపై ఆయన ప్రసరింపచేస్తాడు. తన్మంత్రాధిదేవతలు కూడ మనల్ని అనుగ్రహిస్తారు. దేవాత్మకుడు అనగా వేదాత్మకుడు. వేదాత్మకుడు అనగా మంత్రాత్మకుడు.

వేదమునకు షడంగములు. 1.శిక్ష, 2.వ్యాకరణము, 3.ఛందస్సు 4.నిరుక్తము,

5.జ్యోతిషము, 6.కల్పము – ఈ ఆరు తెలిస్తే వేదాలకు అర్థాలు బాగా తెలుస్తాయి. ఇవి తెలియకపోతే ఒట్టి సంస్కృతంతో వేదాలకు అర్థం చెప్పలేం.

శిక్షాశాస్త్రంలో ఆదిత్యుని గురించి చెబుతూ–

**ఆదిత్యో మునిభిః ప్రోక్తః సర్వాక్షరగణస్య చ** అంటారు. సర్వ అక్షరగణాలకు ఆయనే ప్రభువు అని మునులు చెబుతున్నారు. అక్షరాధిపతి ఈయనే. ఈయనే ప్రణవస్వరూపుడు. ఓంకారస్వరూపుడు. ఓంకారం అక్షరాలకి అధిపతి. సూర్యుడే గురువు, ఐశ్వర్యకారకుడు, లక్ష్మీస్వరూపుడు, విద్యాస్వరూపుడు, శక్తిప్రదాత, వరప్రదాత – ఇలా ఏ భావనలో చూస్తే అది సూర్యుడే మనకి ఇస్తున్నాడు. ఏ భావం లేకుండా చూసినప్పుడు ఆయన పరబ్రహ్మ అనుకుంటే మనకి అన్నీ ఇస్తాడు.

ఇంత ధాటిగా చెప్పడానికి ఋషుల వాక్యాలే ప్రమాణాలు.

**ఘనవృష్టిః**

గొప్ప వర్ష స్వరూపుడు. సూర్యుడు వర్షకారకుడు. మనకు వర్షం కావాలన్నా ఆయన్నే ఆరాధించాలి. కూడని అతివృష్టి వచ్చినా ఆయన్నే ఆరాధించాలి. ఎందువల్లనంటే దాన్ని నియంత్రించేవాడు ఆయనే.



అందుకు రుద్రనమకంలో నమో వర్ష్యాయచ అవర్ష్యాయచ అన్నారు. వర్షం కలగడం నువ్వే. వర్షాభావంనువ్వే. వర్షాల మీద ఆయనదే కర్తృత్వం. ఘనవృష్టి –గొప్పవృష్టిని కురిపించువాడు. ఘనం అనగా మేఘం. పర్జన్యకారకుడు అని అర్థం తీసుకుని పర్జన్య స్వరూపుడు, వర్ష స్వరూపుడు అని రెండింటికి కలుపుకోవచ్చు.

సౌరశక్తి విశేషం చేతనే మేఘాలు ఏర్పడతాయి. ఆయన తన కిరణాల ద్వారా స్వీకరించిన జలాలనే మళ్ళీ మేఘాలుగా మారుస్తున్నాడు. అలా వాటిని ఘనీభవింపజేసి తిరిగి వర్షాలు కురిపిస్తున్నాడు. ఉప్పునీరును గ్రహించి తీయని నీరును కురిపిస్తున్న మహానుభావుడు సూర్యభగవానుడు. సర్వ రసాలనూ, మనకు పనికిరాని రసాలను కూడా గ్రహించి మనకు పనికొచ్చేదే ఇచ్చే దయామయుడే సూర్యభగవానుడు.

**అపాంమిత్రః**

సూర్యుడు ప్రపంచములో జలవ్యవస్థని నియమించువాడు. సూర్యుడు తాకగానే మనకు పొడి అనిపిస్తుంది గాని తడి పొడి రెండూ ఆయనే.

**'అగ్నీషోమాత్మకః సూర్యః'** అగ్నిస్వరూపుడుగా ఉన్నవాడు, సోమస్వరూపుడుగా జలములను సృష్టిస్తున్నవాడు ఆయనే. వీటి గురించి శాస్త్రాలయందు వివరించబడినది.

ఆయన అగ్ని స్వరూపం విద్యుత్తుగాను, జ్వాలలుగాను ఉంటే, ఆయన సోమస్వరూపం వర్షంగాను, చంద్ర స్వరూపంగా ఉంటుంది.

ఆయన స్వరూపమే చంద్రుడు.

'అపాంమిత్రః' జలాలకు మిత్రుడు, అనుకూలుడు. తన శక్తులను జలరూపంగా పరి గణింపచేస్తాడు కనుక అపాంమిత్రః అన్నారు.

సూర్యుని పరిణామరూపమే జలము.

**వింధ్యవీధీప్లవంగమః**

వింధ్యవీధిలో వేగంగా ఎగురుతూ, దూకుతూ వెళ్ళేవాడు ఆయనే అన్నారు. వేగాన్ని చెప్పడానికి 'ప్లవంగమః' అన్నారు.

ప్లవంగం అనే పేరు కోతికి ఉంది. సూర్యునికి కూడా ప్లవంగమని పేరు ఉంది. అలాగే సంవత్సరాలలో ప్లవంగనామ సంవత్సరం ఉన్నది.

సంవత్సరాల అరవై పేర్లు సూర్యునిపై ఆధారపడే వచ్చాయి. వికృతి, విరోధి, రక్తాక్షి ఇవన్నీ సూర్యుని శక్తి పేరులే.



అలా సంవత్సర నామములన్నీ ఆయనవే కనుక సంవత్సరాత్మకుడు సూర్యుడు.

ప్లవంగ అంటే మహావేగంగా వెళ్ళే శక్తులలో ఒక రకం. సూర్యకిరణాల గమనశక్తిలో రకరకాల పద్ధతులు ఉన్నాయి. ఆ పద్ధతుల బట్టి సూర్యునికి ప్లవంగం, హంస, గరుత్మంతుడు, వృషభం, అశ్వం అని పేర్లు వచ్చాయి.

అశ్వము అన్నప్పుడు వేదంలో హరయః అని వున్నది. హరులు అనగా అశ్వములు అని అర్థము.

**హరిదశ్వః** – హర్యశ్వాయ నమోనమః. గుఱ్ఱానికి హర్యశ్వ శబ్దాల బట్టే ఆంగ్లభాషలో HORSE అనడంలోని సామ్యం ఉన్నది. ఇలాంటివి చాలా కనిపిస్తాయి.

ఆయన కిరణాలకు 'ప్లవంగ'అన్న లక్షణం ద్వారా వింధ్యవీధిలో ప్లవంగం ఆయన. ప్లవంగం – దుముకుతూ (వేగంగా) వెళ్లేది.

'వింధ్యవీధి' అనగా 'ఆకాశవీధి' అని అర్థం. తెలుగులో ఆకాశాన్ని 'విను'వీధి అంటారు. వియత్ ఈ శబ్దాలు ఆకాశపరంగా చెప్తారు.

వింధ్యవీధి అనగా చాలా మందికి గుర్తుకు వచ్చేది వింధ్యపర్వతం. అక్కడున్న లక్షణాల బట్టి ఆ కొండకు ఈ పేరు పెట్టారు.

ఆకాశాన్ని దాని లక్షణం బట్టి ఎప్పుడు ఏ పేర్లతో పిలవాలో ఉంది. పృథ్వికి సంబం

ధించిన వరకు మనకు కనబడుతున్న సూర్యుడే ఆకాశంలో ఉన్నాడు. రాత్రి మనకు సూర్యుడు కనబడకపోయినా మరో చోట మరొక దేశంలో సూర్యుడు ఉదయిస్తున్నాడు. ఆయనకు విశ్రాంతి లేకపోయినా మనకు విశ్రాంతి నిచ్చాడు.

ఇలా చూస్తే వింధ్యవీధి అనగా దక్షిణాపథం (దక్షిణం వైపు). అందుకే వింధ్యదాటితే దక్షిణం వస్తుంది. వింధ్యవీధిని దక్షిణం వైపు చెప్పుకుంటారు.

ఇప్పుడు ఈ వాక్యం అంతా 'దక్షిణాయనం'లో వున్న సూర్యశక్తిని తెలియచేస్తుంది.

'ఘనవృష్టిః - అపాంమిత్రః - వింధ్యవీథీ ప్లవంగమః' అనే ఈ మూడింటిని జాగ్రత్తగా చూసినట్లయితే దక్షిణాయనంలో సూర్యుడు అపాంమిత్రుడు - జలములను కలిగించువాడు. వర్షఋతువు దక్షిణాయనంలోనే వస్తుంది.

మంచి వృష్టి కురిసేదంతా దక్షిణాయనంలోనే కదా!

ఉత్తరాయణం వచ్చిన దగ్గర నుంచి వర్షాలు తగ్గుముఖం పడతాయి. దక్షిణాయన సమయంలో సూర్యుని గమనం నుంచి మేఘాలు సృష్టింపబడి వర్షాన్ని ఇస్తూ మొత్తం జలవ్యవస్థను అనుకూలంగా ఉండేటట్లు చేస్తుంది.

**ఆతపీ మణ్డలీ మృత్యుః పిఙ్గలః సర్వతాపనః**
**కవిర్విశ్వో మహాతేజా రక్తః సర్వభవోద్భవః** (14)



**ఆతపీ**

'ఆతపీ మండలీ మృత్యుః పింగళః సర్వతాపనః' ఈ వాక్యం ఉత్తరాయణంలో గల సౌరశక్తిని తెలియచేస్తుంది. ఆతపం అనగా ఎండ. ఆసమంతాత్ తపతి - సంపూర్ణంగా తపింపజేస్తాడు. తీవ్రమైన తాపం కలిగించే ఎండ ఆయన రూపమే.

ఎండ రూపంలో ఉన్నవాడు కనుక 'ఆతపీ' అన్నారు. ఉత్తరాయణం ప్రవేశించిన దగ్గర నుండి తాపం పెరుగుతూ ఉంటుంది.

**మండలీ**

ఉత్తరాయణంలో ఆయన సంపూర్ణ మండలాకృతిలో మనకి గోచరిస్తూవుంటాడు. దక్షిణాయనంలో మబ్బులు ఇత్యాదులు క్రమ్మడం కనబడుతుంది. 'మండలీ' అనే మాటకు వృత్తాకారంగా, గుండ్రంగా ఉన్నవాడు అని అర్థం. సృష్టిలో అనేక భగవన్నిర్మాణమైన జ్యోతిస్స్వరూపాలు మండలాకారంగా, వృత్తాకారంగా ఉంటాయి.

హిరణ్మయమైన మండంలంలో పరంజ్యోతిస్స్వరూపునిగా ఆదిత్యునిగా ఆ పరమాత్మే

ఉన్నాడు. అలా ఆ మండలంలో వానిని దర్శించాలి. ఆ జ్యోతినే జ్యోతిర్లింగం అంటారు. మండల, వర్తులాకారమే శివలింగారాధనలో కూడా వచ్చింది.

ఆద్యంతరహితమైన తత్త్వానికి సంకేతం మండలం.

ఒక బిందువు పెద్దగా కనపడితే మండలం. ఒక మండలం చిన్నగా కనపడితే బిందువు.

బిందువు విస్తారమైతే వృత్తం. కనుక సూక్ష్మంగా ఉన్నప్పుడు బిందువు. విస్తరించి స్థూలమైతే వృత్తం. వృత్తం అనంతతత్త్వానికి సంకేతం. అనంతంగా ఉన్నదే వ్యాపిస్తుంది. ఆ మండలాకారంలో అనంత వ్యాపకత్వమైన పరతత్త్వాన్నే చెబుతున్నారు. అందుకే

**అఖండ మండలాకారం వ్యాప్తంయేన చరాచరం।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః॥**

ఆత్మజ్ఞానస్వరూపుడైన గురువును కూడా అఖండమండలాకారంగా చెబుతున్నారు. ఈ అఖండమండలాకారమైన చిహ్నమే లింగాకారం.

మండలీ అనే మాటకు సమూహం అని మరొక అర్థం. ఈయన ఒక పెద్ద మండలి. ఈయన చుట్టూ పెద్ద సమూహం ఉంటుంది. లోకంలో కూడా మనం ఆయనకు పెద్ద 'సర్కిల్' ఉందండి అంటూ ఉంటాం. ఆ 'సర్కిల్' అనేదే మండలం.



అందుకే దేవాసుర నమస్కృతం నుంచి మొదలుపెట్టారు.

**ఆదిత్యైః అప్సరోభిః మునిభిః అహివరైః గ్రామణీయాతుధానైః**
**గంధర్వైః వాలఖిల్యైః పరివృత దశమాంశస్యకృత్స్నం రథస్య**

మొత్తం 12 రకాల గణాలు ఆయన చుట్టూ ఉండి ఒక్కొక్కరు ఒక్కోరకంగా కొలుచు కుంటూ ఉంటారు.

**నిత్యం నృత్తైర్గీతై రథీశూగ్రహనుతివహనై రగ్రతఃసేవయా**

అప్సరసలు నృత్యాలతో, గంధర్వులు గానంతో, పగ్గాలు వ్యవస్థంతా చూసుకోవడానికి గ్రామణులు, త్రోవలో అడ్డువచ్చే వాళ్ళని ప్రక్కకు తొలగండిఅని చెప్పడానికి యాతుధానులు, వాలఖిల్యాది మహర్షులు దివ్యాలైన సౌరమంత్రాలతో స్తుతిస్తూ ఉంటారు. అవన్నీ వింటూ అనూరుడు నడుపుతున్న రథంలో పద్మాసనంపై కూర్చుని పద్మహస్తుడై మందహాస వదనంతో ప్రసన్నంగా భక్తుల్ని చూస్తూ ఉంటాడు ఆదిత్య మండలాంతర్వర్తి యైన పరమాత్ముడు.

అనూరుడు గరుత్మంతుని అన్నగారు. కదిలితే గరుత్మంతుడు, కదలలేకపోతే అనూరుడు. వీరిద్దరిది ఒకే తేజస్సు. అనూరుడు స్థిరశక్తి . గరుత్మంతుడు చరశక్తి (Dynamic

energy). ఇదే దానికున్న ప్రతీక. శక్తి మూలం ఆదిత్యభగవానుడు(Static energy).

**మృత్యుః**

తీవ్రమైన మారణం కలిగించే శక్తిని ప్రయోగించువాడు. సూర్యకిరణాలతోనే క్రిమి సంహారం జరుగుతుంది. ఇక్కడ ఆయన మారణ శక్తిని వివరిస్తున్నారు. ఉత్తరాయణ కాలంలో ఆయన తీవ్ర గ్రీష్మ ఇత్యాది లక్షణాలు కల్గిన కిరణాల శక్తిని గురించి చెప్తున్నారు. ఆ తీవ్ర తాపానికి ఎన్నో నశించిపోతూ ఉంటాయి.

మృత్యుః – పరమాత్మపరంగా చూసినపుడు మృత్యు స్వరూపంగా కలవాడు సూర్య భగవానుడు.

వింధ్యవీధి ఇత్యాది పదాలతో చూపించినప్పుడు మనలో నాడీ మండలములో సంచ రించే ప్రాణశక్తి స్వరూపమైన ఆత్మచైతన్యాన్ని వర్ణిస్తున్నాడు.దేవతగా భావించినప్పుడు ఆయనే మనపై అభీష్టాలను వర్షిస్తున్నాడు కనుక ఘనవృష్టిః.

మనం మృత్యువును కూడా భగవత్స్వరూపంగానే భావన చేస్తాం.

భారతీయసంస్కృతిలో అన్నీ ఆయన స్వరూపాలుగానే చెప్తారు. కొన్ని ఘోర స్వరూపాలు. కొన్ని అఘోర స్వరూపాలు. రెండూ ఆయనే స్వరూపాలే. ఎవరు తెల్సుకుంటారో వారికి మాత్రం ఆయన శుభస్వరూపుడు.



రుద్రంలో **అఘోరేభ్యో థఘోరేభ్యో ఘోరఘోర తరేభ్యః** అంటారు.

గ్రీష్మకాలంలో ఎండల రూపంలో, వర్షాకాలంలో కుంభవృష్టితో ఘోరరూపంగా ఈయనే ఉంటాడు. గ్రీష్మకాలంలో బాగా తపింపజేస్తే తప్ప వర్షాకాలములో కుంభవృష్టి కురిపించడు. అది ఆయనకు తెలుసు.

ఆయన దయ ఉంటే ఎండ కూడా మనకి చల్లని గొడుగై తీరుతుంది.

ఆ పరమాత్మ ఏవిధంగా కనబడినా క్షేమంకరుడే అనే భావన ఉండాలి.

**'ఆతపం ననింద్యాత్ వర్షం ననింద్యాత్ అన్నం న నింద్యాత్'** అని వేదం చెప్పింది.

అన్నాన్ని నిందించరాదు. వర్షాన్ని నిందించరాదు. ఎండను నిందించరాదు అవన్నీ పరబ్రహ్మస్వరూపాలే– అని వేదమాత నొక్కిచెప్పింది.

మృత్యువు కూడా ఆయన స్వరూపమే. మృత్యువు ఎంత దయామయుడో తెల్సుకోవాలి. మృత్యువు అనగా ఇంక పనికిరాని దేహం నుంచి జీవచైతన్యం బయటకి రావడమే.

పాడైన ఇల్లును వదలి మరొక ఇంటిలోకి ప్రవేశించినట్లు భావించాలి. ఇల్లు, ఒళ్ళు ఒకటే. మనం ఉన్న ఇల్లు మన దేహం. మనలో ఉన్న ఆత్మకు మన దేహమే ఇల్లు.

వ్యాసదేవుడు భాగవతంలో 'ఆత్మాగారాణి' అని సంబోధించాడు. ఒళ్ళే "నేను" అనుకుంటే ప్రమాదం. ఒళ్ళే "ఇల్లు" అనుకుంటే హాయి.

మనకి దేహం తపస్సుకి యోగానికి సాధనగా ఇవ్వబడింది. భోగానికి ఇవ్వబడలేదు. యోగ భూమిగా మలచుకోవాలి. దివ్యమైన ఈ దేహం క్షీణించినపుడు తీసివేయక తప్పదు. ఏ స్వామి ప్రాణాన్ని ఇస్తున్నాడో ఆయనే సమయం వచ్చినప్పుడు ఆ ప్రాణాన్ని లాగేస్తున్నాడు. అపుడు అది వరమే. సమయాన్ని చూసి సమయింపజేయడం కూడా చాలా అవసరం.

మృత్యువు అనుగ్రహించక పోతే క్షీణించిన దేహాలతో ఈ పృథ్వీ అంతా నిండిపోయి ఉండేది. ఎప్పుడు క్షీణించిందో అప్పుడు తొలగించడం ఆయన విధి.

ఈ దేహం "నేను" కాదు అని తెలిసినవాడికే శాంతి. అలాగే బాధించే దుష్టత్వం ఎప్పుడూ బ్రతికి ఉండడం ప్రమాదమే. కనుక అపమృత్యువుని తొలగించేవాడు ఆయనే. సకాలంలో మృత్యువు ఇచ్చేవాడు ఆయనే.

మృత్యువు ఆయన ఆధీనంలోనే ఉన్నది.

**పింగళః**



బాగా ఎఱ్ఱగా తీక్ష్ణంగా ఉన్నవాడు. ఉత్తరాయణ కాలంలో ఉదయసమయంలో, అస్తమయసమయంలో ఆయన జ్వాల చాలా తీక్ష్ణంగా పింగళ వర్ణం 'మంచి ఎరుపు రంగు' గా ఉంటాడు. అన్ని రంగులను తనలో కలిపేసుకునేవాడు. 'పింగ' అనే మాటకు అందరితో కలిసిపోయే వాడు అని అర్థం.

ఆ కలిసిపోయే స్వభావం ఆయనకి ఉంది. అందరిని తనలో కలుపుకోగలిగిన స్వభావం కలిగినవాడు.

పింగళనాడి మన శరీరంలో కుడివైపు ఉంటుంది. ఎడమవైపు ఇడానాడి ఉంటుంది. ఇడానాడికి చంద్రుడు అధిదేవత. పింగళనాడికి సూర్యుడు అధిదేవత. ఈ రెండూ ఆయన స్వరూపాలే. ఈ మధ్యలో సుషుమ్నానాడి ముఖ్యనాడి ఉంటుంది. పింగళనాడికి సూర్యుడు తన రూపంతో తానే అధిపతిగా ఉన్నాడు. ఇడానాడికి చంద్రరూపంతో సూర్యుడే అధిపతి భారతీయ సంస్కృతిలో శ్వాస గురించి ఎన్నో రకాలైన అద్భుతప్రయోగాలు చేసారు. యోగశాస్త్రం జాగ్రత్తగా పరిశీలిస్తే ఆ యోగశాస్త్రాన్ని మంత్రశాస్త్రంతో ఎలా కలిపారో తెలుస్తుంది. మనం యోగశాస్త్రం వేరు, మంత్రశాస్త్రం వేరు, పూజాపునస్కారం వేరు, ధ్యానం వేరు అని అనుకుంటాం.

భారతీయ సంస్కృతిలో తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం కాదు. అన్నీ ఒక్క

దగ్గర కలుస్తాయి. మనం పూజ చేసినపుడు ప్రాణాయామం చేస్తాం. పూజకి ముందు ప్రాణాయామం చేయాలి. దీని వల్ల శుద్ధులం అవుతాం.

శుద్ధులం అయితేగాని ధ్యానం చేయలేం. నిత్యం ప్రాణాయామం చేయడం వలన అది ధ్యానానికి హేతువు అవుతుంది.

ప్రాణాయామం మనస్సు నిలపడానికి పనికివస్తుంది. ప్రాణాయామం, ధ్యానం, ఆవాహనం ఇవన్నీ పూజలో వస్తాయి. ఇవన్నీ కలవాలి. అన్నం వండడానికి బియ్యం పాత్ర, నీరు, అగ్ని అన్నీ ఉండాలి. ఇవన్నీ ఒకదానికి ఒకటి సహకారులు. పరంపరాగతమైన సంప్రదాయాన్ని పొరపాటునైనా వదులుకోరాదు.

**పింగళః** అనే నామం నాడీవిజ్ఞానం గురించి చెబుతుంది. ప్రాతఃకాలంలో ఊపిరి వదిలినపుడు వారి శరీరతత్త్వం బట్టి కొందరికి కుడివైపు నుండి, కొందరికి ఎడమవైపు నుండి ఊపిరి వస్తుంది. ఒక్కొక్కరిలో ఒక్కో విధంగా ఉంటుంది.

బయట కాలానికి మనలో ఊపిరికి అనుబంధం ఉంటుంది. దీనిని బట్టే మనవాళ్ళు ఏ కాలంలో ఏది చెయ్యాలో చెప్పారు. ఈ రెండు వైపులా శ్వాసతీయడానికి ఎంత సమయం పడుతుంది అనేదానికి లెక్కలు ఉన్నాయి. మొత్తానికి - పింగళః అంటే పింగళనాడీ రూపంలో ఉన్నవాడు అని కూడా అర్థం.

**సర్వతాపనః**

అందరినీ తపింపజేస్తాడు. ఈ వాక్యమంతా ఉత్తరాయణకాలంలో సూర్యభగవానుని గమనాన్ని చెప్పారు. 'ఆతపీ' నామం నుంచి 'సర్వతాపనః' నామం వరకూ తాపం గురించే చెప్పారు. **తప** అనే ధాతువుకు **ఆలోచన** అని అర్థం. **తప ఆలోచనే, తప జ్ఞానే** అని రెండు ధాత్వర్థాలు చెప్పారు. ఆలోచించేవాడికే జ్ఞానం వస్తుంది. ఆలోచించని వాడికి ఏమీ లేదు. మన బుద్ధిని సరిగ్గా ఆలోచింపచేయాలి. గీతలో కృష్ణపరమాత్మ

**యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు।**
**యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥**

అన్నారు. యోగబద్ధమైన సాధనతో చేసే ఆలోచన నిజమైన తపస్సు అవుతుంది. ఆ తపస్సు ఏకాగ్రంగా చేయగలిగితే సృష్టిరహస్యాలు వాటంతట అవే బయటపడతాయి. శాస్త్రజ్ఞులు అందరూ ఎంతో ఆలోచన చేస్తేగాని మంచి విషయాలు తెలియబడవు. మనకి ఆలోచనని, బుద్ధికి చైతన్యాన్ని ఇచ్చేది **'ధియోయోనః ప్రచోదయాత్'.**

మన బుద్ధికి ఆలోచనారూపజ్ఞానం ఇచ్చే పరమాత్మస్వరూపుడు సూర్యభగవానుడే.

సంపూర్ణమైన జ్ఞానస్వరూపుడు ఆయనే. సర్వతాపనః మనందరి శరీరంలో వేడిని పుట్టిస్తున్నాడు. అలానే అందరినీ ఆలోచింప చేయగలిగే జ్ఞానప్రదాత సూర్యభగవానుడు. ఇందులో గురుస్వరూపాన్ని చెబుతున్నాడని భావించవచ్చు. వింధ్యవీధీ ప్లవంగమః దగ్గర నుంచి ఇంత వరకూ గురుస్వరూపంగా అర్థం చెప్పుకోవచ్చు.

కవిః

మనకి ఆలోచన, జ్ఞానం ఇస్తాడు కనుక ఆయనే జ్ఞానస్వరూపుడు. ఉన్నది ఏదో అది ఆయన ఇస్తాడు. దీపం కాంతిని ఇవ్వడానికి ఎక్కడ నుంచో తెచ్చి ఇవ్వదు. తనకాంతిని తాను ప్రసరింపచేస్తుంది. అలాగే భగవంతుడు జ్ఞానమివ్వాలంటే తన స్వరూపాన్ని తాను ఇస్తాడు. జ్ఞానం ఆయన స్వరూపం. ఆయన్ని మించిన కవి లేదు.

కవి అంటే 'కవిర్మనీషీ పరిభూః స్వయం భూః' – వేద మంత్రం. ఈయన కవి.

ఈయన 'మనీషి' అంటే మహామేధావి, గొప్పజ్ఞాని అని శ్రుతి చెప్పింది. ఈయనను మించిన మేధావి లేదు.

**'మేధావీ విక్రమః క్రమః'** అని విష్ణుసహస్రంలో అంటున్నాం. మహాతెలివైనవాడు. మేధస్సులకు అన్నింటికి మూలమైనవాడు కనుక మహామేధావి.



కవి అంటే మహాజ్ఞాని. అంతేకాదు **'కవిః క్రాంతదర్శీ'** అని మాట ఉంది. కవి వేదంలోని శబ్దం. కవి అనేమాట మంత్రానికి, ఋషికి, పరమాత్మకి మాత్రమే శాస్త్రం వాడింది. అందుకే గీతలో కృష్ణపరమాత్మ విశ్వరూపాన్ని అర్జునుడు చూసి పులకించి స్తోత్రం చేస్తూ

**కవిం పురాణమనుశాసితారమ్ అణోరణీయాం సమనుస్మరేద్యః**
**సర్వస్యధాతార మచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసఃపరస్తాత్**

అని స్తుతిస్తాడు. కవి అంటే క్రాంతదర్శి – వ్యాపకమైన చూపు కలవాడు. దాటిన చూపుకలవాడు. క్రాంతము, క్రమణము అంటే 'దాటుట' అని అర్థం. అంటే మన చూపు అంతా ఇంద్రియాలని, మనస్సుని అంటిపెట్టుకొని ఉంటుంది. ఇంద్రియాలని, మనస్సుని దాటిన సత్యాన్ని చూడగలిగేవాడు క్రాంతదర్శి.

మనం చూడలేని దాన్ని చూసేవాడు కవి. మనం ప్రకృతిలో ఒక పువ్వుని చూసి చాలా బాగుంది అనుకుంటాం. అదే కవి దానిని చూసి దాని మరో స్వరూపాన్ని చెప్తాడు. అందుకే ఆయనకు ఆ పేరు పెట్టింది శాస్త్రం. మనం చూడలేని ఒకశక్తిని, సత్యాన్ని ఆయన దర్శిస్తున్నాడు. ఇక్కడ దర్శనశక్తిని గురించి చెప్పాడు అని అనుకోవచ్చు.

ముందు చెప్పుకున్న సహస్రాక్షః నామం ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి. సూర్యుడు చూపుకు అధిదేవత. శరీర ఆరోగ్యంలో ఏ అవకరం వచ్చినా సూర్యుని ప్రార్థించాలి.

**త్వచిదోషాః దృశిదోషాః హృదిదోషాః యేఽ ఖిలేంద్రియజదోషాః**
**తాన్ పూషా హతదోషః కించిద్ రోషాగ్నినా దహతు**

**త్వచిదోషాః** – శరీరానికి వచ్చిన దోషం, **దృశిదోషాః** – నేత్రాలకు వచ్చిన దోషం, **హృదిదోషాః** – గుండెకు వచ్చిన దోషం. వేదంలో ఒక మంత్రం ఉద్యన్నద్య వివశ్వాన్. ఈ మంత్రం చెపితే చాలా మంచిది అంటారు. కాని ఈ మంత్రాలలో స్వరాది లోపాలు, సంస్కారాది లోపాలు వస్తే మళ్ళీ ప్రమాదం. సూర్యుడు మనమీద దయతో సాంబుడికి పన్నెండు శ్లోకాలు పైనుండి విసిరాడు. ఆ విసిరిన శ్లోకంలో మొదటి మంత్రమే ఇది.

**ఉద్యన్నద్యవివశ్వాన్ ఆరోహన్నుత్తరాన్ దివం దేవః**
**హృద్రోగం మమ సూర్యో హరిమాణం చాఽ ఽ శునాశయతు**

ఇది వేదమంత్రాలలో ఉన్నదానినే చిన్నమార్పులతో శ్లోకరూపంలో తెచ్చాడు.

ఋషి మంత్రాన్ని ఋషే మళ్ళీ మలచి ఇవ్వగలగాలి. అలా మనకోసం సాంబుడిని అనుగ్రహిస్తూ సూర్యుడిచ్చిన శ్లోకం. ఇందులో 'హృద్రోగం మమ సూర్యః హరిమాణం చ ఆశునాశయతు' – నా హరిమాణాన్ని, నా హృద్రోగాన్ని కూడా వెంటనే సూర్యుడు నశింపచేయలన్నాడు. దీనికి చాలా అనుభవాలు ఉన్నాయి. పన్నెండుకాకపోయినా ఈ ఒక్కశ్లోకం చదివినా గుండెకు సంబంధించిన రోగాలుగాని, చర్మానికి సంబంధించిన రోగాలు గాని ఉండవు. ఇందులో సందేహం లేదు.



'హరిమాణం' అంటే కామెర్లవ్యాధి. పచ్చకామెర్లు ఇత్యాదులు. అలాగే హృద్రోగం – గుండెకు సంబంధించినది. జబ్బులు పోగొడతాడని ఒక అర్థం చెప్పారు. కాని 'హృద్రోగం' అంటే లోపలి రోగాలు అంటే మానసిక రోగాలు.

'హరిమాణం' అంటే బయట కనపడే రోగాలు. లోపల జబ్బులు కొన్ని ఉంటాయి. ఒళ్ళంతా బాగానే కనపడుతుంది కాని మనస్సులో మానసికవ్యాధులు ఉంటాయి. మానసిక వ్యాధులను, శారీరక వ్యాధులను పోగొట్టువాడు అని అర్థం కూడా చెప్పారు ఋషులు. ఆధివ్యాధి నాశకుడు.

**సర్వాధివ్యాధిశమనం ఛాయాశ్లిష్టతనుంభజే**

ఉన్నతమైన స్థానంలో ఉదయిస్తున్న సూర్యభగవానుడు మన ఆధివ్యాధులను పోగొట్టు గాక! సూర్యుని ఉదయాస్తమయ వేళలలో, సంధ్యాసమయాల్లో ఆరాధన చేస్తే అన్నీ

ఇస్తాడు. కొందరు మా పిల్లవాడికి ఉపనయనం చేసాం గాని సంధ్యావందనం చేయడం లేదు అని అంటుంటారు. రెండుపూటలా సంధ్యావందనం చేయించితే వాడి గురించి మనం ఆందోళన చెందాల్సిన అవసరం లేదు ఆ సూర్యభగవానుడే అంతా చూసుకుంటాడు.

**ఉద్యన్త మస్తంయన్త మాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్సకలం భద్రమశ్నుతే అసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి య ఏవం వేద అసావాదిత్యో బ్రహ్మ**

ఉదయిస్తూ, అస్తమిస్తూ ఉన్న ఆ సూర్యభగవానుని ఎవరు ధ్యానిస్తున్నారో వారికి, అన్నీ భద్రాలే జరుగుతాయి.

**ఆయుఃపృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసమ్, మహ్యం దత్వా ప్రయాతుం బ్రహ్మలోకమ్**

సూర్యభగవానుడు ఆయుష్షు, సంపద, బ్రహ్మవర్చస్సు కూడా ఇస్తాడు. వర్చస్సు విద్య వల్ల వస్తుంది. ఆయుష్షు, ధనం అందరికీ కావాలి. మన పిల్లలకు కూడా ఇవి కావాలి. కొందరు ఉపాసనలు, పూజలు ముసలితనంలో చేసుకోవచ్చని అని పొరపడతారు. ముసలితనం వస్తున్నకొద్ది కర్మలు తగ్గించుకొని జ్ఞానవిచారణ పెంచుకోవాలి.



ప్రతివారికి ఆయుష్షు, సంపద కావాలంటే ప్రతినిత్యం భగవదారాధన చెయ్యాలి. భగవదుపాసనలు, ఆరాధనలు వృద్ధులకోసం అనుకోవద్దు.

కొంతమందికి చక్కెరవ్యాధి, రక్తపోటువ్యాధి వచ్చినప్పుడు వైద్యుడు వారిని ప్రతిరోజూ వ్యాయామం చెయ్యమంటాడు. అలా అని వ్యాధిగ్రస్తులు మాత్రమే వ్యాయామం చేయాలి అనడం ఎంత అజ్ఞానమో, ఆధ్యాత్మిక సాధనలు ముసలివాళ్ళకే అనుకోవడం అంత అజ్ఞానం.

మనం అజ్ఞానంతో సాంగత్యం చేసి పిల్లలను కూడా ఆధ్యాత్మిక సాధనల నుంచి దూరంగా పెడుతున్నాం.

చదువుకోవల్సిన వయస్సులో జీవితంలో సాధించవల్సిన వయస్సులో బుద్ధిని సరిదిద్దే దైవాన్ని ఉపాసిస్తే వారు తప్పుడు మార్గాలలో వెళ్ళరు.

తల్లిదండ్రులు పిల్లలకు సరియైన ఆలోచనలను ఇవ్వలేకపోవచ్చు. కానీ పరమాత్మ వాళ్ళ బుద్ధికి సరియైన నిర్ణయాన్ని ఇస్తాడు.

'బుద్ధిని ప్రేరేపించే ఓ దైవమా! నీకు నమస్కారం' అంటే చాలు. సంధ్యాకాలంలో సూర్యుని మన ఇష్టదైవరూపంతో ఉపాసించు కోవాలి. మన ఇష్టదేవతని సూర్యరూపంలో ఉపాసించాలి.ఇది ప్రతివాళ్ళూ చేయవలసినది.

## కంటి దేవుడు

'కవిః' అనే మాట చెప్పేటప్పుడు ఆయన కంటిచూపు, బుద్ధి అన్నీ బాగుచేస్తాడు. చూపు గురించి 'అక్షి ఉపనిషత్' అని ప్రత్యేక ఉపనిషత్ ఉన్నది. దీనిని సాధన చేసి, పోయిన కంటిచూపుని తెచ్చుకున్నవారు చాలా మంది ఉన్నారు.

ఢిల్లీలో ఒకప్పుడు ఒక విద్యాధిక కుటుంబంలో అన్నదమ్ములు అందరికి పేర్లు సూర్య నామాలే ఉన్నాయి. వాళ్ళ అమ్మగారికి తొలిసంతానం గర్భవిచ్ఛిత్తి జరిగిపోయింది. అపుడు సూర్యనారాయణునకు ప్రదక్షిణం చేయమని చెబితే అరసవిల్లి క్షేత్రంలో సూర్య నారాయణునకి ప్రదక్షిణ చేస్తే తరువాత మంచి సంతానం కలిగింది.

రెండోసారి గర్భం దాల్చినప్పుడు ఆమె ఈపని చేయలేదు. కలిగిన పిల్లలకి చూపు లేదు. మరోమారు గర్భవతైనపుడు సూర్యప్రదక్షిణలు చేసింది. తరువాత కలిగిన సంతానానికి చూపు ఉంది. ఇది వారి స్వానుభవం. ఐతే ఆ చూపులేకుండా పుట్టినవారు కూడా గొప్ప సంగీతవిద్వాంసులయ్యారు. ఇక్కడ విశ్వాసం కాదు అనుభవం. విశ్వసిస్తేనే అనుభవానికి వస్తుంది లేదా అవతలివాడి అనుభవాన్ని విశ్వసించండి.

'చక్షుష్మతీ విద్య' అని ఒకటుంది. 'చక్షుష్మతి' అనే దేవత సూర్యమండలంలో ఉంటుంది. మన కంటిలో కూడా ఉంటుంది. అందుకే సూర్యమండలంలో ఉన్న పరమాత్మ తేజస్సే మన కంటిలో ఉన్నది. ఆ దేవతను ధ్యానించవలసిన పద్ధతి చెప్తూ

**చక్షుస్తేజోమయం పుష్పం, కందుకం బిభ్రతీం కరైః**
**రౌప్యసింహాసనారూఢాం దేవీం చక్షుఃష్మతీం భజే**

**'చక్షుష్మతీదేవి'** ఒక చేతితో బంతి, మరొక చేతితో పువ్వు పట్టుకుని వెండిసింహాసనం మీద కూర్చుంటుంది. మన దేవతాకారాల విషయాలు తెల్సుకోవాలి.

ఇక్కడ వెండి సింహాసనం అంటే మన కంటి చుట్టూ ఉండే తెలుపు లేదా మన నల్ల గుడ్డు మధ్యలో ఉన్న తెల్లని బిందుస్థానం. అక్కడ సూక్ష్మరూపంలో ఈ చక్షుష్మతీదేవి ఉంటుంది. దేవతల మూర్తుల చేతులలో ఉండే వస్తువులకు ప్రతీకలు ఉంటాయి. అవి అక్కడ ఉపాసిస్తే శక్తి వస్తుంది.

దేవతలు, విగ్రహాలు, ఉపాసనలు ఉన్న మతంలో సంపూర్ణమైన జ్ఞానం ఉన్నది. అదృష్టం కొద్దీ మనం ఆ జ్ఞానం ఉన్న మతవిశ్వాసంలో పుట్టాం. ఇందులో బ్రతకడం అదృష్టం. ఇందులోనే మరణించడం మరీ అదృష్టం.

చేతిలో పుష్పం పట్టుకుందంటే అర్థం పుష్పం వికసనానికి సంకేతం. కంటిగుడ్డు

వికసించాలి. కన్ను వికసిస్తేనే ఏదైనా చూడగలగుతాం. తరువాత మరొక చేతిలో బంతి పట్టుకోవడంలో అర్థం గుండ్రంగా తిరగడానికి' సంకేతం.

మన కనుగ్రుడ్డు తిరగడం వల్లే దేనినైనా చూడగలుగుతున్నాం.

కనుగ్రుడ్డు తిరగకపోతే దేనినీ చూడలేం.

సూర్యుని చక్షుష్మతి అనే శక్తి మనకంటిని అనుగ్రహిస్తే మన కన్నులు పనిచేస్తాయి. పురాకృతసుకృతం ఉంటే పరమాత్మ మనకి ఆ శక్తిని ఇస్తాడు. లేకుంటే ఆ చూసే శక్తిని తొలగిస్తాడు.

మనలో ప్రతి ఇంద్రియానికి ప్రాణశక్తిని ఆయనే ఇస్తున్నాడు.

శాస్త్రాలలో చక్షుష్మతి మంత్రరాశి చాలా ఉంది.

**చక్షుర్నోదేవ స్సవితా చక్షుర్న ఉత పర్వతః**
**చక్షుర్ధాతా దధాతునః తమాదిత్యం నత్వా**
**చక్షుష్మతీ విద్యయా తమస్సుమతి**

అని ఈ చక్షుష్మతీ విద్య గురించి చెప్పారు. ఆదిత్యుని ఈ చక్షుష్మతీ విద్యతో నమస్కరిస్తే వారికి నేత్రాలు బాగుపడతాయి. మనకి ఉన్న రెండు నేత్రాలే కాక మనోనేత్రం కూడా బాగుపడుతుంది. మనం నిత్యం చేసుకోవడానికి వీలుగా దీనికో చిన్న మంత్రాన్ని కూడా చెప్పారు.



**"శ్రీ భగవతే సూర్యాయ ఆదిత్యాయ అక్షితేజసే నమః."**

సభలలో, బాహాటంగా బీజాక్షరసహితమైన మంత్రాలను చెప్పరాదు అనే నియమాలకి కట్టుబడి, బీజాక్షరరహితమైన మంత్రాలను ఏవి చెప్పవచ్చని ఋషులు నిర్దేశించారో అవి మాత్రమే ప్రస్తావించుకుంటున్నాం.

**విశ్వః**

విశ్వః అంటే సమస్తం. విష్ణుసహస్రంలో మొదటినామమే విశ్వం. సమస్తం ఆయనే. మనందరిలో ఆ సూర్యప్రకాశం చైతన్యరూపంగా అంతటా వ్యాపించి ఉంది. సూర్యప్రకాశం అంటే అందులో ఉన్న పరమాత్మ. ఇక్కడ సూర్యుని మండలంలాగ చూడకుండా సమస్త సృష్టి స్థితి లయకారకుడైన పరమాత్మగా ఉపాసిస్తున్నాం.

'ఆదిత్యో బ్రహ్మేతి ఉపాసితవ్యం' అని బ్రహ్మసూత్రాలలో చెప్పారు. ఆ ధర్మ సామ్యత ఈయనలో ఉండటం వలన ఈ మాట చెప్పారు. పరమాత్మ ధర్మాలన్నీ సూర్యభగవానుని లో కనబడుతున్నాయి. అంతటా వ్యాపిస్తూ దేనికీ అంటనివాడు పరమాత్మ. అది మనకి

సూర్యునిలో కన్పిస్తుంది. అన్నిటా తన కిరణాలను ప్రసరింపచేస్తాడు కానీ ఏ వికారం ఆయనకి అంటదు. స్వయంప్రకాశకత్వం, సృష్టిస్థితిలయ కారకత్వం కనబడుతుంది.

శాస్త్రములలో చెప్పిన పరమేశ్వర ధర్మాలు అన్నీ మనకు సూర్యునిలో కనబడుతున్నాయి. సూర్యుని పరబ్రహ్మగా ఉపాసిస్తే మనం పరబ్రహ్మని పొందగలం. కనక విశ్వః - సమస్తం ఆయనే.

ఇక్కడ మరొక అర్థం - మెలకువగా ఉంటేనే మన బుద్ధిశక్తులు, కంటిశక్తులు పని చేస్తాయి. మన లోపల ఉన్న జీవచైతన్యం జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ అనే మూడు అవస్థలలో మూడు పేర్లతో ఉంది.

జాగ్రదవస్థలో మనలో ఉన్న చైతన్యానికి పేరు విశ్వుడు. స్వప్నావస్థలో మనలో ఉన్న చైతన్యం పేరు తైజసుడు. సుషుప్తి అవస్థలో ప్రాజ్ఞుడు. మూడు అవస్థలలో ఉన్న జీవచైతన్యం ఒకటే.

తురీయ భూమికకు చెందిన పరమాత్మే జాగ్రదవస్థలో విశ్వరూపుడుగా ఉన్నాడు. విశ్వుడు అంటే మనలో మెలకువ రూపంలో ఉన్నవాడు.

సూర్యుడు పరమాత్మస్వరూపంగా బయట ఉన్నాడు. మనలో ఆయన మెలకువరూపంలో ఉన్నాడు. సూర్యుడు అంటేనే జాగ్రదవస్థ. మనం జాగ్రదవస్థలో ఉన్నప్పుడే ఆయన చైతన్యాన్ని తెల్సుకోగలుగుతున్నాం.



మెలకువ-జాగ్రత్ అందుకే పురుషస్సతతోత్థితః అని విష్ణుసహస్రంలో చెప్పింది. శరీరంలో ఉన్న ఇంద్రియాలన్నీ ఎప్పుడూ మెలకువగా(జాగరూక స్థితిలో) ఉండాలి. సూర్యభగవానుని ప్రార్థిస్తే ఆయన మనల్ని అజ్ఞానపునిద్ర నుంచి మేల్కొలిపి జ్ఞానాన్ని ప్రకాశింపచేస్తాడు.

**మహాతేజః**

ఇక్కడ విశ్వుడు మహాతేజస్స్వరూపుడు. గొప్పదైన స్వరూపం. ఎంత తేజస్సు అంటే తేజసామపి తేజస్వీ - ఆయన తేజస్సులకి కూడా తేజస్సు ఇచ్చినవాడు. మహాతేజ అంటే స్వయంప్రకాశ స్వరూపుడు, గొప్పతేజస్స్వరూపుడు, పరబ్రహ్మస్వరూపుడు అని కూడా చెప్పుకోవచ్చు. ఆయన పరంజ్యోతి. మహాతేజ - పరంజ్యోతికే ఈ మాట వర్తిస్తుంది. అన్నిటికి మించిపోయి ప్రకాశించేవాడు కనుక పరంజ్యోతి.

**రక్తః**

సూర్యోపాసనలో ఎరుపుదనానికి చాలా విశేషం ఉన్నది. ఆయన ఎర్రనివాడు. అందుకే

ఎఱ్ఱని వస్త్రాలు కట్టుకోవడం, రక్తచందనం ఆయనకు పూయడం ఇవి ఉపాసనలో చెప్పబడుతున్నవి. రక్తవర్ణప్రియుడు సూర్యుడు. రక్తం అంటే ఎరుపు అని అర్థంలో వాడతారు. ఇక్కడ మనలో ఉన్న రక్తం అని అర్థం కాదు.

మన శరీరంలో ఉన్న రక్తమునకు రుధిరం అని పేరు. రంగుబట్టి రక్తం అంటున్నాం కాని రక్తమంటే మనం అనుకున్నట్టు blood కాదు red. Blood red గా ఉంది కాబట్టి రక్తమని పేరు పెట్టుకున్నాం.

రక్తః అంటే ఎఱ్ఱనివాడు. అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగళః - ఉదయిస్తూనే సూర్యుడు ఎఱ్ఱగా కనపడతాడు. రక్త, రక్తి, అనురక్తి అనే మాటలు మనం లోకంలో వింటూ ఉంటాం. సంస్కృతంలో రక్తవర్ణాన్ని రాగం అంటాం. సంధ్యారాగం అని అంటాం. రక్తిమ-అనురాగం. **రక్త అంటే ఇక్కడ ప్రేమస్వరూపుడు అని అర్థం.** ప్రపంచం మీద ప్రేమ వల్లే ఆయన వస్తున్నాడు.

రవీంద్రనాథ ఠాగూర్ - ప్రతిసూర్యోదయం భగవంతుడికి ఇంకా ఈ ప్రపంచం మీద ప్రేమ ఉన్నది అనటానికి నిదర్శనం అన్నారు. ప్రతి ఉదయం ప్రేమ. ప్రతి అస్తమయం ప్రేమ. ప్రతి కదలిక ప్రేమ. లలితాసహస్రంలో **'అరుణాం కరుణా తరంగితాక్షీం'** అని ధ్యానశ్లోకాల్లో చెప్పారు.



సౌందర్యలహరిలో శంకరులవారు **'జగత్త్రాతుం శంభోర్జగతి కరుణాకాచిదరుణా'** - జగతిని రక్షించడం కోసం ఆ శంభుని కరుణే అరుణై కనిపిస్తున్నది అన్నారు. ఆ అరుణమే అమ్మ లలితాంబ. ఆమెయే రక్తస్వరూపిణి, ప్రేమస్వరూపిణి.

పరమాత్మకి ప్రపంచం మీద ఉన్న ప్రేమ, కరుణ ఎఱ్ఱని రూపంలో ప్రతి ఉదయం కనబడుతున్నది.

ఆ భానుమండలమధ్యస్థ అయిన అరుణస్వరూపిణికి నమస్సులు. అరుణోపనిషత్ చెబుతున్న మర్మం ఇదే. ఆ రక్తవర్ణమే సర్వభవోద్భవః అన్నారు.

**సర్వభవోద్భవః.**

సర్వభవః ఉద్భవః - అన్నీ కలగడానికి కారణం. సర్వభవాలకు అది ఉద్భవం. ఆ ప్రేమ చేతనే జగత్తు అంతా సృజింపబడుతున్నది. అందుకే ఈయన మహాతేజః రక్తః సర్వభవోద్భవః.

**నక్షత్రగ్రహతారాణామధిపో విశ్వభావనః**
**తేజసామపి తేజస్వీ ద్వాదశాత్మన్నమోస్తుతే** **(15)**

నక్షత్రగ్రహతారాణాం అధిపః - ఈయన నక్షత్ర గ్రహ తారలకు అధిపుడు. కొంతమంది ఈయన అనేక గ్రహనక్షత్రాలలో ఒకడు అనుకుంటారు. నక్షత్ర గ్రహ తారలకు అధిపుడు అని చెబుతున్నారు అని అనిపించవచ్చు. ఆదిత్యమండలంలో ఉన్న సర్వవ్యాపకపరం జ్యోతిని ఆదిత్యహృదయం వర్ణిస్తుంది. ఇక్కడ ఆ దృష్టితో చూడాలి.

సృష్టిస్థితిలయకారకుడైన పరమాత్మనే ఇక్కడ చెబుతున్నారు. 'ఎవ్వనిచే జనించు జగమె వ్వని లోపలనుండు లీనమై' శ్లోకంలో ఉన్నవానినే వర్ణిస్తున్నారు. కనుకనే సూర్యుడు ఎవరు?

**ద్యౌస్సచం ద్రార్క నక్షత్రం ఖం దిశో భూః మహోదధిః**
**వాసుదేవస్యవీర్యేణ విధృతాని మహాత్మనః**

అక్కడ ఏం చెప్పాడో ఇక్కడా అదే. నక్షత్ర గ్రహ తారాదులన్నింటికి కూడా ఈయనే అధిపతి. ఈ విశేషాన్నే పురాణాలలో

**నక్షత్రగ్రహ సోమానాం ప్రతిష్ఠా యోని రేవచ।**
**చంద్రాద్యశ్చ గ్రహాస్సర్వే విజ్ఞేయాః సూర్య సంభవాః॥** - భవిష్యపురాణం

సూర్యుడు అంటే సువతి ప్రేరయతి సృష్టించువాడు ప్రేరేపించువాడు. సూర్యుడంటేనే సృష్టికర్త అని అర్థం. ఈ సృష్టి కర్తయైన పరమాత్మ నక్షత్రగ్రహసోమానాం ప్రతిష్ఠా - నక్షత్ర గ్రహ చంద్రాదులన్నింటికి ఆధారం. యోని అనగా కారణం. ఈయనే ఆధారం. ఈయనే కారణం. కాబట్టి వీరందరూ సూర్యమయులు.

**విశ్వ భావనః**

భావనః అంటే కలిగించువాడు. సమస్తమును కలిగించువాడు అని అర్థం.

**తేజసామపి తేజస్వీ**

ఈయన తేజస్సులకే తేజస్సు.

**ద్వాదశాత్మన్! నమోస్తుతే**

ఇక్కడితో ఆదిత్యహృదయంలో ఒక భాగం పూర్తవుతుంది. ఇక్కడ నుంచి వరుసగా నమకం మొదలవుతుంది. నమకం అంటే నమస్కారం. సూర్యుడు నమస్కారప్రియుడు. అందుకే రుద్ర నమకం.

ఇక్కడ నుంచి 19 నమస్కారాలున్నాయి. ఇక్కడ 'నమోస్తుతే' అని వచ్చింది.

'నమస్కార ప్రియః సూర్యః' – నక్షత్ర గ్రహ తారలకు అధిపుడైన ఈయనే గ్రహమండలానికి కర్త. మనం చూస్తున్న గ్రహమండలం అంతా ఆయన కిరణాలే ఉన్నాయని చెప్పుకున్నాం. కిరణాలలో మన శరీరంలో కూడా గ్రహశక్తులు ఉన్నాయని చెప్పుకున్నాం. మన శరీరంలో సూర్యకిరణాలలో ఉన్న 9 గ్రహశక్తులు పనిచేస్తాయి. శరీరంలో ఉన్న గ్రహస్థానాలను చూస్తే...

1. హృదయానికి సరిగ్గా క్రిందిభాగంలో సూర్యస్థానం. అది మాణిక్యకాంతితో ఉంటుంది.
2. చంద్రుడు లలాటస్థానం – ముత్యపుకాంతి
3. కుజుడు నేత్రస్థానం –పగడపు కాంతి.
4. బుధుడు హృదయానికి పైభాగం– పచ్చకాంతి
5. గురుడు కంఠస్థానం – పుష్యరాగపుకాంతి
6. శుక్రుడు హృదయమధ్యం –వజ్రకాంతి
7. శని నాభి – నీలపుకాంతి
8. రాహువు ముఖములో ఉంటాడు –గోమేధికకాంతి
9. కేతువు ఫాలస్థానము– వైడూర్యకాంతి



ఇది శాస్త్రంలో చెప్పబడింది.

మనలో ఉన్న గ్రహస్థానాల స్పందన, సూర్యకిరణాలలో గ్రహాల స్పందన ఈ రెండిటికి ఉన్న అనుబంధం గురించి ప్రస్తావించడం జరిగింది. ఇది మనకి ఋషులు ఇచ్చిన విజ్ఞానం. మనలో వ్యాపించిన గ్రహకాంతికి కూడా మన హృదయాంతర్వర్తియైన ఆదిత్యుడే మూలం. అనంత విశ్వం ఇందులో చెప్పబడింది. నక్షత్రగ్రహతారకమైన సమస్త విశ్వం ఈయనే కలిగిస్తున్నాడు.

'ద్వాదశాత్మన్ నమోస్తుతే' ఇక్కడ నమస్కారం మొదలుపెట్టాం. ఇప్పటి వరకూ సూర్యభగవానుని వర్ణించారు, స్తుతించారు. కాని సూర్యభగవానుని సూటిగా చెప్పకుండా 'ఇతడు, ఇతడు' అని పరిచయం చేస్తున్నట్టు చెప్పారు.

ఇప్పుడు ఆయన వైపు తిరిగి నీకు నమస్కారం అంటున్నారు.

'ఓ భగవాన్ ఇంతవరకు వర్ణించిన స్వరూపం కలిగిన నీకు నమస్కారం.' ఆయన ఎవరు? ద్వాదశాత్మన్ –ఆదిత్యుని ద్వాదశసంఖ్యలో మనం చెప్పుకుంటాం.

**కతమ ఆదిత్యా ఇతి ద్వాదశావై మాసాః సంవత్సరశ్చ**
**యేత ఆదిత్యాయేతేహీదం సర్వమాదధానాయంతి**

అని 'బృహదారణ్యకోపనిషత్'లో మంత్రము కనబడుతున్నది.

సూర్యుడు ఒక్కడే పన్నెండుగా ఉన్నాడు అన్నారు. దానికి వేదం చక్కని వివరణ ఇచ్చింది. సూర్యుడు ఒక్కడే అయినా ఏడాది పొడుగునా ఒకేలా ఉండడు.

ఆయన **ఋతుకర్తా**- ఋతువులను కలిగిస్తాడు.

ఋతువులు 6, మాసాలు 12. పన్నెండుమాసాల్లో పన్నెండు రకాలుగా ఉంటాడు. ఆయన అలా ఉంటేనే కాలచక్రం నడుస్తుంది. కాబట్టి సంవత్సరాత్మకుడు సూర్యుడు. ఈ సంవత్సరకాలమే తిరిగి మళ్ళీ వస్తుంది. సంవత్సరమే ప్రధానకాలం. దీని ఆవృతే మిగిలిన కాలం.

సంవత్సర స్వరూపుడైన ఆదిత్యుని ఉపాసిస్తే సంవత్సరకాలంలో జరిగే మార్పుల అనుకూలత కలుగుతుంది. ఈ 12 మంది సూర్యుల పేర్లు వేదం చెబుతోంది.

1. ఇంద్ర, 2. ధాత, 3.ఖగ, 4.పూషా, 5.మిత్ర, 6.వరుణ, 7.అర్యమ, 8.అర్చి, 9.వివస్వాన్ 10.త్వష్ట, 11.సవితా, 12.విష్ణుః

దీనికి వేద ప్రమాణంలో **'నానా లింగత్వాత్ ఋతూనాం నానా సూర్యత్వం'** అన్నారు. అనేక ఋతువుల్లో అనేక లక్షణాలు ఉండటం చేత ఆ లక్షణకారకుడుగా భాసిస్తున్న ఆయననే నానాసూర్యులుగా చెబుతున్నాం.



కాని ఆయన 'ఏకః' అని ప్రతిపాదన చేసారు. ద్వాదశాత్మకుడుగా ఆయన ఉండటం వల్లనే కాలం నడుస్తోంది. ఈ పన్నెండునే మరో పేర్లతో- 1.మిత్ర 2.రవి 3.సూర్య 4.భాను 5.ఖగ 6.పూషా 7.హిరణ్యగర్భ 8.మరీచి 9.ఆదిత్య 10.సవిత 11.అర్క 12.భాస్కర. ఇలా ప్రసిద్ధంగా ఈ 12 పేర్లు చెప్పుకొని నమస్కారం చేయడం ఉన్నది.

లోకంలో ఒకే వ్యక్తికి రెండు మూడు పేర్లు ఎలా వ్యవహారంలో ఉంటాయో అలాగే ఆయనలో లక్షణాలని బట్టి రెండు మూడు నామాలు వచ్చాయి అనుకోవచ్చు.

ఈ ద్వాదశ నామాలని ద్వాదశ విధాలుగా నమస్కరించే పద్ధతి ఉన్నది. వీటిని యోగాభ్యాసంలో నమస్కారంగా చేస్తారు. అపుడు అది శరీరదృఢత్వం కోసం చేసే వ్యాయామం అనుకోకుండా సూర్యునికి చేస్తున్న నమస్కారాలు అని చేయాలి. అపుడు మన ఆరోగ్యం బాగుంటుంది.

"మిగిలిన వ్యాయామాలవలె కాకుండా భారతీయ యోగశాస్త్రపరంగా చేసే వ్యాయామం వల్ల శారీరక పుష్టిమాత్రమే ఇవ్వడం కాకుండా ఒక ఆధ్యాత్మికమైన ఆనందం లభిస్తుంది" అని కొందరు పాశ్చాత్యుల అనుభవం.

**ద్వాదశాత్మన్ నమోస్తుతే** – పన్నెండుగురు సూర్యులకి నమస్కారం. ఈయనకు అర్ఘ్యం 'మిత్రాయ నమః' ఇత్యాది నామాలతో ఇవ్వవచ్చును.

ఆదిత్యపురాణంలో సూర్యుడు స్వయంగా చెప్పిన మాట– 'తామ్రపాత్రతో ఇచ్చిన అర్ఘ్యం నాకు అత్యంత ప్రీతి' అన్నాడు. రాగికి, సూర్యశక్తికి ఏదో సంబంధం ఉంది.

రాగిపాత్ర రోజూ తోమి వాడాలి. రాగి పాత్ర యందు మంచి జలమును పోసి లేతగరికలు, అక్షతలు రెండూ కలిపి అందులో చందనం, ఎర్రగన్నేరు మొదలైన ఎర్రని పూలు వేసి సూర్యుని ఒక్కొక్క పేరుని స్మరిస్తూ ఆ నామానికి చతుర్థీ విభక్తి కలిపి ... ఉదాహరణకు 'మిత్ర', అనే నామాన్ని చతుర్థ్యంతం చేస్తే **శ్రీ మిత్రాయ నమః** అని నమస్కారం చేస్తూ మాటిమాటికి అర్ఘ్యం ఇవ్వాలి.

ఈ పన్నెండు నామాలు చెప్పి ఒక్కసారి అర్ఘ్యం కాకుండా, పన్నెండు నామాలకు పన్నెండు మార్లు ప్రాతఃకాలంలో అర్ఘ్యం ఇస్తే సూర్యభగవానుడు సంతోషించి మనకు ఆయురారోగ్యాలు, సౌభాగ్యం, పరమాత్మ ప్రాప్తి ప్రసాదిస్తాడు. పన్నెండు నామాలు ఉచ్చరించి ఏక పర్యాయమైనా ఇవ్వవచ్చు.



గరికలు గణపతికి కూడా ప్రీతి. గణపతికి, సూర్యునికి ఉన్న అనుబంధం చెప్పుకున్నాం. ప్రాతఃకాలంలో గణపతి శక్తే సూర్యునిలో వుంటుంది. మనకు భారతదేశంలో సూర్యాలయాలు అనేక చోట్ల ఉన్నాయి.

గుజరాత్‌లోని అహ్మదాబాద్‌కు 100 కిలోమీటర్ల దూరంలో గల మోధేరాలో సూర్యాలయం వున్నది. రాజస్థాన్‌లో ఓషియా అనే ప్రాంతంలో సూర్యాలయం ఉన్నది.

కాశ్మీరులో మార్తాండ మందిరం ఉన్నది. అది ముష్కరులచే ధ్వంసం చేయబడింది.

తంజావూరులో సూర్యన్ కోవెల్ అని ఉన్నది.

ఒరిస్సాలోని కోణార్క మందిరం కారణాంతరాల వల్ల ధ్వంసం అయ్యింది. అయినా అది పురాణ ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. కేరళలోనూ కొన్ని సూర్యాలయాలు ఉన్నాయి. కేరళలో మలయాళులు మీనమాసం అని ఒక మాసంలో అందరూ కూడా సూర్యుని ఉద్దేశించి దీపాలు వెలిగించి అంజలి ఘటిస్తారు.

అమెరికాలోని కాలిఫోర్నియాలో కొలరెడో అనే విశ్వవిద్యాలయం(The University of Colorado) లో 1995 సంవత్సరంలో Professor Jhon M.Melville అనే ఖగోళశాస్త్రవేత్త(Astrophysicist) వైశ్విక చైతన్య శక్తి (cosmos) మీద ప్రయోగాలు (research) చేస్తూ మన భారతీయ గ్రంథాలకు చెందిన స్కాందపురాణంలోని కాశీఖండం

చదివారు. ఆ కాశీఖండంలో వ్యాసదేవుడు ఏ లింగం ఎక్కడ వుందో వర్ణిస్తారు.

లింగాభిధాన మాలిక అని ప్రత్యక్షంగా ఎక్కడ ఏ లింగం ఉందో సూచిస్తూ వాటి దాశలను కూడా చెప్పారు.

ఈ ఖగోళశాస్త్రవేత్త స్కాందపురాణమును ఆధారంగా చేసుకుని ఒక మ్యాప్ తీసుకుని తిన్నగా భారతదేశానికి వచ్చాడు.

ఆయన కాశీలోని బెనారస్ విశ్వవిద్యాలయానికి వెళ్ళి అక్కడ Professor P B Sing అనే ఆయన్ని కలిసి ఈ విషయం చెప్పి మీ సహాయంతో నేను Cosmic Energy గురించి పరిశోధన చేద్దామనుకుని cosmos కి భూమికీ సంబంధించిన విజ్ఞానం గురించి తెలుసుకుందామని వచ్చాను. మీ సహాయం కావాలి ఆయన్ని కలిసారు.

అప్పుడు ఇద్దరు కలిసి పరిశోధనలో ఒక గ్రంథాన్ని రచించారు.

కాశీలో 12 సూర్యాలయాలు ఉన్నాయని కాశీఖండం చెప్పింది.

ఆలయం అంటే కట్టడం కాదు. క్షేత్రం ముఖ్యం. ఆ క్షేత్రంలో శక్తి ఉంటుంది .

Professor Jhon M.Melville తనతో తెచ్చుకొన్నపరికరాలు- G.P.S అంటే Global Positioning System,Radar ఇత్యాదుల సహా యంగా తీసుకుని మొత్తం ఈ పన్నెండు సూర్యదేవాలయాలని పరిశోధించాడు.

ఈయన వ్రాసిన ముగింపు వ్యాఖ్యాలను చూస్తే తెలుస్తుంది.

Each of the Twelve temples were located in such a way that it indicated the moment, speed and the intensity of light during the apparent moment of the Sun across the twelve signs of Zodiac.

సూర్యభగవానుడు రాశి చక్రంలో పన్నెండు రాశులలో సంవత్సరకాలం సంచరిస్తున్నప్పుడు ఆయన కాంతి గమనం, వేగం, తీక్షత, తీవ్రత ఒక్కొక్క రాశిలో ఉన్నప్పుడు ఒక్కొక్క ఆలయం గ్రహిస్తుంది. ఇలా ఈ పన్నెండు ఆలయాలు ఆయా ప్రదేశాలలో ఏర్పరచబడ్డాయి అని ఆయన యంత్రాల ద్వారా ఋజువు చేయగలిగాడు.

మనం ఆ క్షేత్రానికి వెళ్ళగలిగితే అక్కడ ఉన్న శక్తి, అందులో ఉన్న దివ్యత్వం మన వైపు ప్రసరిస్తుంది. లేదు అనడానికి అజ్ఞానం చాలు. ఉంది అనడానికి అన్వేషణ కావాలి. అన్వేషణ ఉంటేనే సిద్ధి.

ఇతను ఋజువు చేసిన అంశం- Cosmic Geometrical Pattern. దానితో

వీటిని కొలిచాడు. కాశీ ఏడు ఆవరణల యంత్రంలా ఉంటుంది. ఏడు ఆవరణలలో ఒక్కొక్క ఆవరణలో 8 చొప్పున 56 గణపతి ఆలయాలు వున్నాయి.

వాటిమీద ఆయన పరిశోధన చేసి ఆశ్చర్యపోయాడు. అలాగే ఆయన అక్కడ నుంచి చిత్రకూటానికి వెళ్ళి అక్కడ ఆలయాలను చూసి, వాటి స్థానాలను పరిశోధించి చెబుతున్నాడు. గణపతి దేవాలయాలను గురించి చెబుతూ–

The position of the temples in terms of cosmic geometry incredibly accurate . It is a mystery how the ancient Indians has fixed the sight for these temples.

సరిగ్గా cosmic geometry తగ్గట్టుగా ఈ క్షేత్రాన్ని మన ప్రాచీన భారతీయులు ఎలా నిర్దేశించారో? By mathematical calculation or through intuition and meditation ఇది అతను చెప్పినది. నేను యంత్రాలు, రాడారులు తెచ్చాను గాని అనాదికాలంలోనే భారతీయులు ఎలా చెప్పారో తెలీదు. కాబట్టి భారతీయ ఋషులు ఎలా కనుక్కున్నారో! గణితం ద్వారానా? స్వయం ప్రజ్ఞతోనా? ధ్యానంతోనా?

దీన్ని బట్టి భారతీయులు Higher stages of spiritual evaluation and the Indians relation with Cosmos. భారతీయ ఋషులు అతి ప్రాచీన కాలంలోనే వైజ్ఞానికంగా ఎదిగారు.



**ద్వాదశాత్మన్ నమోస్తుతే** – మనలోపల ఉన్న పరంజ్యోతి మనలో పన్నెండు చోట్ల ప్రకాశిస్తున్నది. అది అలా ప్రకాశిస్తేనే మనం కదలగలుతున్నాం.

ప్రకాశం అంటే చైతన్యం. ఇది పురాణం చెప్పింది.

సాంబుడు సూర్యభగవానుని స్తుతిస్తూ చెప్పిన శ్లోకం.

**కర్మ జ్ఞాన ఖ దశకం మనశ్చ జీవ ఇతి విశ్వసర్గాయ**
**ద్వాదశధా యో విచరతి సద్వాదశమూర్తిరస్తు మోదాయ**

'ఖం' అంటే ఇంద్రియాలు. 'ఖ' దశకం అంటే మనలో ఉండే 10 ఇంద్రియాలు. ప్రతి వారిలో కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు ఉన్నాయి. ఈ పదింటితో సంబంధం ఉండేది మనస్సు. ఈ పదకొండింటితో సంబంధం పెట్టుకుని, 'నేను సుఖ పడుతున్నాను, నేను కష్టపడుతున్నాను' అనుకొనేవాడు జీవుడు. ఈ పన్నెండింటిలోనూ ఆత్మజ్యోతియైన ఆదిత్యుని వెలుగే ఉంది. మన శరీరంలో ఉన్న 12 జ్యోతిర్లింగాలు అవే. మనలో ఉన్న ఆ పరంజ్యోతిని చూస్తే అదే పెద్ద జ్యోతిర్లింగం. ఇదే గీతలో కృష్ణపరమాత్మ

**ఇదం శరీరం కౌంతేయ! క్షేత్ర మిత్యభిధీయతే।**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విధః॥**

అంటారు. ఈ శరీరం దేవాలయం అన్నారు.

**దేహో దేవాలయః ప్రోక్తః.** ద్వాదశాదిత్యులు మనలోనే ఉన్నారు. మన కంటిలో ఆదిత్యుడు లేనిదే కన్ను చూడగలదా!

ఆదిత్యుడులేనిదే చెవి వినలేదు. ఇంద్రియాలు ఎన్ని ఉన్నాయో అంతమంది ఆదిత్యులు ఉన్నారు. ఇలా 12 మంది ఆదిత్యులకు మూలమైన ఆదిత్యుడు ఉన్నాడని తెలుసుకోవాలి. ఆయనే 12 రకాలుగా మనలో ఉన్నాడు. తదింద్రియగతమైన చైతన్యమే ఆదిత్యుడని తెలుసుకోవాలి.

ఎలాగైతే ఒకే ఆదిత్యుడు 12 మాసములకు 12 రకాలుగా ఉన్నాడో మనలో ఆత్మ అనే ఒకే ఆదిత్యుడు ఈ పన్నెండింటి యందు ప్రకాశిస్తున్నాడు.

మనం ఇంద్రియాల్ని చూడడం కాదు. ఇంద్రియాల్లో ఉన్న ఆత్మజ్యోతిని చూసి మనలో ఉన్న ఆదిత్యునకు నమస్కారం అనాలి.

సృష్టి అంతటికి మూలమైన పరంజ్యోతియే ఆదిత్యునిలో ఉండి మనల్ని కాపాడు తున్నాడు. సృష్టికి మూలమైన జ్యోతి.



ఆ జ్యోతి ఎవరు?...

ఆ చైతన్యం ఎవరు?...

ఆ ప్రకాశం ఎవరు?...

ఆ ప్రకాశం గురించి వర్ణిస్తూనే **యధా తమస్తన్న దివా న రాత్రిః న సన్నచాసత్ శివ ఏవ కేవలః** –ఈ సృష్టి ఆవిర్భవించక ముందున్న పరంజ్యోతియే సృష్టి ఆవిర్భావం జరిగినపుడు సూర్యమండలంగా భాసించింది. సూర్యమండలంగా రాకపోతే ఆ పరంజ్యోతి ఏకంగా ఉన్నది. ఆ జ్యోతే అన్నిటిని సృష్టించి, అన్నిటియందు లీనమై ఉండి, అన్నింటిని లీనం చేసుకుంది. ఆ లీనం చేసుకున్న దానిని లింగం అన్నారు.

పరంజ్యోతియే లింగం. అదే జ్యోతిర్లింగం. ఆ జ్యోతిర్లింగమే ఆదిత్యమండలంలో ఉందని ఉపాసిస్తాం. ఆదిత్యమండలంలో ఆ జ్యోతి పన్నెండుగా ఉన్నది గనుక జ్యోతిర్లింగాలను 'ద్వాదశజ్యోతిర్లింగాలు'గా అంటున్నారు.

ద్వాదశాదిత్యులకి, 'ద్వాదశజ్యోతిర్లింగాల'కి మనలో ఉన్న ద్వాదశస్థానాలకి సంబంధం ఉన్నది. భారతీయుల అద్భుతమైన సమన్వయాన్ని చెప్పుకోవాలి. ద్వాదశాత్మన్ నమోస్తుతే.

Underlins-English



దీనికి ప్రమాణంగా **సోహమర్కః పరంజ్యోతిః అర్కః జ్యోతిః అహం శివః** అనే మాట శాస్త్రంలో కనబడుతుంది.

> **నమః పూర్వాయగిరయే పశ్చిమాయాద్రయే నమః**
> **జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః** **(16)**

తూర్పు కొండకు నమస్కారం. పడమటికొండకు నమస్కారం అన్నారు. తూర్పువైపు ఉదయం సూర్యుడు కొండలమీంచి కనబడతాడు కాబట్టి ఆ కొండ తూర్పుకొండ. పడమటి వైపు కొండలలో అస్తమిస్తాడు కాబట్టి ఆ కొండ పడమటి కొండ అననక్కరలేదు. దీనికి కూడా రెండు అర్థాలు ఉన్నాయి.

**పూర్వగిరి** అంటే ఉదయం. **పశ్చిమాద్రి** అంటే అస్తమయం. రెండు సమయాల్లో సూర్యునికి నమస్కరించాలి అని ఇక్కడ చూపిస్తున్నారు.

అద్రి, గిరి అనే మాటలకు 'కదలకుండ ఉండేది' అనే అర్థంలో వాడతారు కాని ఒక 'కొండ' అనే ఆకారంలో కాదు.

పూర్వము అంటే తూర్పు. తూర్పున స్వామి ఉదయిస్తాడు. పడమట అస్తమిస్తాడు. ఎప్పుడైనా ఇది మారిందా? సృష్ట్యాది నుంచి ఇదే. మారకుండా ఉంది కనుకనే కొండ. అంటే తూర్పు కొండ, పడమర కొండ అంటే మారని స్థానాలు అని అర్థం.



ఇంకొక అంతరార్థం- భరద్వాజ మహర్షికి ఇంద్రుడు వేదాలను చూపిస్తాడు. ఆ వేదాలు కొండల రూపంలో కనబడ్డాయి.

వేదాలకి గిరులు అని పేరు. వాక్కులకు కూడా గిరులు అని పేరు ఉన్నది.

**'ఆత్మా త్వం గిరిజా మతిః'**

**'స్తోత్రాణి సర్వా గిరో.....'** అన్నారు కదా!

వేదాలకు గిరులు అనే పేరు. అందుకే గిరిశ, గిరీశుడు, గిరిజానాథుడు అని అంటున్నాం. గిరిజానాథుడు అంటే శివుడు. ఆ శివుడే సూర్యుడు. ఆయన ఎప్పుడూ కొండమీద ఉంటాడు.

మనం ఎక్కలేనంత ఉన్నతంగా, విస్తారంగా ఉంటే కొండ అని అంటాం. అనంతమై ఉన్నతంగా విస్తారంగా వేదాలు ఉన్నాయి.

వేదం రెండు భాగాలు. పూర్వ భాగం- కర్మకాండ, పశ్చిమ భాగం- జ్ఞానకాండ అని అంటారు. కర్మకాండలో భాగమే ఉపాసనా కాండ. వేదానికి 'కాండద్వయాత్మకం' అనే మాట వాడతారు.

**నమః పూర్వాయగిరయే** – వేదంలో పూర్వభాగంలో ఉన్న వేదరాశి అంతా 'కర్మకాండ'ను తెలియచేస్తుంది. **పశ్చిమాయాద్రయే నమః–** వేదంలో పూర్వభాగం తరువాత ఉన్న వేదరాశి అంతా 'జ్ఞానకాండ'ను అనగా 'వేదాంతా'న్ని తెలియచేస్తుంది.

వేదాంతం అనగా ఉపనిషత్తులు. 'అంతం' అంటే పశ్చిమం (తరువాతి భాగం).

పూర్వంలో ఉన్న గిరులు, పశ్చిమంలో ఉన్న అద్రి. గిరులు అంటే వాక్కులు, అద్రి అంటే కదలనిది. వేదాంతతత్త్వమైన బ్రహ్మమునకు పరిణామం లేదు. కర్మలు, వాక్కుల ద్వారా ఎన్ని విధాలుగా అయినా చేసుకోవచ్చు. పూర్వాయ గిరయే – ఇది వేదము నందు కర్మభాగము. సూర్యుడే కర్మల యందు యజ్ఞస్వరూపుడుగా ఉన్నవాడు. ఆయనే జ్ఞానకాండ పశ్చిమాద్రి యందు బ్రహ్మముగా చెప్పబడుతున్నవాడు.

**జ్యోతిర్గణానాం పతయే నమః**

విద్యలన్నీ వేదాల నుంచి ఉద్భవించినవి. ఈ విద్యలన్నీ సూర్యుడు అనే మహాజ్యోతి నుంచి వచ్చిన జ్ఞానజ్యోతులే. సూర్యుడే ఆ జ్ఞానజ్యోతులనే విద్యాగణాలకు పతి.

**దినాధిపతయే నమః**

విచారణ వలన కలిగే బ్రహ్మవిద్యకే 'పగలు' (దినం) అని పేరు. శంకరభగవత్పాదుల వారి ప్రమాణంతో పగలంటే బ్రహ్మ విద్యాజ్ఞానం, శాస్త్రాల వలన కలిగిన బ్రహ్మజ్ఞానానికి సూర్యుడే పతి. అనగా వేద ప్రతిపాద్యమైన పరతత్త్వం.



**జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమో నమః**
**నమో నమః సహస్రాంశో ఆదిత్యాయ నమో నమః (17)**

జయాయ జయభద్రాయ– జయస్వరూపుడు. జయం అంటే అన్నింటినీ మించుట. అన్నింటినీ మించిపోయినవాడు కనుకనే జయ స్వరూపుడు. ఆయన జయం, భద్రం ఇస్తున్నాడు. ఎవరి జయం భద్రమవుతుందో ఆయనే లోక క్షేమంకరుడు. అన్నింటినీ మించిపోయిన ఆయన లోకానికి భద్రం కలిగిస్తున్నాడు.

**విశ్వాని దేవస్సవితా దురితాని పరా సువ**
**యద్భద్రం తన్న ఆసువ**

అని వేదం మంత్రం. ఓ స్వామీ నీ దయ వల్ల మేము దురితం నుంచి బయటపడతాం. ఏది భద్రమో దానిని నువ్వు మాకు కలిగిస్తావు. సూర్యభగవానుడు భద్రప్రదాత.

**"ఉద్యంతమస్తం....... భద్రమశ్నుతే"** అని వేదం. ఆయనే భద్రం ఇచ్చేవాడు.

ఆయన్ని ఉపాసించిన వారికి జయము, భద్రము రెండూ ఇస్తాడు. జయము అంటే చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధి.

**హర్యశ్వాయ నమో నమః**

ఈ నామం యొక్క అర్థాన్ని ముందు ప్రస్తావించుకున్నాం

**నమో నమః సహస్రాంశో**

వేలకొలది కిరణములు కలవాడు. ఈ నామాన్ని మునుపే విస్తారంగా వివరించు కున్నాం.

**ఆదిత్యాయ నమో నమః**

ఈ నామాన్ని కూడా ప్రస్తావించుకున్నాం.

> **నమ ఉగ్రాయ వీరాయ సారఙ్గాయ నమో నమః**
> **నమః పద్మప్రబోధాయ ప్రచణ్డాయ నమోస్తు తే** **(18)**

**నమ ఉగ్రాయ**



ఉగ్రుడు అంటే తీవ్రంగా ప్రకాశించువాడు. మించిపోవడాన్ని ఉగ్రత్వం అంటారు. ఆయన ఉగ్రుడు. ఆయనను మించి మరొకడు లేడు కనుక ఉగ్రుడు. ఉగ్ర నృసింహస్వామి స్వరూపంలో ఉన్న సూర్యభగవానునికి నమస్కారం.

రుద్రనమకంలో **'నమః ఉగ్రాయచ భీమాయచ'** అని పరమేశ్వరుని వర్ణించారు. ఆయన ఉగ్ర స్వరూపుడు.

ఉగ్ర అంటే 'ఉత్ గ్రసతి ఇతి ఉగ్రః' - పైకి లేపువాడు అని అర్థం.

ఈయన సంసార పంకంలో కూరుకుపోయినవారిని పైకి లేపుతున్నాడు. అలాగ ఉద్ధరించువాడు ఉగ్రుడు. ఉగ్ర శబ్దానికి సంసారం నుండి ఉద్ధరించువాడు అనే అర్థమును తీసుకోవాలి.

**వీరాయ**

ఆయనే వీరుడు. సూర్యుడు ప్రతాపశాలి. ప్ర-తాపం ఆయనదే. ప్రతాపం, ప్రకాశం, ప్రసన్నం అన్నీ ఆయనే. ఆయన ప్రసాద, ప్రతాప, ప్రకాశ గుణాలు కలిగినవాడు. ఉగ్రవీర... వీర అంటే 'విశేషేణ ఈరయతి ఇతి వీరః' విశేషంగా ప్రేరేపించువాడు.

రామచంద్రమూర్తి ఆ ఉగ్రవీర లక్షణాలనే చూపించబోతున్నాడు.

**సారంగాయ**

ఆయన వీరత్వంలో మహావేగం ఉంది. దానిని సారంగంతో పోల్చారు. సారంగం అంటే లేడి. ఆయన కిరణాలకు లేడి, ప్లవంగం, అశ్వం, హంస, గరుత్మంతుడు, వృషభం మొదలైన గమన లక్షణాలు ఉన్నాయి. లేడి ఎలా ప్రయాణిస్తుందో అలా సూర్యకిరణాలు ప్రయాణిస్తాయి అని చెబుతున్నారు.

సారంగపాణి అని శివుడికి పేరు. ఉపాస్యమూర్తిగా లేడి చేతిలో ఉన్నవాడు. పాణి అంటే చేయి(సంస్కృతంలో కరం). కరము అంటే కిరణం. సారంగపాణి అంటే మహా వేగం కలిగిన కిరణములు కలవాడు. సూర్యరూప శివుడు.

మరొక అర్థంలో- సారం గ్రహించువాడు సారంగుడు. ఆయన సారమును అంతటినీ పొందుతాడు.

'సారం గచ్ఛతి సారం గమ్యతే ' అని అర్థం చెప్పారు.

సూర్యుడు తన కిరణాలతో సృష్టిలో సారాన్ని లాగుతాడు. ఎవరు ఆయనని నమ్ముకుంటారో వాళ్ళని సారమునకు చేర్చుతాడు. ప్రపంచమనే పండులో సారం పరమాత్మే. ఆ సారాన్ని యోగులు మాత్రమే గ్రహిస్తారు. మనం మాత్రం పండు చూస్తాం.

**కర్పూర గౌరం కరుణావతారం**
**సంసార సారం భుజగేంద్ర హారం**
**సదా వసంతం హృదయారవిందే**
**భవం భవానీ సహితం నమామి**

అని అంటాం. ఆయన విశ్వసారం. ఆ విశ్వసారమైన పరమాత్మని పొందించేది ఆయనే. తన దగ్గరకు తానే లాక్కుంటాడు అదే సారంగాయ. సారమైన పరమార్థాన్ని పొందించువాడు.

**నమః పద్మప్రబోధాయ**

ప్రబోధము అంటే మేలుకొలుపు. పద్మాలను మేలుకొలుపుతాడు. ఆయన రాగానే పద్మాలు వికసిస్తాయి. వికసనము చేయువాడు. అజ్ఞానంతో ముడుచుకుపోయిన మన హృదయపద్మాలను, జ్ఞానంచేత వికసింప చేస్తాడు.

**ప్రచండాయ నమోనమః**

కొన్ని గ్రంథాలలో మార్తాండాయ అని ఉన్నది కానీ ప్రచండాయ అనే ఎక్కువ గ్రంథాల్లో ఉన్నది. కనుక మార్చుకోవచ్చు. మార్తాండాయ అంటే తప్పులేదు. ప్రచండాయ అంటే బాగుంటుంది.

> బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసే
> భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః (19)

**బ్రహ్మేశానాచ్యుతేశాయ**

ఈయన బ్రహ్మకి, ఈశానునకు, అచ్యుతునకు ప్రభువు, ఈశ్వరుడై ఉన్నాడు. బ్రహ్మ విష్ణు రుద్రులకు ప్రభువు.

మన వైదిక సంస్కృతి 'సృష్టిలో ఒకే పరమాత్మ ఉన్నాడు' అని చెప్తోంది. ఆ పరమాత్మే సృష్టి చేయాలనే సంకల్పం వచ్చినపుడు పరమేశ్వరుడు అవుతాడు. సృష్టికి అతీతంగా ఉంటే పరమాత్మ. ఆ పరమేశ్వరుడు సృష్టి చేసేటపుడు బ్రహ్మ, స్థితి చేసేటపుడు అచ్యుతుడు, లయం చేసేటపుడు రుద్రుడు. ఆయనే ఈయన.

ముగ్గురికి మూలమైన ఆ తేజస్సును బ్రహ్మ- ఈశాన- అచ్యుత- ఈశానాయ అంటే అర్థం బ్రహ్మ విష్ణు రుద్రులకి కూడా మూలమైన పరంజ్యోతి.

ఆయనే ముగ్గురిగా వచ్చాడని అర్థం. సాక్షాత్ ఈశ్వరుడు.

**సూర్యాయ**



ఈ నామం యొక్క అర్థాన్ని ముందు వ్యాఖ్యానించుకున్నాం.

**ఆదిత్యవర్చసే**

ఖండము కాని తేజస్సే ప్రకాశముగా కలవాడు.

**భాస్వతే**

తస్యభాసా సర్వమిదం విభాతి- అని ఉపనిషత్తు చెప్పినట్టుగా ఆయన ప్రకాశమే అంతటా వున్నది.

**సర్వభక్షాయ**

ఈయనే అన్నింటిని భక్షించువాడు.

ఈ నామంలో సూర్యుని లయకారకత్వమును చెబుతున్నారు.

**రౌద్రాయ వపుషే నమః**

ఇక్కడ అప్పయ్యదీక్షితులు చమత్కారం చూపించారు.

దీనికి వ్యాఖ్యానం ఆయన చక్కగా చెప్పారు. రౌద్రాయ వపుషే నమః.

రౌద్రమైన శరీరం కలవాడు. ఇక్కడ వరకు ఆయన శరీరమనే మాట ఎక్కడా రాలేదు. ఇంత వర్ణించిన వాడి శరీరాన్ని చూపిస్తున్నాడు.

అంటే అర్థం సర్వ దేవాత్మకుడై త్రిమూర్తులకు మూలమైన రుద్రభగవానుడైన పరమేశ్వరుడికి నమస్కారమని చూపిస్తున్నారు.

లోతుగా పరిశీలిస్తే **రుద్ర నమక మంత్రాల రహస్యమే ఆదిత్య హృదయం.**

ఆ రుద్రోపాసననే అగస్త్యమహర్షి రామచంద్రమూర్తికి గుర్తు చేశాడు.

రామచంద్రమూర్తి శివారాధన చేశాడు. ఆ శివతత్త్వాన్నే ఇచ్చారు అని అప్పయ్య దీక్షితుల వారు చక్కగా చెప్పారు.

**రౌద్రాయ వపుషేనమః** - రుద్రస్వరూపుడైనవాడు. రుద్రుని శరీరమే ఆదిత్యుడు. ఆదిత్యహృదయంలో రుద్రనమక చమక సారం అంతా ఉంది.

రుద్ర అంటే 'రుత్ దుఃఖం ద్రావయతి' - దుఃఖాన్ని పోగొట్టువాడు. అలాగే రుజాన్ ద్రావయతి - రోగాలను పోగొట్టువాడు.

**తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే।**
**కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః॥** **(20)**

**తమోఘ్నాయ**

ఈ నామాలన్నింటికీ 'ఘ్న వచ్చింది. 'ఘ్న' అంటే నశింపచేయుట. తమోఘ్నాయ అంటే తమస్సును పోగొట్టువాడు. చీకటిని నశింపచేయువాడు.

**హిమఘ్నాయ**

హిమఘ్నాయ - మంచును నశింపచేయువాడు.

**శత్రుఘ్నాయ**

శత్రుఘ్నాయ - శత్రువులను నశింపచేయువాడు.

**అమితాత్మనే**

అనంతముగ విస్తరించువాడు.

**కృతఘ్నఘ్నాయ**

సృష్టిలో యజ్ఞమే కృతజ్ఞత. యజ్ఞజీవితం వదలి వేస్తే కృతఘ్నత. మనకు జన్మను ఇచ్చినందుకు తల్లిదండ్రులను, పితరులను, మనఇంద్రియాలకి ఈ విశ్వంలో ఎన్నో ఇచ్చిన దేవతలను, ఈ జ్ఞానాన్ని అందించిన ఋషులను, ఈ జీవితంలో సహకరిస్తున్న సాటిమానవులను, మనతో సహజీవనం చేస్తూ అన్ని విధాలుగా పోషిస్తున్న ప్రకృతిని మనం కృతజ్ఞతతో నిరంతరం ఆదరించాలి.

ఈ ఐదింటిని జాగ్రత్తగా చూచుకోవటమే కృతజ్ఞత. ఈ ఐదు పంచయజ్ఞాలు.

అది వదిలేస్తే కృతఘ్నత. ఆ కృతఘ్నతా దోషం ఉన్నవారికి భూమి మీద బ్రతికే అర్హత లేదు.

దేవతల పట్ల కృతజ్ఞత ప్రకటించాలి. కృష్ణపరమాత్మ 'కృతజ్ఞత లేకుండా ప్రపంచంలో బ్రతికే వాడిని దొంగ' అన్నాడు.

'పంచయజ్ఞప్రియా' అని అమ్మను కీర్తించారు. ఈ పంచయజ్ఞ జీవితం ఎవరు సక్రమంగా జరపరో వారు కృతఘ్నులు. వారిని శిక్షించే ఈశ్వరుడీయన. కర్మఫల ప్రదాత. ఈ ఐదు పనులు చేయటమే సత్కర్మ.

ఈశ్వరుడు కర్మసాక్షి. మనం ఆయన ద్వారా అన్నీ పొందుతున్నాం కనుక దానికి తిరిగి మనం ఆయనకు కృతజ్ఞత ప్రకటించాలి. కృతఘ్నతా దోషాన్ని పోగొట్టువాడు.

**దేవాయ**

ప్రకాశ స్వరూపుడు..

**జ్యోతిషాంపతయే నమః**

ప్రకాశానికి ప్రభువైన ఆయనకి నమస్కారం. విద్యలకు ప్రభువు అని కూడా చెప్పవచ్చు. పరమాత్మ బాగా తెలియాలి అంటే మనలో శుద్ధసత్త్వగుణం ఏర్పడాలి. దాన్ని రెండు దుర్గుణాలు అడ్డుకుంటున్నాయి. అవి తమోగుణ, రజోగుణాలు. ఆ రెండూ పోతే గాని పరమాత్మ తెలియబడదు.



**తమోఘ్నాయ**- తమోగుణాన్ని నశింపచేయువాడు.

**హిమఘ్నాయ**-రజోగుణమును నశింపచేయువాడు. హిమ శబ్దం రజోగుణానికి ప్రతీక. అంతే కాదు. హిమ-జడత్వం. దానిని తొలగించువాడు.

**శత్రుఘ్నాయ** - జ్ఞానదృష్టిలో ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధం కలిగించేవే శత్రువులు. వాటిని నశింపచేస్తాడు అని అర్థం.

ప్రతికూలతలను అన్నింటిని తొలగించి మనలను తరింపచేస్తాడు.

**కృతఘ్నఘ్నాయ దేవాయ** - కృతమును తెలుసుకోలేక పోవటమే కృతఘ్నత. కృతము అనగా చేయబడినది. చేయబడిన ఈ ప్రపంచం ఆయనదే అని తెలుసుకోలేని అజ్ఞానమే కృతఘ్నత. ఆ కృతఘ్నతను తొలగిస్తాడు.

కృతమంతా ఆయనే అనే జ్ఞానం మనకు కలిగిస్తాడు. ఈ విశ్వమంతా ఆయనచేత చేయబడినది. కాని మనం ఆ ఎరుక లేకుండ బ్రతుకుతున్నాం. అదే కృతఘ్నతా దోషం. భగవంతుడు మనకు ఎంతో మేలు చేశాడు. ఆ మేలుకు తగ్గట్లు మనం గుర్తుపెట్టు

కుంటున్నామా? ఇంకేం కావాలి కృతఘ్నతకు? అలాంటి కృతఘ్నతా దోషం ఏదైతే ఉన్నదో అది ఆయనకు నమస్కరించటం వలన పోతుంది.

భగవంతుని కృతజ్ఞతతో నమస్కరించాలి కాని ఆశతో కాదు. భగవంతుడు మనకు ఏదో ఇస్తాడని నమస్కరించడం కాదు. ఎన్నో ఇచ్చాడని నమస్కరించాలి.

ఈ ప్రపంచంలో మనకి చాలా ఇచ్చాడు.

ఇవ్వని వాటిని మనం చూడవద్దు. ఇచ్చిన వాటిని దర్శించే ప్రయత్నం చేద్దాం. ఆయనకు మనం ఏమి ఇవ్వగలం అని ఆలోచించాలి. ఆయనకి వినయంగా నమస్కరించాలి. నమస్కారం అంటే ఏమిటి? మనస్సే నమస్సు. మనస్సుని సమర్పించడమే నమస్కారం. నమ్రతే నమస్కారం. మన అహంకారాన్ని అర్పించటమే నమస్కారం.

నేను, నాది అనే పొగరు తీసి అంతా నీవే, నీదే అనే జ్ఞానమే నమస్కారం. నమస్కారం మనల్ని 'అహం బ్రహ్మాస్మి'లోకి తీసుకువెడుతుంది. నమస్కారం వేదంలో ప్రణవంగా చెప్పబడుతుంది.

**తప్తచామీకరాభాయ వహ్నయే విశ్వకర్మణే**
**నమస్తమోభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే (21)**



**తప్తచామీకరాభాయ**

పుటం పెట్టిన బంగారం లేదా కరగబెడుతున్న బంగారంలా వెలిగిపోతున్నాడు.

**వహ్నయే**

అగ్ని స్వరూపుడు.

**విశ్వకర్మణే**

విశ్వకర్మ - అంటే సమస్తమైన కర్మలు ఆయనే.

ఈ ప్రపంచంలో నిరంతరం ఎన్నో కర్మలు జరుగుతున్నాయి.

ఈ కర్మలు అన్నీ ఆయన స్వరూపమే. ఈ కర్మలు చేస్తున్నవాడు ఆయనే.

ఆ కర్మరూపచైతన్యం ఆయనే.

**నమస్తమోభినిఘ్నాయ**

ఈయనే తమోగుణ నాశకుడు.

**రుచయే**

కాంతి స్వరూపుడు.

**లోకసాక్షిణే**

ఈయన కర్మసాక్షి. మనం చేస్తున్న ప్రతిదీ గమనిస్తూ ఉంటాడు.

ఆయన జడ పదార్థం కాదు. పెద్ద కన్ను ఆయన.

ఆ సూర్య రూప సదాశివుడు. ఒక్కసారి అగ్నిరూపలింగంగా ఆవిర్భవించగానే ఆ పైన చూడకుండా చూసానని చెప్పి బ్రహ్మదేవుడు అబద్ధమాడాడు.

ఆయన "నేను చూడలేదన్న విషయం ఎవడు చూడొచ్చాడు" అని అనుకున్నాడు. కాని ఆయన అబద్ధమాడగానే అగ్నిలింగంలోంచి పరమేశ్వరుడు వచ్చి అబద్ధమాడిన బ్రహ్మ తలను గిల్లేసాడు.

అగ్నిలింగంగా ఆయన ప్రతిదీ చూస్తూనే ఉన్నాడు.

కాబట్టి ఆయన చూడడం లేదు అనుకోవద్దు. ఆయనే పెద్ద జగచ్చక్షువు. కర్మసాక్షి. మామూలుగా చూడటం కాదు. సాక్షి అంటే సమగ్రంగా దర్శించువాడు.

ఈ నామంతో నమస్కారాలు పూర్తి అయ్యాయి.

మునుపు చెప్పిన స్వరూపాన్నే తిరిగి ఇక్కడ ఆవిష్కరిస్తున్నారు.



ఇవన్నీ ఆయనే అని "ఏష"తో మొదలుపెట్టి "ఏష"తో పూర్తి చేస్తున్నాడు.

> **నాశయత్యేష వై భూతం తదేవ సృజతి ప్రభుః।**
> **పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః॥** (22)

భూతం అనగా కలిగినది, ఉన్నది అని అర్థం. ఈ కలిగి ఉన్న సమస్త జగత్తుని ఈయనే లయింపజేస్తాడు. తిరిగి సృష్టిస్తాడు. మృతమైన దాన్ని తిరిగి జీవింపజేస్తాడని చెప్పుకున్నాం.

**పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః**

ఆ సృజించిన జగత్తుని పాలిస్తాడు. వర్షిస్తాడు. తపింపజేస్తాడు, జ్ఞానాన్ని ఇస్తాడు. (తపత్యేష అనే దానికి జ్ఞానప్రదాత అని అర్థం). ఈయన ఎక్కడుంటాడంటే

> **ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః।**
> **ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్॥** (23)

ఈ ఆదిత్యుడు మండలంలో ఉన్నాడని కాదు. మనలో నిద్రపోయినపుడు, మెలకువగా ఉన్నప్పుడు కూడా ఆయన ఉన్నాడు. ఆయన ఎప్పుడూ ఉన్నాడు. మార్పు అనేది మనది కాని ఆయనది కాదు. భూమి తిరుగుతోంది కాబట్టి ఉదయించాడు, అస్తమించాడు

అంటున్నాంగాని ఆయనకి ఆ రెండూ లేవు.

ఈ శరీరం పతనజననాల బట్టి ఆత్మ నశించింది, జీవించింది అంటున్నాం కానీ ఆత్మకి ఆ రెండూ లేవు. భూమియే శరీరం. ఆత్మయే సూర్యుడు. ఇలా మనం గమనించు కుంటూ నేర్చుకోవాలే గాని వేదాంతం అంతా ప్రపంచమే నేర్పుతుంది.

'జాగ్రత్ స్వప్నసుషుప్తీనాం సాక్షిభూత్యై నమో నమః' లలితను చెప్పినా, ఆదిత్యుని చెప్పినా రెండూ ఒక్కటే. మనలో ఉన్న జాగ్రత్ , స్వప్న, సుషుప్తులలో సాక్షిగా ఉన్న ఆత్మ చైతన్యమే ఉపాసించబడుతున్నాడు. ఆయననే వేదాంతపరంగా 'ఆత్మ' అని, కర్మపరంగా 'యజ్ఞ స్వరూపుడు' అని అంటున్నాం.

**"ఏష చైవాగ్నిహోత్రం చ ఫలం చైవాగ్నిహోత్రిణామ్"**

ఆ యజ్ఞంలో ఉపయోగించే అగ్ని ఆయనే. **అగ్నిగర్భః** - ఆయనే అగ్ని.

ఆయనే అగ్నిహోత్రం.

అగ్నిహోత్ర కర్మలకి ఫలం ఆయనే. అగ్నిహోత్ర కర్మలు కోరికతో చేస్తే ఉత్తమలోకాలు, కోరికలు లేకుండా చేస్తే కైవల్య హేతువైన చిత్తశుద్ధిని ఇస్తాయి. యజ్ఞఫలాన్ని ఇచ్చేవాడు,

యజ్ఞస్వరూపుడు ఆయనే. యజ్ఞానికి వినియోగించే వేదాలు ఆయనే. ఆ వేదాలు చెప్పిన సత్కర్మలు ఆయనే. క్రతువు అనగా సత్కర్మ, యజ్ఞములు అని రెండు అర్థాలు. 'వేదాశ్చ (దేవాశ్చ) క్రతవశ్చైవ' రెండూ ఆయనే.



**వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవ చ**
**యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః(సఏష పరమప్రభుః)(24)**

వేదాలు, అవి చెప్పినకర్మలు, వాటి ఫలాలు ఈయనే.

యాని కృత్యాని లోకేషు –ఈయనే ఈ లోకములో ఈశ్వరుడు. కృత్యములన్నీ చేస్తున్న ఈశ్వరుడు.

**'సర్వ ఏష రవిప్రభుః'**

ఈ సర్వమూ ఈ రవియే. ఈ ప్రభువే అన్నారు. ఉపనిషత్తులు చిట్టచివరకు ఒకమాట చెప్పాయి. అన్నింటి సారం ఒక్క ముక్కలో చెప్పాయి.

'సర్వం బ్రహ్మమయం జగత్' –సర్వం పరమాత్మమయం.

'సర్వఏష రవిప్రభుః' - సర్వం ఈ ప్రభువే. "ఈ"అని చెప్పడంలో పరమాత్మ అప్రత్యక్ష విషయం కాదు. ఆయన ప్రత్యక్ష విషయం. అపరోక్షానుభూతి.

ఆత్మ స్వరూపమైన పరమాత్మ నాలో 'నేను' అయి ఉన్నాడు అని తెలుసుకోవాలి.
**"ఏషః"** అను పదం ఉపనిషత్తులు చెప్పిన 'అహంబ్రహ్మాస్మి' అనే అపరోక్షానుభూతి.
ఆదిత్య హృదయం ఉపనిషద్రూపంతో పర్యవసిస్తూ ఉంది.

**'సర్వ ఏష రవిప్రభుః'** అనే మాటకి **'స ఏష పరమప్రభుః'** అను పాఠాంతరం కూడా ఉంది. ఈతడే పరమ ప్రభువు అని చెప్పారు. అగస్త్యుల వారు రామచంద్రమూర్తికి ఉపదేశించి చెప్తున్నారు. ఎప్పుడూ దీన్ని చేసుకో, ఎప్పుడైనా ఆపద కలిగినప్పుడు చేసుకో అని చెప్తున్నారు.

**ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాన్తారేషు భయేషు చ**
**కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ** (25)

కృచ్ఛ్రేషు అనగా అతికష్టమైన, క్లిష్ట పరిస్థితులలో, అదే విధంగా ఆపదలలో అడవులలో ఒంటరిగా ఉన్నప్పుడు, భయాలు కలిగినప్పుడు దీన్ని ఒక్కసారి చదువుకుంటే వాళ్ళకి ఏ ప్రమాదం ఉండదు. ఆ స్వామి వారిని కాపాడతాడు.



**పూజయస్వైనమేకాగ్రో దేవదేవం జగత్పతిమ్।**
**ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి॥** (26)

ఆయన్ని – 'ఏకాగ్రంగా పూజించవయ్యా' అని అగస్త్యుల ఉపదేశం. దేవదేవుడు జగత్పతి అనే భావంతో సూర్యభగవానుని పూజించాలి.

**సర్వాత్మకోయం లోకేశో మహాదేవః ప్రజాపతిః॥**
**సూర్య ఏవ త్రిలోకేశః మూలం పరమ దైవతమ్॥** (భవిష్యపురాణం)

అని శాస్త్రం చెప్తున్నది. **'ఏతత్త్రిగుణితం జప్త్వా'** మూడుమార్లు ఆదిత్యహృదయం చదివితే – ముమ్మారులు అనగా మనస్సు, మాట, శరీరం మూడింటితో త్రికరణ శుద్ధిగా జపించు. అంతేకాదు మూడుమార్లు పఠించడం (త్రిరావృతం) శక్తిని కలిగిస్తుంది.
అప్పుడు 'యుద్ధేషు విజయిష్యసి' యుద్ధంలో విజయం సాధిస్తావు. జీవితమే ఒక యుద్ధం. సాధనే యుద్ధం.

**అస్మిన్ క్షణే మహాబాహో రావణం త్వం వధిష్యసి।**
**ఏవముక్త్వా తదాఽగస్త్యో జగామ స యథాగతమ్॥** (27)

'ఓ మహాబాహో! – ఓ రామా! ఇప్పుడే రావణుని వధించు' అని అగస్త్యులవారు రామ

చంద్రమూర్తికి చెప్పి ఎలా వచ్చారో అలాగే వెళ్ళిపోయారు.

శ్రీరాముడు మనకి ఆదర్శం చూపడం కోసం అవతరించిన పరమాత్మ.

సద్గురువుని ఆశ్రయించు, ఉపాసించు తరిస్తావు అని మనకి చూపించాడు.

మన ప్రయత్నమే మనకి కవచం. అది మనకి ఎంత అవసరమో భగవదనుగ్రహం కూడా అంత అవసరం అని చెప్తున్నాడు.

ఇప్పుడు రాముడు ఏ దేవుని ఆశ్రయిస్తాడు.

తనని తానే ఆరాధించుకోవాలి. తన హృదయంలో ఉన్న తన స్వరూపాన్నే తాను అనుసంధానం చేసుకున్నాడు. అనుసంధానం చేసుకోనే విధానం

**ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోభవత్తదా।**
**ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్॥ (28)**

అది వింటూనే ఆయన శోకం పోయింది. ఉత్తమసాధకుడి లక్షణం ఇది. ఉత్తమ సాధకుడు ఉపదేశం లోంచే స్ఫూర్తి పొంది వెంటనే ఉత్సాహం తెచ్చుకుంటాడు. ధారణ చేస్తాడు. మనస్సుతో ఏకాగ్రంగా పట్టుకుంటే ధారణ. **ప్రయతాత్మవాన్** – ఏకాగ్రమైన బుద్ధితో ధారణ చేసాడు. గురువు నుంచి ఉపదేశం పొందగానే ఆనందం కలిగింది.



గురువాక్యాలందు విశ్వాసం, శ్రద్ధ వల్ల మంత్రం సిద్ధిస్తుంది. మొదట కావలసింది 'ఫలిష్యతి ఇతి విశ్వాసః' ఇది ఫలిస్తుంది అనే విశ్వాసం సిద్ధి లక్షణం. అందువల్ల 'నష్టశోకః' అదే విశ్వాసంతో, తరువాత ఏకాగ్రంగా సాధన చేసాడు.

సాధనకి ముందు మూడుమార్లు ఆచమనం, సాధనకి తరువాత మూడు మార్లు ఆచమనం చేసాడు.

**ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్షమవాప్తవాన్।**
**త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్॥ (29)**

ఆయన్ని చూస్తూ ఈ స్తోత్రాన్ని పఠిస్తూ అనుభూతిలో పరమానందం పొందుతున్నాడు. ఆచమనం చేసి జపించగానే, శుచియైన వాడై, శోక రాహిత్యం పొందినవాడై 'ధనురాదాయ వీర్యవాన్'– రాముడు మహోత్సాహంతో ధనుస్సు తీసి రావణునిపై ఎక్కుపెట్టి సంహరించడానికి సిద్ధమయ్యాడు.

**రావణం ప్రేక్ష్యహృష్టాత్మా యుద్ధార్థం సముపాగమత్।**
**సర్వయత్నేన మహతా వధే తస్య ధృతోఽభవత్॥ (30)**

నా సర్వ ప్రయత్నాలతో రావణుని తప్పకుండా సంహరిస్తాను అని ముందుకు రాగానే పైన గగన మండలంలోంచి సూర్యభగవానుడు వస్తున్నాడు.

**అథ రవిరవదన్నిరీక్ష్యరామం ముదితమనాః పరమం ప్రహృష్యమాణః।**
**నిశిచరపతిసంక్షయం విదిత్వా సురగణమధ్యగతో వచస్త్వరేతి॥ (31)**

మనం భగవంతుని భక్తితో స్తుతించితే మనల్ని చూసి ఆయన ఆనందిస్తాడు.

వెంటనే సూర్యుడు చాలా ఆనందించి రావణాసురుని నాశనం తెలిసి రాముడిని 'త్వర' అన్నాడు. ఇలా అన్నప్పుడు ఆ సూర్యభగవానుని (మండలం) చుట్టూ దేవతలందరూ ఉన్నారు.

**త్వర–** అనగా రామా విజృంభించు అని ప్రేరేపించాడు. పరమాత్మను ఉపాసిస్తే మనలో బుద్ధిని, శక్తిని ప్రేరేపించి తద్వారా మనకి విజయాన్ని ప్రసాదిస్తాడు.



**ధియోయోనః ప్రచోదయాత్.** ఇక్కడ ప్రచోదయాత్ అనే భావం 'త్వరేతి' అనే మాటలో పెట్టారు.

రామచంద్రమూర్తిలో ప్రేరణయే సూర్యనారాయణమూర్తి.

ఇలా ఆదిత్య రామమూర్తుల ఏకత్వాన్ని ఇక్కడ తెలుసుకున్నాం. అటు తర్వాత రావణుని వధించాడు. ఆ యుద్ధం ఎలా జరిగిందో వర్ణించలేమని వర్ణించాడు వాల్మీకి. ఈ విధంగా రావణవధ పూర్తి అయ్యింది.

శ్రీరామచంద్రమూర్తి లోకానికి క్షేమాన్ని కలిగించాడు. ఆదిత్యహృదయం శత్రునాశనం చేయిస్తుంది.

ఇప్పుడు భారతదేశంలో కనబడకుండా కనబడుతూ అనుక్షణం భయభ్రాంతులను సృష్టిస్తున్న అసురశక్తులను దునుమాడమని ఆదిత్యమండలాంతర్వర్తియైన ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తూ, ఆయన దివ్య చరణాలకు ఈ ఆదిత్యహృదయ ప్రవచన పుష్పమాలికను సమర్పించుకుంటూ స్వస్తి.

**సర్వం గజానన షడానన సమేత శ్రీ ఉమామహేశ్వర పరబ్రహ్మార్పణమస్తు.**

# సూర్యారాధన

ఆరాధన అనేది ఉపాసనకు సంబంధించింది. మనకున్న ప్రధాన మార్గాలు కర్మమార్గం, జ్ఞానమార్గం, ఉపాసనామార్గం. ఉపాసనామార్గం కర్మమార్గానికి పరిపూర్ణం. జ్ఞానమార్గానికి సహకారి. అది దానికున్న ప్రత్యేకత. కర్మమార్గంలో సకామంగానో, నిష్కామంగానో చేసే ఉపాసన క్రమంగా చిత్తశుద్ధికి హేతువు అవుతుంది. ప్రేమ పూర్వకంగా చేసే ఉపాసన భక్తిగా పరిణమించి క్రమంగా ఉపనిషత్తు ప్రతిపాద్యమైన తత్త్వంతో అనుసంధానం జరుగుతుంది.

కర్మకి, జ్ఞానానికి సంధిని కుదర్చగలిగే శక్తి ఉపాసనలో ఉంది. జ్ఞానమార్గప్రతిష్ఠాత శంకరభగవత్పాదులవారు ఉపాసనామార్గాన్ని సుష్ఠుపరచారు. జ్ఞానము, ఉపాసన వైదిక మైనవి కనుక ఆ వేదపరమైన ఉపాసనమార్గాన్ని షణ్మతాలుగా సుష్ఠుపరచినవారు శంకర భగవత్పాదులవారు.



షణ్మతాలు అని ప్రత్యేకించి ఎందుకు చెప్పారంటే కలి ప్రవేశిస్తే ఏది పడితే అది ఉపాసనగా, ఎవడు పడితే వాడిని దేవుడుగా తయారు చేసేయడం ఎక్కువ అవుతుందని గురువుగారికి తెలుసు. వేదం ప్రతిపాదించేదే దైవం అవుతుంది.

వేదం ప్రతిపాదించిన ఉపాసనా మార్గాలు ఆరు మాత్రమే అని ప్రధానంగా ప్రతిష్ఠ చేసి చూపించారు.

అవి షణ్మతాలు- 1. గాణాపత్యం, 2. వైష్ణవం, 3. శైవం, 4. శాక్తేయం, 5. స్కాందం 6. సౌరం. ఈ ఆరు వేదం అంగీకరించినవి. వీటి ప్రాధాన్యం నిగమాలలో ఎంత ఉందో ఆగమాలలో కూడా అంతే ఉంది. ఉపాసన సాత్త్విక, రాజస, తామస పద్ధతులలో చేసేవారు ఉన్నారు.

కాని ఎప్పుడైనా సాత్త్వికమైన ఉపాసనా మార్గం మాత్రమే చిత్తశుద్ధికి హేతువై మోక్షానికి హేతువు అవుతుంది. ఈ పద్ధతులన్ని మనకు వేదం ఇచ్చింది. వేదం ఇచ్చిన పద్ధతులు

క్రమంగా పురాణాల ద్వారా, ఆగమాల ద్వారా, ఇతర శాస్త్రాల ద్వారా విస్తరించి సామాన్యులకు కూడా చేరాయి.

ఉపవీతులైన వేదమార్గగాములు దగ్గర్నించి సామాన్యుల వరకూ సూర్యుని ఆరాధించే పద్ధతులు పురాణాలు అన్ని చక్కగా ఏర్పరిచాయి. సూర్యారాధన ఎలా చెయ్యాలి? అసలు సూర్యుని చూడవలసిన దృష్టి ఎలా ఉండాలి? ప్రస్తుతం ఉన్న వైజ్ఞానిక శాస్త్రం వేదపురాణ వాఙ్మయాలలో ఉన్న విషయాలను ఏ విధంగా అంగీకరించి గౌరవిస్తోంది? ఇలా అనేక అంశాలను కలబోసుకుంటూ సూర్యుడు అనుగ్రహించినంత మేరకు చెప్పుకునే ప్రయత్నం చేద్దాం.

సూర్యారాధన చెయ్యడం వలన భుక్తి, ముక్తి రెండూ లభిస్తాయనేది ఎందరికో పూర్వం నుంచి ఇప్పటి వరకూ స్వానుభవమే. భుక్తి, ముక్తులు ఇవ్వగలిగిన శక్తి సూర్యారాధనలో ఉంది. అయితే సూర్యారాధన చెయ్యకపోతే పాపం వస్తుందని శాస్త్రం చెప్తోంది. అందులో సందేహం లేదు.

సూర్య అపచారాలు కొన్ని ఉన్నాయి. సూర్యునికి సంబంధించి చేసే అపచారాలు ఎలా మనకు దుర్దశల్ని ఇస్తాయో శాస్త్రం చెప్తోంది. సంధ్యలలో నిద్రపోవడం, అనాచారాలు, దురాచారాలు ... ఇవన్నీ సూర్యాపచారాలు క్రిందికి వస్తాయి.



ఉపాసన చెయ్యకపోతే పోయాం, అపచారాలు చేసి పాపాలకు పోతావా? అని కూడా మందలిస్తోంది శాస్త్రం. దీనిని బట్టి సూర్యుని విషయంలో మనం ఎంత జాగ్రత్తగా ఎలా ఉండాలో పరిశీలించుకోవాలి. సూర్యభగవానుని ఉపాసించేవారికి, ఉపాసించని వారికి కూడా ఆయన నించి వచ్చే శక్తిలో భేదం ఎలా ఉంటుందో ఒక పాశ్చాత్యుడు పరిశోధన చేసాడు. వాళ్ళు పరిశోధిస్తేగాని తెలుసుకోరు. వాళ్ళకి శ్రద్ధప్రమాణం కాదు, అనుభవం కావాలి. ప్రత్యక్షంగా అతడు ఏ భక్తిభావం లేకపోయినా కాసిన్ని పువ్వులు ఒక రాగి పాత్రలో వేసి సూర్యునికి చూపించి దణ్ణం పెట్టిన తరువాత అదే తీక్షణమైన ఉష్ణోగ్రతలో నిలబడి పరీక్ష చేసుకుంటే శరీరంలో ఉష్ణోగ్రత మునుపటికంటె నార్మల్‌గా ఉందిట. దీనిని బట్టి సూర్యుడు ఎలా స్పందిస్తాడో తెలుస్తుంది.

మనం కాసింత నమస్కరిస్తే మన భక్తికి వందరెట్లు స్పందించే చైతన్యమూర్తి సూర్యభగవానుడు. సూర్యభగవానుడు పూర్తిగా కాంతిస్వరూపం. ఆ కాంతి ప్రేమ స్వరూపం. సూర్యుడు ప్రేమ స్వరూపుడు.

ఆయననించి వచ్చే ప్రతి కిరణం ప్రేమకి చిహ్నమే. భగవంతుని ప్రేమ అంటే కారుణ్యం.

ప్రేమ స్వరూపుడంటే కారుణ్యస్వరూపుడని అర్థం.

సూర్యునికి 'రక్తస్సర్వభవోద్భవః' అని పేరు. రక్తః అనే మాటకి అర్థం ఎర్రగా ఉన్నవాడు అని మాత్రమే కాకుండా రక్తము, అనురక్తి, ప్రేమ కలవాడు, కారుణ్యస్వరూపుడు అని తెలుసుకున్నాం. పరమేశ్వరుడు వేరు, సూర్యుడు వేరు కారు. పరమేశ్వరుడే తన తేజస్సుని సూర్యుని రూపంలో అందిస్తున్నాడు.

పైగా కొంతమంది ఉపనిషత్తులు దగ్గరకి వచ్చేటప్పటికి ఉపాసనలన్నీ కాదు, జ్ఞానమే ప్రధానం అంటుంటారు. ఉపనిషత్తులని కాస్త సునిశితంగా పరిశీలిస్తే ఉపనిషత్తులలో ఉపాసనలు అనే అంశం ప్రత్యేకంగా చెప్పవచ్చు. ఉపాసనకి మరొక పేరే విద్య. శ్రీవిద్య అనడానికి కూడా కారణం అది ఉపాసనే. అలాగే ఉపాసనలకి విద్య అనే పేరు చెప్పుకుంటే ఉపనిషత్తులలో అనేక ఉపాసనా విద్యలున్నాయి. దహర విద్య, అక్షి విద్య, మధు విద్య ఇలా చాలా ఉన్నాయి.

అంతరాదిత్యోపాసన అని ప్రత్యేకంగా ఛాందోగ్యోపనిషత్తు కూడా వర్ణిస్తోంది. ప్రశ్నోపని షత్తులో సూర్యుని ఎలా ఆరాధిస్తే తరిస్తారో ప్రత్యేక మంత్రాలు ఉన్నాయి. సూర్యుని ఎలా చూడాలో మనకి చూపిస్తారు. ఉపనిషత్తులన్నింటిలో కూడా ఆదిత్యోపాసన స్పష్టంగా చెప్పబడుతున్నది.



ఉపాసన అంటేనే భావనాబలంతో కూడినది. అక్కడున్న భగవచ్ఛక్తిని మనం భావన బలంతో అందుకో గలిగితే క్రమంగా ముక్తినే పొందుతామని స్పష్టంగా ఉపనిషత్తు చెప్తోంది. ఉపనిషత్ ప్రతిపాద్యమైన సూర్యోపాసనలు చాలా ఉన్నాయి.

అదేవిధంగా బ్రహ్మసూత్రాలలో కూడా దానికి సంబంధించిన అంశాలు కనపడు తున్నాయి. వేదంలో సౌర, అరుణ మంత్రాలు సూర్య తత్త్వాన్ని విస్తారంగా వర్ణించాయి.

అంతేకాదు లోతుగా పరిశీలించి చూస్తే మహిమాన్వితమైన పురుషసూక్తం, రుద్రనమక మంత్రరాశి కూడా సూర్యతత్త్వాన్నే అందిస్తున్నాయి. పైగా ఏ దేవతా నామాన్ని తీసుకున్నా అది సూర్యపరంగా చక్కగా అన్వయింపబడుతున్నది.

పాండిత్య ప్రతిభతో కాకుండా వైదిక సంప్రదాయంతో విష్ణుసహస్రాలు వెయ్యి సూర్యనామాలుగా ఋజువు చెయ్యవచ్చు. స్పష్టంగా 'రవిర్విరోచనః సూర్యః' ఇత్యాదులు ఉన్నాయి. పైగా మనం వాడే గోవింద, గోపతి శబ్దాలన్ని సూర్యునిపరంగానే అన్వయింప బడుతున్నాయి.

సూర్యోపాసన స్వచ్ఛమైన ఉపాసనగా మనకు కనబడుతున్నది. అందుకు సౌరమతం

ఒక ప్రత్యేక మతంగా ఒకప్పుడు బాగా వ్యాప్తిలో ఉండేది. ఇప్పటికీ కూడా గుజరాత్ రాష్ట్రంలో సూర్యోపాసన కనపడుతుంది. దాని పేరే సౌరరాష్ట్రం.

శంకరులు అన్ని మతాలని సమన్వయ పరుస్తూ అన్నింటిని ఒకే గొడుగులోకి తెచ్చి ఆరింటిని ప్రధానంగా చూపించారు. అందులో సూర్యోపాసన కూడా ఉంది. సౌర, అరుణ మంత్రాలు అన్నవి చాలా సంక్లిష్టంగా ఉంటాయి. విజ్ఞానం ఎప్పుడూ సంక్లిష్టమే. ఆ వేద విజ్ఞాన రాశిని అంతటిని తీసుకుని చాలా క్లుప్తరూపంలో మనకి పురాణాలు ఒక రస ప్రక్రియగా అందించాయి.

పురాణ కథలలో సూర్యకథలు మనం భక్తితో శ్రవణం చేస్తే యజ్ఞాలు చేసిన ఫలితాలు వస్తాయి. సౌరవిజ్ఞానాన్ని మనం ఆధునిక విజ్ఞానంతో కలబోసుకుని వేదవిజ్ఞానంతో సమన్వయపరిచి చూస్తే ఆశ్చర్యకరమైన అంశాలు చాలా బయటపడతాయి.

మన భారతీయ సదాచారాల గురించి బాగా ఆలోచన చేసి ప్రసుత్తం ఉన్న వ్యవ హారాలను పరిశీలిస్తే ఒక వేదనాభరితమైన అంశం స్ఫురిస్తుంది. మానవుడు పశుస్థాయిలో ఉండకుండా క్రమంగా దివ్యత్వానికి వెళ్ళడం కోసం భారతీయ మహర్షులు కొన్ని యుగాల తపస్సు ధారపోసి ఒక దివ్య విజ్ఞానాన్ని ఆవిష్కరించి మనకిస్తే, ఆ జ్ఞానాన్ని అందుకోలేక అజ్ఞానంతో దిగజారిపోయి జ్ఞానాన్నే అజ్ఞానమని నిందిస్తున్న దుస్థితిలో మనం ఉన్నాం. ఇలాంటి సమయంలో ప్రతివ్యక్తి మన సంస్కృతి గురించి పూర్తిగా తెల్సుకొనే ప్రయత్నం చెయ్యాలి.



మనం ఒక చైతన్యంతో సూర్యుని ఆరాధించాలి. సూర్యభగవానుడు ఎంత ప్రేమగా చైతన్యంతో చూస్తున్నాడో మనం కూడా అంత ప్రేమగా ఆయన్ని చైతన్యంతో నమస్క రించాలి. పశువుకి ఎప్పుడూ సూర్యునికి దణ్ణం పెట్టాలని స్ఫురించదు కదా!

సూర్యుడు మన మీద, పశువు మీద ఒక జడమైన వెలుగులా పడటం లేదు. తన ప్రేమనే అంతటా కురిపిస్తున్నాడు. ఈ సృష్టి రచనలో సూర్యభగవానుని ద్వారా పరమే శ్వరుని కృప మనకి లభిస్తోంది. సృష్టి, స్థితి, లయకారకుడైన పరమేశ్వరుడే సూర్యభగవానుడు అనే భావం కలగాలి. సూర్యారాధన అంటే ఈశ్వర ఆరాధన. సౌరులకు సూర్యుడే సర్వస్వం. బ్రహ్మ, విష్ణు, రుద్ర ఇవన్నీ సూర్యుడే అంటారు. అదీ సత్యమే. సూర్యుని ఆ భావనతో ఆరాధన చేస్తే అది పరిపూర్ణమవుతుంది.

ఆదిత్య హృదయం చాలా మందికి తెలుసు. ఆదిత్యహృదయం వ్యాప్తి ఒక ఉద్యమంలా జరగాలి. వాల్మీకి రామాయణంలో రామచంద్రమూర్తి లోకరక్షణకోసం చెయ్యబోతున్న

అసలైన సందర్భంలో ఆయనకు ఊతమైంది ఆదిత్యహృదయం. దాని వల్ల రామ చంద్రమూర్తి సాధించిన మహత్తరకార్యం ఏమిటి? లోక రక్షణ.

లోకరక్షణకి ఆదిత్య హృదయం చాలా ముఖ్యమని చెప్పడం వాల్మీకిమహర్షి ఉద్దేశ్యం. రాముడికి ఆదిత్య హృదయం ఎంత అవసరమో ప్రక్కన పెడితే లోకరక్షణకి ఆదిత్య హృదయం చాలా అవసరమని దీని వలన గ్రహించగలగాలి.

ఆదిత్య హృదయం అంటే ఏమిటి? ఆదిత్య హృదయాలు ఎన్ని ఉన్నాయనే దానికి వాల్మీకి రామాయణంలో ఆదిత్య హృదయం ఒక్కటే కాదు, భవిష్యోత్తరపురాణంలో ఏడు అధ్యాయాల ఆదిత్యహృదయం ఉంది.

ఆశ్చర్యకరమైన అంశాలు దానిలో కనపడతాయి.

అందులో మనకు వేదపాదాలతో ఆదిత్యస్తోత్రం అందరూ పఠించదగ్గ విధంగా సమకూర్చారు. అదే విధంగా ఆదిత్యమండలం, పురుషుడు ఇత్యాది వర్ణనలు, ఇంకా కొన్ని కేవలం ఉపాసకులకు మాత్రమే పనికి వచ్చే అంశాలు కనపడతాయి. అత్యంత సంక్షిప్తంగా చెప్పబడుతున్న ఆదిత్యహృదయం రామాయణం లోనిది.

ఇవి కాకుండా సూర్యభగవానునికి సంబంధించిన వాఙ్మయం మార్కండేయపురాణంలో ప్రత్యేకంగా కనబడుతుంది. మార్కండేయపురాణం అనగానే ఉపాసకులకి, భక్తులకి గుర్తుకు వచ్చేది చండీసప్తశతి, దేవీమాహాత్మ్యం.

దాని తరువాత పది అధ్యాయాలు సూర్యభగవానుని గురించి వర్ణన వస్తుంది. ప్రతి అధ్యాయం చివర శ్రవణ ఫలం చెప్పారు. సులభమైన పద్ధతులలో సూర్యోపాసన చేసి ఎలాంటి లాభాలు మనం పొందవచ్చు అనే దానికి పురాణ ప్రమాణాలు చారిత్రక ప్రమాణాలు, ఇటీవల కాలంలో వైజ్ఞానిక ప్రమాణాలు వేద సమ్మతమైనవి మనం తీసుకుంటున్నాం.

సైన్స్ ఒప్పుకున్న వేదం చెప్పడం కాదు. వేదాన్ని సమర్థించే శక్తి ఇప్పటి సైన్స్‌కు ఇంకా రాలేదు. దీని ధోరణే వేరు. పాశ్చాత్యులు పరిశోధనలు చేసి సూర్యభగవానుని చైతన్య స్ఫూర్తిని ఏవిధంగా అనుభవించి చూపిస్తున్నారో అది భారతీయులందరూ ఎంతో కాలం నుంచి అనుభవిస్తున్నదే కాని ఈ మధ్యకాలంలో దాన్ని విస్మరిస్తున్నారు. సూర్యుని మరువరాదు.

పైగా ఏ దేవతా ఉపాసకుడైనా తద్దేవతానుగ్రహం తొందరగా పొందడానికి ప్రక్రియ ఉద్ధవగీతలో స్వయంగా కృష్ణపరమాత్మే ఉద్ధవుడితో చెప్పాడు.

ఉద్ధవా! నన్ను ఆరాధించాలంటే విగ్రహంలో ఆరాధించవచ్చు. ఒక శ్రోత్రియుని యందు ఆరాధించవచ్చు. అగ్నిహోత్రంలో ఆరాధించవచ్చు. అన్నింటి కంటే సూర్యమండలంలో ఆరాధిస్తే నన్ను తొందరగా పొందవచ్చు అంటాడు.

భగవంతుడు సర్వవ్యాపి. సర్వవ్యాపి అయిన భగవంతుని సర్వేసర్వత్రా అనుభవించే స్థితి మనకి దేహాత్మభ్రాంతి ఉన్నంత వరకు రాదు. ఇది అనుభవం-అది జ్ఞానావస్థ. కాని ఈశ్వరోపాసన ఒక ఆలంబనగా గ్రహించి చెయ్యాలంటే దానికి సహజసిద్ధమైన ఆలంబన సూర్యమండలం.

భాగవతంలో అనేక చోట్ల సూర్యపరమైన అంశాలు ప్రస్తావనకి వస్తాయి. పరబ్రహ్మను తెలియచేసే ప్రణవం, ఆ ప్రణవానికి మరొక రూపమైన గాయత్రీ సంపూర్ణముగా సూర్యమంత్రమే. సవితుః అనడంలోనే అది కనపడుతుంది. ఎవరు ఇష్ట దైవంగా వారు అన్వయించుకుని చేసుకోవచ్చు.

వేదమాత గాయత్రి సాక్షాత్తు నేను సూర్యమంత్రాన్ని అని చెప్తున్నప్పుడు సూర్యుడే మనకు వేదమతంగా స్పష్టమవుతోంది. సూర్యావిర్భావఘట్టాన్ని పురాణాలు చాలా చక్కగా ఆవిష్కరించాయి. సూర్యోపాసనకి సంబంధించి పురాణాలలో మహిమాన్వితమైన శ్లోకాలు ఉన్నాయి. ఇవి కాకుండా మహర్షితుల్యులైన కొంతమంది ఉపాసకులు వారి అనుభవంతో సూర్యారాధనకి సంబంధించి మరికొన్ని అద్భుతమైన నిధులను ఇచ్చారు. అవి పట్టుకున్నా మనం ఫలితాలు పొందవచ్చు.

మహాత్ములు వారు తరించిపోవడమే కాకుండా లోకం తరించాలని తాపత్రయపడుతూ ఉంటారు. వారు చరిత్రలో నిలిచిపోయి వారు ఇచ్చిన పరిదానం మనకు మిగిలిపోతుంది. అలాంటి వారిలో మనకి సాంబుడు.

సాంబుడు కృష్ణపరమాత్మ పుత్రుడు. ఆయన నారదుని విషయంలో ఏదో అపచారం చేసాడు. నారదుడు శపించగానే కుష్ఠువ్యాధి వచ్చింది. కృష్ణుడికి పుత్రుడిగా పుట్టడం భాగ్యం గాని ఆ ఈశ్వరతత్వం ఆయనకి ఎక్కడ వస్తుంది.

కాని తన అహంకారానికి శాపం ఎప్పుడొచ్చిందో వెంటనే కృష్ణుని దగ్గరికి వెళ్ళి చెప్పాడు. పరిహారం చేసుకోవాలంటే సూర్యుని ఉపాసించాలని కృష్ణుడు చెప్పాడు. సాంబుడు సూర్యోపాసన చేసి సూర్యానుగ్రహం వల్ల వ్యాధి పోవడమే కాకుండా జ్ఞానం కూడా లభించింది.'సాంబపంచాశిక 'అనే పేరుతో యాభై శ్లోకాల అత్యద్భుతమైన గ్రంథాన్ని రచించాడు.

నిజానికి భారతదేశంలో ఎక్కడా దీని ప్రతి కూడా దొరకదు. ఇది ఇప్పటికీ క్షేమంగా దాచిన చోటు మాత్రం కాశ్మీరదేశం. ప్రత్యభిజ్ఞశైవసిద్ధాంతం ప్రకారంగా పండితులైన జ్ఞానులు క్షేమేంద్రులు ఈ యాభై శ్లోకాలకి వ్యాఖ్య వ్రాసారు. అసలు సూర్యుడు అక్కడ కనపడతాడు. ఆ సూర్యునికి 'చిత్సూర్యుడ'ని గొప్ప పేరు పెట్టాడు.

ఆ సూర్యుని వలన ఈ ప్రపంచమంతా ఎలా వెలుగుతోందో, అదే విధంగా మనలో ప్రపంచాన్ని వెలిగించే సూర్యుడు ఒకడు ఉన్నాడు. వాడిని తెలుసుకోవడానికి బయట వాడిని, లోపల వాడిని ఎలా చూడాలో చెప్పారు. ఈయన ఉపాసన తారాస్థాయికి వెళ్ళి జ్ఞాన స్థితిని అందుకుంది. అందుకే ఆయన యాభై శ్లోకాలలో చిత్సూర్య స్వరూపాన్ని ఆవిష్కరిస్తాడు.

సాంబపంచాశిక నేర్చుకుని పలకడం కూడా క్లిష్టమే. బాగు చేసే మందు ఎప్పుడూ గట్టిగానే ఉంటుంది. అలా నేర్చుకుని చదివితేనే జబ్బులు పోతాయి. అంత కష్టంగా ఉచ్చరించేటప్పుడు మన లోపల కలిగిన స్పందనలు మనలోని జబ్బులని పోగొడతాయి.

సూర్యునికి సంబంధించిన వాఙ్మయం కొంత క్లిష్టంగానే ఉంటుంది. యాభై శ్లోకాలు అత్యద్భుతం. కాశ్మీర పండితులు కొందరు దీనిని హిందీలోకి అనువదించారు. అయితే క్రమక్రమంగా కాశీ క్షేత్రం మనకి అన్ని విద్యలకి ఆటపట్టు కనుక మనకి అక్కడ లభిస్తున్నది. దేవనాగరిలోనూ ఉంది.



నా అదృష్టవశాత్తూ మా గురుదేవులు శ్రీమహాదేవానందుల వారు కాశ్మీర దేశానికి వెళ్ళినప్పుడు పండితులని కలిసారు. శైవసిద్ధాంతంలో దానికి సంబంధించిన గ్రంథరాశిని కాశ్మీర దేశం నుంచి తీసుకు వచ్చినప్పుడు సాంబపంచాశిక గురువుల అనుగ్రహం వలన నేను చదవడం తటస్థించింది. సాంబపంచాశిక అంతా శ్రీవిద్యా సంప్రదాయ ప్రకారంగా రచింపబడింది.

శ్రీవిద్యలో అమ్మవారిని ప్రధానంగా 'మాతృకావర్ణరూపిణి' అని యాభైఅక్షరాల స్వరూపంగా చూపిస్తారు. ఆ యాభై అక్షరాలలో ఒక్కొక్క మాతృకలో ఉన్న ఒక తేజస్సుకి స్వరూపంగా భానుమండలమధ్యస్థగా ఆ శివశక్తిస్వరూపిణిని ఉపాసిస్తూ చేసిన ఉపాసనే మాతృకావర్ణరూపిణి. యాభై అక్షరాలు యాభై శ్లోకాలుగా వికసించి ఒక మంత్రమయమైన స్వరూపంగా అందులో లభిస్తున్నది. ఇది ప్రత్యేకం.

సాంబపంచాశిక క్లిష్టమైనప్పటికి ఇలాంటి స్తోత్రమే చేసిన సాంబుడు సూర్యధ్యానంలో ఉండగా ఆ సూర్యమండలం నుంచి కొన్ని భూర్జపత్రాలునేలమీద పడ్డాయి. వాటి మీద

పన్నెండే శ్లోకాలు లిఖించబడి ఉన్నాయి. ఈ పన్నెండు శ్లోకాలు సూర్యభగవానుని కృప వలన తనంతతానుగా లభించాయి. ఈ పన్నెండు శ్లోకాల్ని తేలికగా ప్రతివారు చదువు కోవచ్చు. ఇవి సాంబుడు రచించలేదు. ఆయనకు సూర్యానుగ్రహం వల్ల లభించాయి. **సాంబస్య పురతో నభఃస్థలాత్పతితం** అని అందులో చివరికి చెప్తారు.

సాంబుడి ముందు ఆకాశం నుంచి పడ్డాయన్నారు.

ఈ పన్నెండు శ్లోకాలలో సౌర, అరుణ మంత్రాల విశేషాలన్నీ పెట్టారు. సౌర, అరుణ మంత్రాలు వేదంలోవి కనుక వాటిని పారాయణ చెయ్యాలంటే స్వరనియమాలతో పాటు శాస్త్రనియమాలు అవసరం. అవి లేని వాళ్ళు ఆ భావాలు, ఆ అక్షరాలు తీసుకొని ఆ స్వరాదినియమాలు లేకుండా ఉచ్చారణ మాత్రం జాగ్రత్తగా చూసుకుంటూ చదువుకోగలిన తెలికపాటి పన్నెండు శ్లోకాలే ద్వాదశార్యాస్తుతి.

ఈ పన్నెండు శ్లోకాలు ఒక ఉపనిషత్తు అంతటి గరిమతో ఉంటాయి. అందులో భావాలు పరిశీలిస్తే మనలో అంతర్గతమైన అంతరాదిత్యస్థితిని కూడా చూడగలిగే స్థితిని కల్పిస్తాయి.



సూర్యునికి ఇష్టమైన ఛందస్సులో మన వాళ్ళు కనిపెట్టినవి రెండు అవి 1. ఆర్యా ఛందస్సు 2.స్రగ్ధరా ఛందస్సు. ఆర్యా ఛందస్సుకి వేదమూలాలు ఉన్నాయి. అందుకే దానికి అంతటి పటిష్టత ఉంది. కొన్ని వేదమంత్రాలు ఆర్యా ఛందస్సుకి సమీపంగా ఉన్నాయని పరిశోధన కూడా చేసి చూపించారు.

దుర్వాసుడు కూడా అమ్మవారిని ఆర్యాద్విశతిలో స్తుతించారు. అదే బాణీలో మూకకవి అమ్మవారిపై మొట్ట మొదట రచించింది ఆర్యాశతకమే. ఆర్యాఛందోబద్ధమైన సూర్య స్తుతులు మూడున్నాయి. మూడు వేరు వేరు. ఒకటి సాంబుడిది అయితే, మరొకటి యాజ్ఞవల్క్యునిది. అతడు సూర్యోపాసనాబలం కలవాడు. ఈ మూడు స్తుతులు పన్నెండు సంఖ్యతో కూడుకొని ఉన్నవే. ద్వాదశాదిత్య సంఖ్య.

వారి సంఖ్యానియమాన్ని కూడా గమనించాలి. సాంబపంచాశిక ఏభై శ్లోకాలతో మాతృకావర్ణరూపిణి. పన్నెండు శ్లోకాలు ద్వాదశాదిత్య సంఖ్య. దానికి దీనికి ఉన్న అనుబంధం అది. ఋషి మాట అంత తేలికగా ఉండదు. దానిలో బలము, బరువు ఉంటాయి. దాన్ని మనం ఉపాసనతో పండించుకోవాలి.

ఇది కాకుండా మరొకటి మయూరుడు రచించిన సూర్యశతకం. ఇది సంస్కృత సాహిత్యజననికి ఒక అద్భుతమైన కిరీటం. ఉపాసన, ఆధ్యాత్మికత ప్రక్కన పెడితే

సాహిత్యపరంగా అద్భుతమైన శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు, భావాలు అందులో కనపడతాయి. ఆ శ్లోకాలు చదివేవారు భాషలో మహాపండితులు అవుతారు. ఆయన సూర్యశతకాన్ని స్రగ్ధరా అనే ఛందస్సులో రచించారు.

సూర్యశతకాన్ని చదవడం కష్టం. కొన్ని కొన్ని మందులు దిగమింగడం కష్టమే కాని మింగితే మాత్రం ఉన్న జబ్బు పోతుంది. అలా సూర్యశతకం చదవడం కష్టం. చదివితే మాత్రం అనేకమైన ఆధివ్యాధులు పోతాయి. స్రగ్ధరాఛందస్సులో అంతశక్తి ఉంది. ఆ ఛందస్సులో నూరుశ్లోకాలను సూర్యునిపై వ్రాసాడు.

సూర్యశతకంలో మయూరుడు సూర్యుని మండలం, రథము, ఆ లోపల సూర్యభగవానుడు ఎలా ఉంటాడు? ఆయన చూట్టూ పరివారం ఎలా ఉంటుంది? పురుషవర్ణనం, మండలవర్ణనం, రథవర్ణనం, సారథివర్ణనం, అశ్వవర్ణనం, ప్రభావర్ణనం, రశ్మివర్ణనం ఇలా భాగాలుగా ఉంటుంది.

దీన్ని ఈ.టి.వి మాధ్యమం ద్వారా సుమారు సంవత్సరకాలం పాటు ఆదిత్యవైభవం పేరిట సూర్యశతకాన్ని చెప్పడం జరిగింది. ఇదివిన్న ఒకాయన ప్రశ్నిస్తూ "సూర్యుడు అగ్నిగోళంలా కనిపిస్తుంటే లోపల పురుషుడేమిటి? గుర్రాలపై వెళ్ళడమేమిటి? ఇవన్నీ నమ్మశక్యంగా లేవని" అన్నాడు. సూర్యుడిని మన భౌతికమైన దృష్టితో చూస్తే అది కేవలం ఒక అగ్ని మండలం.



మనకు కనిపించే ఒక మహావిషయం సామాన్యదృష్టితో చూస్తే భౌతికాంశం. ఉపాసనా దృష్టితో చూస్తే దేవతా స్వరూపం. ఉపాసనాదృష్టికి దేవత కనపడుతుంది. సామాన్యదృష్టికి వస్తువు కనపడుతుంది. కనుకనే వారికి సూర్యమండలం మండుచున్న అగ్నిగోళం.

జంతువులకి ఎలా కనపడుతుందో మనకి తెలియదు. కొన్ని జంతువులకి 'colour blindness' ఉంటుంది. మనం ఈ రంగు ఆ రంగు అని చెప్తాం కాని కొన్ని జంతువులకి ఏ రంగు తెలియదని చెప్తారు. అయితే వాటికి తెలియలేదని దానికి రంగులేదని అంటామా మనం? వాటికి ఆ దృష్టిలోపం ఉంది.

సూర్యమండలం లోపల ఉన్నవాడిని చూడగలిగే దృష్టి మనకి లేదు. ఆ దృష్టి తెచ్చుకొనే అవకాశం ఉంది. అది కూడా భారతీయుడికి మాత్రమే ఉండడం మన అదృష్టంగా భావించి దాన్ని వినియోగించుకోవడానికి ప్రయత్నించాలి.

భారతీయవిజ్ఞానం ఆ దృష్టిని మనకి ఇచ్చింది – దాని పేరే ఉపాసనా దృష్టి.

ఉపాసనాదృష్టితో చూస్తే మయూరుడు వర్ణించిన వర్ణన అంతా మనకి కనబడుతుంది.

ఆ దృష్టితో కనిపించినదాన్ని వర్ణించాడు మయూరుడు. ఆ నూరుశ్లోకాలు సంక్లిష్టమేగాని దాని సారాన్ని పిండి అప్పయ్యదీక్షితులువారు అటు వేదాలలో, పద్దెనిమిది పురాణాలలో సూర్యుని గురించి చెప్పినదాన్ని ద్వాదశసంఖ్యగా తీసుకొని పన్నెండుశ్లోకాలలో **ఆదిత్యస్తోత్రరత్న**మని అద్భుతమైన స్తోత్రరత్నాన్ని రచించారు.

ఆ పన్నెండు శ్లోకాలలో ఒక్కొక్క పదంలో ఏం చెప్పారో చూపిస్తూ సంస్కృతంలో దానికి వ్యాఖ్యానాన్ని ఆయనే ఇచ్చారు. ఆదిత్యస్తోత్రరత్నాన్ని కూడా ఆయన స్రగ్ధరా ఛందస్సులోనే రచించారు. కాని ఇది మయూరుడు స్రగ్ధరాఛందస్సులో రచించిన సూర్య శతకం అంత క్లిష్టంగా ఉండదు. అంత సంక్లిష్టమైన ఛందస్సుని ఇంత హాయిగా చదవవచ్చా అన్నట్టు ఆయన మార్చివేసి మనమీద దయతో అద్భుతమైన రచన చేసారు.

ఈ పన్నెండు శ్లోకాలకి వ్యాఖ్యానం చెప్పుకొంటే సూర్యుడి గురించి మరొక పురాణం, వేదభాగం వెతకక్కర్లేదన్నట్టుగా అన్ని అంశాలు ఈ స్తోత్రరత్నంలో నిబద్ధం చేసారు అప్పయ్య దీక్షితులవారు. ఈయన శంకరుల తరువాత మళ్ళీ అవతరించిన అపరశంకరులు.

ఆదిత్యస్తోత్రరత్నంలో ఆయన మండలం ఎలా ఉంటుంది? ఆ మండలం చుట్టూ అనేకమంది దేవతలు, యక్షులు, కిన్నెరలు, సిద్ధులు, సాధ్యులు, రాక్షసులు ఎలా పరివేష్టించి ఉంటారు? సూర్యభగవానుని రథం ఎలా ఉంటుందో వర్ణించారు. ఇదంతా ఆర్షవిజ్ఞానం. గాయత్రీమంత్రసారాన్ని అందులో నిక్షిప్తం చేసారు. ఉపనిషత్తుల తత్త్వం తీసుకొచ్చారు.



అప్పయ్యదీక్షితులు అద్వైతమత ప్రతిష్ఠాపకులలో ప్రధానమైనవారు. ఈ స్తోత్రరత్నమంతా రచించి చివర గట్టిగా ఫలశ్రుతి చెప్పారు - ఇది ఎవరైతే ఒక్కసారి శ్రద్ధగా రోజూ చదువుతారో వారికి-

**దుఃస్వప్నం దుర్నిమిత్తం దురితమఖిలమప్యామయానప్యసాధ్యాన్**
**దోషాన్ దుఃస్థానసంస్థగ్రహగణజనితాన్ దుష్టభూతాన్ గ్రహాదీన్**
**నిర్ధూనోతి స్థిరాం చ శ్రియమిహ లభతే ముక్తిమభ్యేతి చాన్తే**
**సంకీర్త్య స్తోత్రరత్నం సకృదపి మనుజః ప్రత్యహం పత్యురహ్నామ్**

పగటికి ప్రభువైన ఆదిత్యభగవానుని ఉద్దేశించి ఈ శ్లోకాల్ని సకృదపి - ఒక్కసారి రోజులో చదివితే దుఃస్వప్నాలు, దుర్నిమిత్తాలు రావు. సాధ్యంకానిదంటూ ఉండదు. మొండిరోగాలు కూడా పోతాయి. గ్రహజనితదోషాలు - మనకి దుస్థానాల యందు గ్రహాలు ఉండడం వల్ల వచ్చే జాతకదోషాలు కూడా పోతాయని సత్యవాదియైన మహర్షి ప్రమాణంతో చూపిస్తూ **ముక్తిమభ్యేతి చాన్తే** అని చెప్పారు.

దీన్ని వ్యాప్తి చెయ్యాలనే ఉద్దేశంతో ఋషిపీఠం ద్వారా చిన్ని పుస్తకం రూపొందించడం జరిగింది. ఇంతకు పూర్వమే శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు దీనికి తెలుగులో చక్కటి అనువాదాన్ని కూడా చేసారు. రాను రాను అసలైన జ్ఞానాన్ని గ్రహించే జాతిని మనం కోల్పోతున్నాం.

అనంతమైన సూర్యవిజ్ఞానం మన భారతీయ సంస్కృతిలో ఉంది. సూర్యారాధన రామాయణంలో ఆదిత్యహృదయం ఒక్కటే కాదు.

యజ్ఞరక్షణకి రాముడిని తీసుకెళ్తున్న విశ్వామిత్రులవారు సూర్యారాధన చెయ్యాలని మొట్టమొదట రాముని ఉద్దేశించి 'కౌసల్యాసుప్రజారామ పూర్వాసంధ్యాప్రవర్తతే' అని సంధ్యకి ఉద్యుక్తుని చేస్తాడు.

చిట్టచివర యుద్ధసమయంలో సూర్యారాధన చెయ్యి అని అగస్త్యమహర్షి ఆదిత్య హృదయాన్ని ఉపదేశించారు. ఇలా రామాయణంలో అనేకచోట్ల సూర్యారాధన కనపడు తుంది. సీతమ్మ కూడా సూర్యారాధన చేస్తుంది. మానసికమైన వేదన కలిగినపుడు ఆ సూర్యమండలాన్ని ఒక్కసారి తలంచుకొని పరమేశ్వరా! అని నమస్కరించుకొంటే శాంతి వస్తుందని వాల్మీకి రామాయణంలో చూపించారు. అదే ఆదిత్యోపాసన. అదే సూర్యా రాధన. అనుగ్రహించడానికి ఆయన ఎప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. మనదే ఆలస్యం.



మార్కండేయపురాణంలో శతానీకుడనే మహాత్ముడు సుమంతుడనే ఋషి వద్దకు వచ్చి ఆదిత్యుని విశిష్టత, ఆరాధన గురించి అడిగితే సుమంతుడు సమాధానం చెప్తూ, "ఈ విషయాలు నాకు తెల్సినవి చెప్పడం కాదు జగద్గురువైన శ్రీకృష్ణుడు అర్జునునికి చెప్పింది నీకు చెప్తున్నాను" అని చెప్తాడు.

జగద్గురువైన శ్రీకృష్ణుడు చెప్పిన మాట – "ఎవరైతే ప్రాతఃకాలంలో సూర్యభగవానుని నమస్కరిస్తారో వారికే సుదినం. వాడు సర్వపాపాల నుంచి విముక్తుడవుతాడు" అని ప్రారంభిస్తూ సూర్యారాధన విశేషాలను వివరిస్తాడు.

ఈ విధంగా కృష్ణుడు అర్జునునికి చెప్పాడని సుమంతుడు శతానీకునికి చెప్పిన ఘట్టమే **భవిష్యోత్తరపురాణం**లో ఏడు అధ్యాయాల ఆదిత్యహృదయంగా మనకి కనపడుతుంది.

మహాభారతంలో కూడా ఆదిత్య ఉపాసన చాలా చోట్ల స్పష్టంగా కనపడుతుంది. సావిత్రీ ఉపాఖ్యానమంతా ఆదిత్యమంత్ర, గాయత్రీ మంత్ర రహస్యమే. సత్యవంతుడు, సావిత్రీ కథ. సవితా – సావిత్రీ – గాయత్రీ – యముడు సూర్యపుత్రుడు ఇవన్నీ రహస్యాలు. ఇవన్నీ యోగదృష్టితో చూడాలి. ఉపాసనాదృష్టితో చూడాలి.

యోగంలో కూడా సూర్యునికి చాలా ప్రధానమైన స్థానం ఉంది. యోగదృష్టితో చూసి అరబిందో 'సావిత్రీ' అని అద్భుతమైన రచన చేసారు. అదొక మార్మికగ్రంథం అంటే మామూలుగా సాహిత్యం, భాష తెల్సినవారికి అర్థంకాదు. ఒక సమాధిస్థితిలో ఉండి చెప్పిన భాష సామాన్యులకి అర్థంకాదు. అందులో యోగరహస్యాలు ఉన్నాయి. అందులో అంతా సూర్యవిజ్ఞానమే కనపడుతోంది. ఇలాంటి రహస్యవిజ్ఞానాన్ని అంతటిని సూర్యుడిని ఏవిధంగా ఆరాధించి పొందవచ్చో అనేక గ్రంథాలు అనేక రకాలుగా చూపించాయి.

సూర్యతత్త్వం గురించి మనకి ఉపాసనాపరమైన అంశంగా ఒక చరిత్రగా అందిస్తున్నాయి పురాణాలు. చరిత్ర అనగానే ఒక క్రమాన్ని అనుసరించి మనం పఠించడానికి సావకాశం ఉంటుంది. విజ్ఞానం అనంతమైనది కనుక ఒక పద్ధతిగా దొరకడం మహాకష్టం. అలాంటి దానిని పురాణం పాత్రరూపంలో చాలా అద్భుతంగా ఇస్తుంది.

పురాణ కథలు జరగలేదు అని చెప్పడానికి లేదు కాని ఒక వైజ్ఞానికాంశాన్ని ఆ పాత్ర రూపంలో తెలుసుకునే అవకాశం కూడా లభిస్తున్నది. ముఖ్యంగా ఉపాసనా పరంగా సూర్యభగవానుని ఆరాధించడానికి వివిధ పురాణాలు మనకు ఉన్నాయి.



ఆదిత్యుని పేరున 'ఆదిత్యపురాణం' అని ఒక ఉపపురాణం కూడా ప్రత్యేకించి ఉంది. ఇదికాక భవిష్యోత్తరపురాణంలో ఆదిత్యుని ఉపాసనా విధానాలు చాలా రకాలుగా చెప్పారు. మనకందరకూ ఒకటే సప్తమి తెలుసు రథసప్తమి. కాని మొత్తం 24 సప్తమి లకు పేర్లు ఉన్నాయి. ఏ ఏ సప్తమి ఎలా చేస్తే ఏ ఏ ఫలితాలు వస్తాయో ఒకొక్క కామ్యానికి ఒకొక్క సప్తమి చెప్పారు. అలాగే ఒక్కొక్క ఆదివారాన్ని కూడా చెప్పడం జరిగింది.

నిజానికి ఏ వారమైనప్పటికి ఆదిత్యుడే ప్రధానం. అందులో సందేహం లేదు. అయినప్పటికీ కూడా ఆయన పేరున ఒక వారం ఉంది. దానికి రవివారం, భానువారం, ఆదివారం, ఆదిత్యునివారం ఇన్ని పేర్లు. దానికి కారణం ప్రతి రోజుకి సూర్యుడు ఉదయించినప్పుడు ఏ గ్రహహోర ఉంటుందో దానిని అనుసరించి వస్తుంది.

కాని ఆదివారంనాడు మాత్రం సూర్యహోరలో సూర్యోదయం జరుగుతుంది. ఆ కారణం చేత దానికి భానువారం అని ఇవ్వడం జరిగినది. సూర్యప్రధానంగా మొదటివారం ఆయనకే ఇచ్చేసారు.

తిథులలో సప్తమి. ఈ సప్తసంఖ్యకి, సూర్యునికి ఉన్న అనుబంధం చాలా విశేషం. సూర్యారాధకులు సప్తమి, ఆదివారం ఈ రెండూ మహా నియమంగా పాటించాలి. పైగా సూర్యారాధకులకు కొన్ని నియమాలలో ఉపాసకులకి సూర్యుడు కనపడని రోజుని

వారు దుర్దినం అంటారు.

సూర్యుడు కనపడని రోజు అంటే మేఘాచ్ఛన్నం అని అర్థం. పూర్తిగా మేఘాలు ఆక్రమించుకుని అసలు సూర్యుడు కాని కనపడకపోతే అది దుర్దినం. సూర్యారాధకులు కొంతమంది ఆ రోజు భోజనం కూడా చెయ్యరు.

ఇటువంటి వారు ఆంధ్రదేశంలో అక్కడక్కడా కొంతమంది కనిపిస్తున్నప్పటికి ఇప్పటికీ గుజరాత్‌లో కొంతమంది సూర్యుడు కనపడకపోతే భోజనం చెయ్యరు. భోజనం లేకపోతే ఉండలేనివారు ప్రత్యామ్నాయంగా సూర్యయంత్రాన్ని పెట్టుకుని ఆ యంత్రాన్ని చూసి నమస్కరించుకొని భోజనం చేసే సంప్రదాయం ఇప్పటికీ ఉన్నది.

సూర్యస్వరూపాన్ని ఎటువంటి భావనతో ఆరాధించాలి? ఎప్పుడైనా ఆరాధనలో భావం ప్రధానం. బాహ్యంగా నియమాలు, ప్రక్రియలు పాటిస్తాం. భావనలో ఉన్న లోపం వల్లనే కొందరి ఆరాధనలు ఫలించవు. భగవదారాధనకి భావనాబలం చాలా అవసరం.

భగవంతుని ఆరాధించేటప్పుడు ఎటువంటి భావంతో ఆరాధించాలో స్తోత్రాదులలో ఉంటుంది. కాని ఆ స్తోత్రం కూడా భావనతో చెయ్యం. ఆ స్తోత్రం చేస్తున్నప్పుడు ఏం చెప్తున్నారో అనేది కొంచెం స్పృహలోకి తెచ్చుకుంటే మనకి ఆ చూస్తున్న దృష్టిలోనే మార్పు వస్తుంది.



మార్కండేయ పురాణం కొన్ని అధ్యాయాలలో సూర్యారాధనని అద్భుతంగా అందించింది. దానిని సంక్షిప్తంగా చెప్పుకోవాలనే ప్రయత్నం చేద్దాం. మార్కండేయమహర్షి క్రౌష్టికుడు అనే వానికి సూర్యారాధన గురించి చెప్తున్నాడు.

మార్కండేయ పురాణం ముందు మనువులు మొదలైన వారి వంశాల చరిత్ర, దేవీసప్తశతి ఇత్యాదులు చెప్పి తరువాత ప్రత్యేకించి సూర్యుని గురించి చెప్పాడు. దుర్గాసప్తశతి కూడా మనుచరిత్రలో భాగమే. సావర్ణిమనువుకు సంబంధించిన చరిత్ర చెప్తూ సప్తశతి (దేవీ మహాత్మ్యం) అంతా చెప్పడం జరిగింది.

మళ్ళీ ప్రత్యేకించి సూర్యారాధన గురించి చెప్పారు. మనువు చరిత్రలలో భాగం కాకుండా దీనికి ప్రత్యేకస్థానం ఉంది. ఈ మనువులందరికి సూర్యునితో సంబంధం ఉంది. **సావర్ణిః సూర్య తనయః.**

వైవస్వతమనువు కూడా సూర్యసంబంధీకుడే. అసలు మనువులందరూ సూర్యసంబంధీ కులే. దేవతలందరూ సూర్యసంబంధీకులే. దేవతలందరికి ఆదిత్యులని పేరు ఉన్నది. ఆదితీదేవి సంతానం కనుక అందరికీ ఆదిత్యులు అని పేరు.

కాని ప్రత్యేకించి ఏ దేవతని 'ఆదిత్యుడు' అని పిలవం. సూర్యుని మాత్రమే 'ఆదిత్యుడు' అని అంటున్నాం.

ఆదిత్యులు అందరి సమాహారస్వరూపం ఈ ఆదిత్యునిలో ఉంది. ఆదిత్యునికి నమస్కారం సర్వదేవతా నమస్కారం అవుతుంది.

**చిత్రం దేవానాం ముదగాదనీకం** – ఇత్యాది మంత్రాలలో స్పష్టంగా సర్వదేవతాత్మకుని గానే ఆదిత్యుని మనం చూస్తున్నాం. ప్రథమంగా రామచంద్రమూర్తికి ఆదిత్యహృదయం ఉపదేశిస్తూ అగస్త్యమహర్షి 'సర్వదేవాత్మకో ఏషః అన్నాడు.

'ఏషః' అంటే ఈతడు. ఈ కనిపిస్తున్నవాడున్నాడే ఇతడు సర్వదేవాత్మకుడు. ఈయనే సర్వదేవాత్మకుడని దృష్టిలో పెట్టుకో అని చెప్పాడు.

## ఆదిత్య వృత్తాంతం

సందర్భవశాత్తూ ఆదిత్యుని గురించి చెప్తూ మార్కండేయుడు

**బ్రహ్మస్వరూపం జగతా మశేషాణాం పరప్రదమ్**
**ఆది మధ్యాంతభూతం చ సర్గస్థిత్యంత కర్మసు**
**యతోఽ ఖిల మిదం యస్మిన్నశేషం చ స్థితం ద్విజః**
**యత్స్వరూపం జగచ్చేదం సదేవాసుర మానుషమ్**
**యః సర్వభూతః సర్వాత్మా పరమాత్మా సనాతనః**
**ఆదిత్యా మభవద్భాస్వాన్ పూర్వమారాధిత స్తయా**



ఎవరి వల్ల ఈ జగత్తంతా కలుగుతూ ఉందో, ఎవరి వల్ల స్థితి పొందుతూ ఉందో, అసలు ఈ జగత్తంతా ఎవరి స్వరూపమో, ఎవడు సర్వాత్మకుడో, పరమాత్మా, సనాతనుడో అతడు అదితిదేవికి పుత్రునిగా ఆవిర్భవించాడు. ఆదిత్యుడు ఎవరు? సాక్షాత్తు పరబ్రహ్మ అని స్పష్టంగా తెలుస్తోంది. వెంటనే క్రౌష్టికుడు మార్కండేయుని అడుగుతూ

**భగవన్ శ్రోతుమిచ్ఛామి తత్స్వరూపం వివస్వతః** – అదితీదేవికి పుత్రునిగా ఆదిత్యుడిగా ఎలా ఆవిర్భవించాడో నాకు తెలుసుకోవాలని ఉందన్నాడు. మార్కండేయుడు సూర్య భగవానునికి నమస్కారం చేసుకొని చెప్పడం మొదలు పెట్టాడు. సూర్యుని గురించి చెప్పాలన్నా, వినాలన్నా సూర్యుని అనుగ్రహం కావాలి.

సూర్యుని చైతన్యానికి పదహారు పేర్లు చెప్పాడు. చైతన్యమంటే జ్ఞానమే. సూర్యుడంటే కేవల జ్ఞానస్వరూపుడు. జ్ఞానమే వెలుగుకదా। వెలుగే సూర్యుడు కదా। సూర్యకాంతికున్న విశేషం పదహారు రకాలుగా చూపిస్తున్నాడు.

**విస్పష్టా పరమా విద్యా జ్యోతిర్భాశాశ్వతీస్ఫుటా**
**కైవల్యం జ్ఞానమావిర్భూః ప్రాకామ్యం సంవిదేవ చ**
**బోధశ్చావగతిశ్చైవ స్మృతిర్విజ్ఞాన మేవ చ**
**ఇత్యేతా నీహ రూపాణి తస్యాఽ రూపస్య భాస్వతః**

ప్రకాశస్వరూపుడైన సూర్యుని దివ్యచైతన్యానికి పదహారు రూపాలు. ఇవి అన్నీ తెలివికి సంబంధించిన పేర్లు. తెలివే సూర్యభగవానుడు.

సూర్యకాంతిని కేవలం ఒక జ్యోతిర్మండలంగానో లేదా కాంతి పుంజంగానో భావించ డానికి వీలు లేదు. అది కేవలం విద్యల స్వరూపమనే భావన చాలా అవసరం. విద్యకు సంబంధించిన మాటలు కైవల్యం, జ్ఞానం, ప్రాకామ్యం, సంవిత్తు, బోధ, అవగతి, స్మృతి, విజ్ఞానం, బోధ అంటే అవతలి వాడు మనకు తేటపరిచేటట్లు చెప్పడాన్ని 'బోధ' అంటారు. అది మనం లోపలకి అవగాహన చేసుకోవడాన్ని అవగతి అంటారు. అది గుర్తులో పెట్టు కోవడాన్ని 'స్మృతి' అంటారు. అది అనుభవంలోకి తెచ్చుకోవడాన్ని విజ్ఞానం అంటారు. ఈ పేర్లలోనే ఎన్ని ప్రత్యేకతలు. తెలివికి ఇన్ని పేర్లా? ఇన్ని పేర్లు పెట్టిన వాడి తెలివి ఎంత గొప్పదో? ఆ ఋషికో నమస్కారం చేసుకుందాం.



మార్కండేయమహాముని ప్రకాశస్వరూపుడైన ఏ రూపం లేని సూర్యుని రూపాలు ఇవి అన్నాడు. తెలివి ఎన్నెన్ని రకాలు ఉన్నాయో అవి అన్ని సూర్యుని రూపాలే అని చెప్పడంలో సూర్యుడు తెలివి స్వరూపుడు అనగా జ్ఞాన స్వరూపుడు.

సూర్యుని యొక్క ఉత్పత్తి చెప్తున్నాడు.కథగా చెపితే చాలా రమ్యంగా ఉంటుంది కనుక ఈ పురాణకర్త ఈ సృష్టి కథ చెప్తున్నాడు.

ఈ సృష్టి కథే సూర్యుని కథ. సూర్యుడు లేకపోతే సృష్టి ఉందా?

మార్కండేయుడు సృష్టికి పూర్వ స్థితి ఎలా ఉందో చెప్తూ

**నిష్ప్రభేఽ స్మిన్నిరాలోకే సర్వతస్తమసాఽ వృతే**
**బృహదండమభూదేక మక్షరం కారణం పరమ్**

మనం చూస్తున్న ఈ సృష్టి ఏర్పడక పూర్వం అసలు వెలుగనేదే లేని స్థితి. ఆలోకము అంటే వెలుగు. నిరాలోకే -వెలుగులేని స్థితి. ప్రకటనలేని స్థితి. ఒక తమస్సుతో కూడుకున్న స్థితిలో ఒక పెద్ద అండం ఏర్పడింది అన్నారు.

అదే అన్నింటికి కారణమైనది, అక్షరమైనది.అది క్రమంగా భేదింపబడినదిట. ఇదే 'Big Bang Theory' అని మన విజ్ఞానశాస్త్రం ప్రస్తుతానికి వైజ్ఞానికంగా అంగీకరి

స్తున్నది. ఈ మధ్య కాలంలో మళ్ళీ తీవ్రమైన పరిశోధనలు చేసి 'God particle' గురించి మాట్లాడినప్పుడు వచ్చిన 'Super string Theaory' కూడా చాలా సమీపంగా వైజ్ఞానికంగా ఇది సరిపోతున్నది.

ఇప్పటి విజ్ఞానం వేదాలకు కొంత దగ్గరకి వెళ్ళగలుగు తోంది.

**తద్భిభేద తదంతస్థో భగవాన్ ప్రపితామహః**

**పద్మయోనిః స్వయం బ్రహ్మో యః స్రష్టా జగతాం ప్రభుః**

ఆ అండం ఛేదింపబడినది. దానికి మధ్య కేంద్రంలో ఉన్నవాడు బయటపడ్డాడు. ఆయన హిరణ్యగర్భుడు. ఈయన ఆ అండం లోపల భాగంలో ఉన్నవాడు. ఆయన బ్రహ్మదేవుడు. ఆయన చూస్తున్నాడు కాని ఇంకా భయంకరమైన చీకటి. వెలుగనేది లేదు. ఆ చేధింపబడిన దాని మధ్యలో ఉన్నాడు.

**తన్ముఖాధోమితి మహా నభూచ్ఛబ్దో మహామునే**

**తతోభూస్తు భువస్తస్మాత్ తతశ్చ స్వరనంతరమ్**

**ఏతా వ్యాహృతయస్తిస్రః స్వరూపం త ద్వివస్వతః**



అతని నోటంట ముందు వచ్చింది ఒక శబ్దం. స్ఫోటము ఏర్పడిన వెంటనే తన్మధ్యంలో (మధ్యబిందువుని న్యూక్లియస్ అనుకోవచ్చు) దాని నుంచి ప్రకటింపబడిన బ్రహ్మదేవుని కంఠం నుంచి ఒక శబ్దం ఆవిర్భవించింది. ఇది అండం శబ్దమా? లేక మధ్యలో ఆవిర్భ వించిన బ్రహ్మ శబ్దమా? అది ఇతరులెవ్వరూ పోల్చలేని స్థితి. ఏక కాలంలో వచ్చింది.

అది బ్రహ్మదేవుని కంఠం నుంచి చేధించుకుని వచ్చిన శబ్దమనే శాస్త్రం చెప్తున్నది. ఒక మహాశబ్దం బ్రహ్మదేవుని ముఖం నుంచి వెలువడినది. ఇది మొదటి శబ్దం.

ఓం అనే మహా శబ్దం ఉత్పన్నమైనది. ముందు ప్రణవం ఆవిర్భవించిన తరువాత క్రమంగా **భూః, భువః, సువః** అనే మూడు శబ్దాలు ప్రధానంగా వచ్చాయి.

వీటిని వ్యాహృతులు అంటారు.

ఈ సృష్టి క్రమానికి, శబ్దానికి ఉన్న సంబంధం చూస్తే ఒక మహాశక్తి ప్రకటింపబడి నప్పుడు దాని ప్రధాన రూపాలు రెండు ఉండాయి. అవి కాంతి, శబ్దం. ఇది ఏ శాస్త్ర మైనా అంగీకరిస్తుంది. ముందు ఆవిర్భవించిన ఈ శబ్దంలో ఆ కాంతి ఎలా ప్రకటింప బడుతుందో చూడాలి.ముందుగా వచ్చింది ప్రణవం - అది విచ్చుకున్నట్లుగా తరువాత వచ్చినవి మూడు వ్యాహృతులు. ఇందులో మొదటిగా వచ్చిన ప్రణవమే ఆ బ్రహ్మం యొక్క సూక్ష్మరూపం.

ఏ బ్రహ్మంద్వారా ఈ బ్రహ్మ ప్రకటింపబడ్డాడో ఆ బ్రహ్మంవేరు బ్రహ్మ వేరు. ఈ చతుర్ముఖ బ్రహ్మ నోటి నుంచి వెలువడిన ఈ శబ్దం 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అన్నట్లుగా ఆ బ్రహ్మమును తెలియచేస్తున్నది. కనుక ఏకాక్షరంగా తనలో బ్రహ్మలో దాగియున్న అంతర్గతమైన ఆ మహా చైతన్యమే ఓం అనే రూపంతో వచ్చింది.

ఆ చైతన్యం యొక్క ప్రథమ స్పందన, ప్రథమ వ్యక్తీకరణ ఓం కారం.

ఈ ఓంకారం ప్రథమం కనుక జరగబోయే సృష్టి యొక్క సమస్త స్వరూపానికి అది సూక్ష్మరూపము. అది ఒక విత్తనం వంటిది. విత్తనంలో చెట్టు అంతా ఉన్నట్లుగా ఓం కారంలో సృష్టి అంతా ఉంది. ఎలాగంటే కొంచెం చమత్కారంగా ఆలోచిద్దాం.

అకారం అంటే తెరుచుకోవడం. ఉకారం అంటే మధ్యభాగం. మకారం అంటే మూసు కోవడం. తెరచుకుని క్రమంగా మళ్ళీ మూసుకోవడం. సృష్టి, స్థితి, లయ అనే దానిని తెలియ చేస్తోంది. మొత్తం జగత్తుకి సంబంధించిన క్రియ అంతా దానిలో కనపడుతున్నది.

తరువాత వచ్చినవి మూడు వ్యాహృతులు. సూక్ష్మరూపం ఓంకారం. ఇది అత్యంత సూక్ష్మరూపం. ఇది ఎవరి సూక్ష్మరూపమో చెప్తున్నాడు.

**ఓమిత్యస్మాత్స్వరూపాత్తు సూక్ష్మరూపం రవేఃపరమ్**
**తతోమహరితిస్థూలం జనం స్థూలతరం తతః**
**తత స్తపః సత్యమితి మూర్తాని సప్తధా**

రవి యొక్క పరమమైన సూక్ష్మరూపమే ఓంకారం. సూర్యుని సూక్ష్మరూపం ఓంకారం. ఇంకొక రకంగా చూస్తే ఓంకారమే సూర్య స్వరూపం అని స్పష్టమవుతున్నది. తరువాత స్థూల శబ్దాలు వెలువడ్డాయి.

**భూః, భువః, సువః** తరువాత వచ్చినవి **మహః** పిమ్మట **జనః** దాని తరువాత **తపః** దాని తరువాత **సత్యం**... ఇలాగ మొత్తం సప్త వ్యాహృతులు. ఈ ఏడే సమస్త లోక నిర్మాణానికి కావలసినవి. ఇవి ఓంకారం తరువాత వచ్చినవి.

**ఆద్యంతం యత్పరం సూక్ష్మమరూపం పరమం స్థితమ్**
**ఓమిత్యుక్తం మయా విప్రః తత్పరబ్రహ్మతద్వపుః.**

ప్రధానమైనది ఓంకారమే. మిగిలినవన్ని వ్యాహృతులని స్పష్టం చేసారు. అటు తరువాత బ్రహ్మదేవుని నించి వ్యాహృతుల తరువాత రకరకాల ధ్వనులు వచ్చాయి. శబ్దోత్పత్తి ఎలా జరిగిందో చూపిస్తున్నాడు.

ప్రథమంగా బ్రహ్మదేవుని నుంచి వచ్చినవి ప్రణవం, తరువాత వ్యాహృతులు. తరువాత

రకరకాల రంగుల కాంతులు వెలికి కనపడుతున్నాయి. ఎవరూ సృష్టించినవి కావు. బ్రహ్మ నుంచి తనంతతానుగా వెలికివస్తున్న శబ్దాలు. ఇక పురుష సృష్టి అంటే మానవులు ఇత్యాది ప్రాకృతికమైన వాళ్ళు సృష్టించినవి కావు. అపౌరుషేయ శబ్దాలు రాబోతున్నాయి. ముందుగా వచ్చినవి

**తస్మాదండాద్విభిన్నాత్తో బ్రహ్మణోఽ వ్యక్తజన్మనః**
**ఋచోఽబభూవుః ప్రథమం ప్రథమా ద్వదనాత్ మునే**

ఎలా వచ్చాడో తెలియబడని స్వయంభువైన ఆ బ్రహ్మదేవుని నుంచి వెలువడిన మొదటి శబ్దంగా ఋక్కులు వెలువడ్డాయి. ఋగ్వేద ఛందస్సు వెలువడింది. వేదంలో ఉండే ఋక్కులు వేదవేత్తలకే తెలుసు. మనం పేర్లు మాత్రం తెల్సుకోగలం. వాటికి ఒక వర్ణం-వెలుగు ఉంది. ఇవి చూడాలంటే విజ్ఞానశాస్త్రం ఇంకా ఎదగాలి.

శబ్దంలో కాంతులు ఎలా ఉంటాయో చూడగలిగే సూక్ష్మశక్తి ఉన్న దృష్టికి మాత్రమే ఇవి గోచరిస్తాయి. ఆ ఋక్కుల్లో ఈ శక్తులు ఉంటాయి. ఎక్కడైన మనకి ఋక్కులు వినబడుతుంటే మనం నమస్కారం చేసుకొంటే చాలు. అలాంటి శబ్దాల నుంచి ఉత్పన్న మౌతున్న వెలుగుపుంజాలు ఏ రంగుతో ఉంటాయో భావించవచ్చు.



**జపాపుష్పనిభాః స్పద్యస్తేజోరూపా హ్యసంహతాః**
**పృథక్ పృథగ్విభిన్నాశ్చ రజో రూపవహాస్తతః**

జపాపుష్పం అంటే ఎర్రని రంగు కుసుమాలు. అలాంటి ఎర్రనికాంతులతో ఋక్కులు వెలువడ్డాయి. ఇవన్ని రజోరూపాలై ఉన్నాయి.ముందు సృష్టికి రజోగుణం కావాలి కనుక రజోరూపంలో ఉన్నాయని చెప్తున్నారు.

**యజూంషి దక్షిణాద్వక్త్రా దనిరుద్ధాని కానిచిత్**
**యాదృగ్వర్ణం తథావర్ణాన్యసంహతిధరాణి చ**

దక్షిణముఖం నుంచి బంగారురంగుతో కూడిన యజుర్వేద ఛందస్సులు విభిన్నంగా వెలికివచ్చాయి. అవి రకరకాల యజుర్వేద ఛందస్సులు.

**పశ్చిమం యద్విభో ర్వక్త్రం బ్రహ్మణః పరమేష్ఠినః**
**ఆవిర్భూతాని సామాని తత్తచ్ఛంధాంసి తా న్యథ**

పశ్చిమముఖం నుంచి సమస్త సామములు వచ్చాయి. సామవేద ఛందస్సులు ఉత్పన్న మయ్యాయి. ఈ సామవేద ఛందస్సులు కూడా భిన్నభిన్నములుగా ఉన్నాయి. ఒకటో రెండో కాదు పుంఖాను పుంఖాలుగా ఉత్పన్నమౌతున్నాయి. వీటికి ప్రత్యేకమైన వర్ణాన్ని

చెప్పలేదు. కాని అవి కొంచెం ధూమ్రవర్ణంగా ఉన్నట్లు భావన చేసుకోవచ్చు.

**అథర్వణామశేషంచ భృంగాంజనచయ ప్రభమ్**
**యావద్ఘోరస్వరూపం తదాభిచారిక శాంతికమ్**
**ఉత్తరాత్ప్రకటీభూతం వదనాత్తస్య వేధసః**
**సుఖసత్వతమః ప్రాయో సౌమ్యా_సౌమ్యస్వరూపవత్**

ఉత్తరముఖం నుంచి అథర్వణ మంత్రాలు వస్తున్నాయి. అవి తుమ్మెద సమూహం లాంటి రంగుతో ఉన్నాయి. కృష్ణవర్ణాలతో ఉన్నాయి. ఇవి మారణ ఉచ్చాటన, అభిచారక, శాంతి, పౌష్టిక ఇత్యాది రకరకాల కర్మలను తెలియజేసే మంత్రాలు ఇవన్నీ అథర్వణములు.

ఈ విధంగా నాలుగు రకాలుగా నాలుగు ముఖాల బ్రహ్మగారి నుంచి వెలికి వచ్చాయి. అసలు ఇవి వెలికి రావడానికే నాలుగు ముఖాలు వచ్చాయేమో! ముఖాల నుంచి వెలికి వచ్చాయా! వెలికి రావడం కోసం ముఖాలు ఏర్పడ్డాయా!.

ఈ ముఖాలన్నీ మనం ధ్యానం చేసుకోవడానికి తగిన రూపంగా చెప్పినప్పటికి నాలుగు వైపుల నుంచి నాలుగురకాల వేదాలు ప్రకటింపబడ్డాయని చెప్పడంకోసమే చతుర్ముఖాలు. బ్రహ్మ చతుర్ముఖాలు చతుర్వేదాలకి సంకేతాలు.



ముఖమంటేనే శబ్దోత్పత్తి స్థానం. ఇలా రకరకాలైన మంత్రాలు వర్ణాలతో ఎదురుగా గోచరించాయి. ఇవన్నీ బ్రహ్మవదనం నుంచి తమంత తాముగా వెలికి వచ్చాయి. బ్రహ్మని నిమిత్తంగా చేసుకొని తమంతతాము ప్రకటింపబడ్డవి వేదాలనే స్వయంచైతన్యస్వరూపాలు. పరబ్రహ్మమే వేదరూపంగా ప్రకటింపబడిందని గ్రహించాలి.

ఓంకారం, సప్తవ్యాహృతులు, చతుర్వేదాలు ఇలా తననుంచి పలికినవాటిని బ్రహ్మ దేవుడు తాను చూస్తూ నమస్కరిస్తూ ఉండగా ఇవన్నీ కలిసి ఒక అద్భుతమైన కాంతి మండలంగా మారి ఓంకారంలో ప్రవేశించాయి. ఇలా బ్రహ్మగారి ముఖం నుంచి వెలికి వచ్చినవన్నీ తనలో కలబోసుకున్న ఓంకారం ఎలా ఉందో చెప్తూ

**తతస్తన్మండలీ భూతం ఛాందసం తేజ ఉత్తమం।**
**పరేణ తేజసా బ్రహ్మన్నేకత్వముపగమ్యతే॥**

ఛాందసం-తేజ ఉత్తమం-మండలం అని మూడు శబ్దాలు వచ్చాయి. ఛాందసం అంటే ఛందస్సులతో నిండినది. ఛందస్సు అంటే వేదమంత్రశబ్దాలు. అవన్నీ కల్సి ఒక మహాతేజః పుంజంగా కనపడ్డాయి. అంటే శబ్దం కాంతిగా మారుతున్నదనేది తెల్సుకోవాలి.

ఇలా ఏర్పడిన కాంతిమండలంలో మొత్తంగా వేదాలు తప్ప మరొకటి లేవు. వేదాలలో

సమస్త విశ్వవిజ్ఞానం ఈశ్వరస్వరూపమే. వేదమంటేనే పరమాత్మ శబ్దస్వరూపం. శబ్దగతమైన చైతన్యమంతా కల్సి ఒక మహామండలంగా ఎదురుగా భాసించగానే వెంటనే బ్రహ్మదేవుడు నమస్కారం చేస్తున్నాడు. ఆ స్వరూపమే ప్రథమంగా ఆవిర్భవించిన సూర్యమండలము. అలా వచ్చినవాడు సూర్యుడు.

మొట్టమొదటగా వచ్చిన వెలుగే సూర్యమండలం. అంటే ప్రపంచానికి మొదటి వెలుగు వేదమే. వేదము వెలుగంతా ముద్దకట్టి ఒక రూపు కడితే సూర్యభగవానుడు. ఇది మనం గుర్తుపెట్టుకొని సూర్యభగవానుని చూసిన ప్రతిసారి ఆయన్ని 'త్రయీమయాయ త్రిగుణాత్మ ధారిణే విరించి నారాయణ శంకరాత్మనే' అని ఎందుకు అన్నారో అర్థమౌతుంది.

వేదంలోనే సమస్త విజ్ఞానం ఉంది. వేదంలో లేనిది ఎక్కడా లేదు. సూర్యమండలాన్ని ధ్యానించి నమస్కరించేవాడికి వాడికవసరమైన విజ్ఞానం సూర్యభగవానుడు తన కిరణ సమూహాల ద్వారా ఇస్తాడు. 'ఋగ్యజు స్సామపారగః' అని ఆదిత్యహృదయంలో చదువుతున్న మాటకిదే అర్థం.

సూర్యమండలం మొత్తం వేదమయం. సూర్యుని నుంచి విద్య నేర్చుకోవడం వల్ల ఆంజనేయుడు మహామేధావి అయ్యాడు. విద్యలు నేర్పేటంత శక్తి సూర్యుడికెలా ఉందంటే ఆయనే విద్యాస్వరూపుడు. విద్యంటే వేదమే. వేదవిద్యాస్వరూపుడు. అలా ఆయన వద్ద వేదవిద్యలు పొందినవారిలో ఆంజనేయుడు, యాజ్ఞవల్క్యమహర్షి మొదలైనవారు.



యాజ్ఞవల్క్యుడు ఒకప్పుడు గురువు వద్ద సమస్త విద్యలు నేర్చుకొన్నాడు. కానీ ఏదో ఒక చిన్న అపరాధం చేసాడు. దానితో గురువుగారు నేర్చుకొన్న విద్యంతా మర్చిపోతావని శపించారు. అంతకన్నా భయంకరమైన శాపం ఋషులకు ఉంటుందా? జ్ఞానమే ప్రధానంగా జీవించేవారికి నేర్చుకొన్నదంతా మర్చిపోతావని ఒక్కసారి శపించగానే చాలా బాధపడ్డాడు. సూర్యమండం కేసి చూసి ఆయన్ని ప్రార్థించాడు.

తనను చూసి భక్తితో, ప్రేమతో ప్రార్థిస్తున్నాడని దయతో సూర్యభగవానుడు స్వయంగా అనుగ్రహించి వేదవిద్యని తిరిగి ఇచ్చాడు.

దానితో ఆయన నుంచి వేదవిద్య తిరిగి వ్యక్తమైంది. దానికే శుక్లయజుర్వేదమని పేరు. మాధ్యందినసంహిత అని కూడా చెప్తారు.

ఈ విధంగా సూర్యుడు మళ్ళీ వేదవిద్య ఇచ్చాడు.

సాధారణంగా గురువు శపిస్తే బయట పడడం మహాకష్టం. అలాంటి దాన్నించి కూడా సూర్యుడు అనుగ్రహించాడంటే సూర్యుని ఆశ్రయించడం వల్ల శాపం నుంచి పాపం

నుంచి బయటపడ్డమే కాకుండా విద్యలు పొందగలమని మనకి యాజ్ఞవల్క్యుని వృత్తాంతం ద్వారా తెలుస్తున్నది.

ఆ కథకి ఇక్కడ సూర్యుని ఉత్పత్తికి సంబంధించి పురాణం చెప్తున్న విజ్ఞానవిషయాల్ని ఒక్కసారి గమనించాలి. ఆ శబ్దోత్పత్తి వల్ల ఏర్పడిన మహాచైతన్యం సూర్యమండలమే. కనుక సూర్యుడు సంపూర్ణంగా వేదమయుడనే భావన ఇక్కడ కనబడుతున్నది. బ్రహ్మ సూర్యుని తయారుచెయ్యలేదు. తనంత తానుగా వ్యక్తమయ్యాడు సూర్యభగవానుడు. బ్రహ్మ ఆయనకి నమస్కారం చేసుకొన్నాడు.

**ఆదిత్యసంజ్ఞామగమదాదావేవ యతోఽభవత్।**
**విశ్వస్యాస్య మహాభాగ కారణంచావ్యయాత్మకం॥**

అప్పుడు ఆయనకి ఆదిత్యుడని పేరు వచ్చింది. ఆది యందు కలిగినవాడు కనుక ఆదిత్యుడు. ఆదిత్యశబ్దానికి చాలా అర్థాలు ఉన్నాయి. ఒక్కొక్క సందర్భంలో ఒక్కొక్క అర్థం చెప్పుకోవచ్చు. అన్ని అర్థాలు ఉన్నాయి కనుకనే ఆ నామం అంత గొప్పగా ఉన్నది. ఆదిత్యహృదయం అన్నాంగాని సూర్యహృదయం అనలేదు.

సూర్య ఇత్యాదినామాలు కూడా మంత్రమయాలేగాని ఆదిత్య అనేది మొట్టమొదట ఆయనకి వచ్చిన పేరు. ఇతడే విశ్వకారణుడు అయ్యాడు. అక్కడ నుంచి వచ్చిన చైతన్యం తోనే బ్రహ్మదేవుడు సమస్త సృష్టిని చేయగలిగాడు. కాని అప్పుడున్న ఆ మహాతీవ్రమైన తేజస్సు గోచరించింది. అక్కడ్నుంచి కాలము ఇత్యాదులు ఏర్పడ్డాయి.



సూర్యుడు లేకపోతే కాలాన్ని ఊహించగలమా! ఎంత కాలాన్ని లెక్క వేయాలన్నా ఆయన ఉదయాస్తమానాలతోనే లెక్క వెయ్యాలి. మనం ఏం చెయ్యాలన్నా సమయాన్ని అనుసరించి చెయ్యాలి. దానిని ఏర్పాటు చేసింది ఆయన. కాలస్వరూపమే సూర్యుడు. సూర్యుడు లేనిదే మనకి కాలమనేది తెలియబడదు.

సూర్యుడు వేదమయుడు కనుకనే ఆయన ఉదయము, ఆయన అస్తమయాన్ని అనుసరించి ఆయనలో ఉన్న మూడు రకాల వేదాలకి, మూడు సంధ్యలకి సంబంధాన్ని చూపిస్తూ అప్పయ్యదీక్షితులవారు

**ఆదిత్యం మణ్డలాన్తఃస్ఫురదరుణవపుస్తేజసా వ్యాప్తవిశ్వం**
**ప్రాతర్మధ్యాహ్నసాయంసమయవిభజనాదృగ్యజుఃసామసేవ్యమ్**
**ప్రాప్యం చ ప్రాపకం చ ప్రథితమతిపథిజ్ఞానినాముత్తరస్మిన్**
**సాక్షాద్బ్రహ్మేత్యుపాస్యం సకలభయహరాభ్యుద్గమం సంశ్రయామి** అంటున్నారు.

ప్రాతః, మధ్యాహ్న, సాయంకాలాలలో ఋక్కులు, యజుస్సులు, సామములు ద్వారా ఋషులు ఆయన్ని ఆరాధన చేస్తూ ఉంటారు. నిత్యం అవి జరుగుతూ ఉంటాయి. ఆ విధంగా మూడు సంధ్యలలో ఆయన ఆరాధింపబడుతుంటాడు.

కేవలం ఆయన పైన వెలుగుతుంటే మనం క్రింద బ్రతుకులన్నింటినే కాదు, మనలోపల కూడా సూర్యభగవానుడు సూక్ష్మమైన ప్రాణరూపంతో మన బ్రతుకలన్నింటిని కదిలిస్తూ ఉంటాడు. మరణం తరువాత కూడా ఎవరు ఏ గతికి వెళ్ళాలో త్రోవలు ఏర్పాటు చేసేది కూడా ఆయనే. ఎంత పైకి వెళ్ళాలన్నా ఆయన చూపించే మార్గం ద్వారా వెళ్ళ వలసిందే. నడిపించేవాడు ఆయనే.

సూర్యునితో జీవునికి ముడి అనేది శాశ్వతం. మనకి శాశ్వతబంధం, నిజమైన ఆత్మ బంధువు సూర్యభగవానుడే. ఆయన లేకపోతే మనం లేనేలేం. తల్లి తండ్రీ అన్నీ ఆయనగానే కనపడుతున్నాయి.

బ్రహ్మదేవుడే ఆయనకి సాష్టాంగనమస్కారం చేసుకొన్నాడు. సూర్యుడు ఆ విధంగా వెలిగిపోతుంటే ఈయన సృష్టి చేద్దామనే ఉత్సాహంతో సృష్టి చెయ్యబోతున్నాడుగాని సాగడం లేదు.



సూర్యుడిచ్చే శక్తితో వెళ్ళవలసిందే తప్ప తనంతతాను చెయ్యలేనని తెల్సుకొని నమస్కారం చేస్తున్నాడు బ్రహ్మదేవుడు ఆ కనిపిస్తున్న మహాతేజాన్ని. ఆ నమస్కరిస్తున్న మహాస్తోత్రం ఇక్కడ చెప్పబడుతోంది.

**నమస్యే యన్మయం సర్వ మేతత్సర్వమయశ్చ యః**
**విశ్వమూర్తిః పరం జ్యోతి ర్యత్తద్ధ్యాయంతి యోగినః॥**
**య ఋఙ్మయో యోయజుషాం నిధానం సామ్నాం చ యో యోనిరచింత్యశక్తిః**
**త్రయీమయః స్థూలతయాఽర్థమాత్రాః పరస్వరూపో గుణపారయోగ్యః**
**త్వాం సర్వహేతుం పరమం చ వేద్య మాద్యం పరంజ్యోతిరవేద్యరూపమ్**
**స్థూలం చ దేవాఽత్మతయా నమస్తే భాస్వంత మాద్యం పరమం పరేభ్యః**
**సృష్టిం కరోమి యదహం తపశ్శక్తి రాద్యా తత్ ప్రేరితో జల మహీపవనాఽగ్ని రూపామ్**
**తద్దేవతాఽదివిషయాం ప్రణవాఽద్య శేషాం నాఽత్మేచ్ఛయా స్థితిలయావపి తద్వదేవ**
**వహ్నిస్త్వమేవ జలశోషణతః పృథివ్యాః సృష్టిం కరోషి జగతాం చ తథాఽద్యపాకం**
**వ్యాపీ త్వమేవ భగవన్ గగనస్వరూపం త్వం పంచధా జగదిదం పరిపాసి విశ్వమ్**
**యజ్ఞైర్యజంతి చాఽపి యతయో నియతాత్మచిత్తాః**

**సర్వేశ్వరంపరమమాత్మ విముక్తికామాః**
**నమస్తేదేవ దేవదేవాయ యజ్ఞరూపాయతే నమః**
**పరబ్రహ్మస్వరూపాయ చింత్యమానాయ యోగిభిః**
**ఉపసంహర తేజో యత్ తేజసః సంహతి స్తవ।**
**సృష్టే ర్విఘాతాయవిభో సృష్టౌ చాఽహం సముద్యతః**

సర్వం ఎవరిమయమో, ఎవరు సర్వమయుడో అటువంటి ఆదిత్యభగవానుడు విశ్వ మూర్తి. విశ్వమూర్తిగా సమస్త జీవులకి ఆయన తెలియబడుతూ ఉన్నాడు. యోగులు మాత్రం పరంజ్యోతిగా ఆయన్ని తెల్సుకొంటున్నారు.

ఎవరు అచింత్యశక్తిగల ఋగ్వేదమయుడో, యజుర్వేదానికి ఆధారమైనవాడో, సామవేద ఉత్పత్తికి కారణమైనవాడో, త్రయీమయుడో, అర్ధమాత్రస్వరూపుడో ఆయనే సూర్యభగ వానుడు. ఎవరు బ్రహ్మస్వరూపుడో, గుణాతీతుడో, పరమకారణరూపుడో అంటే కారణానికి కూడా కారణమైనవాడో, పరమపూజ్యుడో, పరమవేద్యుడో, వహ్నిరూపమగు పరమ జ్యోతియో ఆయనే ఆదిత్యభగవానుడు. సర్వదేవస్వరూపుడు, శ్రేష్ఠులలో శ్రేష్ఠుదు అయిన భగవానునకు నమస్కారం.



దేవా! నీ శక్తియే ఆద్యము. దాని ద్వారానే ప్రేరేపింపబడి జలము, భూమి, వాయువు, అగ్ని ఇత్యాది దేవతలు, ప్రణవాదులు మొదలగు సృష్టి చేస్తున్నాను. ఇదే విధంగా స్థితి, ప్రళయాలను కూడా నీ శక్తితోనే చేస్తున్నాను.

భగవన్! నీవే అగ్నిరూపుడవు. భూమియందు జలాన్ని పీల్చి మరల జగత్తుని సుసంపన్నం చేస్తున్నావు. పంచభూతస్వరూపుడవై విశ్వాన్ని రక్షిస్తున్నావు. వేదవేత్తలు అఖిలయజ్ఞాల యందు విష్ణురూపుడిగా నిన్నే ఆరాధిస్తున్నారు. మోక్షాభిలాషకలిగిన జితేంద్రియులు, యతులు సర్వేశ్వరుడవైన నిన్నే ధ్యానిస్తున్నారు.

బ్రహ్మదేవుడు చేసిన సూర్యస్తుతి చాలా అత్యద్భుతమైన వేదరహస్యాలన్నీ గర్భీకరించు కొన్నది. ఏ స్తోత్రానికి ఆ స్తోత్రం ఒక ప్రత్యేకం. ఆదిత్య హృదయమంత బలమైనవి. మొట్టమొదటిగా ఆదిత్య భగవానుని స్వయంగా సాక్షాత్తు బ్రహ్మదేవుడే స్తుతించాడు. ఆ తరువాత నీ యొక్క మహా తేజస్సు వల్ల నేను చేస్తున్న సృష్టి, నువ్వు ఇచ్చిన శక్తితో చేస్తున్నప్పటికి అది వెంటనే నీరైపోతున్నది. అది నిలవడం లేదు. కనుక ఈ సృష్టి నిల బడడానికి నీ తేజస్సుని దీనికి అనుగుణంగా ఉపసంహరించుకోవయ్యా అని ఆ మహా తేజస్సుని ప్రార్థించాడు.

ఋగ్యజుస్సామాత్మకమైన ఆ మహా తేజస్సు ఎంత ఉన్నదో భావించాలి. ఎప్పుడైతే ఈ విధంగా ప్రార్థన చేసాడో అప్పుడు క్రమంగా సూర్యభగవానుడు తన స్వరూపాన్ని తానే ఉపసంహరించుకున్నాడు. ఇక్కడ గ్రహించవల్సినది సూర్యుడు ఒక జడ పదార్థంకాదు.

మనం అగ్నిని జ్వలింప చేసి ఆ వేడి తట్టుకోలేకపోతే, 'నువ్వు తగ్గవయ్యా, తగ్గవయ్యా' అంటే అది తగ్గదు. ఎందువల్ల అది జడ పదార్థం కనుక మనమే నీళ్ళు పోసి దాన్ని తగ్గించాలి. కాని సూర్యుని యొక్క మహాతేజస్సుని తగ్గవయ్యా! అని ఈయన ప్రార్థిస్తే తనంతతాను తగ్గాడు. దానిని తగ్గించగలిగిన శక్తి బ్రహ్మదేవునికి కూడా లేదు. తనని తాను తగ్గించుకునే శక్తి ఆయనకు ఉన్నది.

సూర్యభగవానుడు జడ పదార్థం కాదు ఒక చైతన్య మూర్తి. చైతన్యం మాత్రమే ఆ పని చేస్తుంది. ఒక బండరాయిని ప్రక్కకు తొలగు అంటే అది తొలగదు. కనుక ఇక్కడ చూపిస్తున్నది సూర్యుడు కేవలం జడ పదార్థం కాదు.

ఆధునిక విజ్ఞానానికి, ఆధ్యాత్మిక విజ్ఞానానికి తేడా - ఆధునికం విజ్ఞానం అనుకోవడం మొదటి పొరపాటు. ఎందుకంటే అంత తేజోమూర్తిని పట్టుకుని దానిని కేవలం ఒక జడీభూతమైన అగ్నిగోళమని వర్ణించడమే ప్రథమ అజ్ఞానం.



ఆయన వల్ల పుట్టి ఆయన వల్ల కలిగిన మనం ఆయన్ని జడపదార్థం అంటామా? ఆయన వల్ల మనకు చైతన్యం వచ్చింది, ప్రాణం వచ్చింది. సర్వప్రాణములకు మూల మైనవాడు. సూర్యభగవానుని కేవలం ప్రాణస్వరూపంగా, చైతన్య స్వరూపంగా చూడాలి. బ్రహ్మదేవుడు తన తేజస్సుని తగ్గించమని సూర్యుని ప్రార్థించాడు.

సూర్యుడు తగినంత తన తేజస్సును ఉపసంహరించకపోతే సృష్టి నడవదు. తన మొత్తం వెలుగు చూపిస్తే మనం ఏమౌతాం? గ్రహాదులు కూడా ఎంత దూరాలలో ఉండాలో అంత దూరంలో ఉంటేనే వాటి యందు జీవాదుల ఉనికి. ఆయన తేజస్సుకు దగ్గరగా వెళ్ళినా ప్రమాదమే, అతి దూరంగా జరిగినా ప్రమాదమే. అయితే గ్రహాలకి వాటంతట అవి జరిగి అనుకూలంగా ఉండే స్థితి ఉందా?

ఆ దూరం కూడా ఆయన ఉంచుతున్నాడు.

భౌతికంగా చూస్తే భూమి ఎక్కడ ఉండాలన్నది ఆయన నిర్ణయం. ఆయన శక్తి వల్లనే అది ఎక్కడ ఉండాలో అక్కడ ఉండి తిరుగుతున్నది. అలాగే ప్రతిదీ కూడా దాని ఉనికి సూర్యుని ఆకర్షణశక్తి బట్టి ఉంది కదా? అంత పద్ధతి ప్రకారంగా ఉన్న చోటుని మనం జడమని, కాకతాళీయం అని ఎలా అంటాం?

విశ్వవిజ్ఞానమంతా ఆయన రూపంగా కనపడుతున్నది.

ఈ విధంగా బ్రహ్మదేవుడు ఆయన అనుగ్రహాన్ని పొంది తరువాత సృష్టిని ప్రారంభిం చాడు. వివిధ విధాలైన సృష్టులు ఏర్పాటై తరువాత కశ్యప ప్రజాపతి, దక్షుడు అందరూ 'అన్ని పురాణలలో చెప్పినట్లుగానే' బ్రహ్మదేవుని నుంచి మనువులు రావడం, ప్రజాపతులు రావడం ఇత్యాదులన్ని చెప్పబడుతున్నాయి.

ప్రజాపతుల సృష్టి, కశ్యప ప్రజాపతి, దక్షప్రజాపతి. దక్షప్రజాపతి కుమార్తెలను కశ్యప ప్రజాపతి వివాహమాడటం, ఆ కన్యల ద్వారా వివిధ రకాలైన జాతులు అంటే విశ్వంలో ఉన్న గరుడ, సర్ప ఇత్యాదులు మానవజాతి వరకు వివిధాలైన జాతుల ఏర్పాటు చూపిస్తు న్నారు. ప్రతి పురాణంలోనూ మనకు కనపడుతున్న సృష్టి క్రమ విధానమే.

వేదవిజ్ఞానాన్ని ఖగోళ విజ్ఞానంతో కలిపి చూస్తే కశ్యపశబ్దంకాని, మరీచిశబ్దంకాని వీటన్నిటిలో సూర్యపరమైన అర్థాలు కనిపిస్తాయి. కశ్యప అనే శబ్దం కూడా సూర్య సంబంధమైనది.

**పశ్యకః కశ్యపోభవతి** అని వేదంలోనే కనబడుతున్న మంత్రం. పశ్యకుడే కశ్యపుడు అవుతున్నాడు అనే మాట ఉంది. పశ్యకుడు అనగా చూసేవాడు అదే కశ్యప అన్నారు. **పరోక్ష ప్రియా ఇవహిదేవాః** - దేవతలకి నేరుగా చెప్పకుండా కొంచెం తిప్పి చెపితే సంతోషం. కథల రూపంలో చెప్పినా, లేకపోతే అటుదిటు తిప్పి చూపించినా అదొక ప్రీతి కలుగుతుంది వాళ్ళకి. అదొక రసజ్ఞత.



**మరీచి** అనగా తీవ్రమైన కాంతి. **మరీచిమాన్** అని ఆదిత్య హృదయంలో వస్తుంది. ఇలాగ ప్రతి దానికి అర్థం తీస్తే మొత్తం సూర్యపరంగానే సృష్టి క్రమం అంతా కనపడుతుంది. మనం చూస్తున్న ఈ భూమియందున్న సృష్టి అంతా సూర్యుడు, దాని నుంచి క్రమంగా కలగడం విజ్ఞాన శాస్త్రం కూడా ఒప్పుకుంటున్న దానికి, పురాణంలో ఉన్న పేర్లను అర్థం తీస్తే దానికి సరిగ్గా సరిపోతున్నది. ఇలా ఆ ప్రథమజ్యోతైన ఆ సూర్యభగవానుని అనుగ్రహం వల్లనే ఇవన్నీ లభించాయి అని చూపించారు.

మరి ఇదంతా బావుంది గాని అదితీదేవికి సూర్యుడు పుట్టాడు అనే కథ ఉంది కదా! అదితీదేవి దక్షప్రజాపతి కుమార్తె. అదితీదేవికి సూర్యుడు పుట్టాడంటే ఇది సృష్టికి పూర్వం చెప్పిన కథ కాదు తరువాత కథ. అదితిదేవికి కలిగినవాడా! ముందు నుంచి ఉన్నవాడా! అనే ప్రశ్నకి అద్భుతమైన కథ చెప్తూ మార్కండేయ మహాముని 'అదీ నిజమే, ఇదీ నిజమే' అన్నారు. ఆ సూర్యభగవానుడే మళ్ళీ అదితీదేవికి పుత్రునిగా జన్మించాడు

అని ఒక కథగా చెప్తున్నారు. ఈ వివిధాలైన సృష్టులన్నీ జరిగి, సాగుతూ ఉండగా క్రమక్రమంగా సాత్త్విక, తామస, రాజస సృష్టిలో రజో, తమో గుణాల ప్రవృత్తి ఆధిక్యం ఉన్నవాళ్ళు దానవులు, దైత్యులు ఇత్యాదులు. సత్త్వగుణ ప్రాధాన్యం ఉన్నవాళ్ళు దేవతలు. దేవతల వల్ల సృష్టికి క్షేమం జరుగుతూ ఉంటుంది.

రజోగుణ, తమోగుణ ప్రాబల్యం కల్గిన దైత్యులు, దానవులు విజృంభించి, ఒకప్పుడు ఈ దేవతలందరిని దెబ్బ తీసారు. ఈ దేవ దానవ సంగ్రామం సృష్టిలో జరుగుతూనే ఉంటుంది. దేవతలు ఎప్పుడైతే దెబ్బతిన్నారో అదితీదేవి బాధపడి సూర్యుని ఆరాధన చేసి తిరిగి తన పిల్లలైన దేవతలందరిని కాపాడుకోవాలనుకొంది. దానికోసం నియమంగా తన భర్త చెప్పిన పద్ధతులలో దీక్ష వహించి సూర్యుని ఆరాధన చేసింది. ఆ చేసిన పద్ధతి

**ఏకాగ్రానియతాహార పరం నియమమాస్థితా**
**తుష్టావ తేజసాం రాశిం గగనస్థం దివాకరమ్**

గగనస్థుడైన ఆ దివాకరుని, ఆ తేజోరాశిని ఆవిడ ఉపాసనతో ఆరాధించింది. దానికి సంతోషించి సూర్యభగవానుడు ఆమెకు తనయుడుగా కలుగుతానని మాట ఇచ్చాడు. ఉన్నవాడే అవతరించాడుకాని అవతరించాకే వచ్చాడని కాదు ఇక్కడ. అయితే ఇక్కడ అదితీదేవి చేసిన స్తోత్రం కూడా చాలా విశేషంగా చెప్పబడుతున్నది.



**నమస్తుభ్యం పరాం సూక్ష్మాం సావర్ణీం బిభ్రతే తనుమ్**
**ధామ ధామవతామీశ ధామ్నా మాధార శాశ్వత**
**జగతా ముపకారాయ తథాఽ ప స్తవ గోపతే**

సూర్యునికి సంబోధనలో గోపతేలాంటి మాటలు కనబడతాయి. గోపతి, గోవిందా దగ్గరి శబ్దాలు. గోపతి= కిరణాలకు ప్రభువు. గో శబ్దం కిరణాలను తెలియచేస్తుంది. అదితీదేవి సూర్యభగవానుని స్తుతించినప్పుడు దేవతారూపముతో ప్రత్యక్షమవుతాడు. ఆ మహాతేజస్సుని చూసిన వెంటనే ఆవిడ ఆనందపడుతూనే "ఈ మహాతేజాన్ని నేను తట్టుకోలేకపోతున్నాను. నువ్వు నాకు తనయుడుగా ఆవిర్భవించి నా పుత్రులైన ఇతర దేవతలందరిని కాపాడాలి" అని ప్రార్థిస్తే సూర్యభగవానుడు నేను నీ గర్భంలో ప్రవేశిస్తానని వరమిచ్చాడు.

**తతో రశ్మి సహస్రాత్తు సౌషుమ్నాఽ యో రవేః కరః**- నాకు వేల కొలదీ కిరణములు ఉన్నాయి. అందులో సుషుమ్నా అనబడే ఒక కిరణం నీ గర్భంలో ప్రవేశిస్తుంది అన్నాడు. సూర్యకిరణాలు వెయ్యి. సహస్రకరుడు అనగా అనంత కిరణాలు కలవాడు అని అర్థం.

వెయ్యి కిరణాలకి పేర్లు ఉన్నాయి. సప్త కిరణములకి పేర్లు ఉన్నాయి. ఎన్నో రకాల విజ్ఞానం చెప్పారు. ఏ ఏ కిరణాలని ఏ ఏ కాలాలలో ఎలా ప్రసరింప చేస్తాడో చూపించారు. అలాంటి స్వామి రకరకాల కిరణజాలాలు, ఆ కిరణములతోనే ఋతు చక్రములు ఏర్పడతాయి.

ఇక్కడ ఆవిడ చేసిన స్తోత్రంలోనే సూర్యుని కాలస్వరూపాన్ని ఋషి అద్భుతంగా ఆవిష్కరిస్తున్నాడు. ఒక్కొక్క స్తోత్రం ఒక విజ్ఞానకోశం. స్తోత్రమంటే పొగడ్తలమయం కాదు. ఒకొక్క దేవతకు సంబంధించిన స్తోత్రం ఆ దేవతకు సంబంధించిన విజ్ఞానం. చాలామందికి ఫలశ్రుతి మీదే శ్రద్ధ తప్ప స్తోత్రం ఏం చెప్తున్నదో తెలియదు.

ఆదిత్య హృదయం చదివితే ఆరోగ్యం వస్తుందండీ. కాని ఆదిత్యహృదయంలో ఏం చెప్పారో ఆలోచించారా? ఆశ్చర్యకరమైన ఆదిత్యుని విజ్ఞానం అందులో చూపించారు.

**గ్రహీతుమష్టమాసేన కాలేనేందుమయం రసమ్**
**బిభ్రతస్తవ యద్రూప మతి తీవ్రం నతాఽస్మి తత్**
**తమేవ ముంచతః సర్వం రసం వై వర్షణాయ యత్**

నువ్వు సంవత్సరంలో ఎనిమిది మాసాలు తీవ్రమైన నీ కాంతితో భూమిలో ఉన్న రసాన్ని తాగుతావు. తరువాత తిరిగి వర్ష రూపంగా దానిని నువ్వే అందిస్తావు. అనగా ఋతుచక్రం సూర్యుని వల్ల ఎలా జరుగుతున్నదో అదితీదేవి చేసే స్తోత్రంలో చూపిస్తున్నాడు.



ఈ స్తోత్రం విని ఈ బయట ప్రపంచాన్ని మనం చూస్తే ఆదిత్యుడు మనల్ని ఎలా బ్రతికిస్తున్నాడు, ఒక్కక్షణం కూడా మనల్ని వదలకుండా ఎలా కాపాడుతున్నాడో తెలుస్తుంది.

**రూపమాప్యాయకం భాస్వం స్తస్మై మేఘాయతే నమః** – తీవ్రమైన కాంతితో ఎనిమిది నెలలు రసాన్ని గ్రహిస్తావు. ఆ తరువాత వర్షం కురిపించేటప్పుడు మేఘరూపుడవై ఉంటావు. ఆ శీతలమైన వర్షభాగంగా కొంత చేస్తావు, దాని తరువాత మంచురూపంగా నీ కిరణములతో నువ్వే అందిస్తావు.

**వార్యుత్సర్గ వినిష్పన్నమశేషం చౌషధీగణమ్**
**పాకాయ తవ యద్రూపం భాస్కరం తం నమామ్యహం**
**యచ్చరూపం తవాఽ మీతం హిమోత్సర్గాఽ ది శీతలమ్**
**తత్కాలసస్యపోషాయ తరణే తస్య తేనమః**

వర్షాలతో సస్యాలన్నీ కలిగిస్తావు, మళ్ళీ హిమాన్ని కూడా నువ్వే అందిస్తావు. హిమము,

వర్షం, తీవ్రమైన ఉష్ణం ఈ మూడింటిని నీ కిరణాలతో కలిగిస్తావు. హిమసర్జన కిరణాలు-300, ఘర్మసర్జన కిరణాలు-400, వృష్టి సర్జన కిరణాలు-300 అని వెయ్యికిరణాల గురించి చెప్పుకున్నాం.

**యద్రూపం జీవనాయైకం వీరుధామమృతాత్మకమ్** - ఈ విధంగా చూసినప్పుడు వర్షం గాని, మంచుగాని అన్నీ సూర్య రూపములే. అంతేగానీ సూర్యుడు వెళ్ళిపోయాడు వర్షం వచ్చింది అని కాదు. ఆయన లేకపోతే ప్రపంచమే లేదు. ఆయనే వృష్టి కారకుడై ఉన్నాడు. ఈమె చేసిన స్తోత్రంలోనే కాలరూపంగా చూపిస్తున్నారు. **ఋతుకర్తా ప్రభాకరః** అని ఆదిత్య హృదయంలోని చిన్న మాటలో ఈ భావమంతా గ్రహించవచ్చు.

**త్వం బ్రహ్మా హరి రజ సంజ్ఞిత స్త్వమింద్రో**
**విత్తేశః పితృపతి రప్పతిః సమీరః**
**సోమోఽగ్ని ర్గగనపతి ర్మహీధరోఽబ్ధిః**
**కిం స్తవ్యం తవ సకలాఽత్మ రూపధామ్నః**

అదితీదేవి చేసిన స్తోత్రంలో చెప్తున్నారు. నువ్వే బ్రహ్మగా, విష్ణువుగా, శివునిగా, ఇంద్రునిగా, కుబేరునిగా, పితృపతి అనగా యమునిగా ఇత్యాదులుగా చెప్పబడుతూ ఉంటావు. అనగా సర్వదేవాత్మక స్వరూపంగా ఇక్కడ చెప్పడం జరిగింది.



తరువాత సూర్యుడు సుషుమ్నానామక కిరణంతో అదితీదేవి గర్భంలో ప్రవేశించిన తరువాత ఆమె తన గర్భంలో సాక్షాత్తు ఆ మహాతేజోమూర్తి ఉన్నాడనే భక్తితో మరింత నియమంగా ఉపవాసాది నియమాలు మొదలు పెట్టింది.

కృచ్ఛ్ర చాంద్రాయణాదీని సా చ చక్రే సమాహితా - చాంద్రాయణ వ్రతాలు ఇత్యాదులు ఇంకా ఎక్కువ చేసింది. గర్భం రావడానికి ఉపవాసాలే. గర్భం వచ్చాక కూడా ఉపవాసాలే. పైగా చాంద్రాయణం అంటేనే క్లిష్టమైనది కృచ్ఛ్ర చాంద్రాయణం అని మరొకటి ఉంది. కృచ్ఛ్రం = అతి కష్టం అని ఒక అర్థం.

మహా తేజోమూర్తిని నేను గర్భంలో ధరిస్తున్నాను కనుక నేను శుచిగా ఉంటాను అని ఆమె నిర్ణయించుకుని మరింత ఉపవాసాది నియమాలు పాటిస్తూ ఉంటే భర్త అయిన కశ్యప ప్రజాపతి చూసి ఏంటది తిండీతిప్పలు లేకుండా అలా ఉంటావు- అని మందలిస్తూ

**కిం మారయసి గర్భాండమితి నిత్యోపవాసినీ** - నిత్యోపవాసములు చేస్తూ నీ లోపల ఉన్న ఆ గర్భాండాన్ని చంపేస్తావా ఏంటి? అన్నాడు. ఆవిడకి ఆ మాట తట్టుకోలేక

మహా కోపం వచ్చి-

**సా చ తం ప్రాహ గర్భాండ మేతత్పశ్యేతి కోపనా**
**న మారితం విపక్షాణాం మృత్యవే తద్భవిష్యతి**

ఇది చచ్చే పిండం కాదు చంపే పిండం అందిట. ఎవరిని చంపుతుంది అంటే, శత్రువులని సంహరించడానికి నాలో పెరుగుతున్న మహా తేజం కానీ చచ్చేదికాదు సుమా! అని వాదించుకుంటున్న వెంటనే ఆ గర్భం ఇంకా మాసాలు నిండుకుండానే లోపల నుంచి బయటకి వచ్చేసింది. తీవ్రమైన తేజస్సుతో. గర్భస్థ శిశివు ఉన్నప్పుడు ప్రతికూల వచనములు ఎక్కువ ఆడరాదు.

మొత్తానికి ఆ మహా తేజః పిండం బయటకి వచ్చేసింది.

**జాజ్వల్యమానం తేజోభిః పత్యుర్వచన కోపితా** – మహా తేజస్సుతో రాగానే చూస్తున్నాడు కశ్యప ప్రజాపతి. ఆ తేజస్సు ఎదురుగా నశించిపోకుండా భాసిల్లుతోంది. ఆ తేజస్సే పుత్రునిగా ఉద్భవించింది. చంపేస్తావా! అంటే ఇది చచ్చేది కాదు చంపేదని **మార** అనే శబ్దం మీద రావడం వల్ల ఆ స్వరూపం **మార్తాండ** అని పేరు పొందినది. మార్తండరూపంలో అదితీదేవికి కల్గిన వాడు కనుక ఆదిత్యుడు 'మార్తాండుడు' అని చెప్పబడుతున్నాడు.



సూర్యభగవానుడు సామాన్యుడు కాదు. రోగకారకుడు. సూర్యుని వల్ల అనేక రకాల రోగాలు కలుగుతాయి. సూర్యుడు రోగనాశకుడు. ఆరోగ్యప్రదాత. రెండూ ఆయనే. సూర్యకాంతికి మలమాడిపోతారు, ఆ సూర్యకాంతిచేతనే ప్రాణం, జీవం పొందుతూ ఉంటారు. రెండూ ఆయనలోనే ఉన్నాయి. సృష్టి, స్థితి, లయలు మూడూ ఆయన కిరణాలలోనే కనపడుతున్నాయి. బ్రహ్మ మొదలుకొని అన్ని దేవతాలక్షణాలు ఆయనలోనే కనపడుతున్నాయి.

ఆయన ఐశ్వర్యప్రదాత. ఆయన కిరణాల వల్లనే లోహాలు, రత్నాలు, ధాతువులు అన్నీ తయారవుతాయి. ఆయనలోంచి వచ్చినవే సమస్త ఐశ్వర్యాలు. ఆయన ఇచ్చిన వాటి వల్ల సంపదలు పొందుతున్నాం.

పంటల వల్ల కొందరు, ఖనిజాల వల్ల కొందరు సంపదలు పొందుతూ ఉంటారు. సర్వం ఆయన వల్ల వస్తున్నప్పుడు ఆయనకు **విత్తేశ్వరుడు** అనే మాట సరిపోతుంది. ఆయన యముడు. కాలుడు. సమయం జాగ్రత్తగా చూసుకుంటూ ఎప్పుడు ఏది పూర్తి చెయ్యాలో అది చేస్తుంటాడు.

సర్వ దేవతలు ఆయనలోనే కనబడుతున్నారు. అటువంటి తత్త్వం ఇక్కడ ఆవిర్భవించింది.

ఆ ఆదిత్య భగవానుడు ఈమె గర్భంలో కిరణాన్ని ప్రవేశింప చేసి అదితీదేవికి పుత్రునిగా వచ్చాడు. ఆ రావడం మహా తేజస్సుతో తనంతతానుగా వచ్చాడు. అది మార్తాండమనబడే మహా తేజస్సు. ఆయన రాగానే దేవతలందరూ చేరి ఆయన్ని స్తుతించారు. వారి స్తుతికి సంతోషించి సూర్యభగవానుడు దేవతల శత్రువులైన అసురులందరిని సంహరించాడు.

సూర్యభగవానుడు చేసిన అసుర సంహారాన్ని మార్కండేయ పురాణం చాలా అద్భుతంగా వర్ణించింది. సూర్యుని ఆవిర్భావం అసుర సంహారం. దివ్యభూమికలో జరిగిన కథ ఇది. దీనిని జరగలేదని మనం ఎలా చెప్పగలం. ఈ కథ రోజూ జరుగుతూనే ఉంటుంది.

అదితి శబ్దానికి ఆకాశమని అర్థం శాస్త్రంలో స్పష్టంగా కనపడుతోంది. ఖండించడానికి వీలైనది దితి. అదితి అనగా ఖండించడానికి వీలుకానిది. ఆకాశమంతా అదితి. ఈ అదితి దేవశక్తి. అమ్మవారి పేరు అదితి. లక్ష్మీఅష్టోత్తర శతనామావళిలో 'అదితిం చ దితిం దీప్తాం' అని చెప్పారు. ఆకాశాన్ని ఎవరూ ఖండించలేరు.



ఆత్మనః ఆకాశ సంభూతః పరమాత్మ మొదటి వ్యక్తీకరణ ఆకాశమే అని చెప్పబడుతోంది. కం బ్రహ్మ అనే మాట కనపడుతోంది. ఆకాశ శరీరం బ్రహ్మ ఖం బ్రహ్మ ఇత్యాది శబ్దాలన్ని కనపడుతున్నాయి. ఆకాశం శూన్యం కాదు. భారతీయ ఋషుల దృష్టిలో ఆకాశమంటే అత్యంత సూక్ష్మమైన మహాశక్తి నిండినదని అర్థం.

వ్యాపకమైన సూక్ష్మశక్తి ఆకాశం. ఆ ఆకాశంలో మహాశక్తి రకరకాలుగా ప్రకటింప బడుతూ ఉంటుంది. అలాంటి ఆకాశంలో ప్రకటింపబడ్డ మహాతేజస్సు. అదితిలో అనేక శక్తులు కలిసి ఒక దగ్గర ప్రకటింపబడితే అది సూర్యమండలమైంది. అదితి ఐన ఆకాశంలో దాని యందు దాగిన సూక్ష్మశక్తి ఒక తేజఃపుంజంగా ప్రకటింపబడింది.

అదితిలో జనించిన తేజఃపుంజం ఆదిత్యం కాదా? అదితిపుత్రుడు. అదితికి సంబం ధించిన మంత్రం సౌర మంత్రాలలో వస్తుంది. ఆ అదితే మాతా, పిత, పుత్ర అని చెప్పారు. అదితికి ఎక్కడి నుంచో రాలేదు. అదితి యందు దాగిన శక్తే సూర్యరూపంతో వచ్చినది.

సూర్యుడు అదితి నుంచి వచ్చాడు. దాని యందు అవ్యక్త శక్తి వ్యక్తీకరింపబడి ఆదిత్య రూపంలో వచ్చింది అని స్పష్టంగా కనపడుతున్నది. ఇంకా అది దేవతలను రక్షిస్తోంది.

ప్రతిరోజూ ప్రాతఃకాలంలో సూర్యభగవానుడు రాగానే అసుర శక్తులన్నీ సంహరింప

బడుతున్నాయి. చీకటిని ఆశ్రయించుకున్న హిమం మొదలైన అమంగళకరమైనవి, రోగకారకమైనవన్నీ కూడా సూర్యోదయంతో పోతున్నాయి. మనల్ని బాధించేవే అసురులు అనుకుంటే సూర్యుని ఉత్పత్తితో ఆ అమంగళాలు, అసురత్వం పోతున్నవా? లేదా? అసుర సంహారం చేసాడా లేదా? ఇది మనం నిత్యం చూస్తున్నది.

నిత్యం సూర్యోదయం జరిగినప్పుడు మనకి తెలియకుండానే అనేక దుష్ట శక్తులు నశించిపోతాయి. రాత్రిని ఆశ్రయించుకుని అనేక దుష్టశక్తులు ఉంటాయి. రోగాదులు ఇత్యాదులు కూడా. తెల్లవారితే బాగుండునని రోగులు అనుకుంటూ ఉంటారు ఆ సమయంలో. ఆశ్చర్యకరంగా తెల్లవారితే కొన్ని పోతూ ఉంటాయి.

సూర్యుని ఉదయమే సుమంగళం అని చెప్తారు వేదంలో. కథని ఆధారంగా చేసుకుంటూ ఒక్కొక్క ఘట్టం దగ్గర ఆగి వేదవిజ్ఞానం చెప్పింది చెప్పుకుంటున్నాం.

సూర్యుడు ఉదయించినప్పుడు విశేషాలను చెప్తున్నారు. ముందు ఉషః కాలమని వస్తుంది. **ఉషదాహే ఉష ఋజాయాం** అని రెండు రకాల పేర్లు చెప్తున్నారు.

ఉషః కాలానికి రోగహరణ కాలమని పేరు. ఉషఃసూక్తం అని ఋగ్వేదంలో చెప్పబడుతుంది. అక్కడ సుమంగళి అనే మాట ఉషః కాలానికి పేరు. ఉషాదేవి ఆవిడ. ఉషఃకాలపు సూర్యచైతన్యం మనకి తల్లి. ఆవిడనే సుమంగళి అంటారు.

ఉషఃకాల సమయంలో వస్తున్న సూర్యభగవానుడు ముందు తామ్రవర్ణంలో మంచి రాగి రంగులో బాగా ఎరుపుగా కనపడతాడు. కొద్ది సేపటికి కాస్త ఎరుపు విరిగి నెమ్మదిగా బంగారు రంగులోకి దిగుతాడు.

ఆ మంగళకరమైన సమయమే ప్రాతఃకాలం. ఎలాంటి మనిషైనా సరే ప్రాతఃకాలంలో నిద్రలేచి ఆ బింబం చూస్తేచక్కని సదాలోచనలు వస్తాయి.

ఆ కాలానికి అంతటి శక్తి ఉంది, ఆ కాలం సుమంగళం.

అలాంటి సూర్యభగవానుడు కైలాసంలో ఉంటాడా? వైకుంఠంలో ఉంటాడా? అంటే ప్రతిరోజూ మనకి కనిపిస్తాడు. అదిగో చూడు అసౌ – అక్కడే ఒక్క సూర్యుని గురించి చెప్పినప్పుడే నేరుగా చూపించగలం ఇంక ఏ దేవుళ్ళ గురించి చెప్పినా ఇదిగో అని చెప్పలేం. ఇదిగో శివుడు, ఇదిగో విష్ణువు అని మనం చూపించగలమా! మహా అయితే విగ్రహం చూపించగలం.

విగ్రహంలో కూడా సూక్ష్మమైన తేజస్సు ఉంటుంది కాని ఆ తేజస్సుని మన కంటితో చూడలేం. మన కంటితో నేరుగా చూడగలిగే పరమాత్మ సూర్యభగవానుడు ఒక్కడే.

మన కంటితో చూసినా ఆయన్ని పరమాత్మా అని తెలుసుకోలేకపోతున్నాం. అదే మన అజ్ఞానం.

ఇది ఎలాంటి అజ్ఞానమంటే ఒక పిల్లవానికి పిచ్చి పట్టి అమ్మని పోల్చుకోలేకపోయాడు. అమ్మని చూస్తున్నంతసేపు ఏదో స్త్రీని చూస్తున్నట్టు మాట్లాడుతున్నాడు. ప్రక్కవాళ్ళు ఒరే ఆవిడ మీ అమ్మ రా! అని చెప్తున్నా వాడికి తెలియటం లేదు. ఒక పిచ్చివాడికి కన బడుతున్న అమ్మలో అమ్మతనం కనపడకుండా ఆడదనే అభిప్రాయం ఉంటే ఎంత అసహ్యకరంగా ఉంటుందో అదేవిధంగా కనిపిస్తున్న సూర్యునిలో పరమాత్మని చూడలేక పోవడం అంతే పిచ్చితనం. ఆ పిచ్చితనంతో బ్రతుకుతున్న మానవజాతికి ఆ అజ్ఞానాన్ని తొలగించారు భారతీయ మహర్షులు. ఆయనలో సాక్షాత్తు పరమాత్మని చూసామా మన బ్రతుకు మారిపోతుంది.

**అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రు స్సుమంగళః** – రుద్ర మంత్రాల్లో రెండు మంత్రాలు ఆదిత్యాత్మకరుద్రస్తుతిగా చెప్పబడుతున్నాయి. వాటినే జపం చేసి సూర్యుని ఉపాసన చేసి రోగాలనుంచి బయటపడినవారు చాలా మంది ఉన్నారు.



**ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః** సూర్యునికి అర్ధరాత్రి సమయం నుంచి మళ్ళీ అర్ధరాత్రి సమయం వరకు ఆయా సమయాలలో ఆయా పేర్లు ఉన్నాయి. సూర్యుడు ఎప్పుడూ ఉంటాడు. సూర్యుడు వెళ్ళిపోయాడు, సూర్యుడు వచ్చాడని లేదు.

**కదాచన నోదేతివా నాస్తమేతి** – సూర్యుడు ఉదయించడు, అస్తమించడు అని ఐతరేయ బ్రాహ్మ ణంలో స్పష్టంగా చెప్తున్నది. మనకు అలా కనిపిస్తాడు, అనిపిస్తాడు అని చెప్పింది. భూమి గుండ్రంగా ఉందని ప్రపంచానికి చాటిచెప్పిన ఆర్యభట్టకి ఆ జ్ఞానం వేదం నుంచే వచ్చింది. పూర్తిగా విజ్ఞానం మీద ఆధారపడ్డ మతం మనది, జ్ఞానం మనది.

సూర్యుని ఆరాధించడం ఒక విజ్ఞానం. కేవలం భౌతిక పదార్థంగా చూసే విజ్ఞానం కాకుండా అందులో చైతన్యాంశ అయిన దేవతామూర్తిని ప్రచోదనం కలిగించి దాని ద్వారా అనుగ్రహం పొందగలిగే విజ్ఞానం ఒకటి మనకి ఉంది. దాన్ని మతం అనుకోవద్దు. దానికి 'సూక్ష్మ విజ్ఞానం' అని పేరు పెడదాం.

సూర్యుని భౌతికాంశ మనకు కనబడే మండలం. సూర్యుని చైతన్యాంశ దేవతామూర్తి. ఆ లోపల దేవతామూర్తి స్వరూపమే మండలంగా గోచరిస్తున్నది. దేవతలను రక్షించడం కోసం వచ్చినవాడు ఆ సూర్యభగవానుడే. ఆయన నుంచే దేవతలందరూ వచ్చారు. తన నుంచి వచ్చిన దేవతలను రక్షించడం కోసం మళ్ళీ తానే అవతరించాడని గమనించి

నట్లైతే సంపూర్ణంగా అదితీదేవికి తనయుడుగా వచ్చిన వైనం ఈ కథలో చూపిస్తున్నారు.

**తతః సుహర్షమతులం ప్రాప్తాః సర్వే దివౌకసః**

**తుష్టువుస్తేజసాం యోనిం మార్తాండమదితిం తథా**

అమ్మా! మా కోసం నువ్వు తపస్సు చేసి ఈయన గారిని మాకు అందించావు అని అదితీదేవిని, మార్తాండునిని కూడా దేవతలందరూ స్తుతించారు. ఇంతవరకు చెప్పుకున్న ఈ దివ్యగాథని ఏవరైతే చదువతారో వారికి రోగనాశనం లభిస్తుందని ఈ ఘట్టానికి ఫలశ్రుతిగా చెప్పారు.

మార్కండేయుడు క్రౌష్టికునితో సూర్యకళ్యాణం గురించి చెప్తున్నాడు. ఈ కథలన్నీ ఎంతో రమ్యంగా చెప్పారు. మార్తాండుడు అదితీదేవికి పుత్రునిగా వచ్చాడు. మార్తాండునకు పిల్లనివ్వడానికి వచ్చినవాడు విశ్వకర్మ. విశ్వకర్మ పుత్రిక పేరు సంజ్ఞాదేవి.

ఈ కథ చెప్తూ మార్కండేయుడు క్రౌష్టికునితో–

**చరితం హంతి యత్పాపం కలౌ సంశ్రుణ్వతాం నృణామ్** – కలిలో ఎలాంటి పాపాన్నైనా పోగొట్టగలిగే ఇతివృత్తాన్ని చెప్తున్నాను శ్రద్ధగా వినవయ్యా అంటాడు.

ఈ కథని చెప్తూ 'గోపతిః' అని ప్రారంభిస్తాడు. గోపతి మాట వేదాలలో వాడబడుతూ ఉంటే దానిని పురాణంలో చక్కగా చూపిస్తున్నారు. గోపతి అయిన సూర్యునికి విశ్వకర్మ తన కుమార్తె అయిన సంజ్ఞాదేవిని ఇచ్చి వివాహం చేసాడు. ఆ సంజ్ఞాదేవికి ఈయన ద్వారా సంతానం కలిగింది. అయితే ఇక్కడ సూర్యుడు గోళాకారపు దేవుడు. ఆయన మార్తాండునిగా అవతరించినప్పుడు కూడా **గోళాకారంతు తందృష్ట్వా** అన్నారు

గోళాకారంగా మహాతేజస్సుతో ఉన్నాడు. ఈవిడ పతివ్రతగా ఆయన్ని ఆశ్రయించి ఇద్దరు పుత్రులను, ఒక కుమార్తెను కన్నది. వైవస్వతుడు, యముడు పుత్రులు, యమునా అనే పుత్రిక. ఆమె ఆయన యొక్క తీవ్రమైన వేడిని భరించలేక తన నుంచి ఒక శక్తిని సృష్టించి నువ్వు కొంతకాలం నా రూపంతో ఈయన దగ్గర ఉండు అని చెప్పి సంజ్ఞాదేవి పుట్టింటికి వెళ్ళినది. ఇదంతా కథలా చెప్తేగాని మనకి అర్థంకాదని ఋషులకు తెలిసి ఈ రూపంలో అద్భుతమైన అంశాలని చెప్తున్నారు.

విశ్వకర్మ అంటే మొత్తం విశ్వంలో జరుగుతున్న పని.

మన సమాజంలో పరిపాలనా పద్ధతి ఉండబట్టే సక్రమంగా అన్నీ జరుగుతున్నాయి. వ్యవస్థ అంటూ ఉంది కనుకనే మనం క్షేమంగా ఉండగలుగుతున్నాం. ఆ వ్యవస్థ మనకి తెలియకపోవచ్చుగాని ఉందని అంగీకరిస్తున్నామా! లేదా! ఒక ఊరిలోనే ఒక

వ్యవస్థనేది లేనపుడు మనం ఉండలేమని అనుకున్నప్పుడు ఈ విశ్వంలో కూడా దానికొక పనిచేసే వ్యవస్థ ఉంది అని మనం గ్రహించగలగాలి.

మనం పెట్టుకొన్న ఈ 'Administrative System' కంటే పకడ్బందీ వ్యవస్థ ఈ విశ్వంలో ఉంది. ఒకడే ఈశ్వరుడు, ఒకడే పరమేశ్వరుడు. ఆయన విశ్వమంతా పకడ్బందీగా అణువు మొదలు బ్రహ్మాండం అంతా నిర్వహించి పనిచేసేటప్పుడు ఆయన విశ్వకర్మ. ఆయన కూడా ఆ సూర్యస్వరూపమే.

విశ్వకర్మ కుమార్తె సంజ్ఞా. ఈ పేర్లన్నీ అర్థం తెల్సుకోగల్గితే– 'సంజ్ఞా' అంటే ఒక వస్తువును పోల్చుకొనుట అని అర్థం. పురాణ భాషలో భార్య అంటే 'విడదీయని శక్తి' అని అర్థం. సూర్యుని భార్య సంజ్ఞా అంటే సూర్యుడు వస్తేనే ఏ వస్తువునైనా పోల్చుకోగలం. ఏ వస్తువునైనా పోల్చుకోగలిగే శక్తే సంజ్ఞా.

ఈ సంజ్ఞని వదిలి వెళ్ళిన ఆవిడ పేరు ఛాయ. ఈ ఛాయ ఆవిడనించి వచ్చిందే. సూర్యుడు ఉంటేనే ఏ వస్తువునైనా పోల్చగలం. దేనితో? వెలుగుతో. మరి నీడ? వెలుగు లేకపోతే నీడ ఉంటుందా? చీకటిలో నీడా తెలియదు. వెలుగు తెలియదు. కనుక వెలుగు ఉంటేనే నీడ ఉంటుంది. సంజ్ఞా, ఛాయా పేర్లలోనే ఔచిత్యం ఉంది. ఋషి ఊరకనే చెప్పలేదని తెలుస్తుంది. వేదంలో దీనిని విజ్ఞానంగానే చెప్పారు.



పురాణం దానిని కథా రూపంలో మనకి అందిస్తున్నది. కాలక్షేపంగా మనకి అందించ కుండా కథారూపంలో వినడం వల్ల – అవి జడపదార్థాలు కావు, అవీ చైతన్యస్వరూపములే అనే ఎరుకకోసమే వాటిలో పాత్ర, రూపమనే కల్పన జరుగుతూ ఉంటుంది. ఇది వినడం ఒక యజ్ఞం చేసిన ఫలితం ఇస్తుంది.

ఒకొక్క పురాణకథ వినడం ఒక యజ్ఞం చేసిన ఫలితం. మనం ఒక సౌరయాగం చేసిన ఫలితాన్ని దీని ద్వారా పొందుతున్నాం. సంజ్ఞాదేవి ఛాయాదేవిని జాగ్రత్తగా చూసుకోమని చెప్పి పుట్టింటికి వెళ్ళినది. తండ్రి సంజ్ఞాదేవిని చూసి ఏంటి ఇలా వచ్చేసా వని అడిగితే మా ఆయన వేడిని తట్టుకోలేకపోతున్నాను అంది. వీలులేదు సుమా! భర్తని వదిలి వస్తే ఇంట్లో కూర్చోపెట్టుకునే తండ్రిని కాను నువ్వు వెళ్ళిపో! అని చెప్పాడు. తల్లిదండ్రుల పని, పిల్లకి పెళ్ళి చేసిన తరువాత కాపురం నిలబెట్టడం.

సంజ్ఞాదేవి తండ్రితో నేను ఆయన్ని వదిలేసి రాలేదు.ఆయన్ని తట్టుకోగలిగే శక్తి కోసం తపస్సు చేసుకుందామని వచ్చాను. భార్యాభర్తలకి ఒకరికొకరు పడలేదంటే భౌతిక కారణాలే కాదు, సూక్ష్మకారణాలు కూడా ఏవో ఉంటాయి. గతజన్మల బంధాలు కూడా ఉంటాయి.

ఆలోచించి దాని విరుగుడుకి ఏదైనా తపోమార్గం ఆలోచించుకుని సాధనో, వ్రతమో చేసుకుని కలుపుకోవాలి. విడిపోతారా? ఈ కథలలో నేర్చుకొనే గొప్పగొప్ప అంశాలు ఉన్నాయి. అన్యోన్యంగా ఉండే ఆదిదంపతులైన కామేశ్వరీ కామేశ్వరుల ఉపాసన చేసుకుంటే పడని భార్యాభర్తలకి కూడా పడుతుంది.

ఎప్పుడైనా సరే ఏదో కష్టం ఉందని చెప్పి మనం భౌతిక పరిష్కారాల పేర్లతో ధర్మం నుంచి భ్రష్టం కారాదు. ఏదో ఒక నియమమో, తపస్సో, ఉపాసనో చేసుకుని తిరిగి కాపాడుకోవాలే తప్పా ధర్మం భ్రష్టత్వం కూడదని పురాణం గొప్ప నీతిని బోధిస్తోంది.

నేను తపస్సు చేసుకోవడానికి వచ్చాను. నువ్వు నన్ను ఇంటినుంచి వెళ్ళిపోమన్నావు కనుక నేను తపస్సు చేసుకోవడానికి అరణ్యానికి వెళ్ళిపోతాను అని, బడబా రూపంతో అనగా ఒక గుఱ్ఱం రూపంతో వెళ్ళిపోయి ఒక అరణ్యంలో కూర్చుని తపస్సు చేసుకుం టోంది సంజ్ఞాదేవి.

ఈ లోపు సూర్యుని దగ్గర ఉన్న ఛాయాదేవి సంజ్ఞాదేవి కన్న సంతానాన్ని తల్లిలా చూసుకుంటోంది కానీ తల్లిగా కాదు. ఎంతైనా సవతి తల్లి లక్షణాలు కనపడ్డాయి. తెలివైన ఆ పిల్లలు పోల్చేసారు. మా అమ్మలా ఈ అమ్మ చూడడం లేదు- అసలు ఈ అమ్మ మా అమ్మేనా! అని అనుమానం వచ్చింది.



సూర్యుడు మాత్రం వచ్చినప్పుడల్లా నమస్కారం పెడుతోంది ఆవిడే ఈవిడ అనుకున్నాడు ఆయన. అలాగని ఈయన మూర్ఖుడు కాడు. ఒక్కొక్కసారి తన ఆలోచన ప్రసరించకపోతే ఆ విషయం పట్టించుకోడు. అయితే పిల్లలు పట్టేసారు. వైవస్వత మనువు ఈ తేడా చూపించడాన్ని సహించాడు కానీ, యముడు సహించలేకపోతున్నాడు.

పైగా ఛాయాదేవికి కూడా సంతానం కలిగింది. ఆమెకి కూడా ఇద్దరు పుత్రులు, ఒక పుత్రిక. వారు సావర్ణి మనువు, శని. కుమార్తె తపతి. ఛాయాదేవి తన కడుపున పుట్టిన సంతానాన్ని బాగా చూస్తూ సంజ్ఞాదేవికి పుట్టినవారిని బాగా చూడటంలేదు.

అప్పుడు యముడికి కోపం వచ్చి తల్లి మీద కాలు ఎత్తితే ఆమె కోపంతో నీ కాలు ఊడి భూమి మీద పడుగాక! అని శపించింది. వెంటనే యముడు వెళ్ళి సూర్యభగవానునికి ఫిర్యాదు చేసాడు. నిజంగా తల్లి అయితే కొడుకు కాలు కింద పడాలని శపిస్తుందా? ఆమె నా తల్లి కాదని నా అనుమానం అన్నాడు. సూర్యుడు- తల్లి అవునో కాదో కానీ, సవతి తల్లి అయినా సరే కాలు ఎత్తుతావా? అని అడిగాడు.

**యేన త్వా మావిశత్ క్రోధో ధర్మజ్ఞం సత్యవాదినం** - ధర్మజ్ఞుడవు, సత్యవాదివైన

నువ్వు క్రోధంతో ఆ పని చేయ్యవచ్చా? అందువల్ల నీకు శాపం వచ్చింది. అయినప్పటికి నువ్వు చెప్పిన మాటలలో వేదనని అర్థం చేసుకుని ఓ పని చేస్తా. నీ పాదంలో కొంత మాంసాన్ని భూమిపై పడేటట్టు చేస్తాను. అలా ఒక విధంగా శాపం అయిపోయినట్లు ఉంటుందే తప్ప పూర్తిగా దెబ్బ తగలకుండా నేను కాపాడుతాను. కాని క్రోధం చాలా తప్పు సుమా! నీ ధర్మమే నిన్ను రక్షిస్తుంది- అనగానే సిగ్గుతో తల వంచుకుని, ఇంక ఎప్పుడూ ఇలా చెయ్యను అన్నాడు యముడు.

సూర్యుడు తిన్నగా సంజ్ఞాదేవి దగ్గరకు వెళ్ళి ఎవరునువ్వు? అని అడగ్గానే నేను సంజ్ఞనే అని అబద్ధం చెప్పగా, ఆయన ఒకసారి తపస్సు దృష్టిపెట్టి చూస్తే అసలు విషయం తెలిసి వెంటనే మహాకోపంతో "ఏమిటి ఈ మోసం?"అన్నాడు.

మొత్తం జరిగినకథ అంతా చెప్పి "ఆవిడ నన్ను ఇక్కడ పెట్టి వెళ్ళింది" అంది.

సరే విశ్వకర్మకి కుమార్తె చేసిన మోసం చెప్పడానికి సూర్యుడు ఆయన వద్దకు వెళ్ళాడు.

వెళ్ళిన వెంటనే ఆయన నమస్కారం చేసి, స్వామీ! ఏం లేదు మీ వేడి తట్టు కోవడం కోసం ఆవిడ తపస్సు చేస్తోంది అని చెప్తూ నాకు ఒకసారి బ్రహ్మదేవుడు నీ తీవ్రమైన తేజస్సుని కొంత తగ్గించమని నాకు చెప్పాడని చెప్తాడు.



తీవ్రమైన తేజోమయమైన ఉష్ణరూపాన్ని కొంచెం నువ్వు తగ్గించు అనగా తరుగు చేయమని చెప్పాడు. మీరు కాసేపు కూర్చుంటే మిమ్ములను తరుగు చేస్తాను అన్నాడు విశ్వకర్మ. సూర్యుడు సరే కానీ అన్నాడు. ఇదంతా మహర్షులు ఒక విశ్వవిజ్ఞానాన్ని కథారూపంలో మనకి అందిస్తున్నారు అని గ్రహించాలి.

మా అమ్మాయి అన్నమాట కూడా వాస్తవమే. ఇంత వేడి ఒళ్ళు పెట్టుకుంటే ఎవరు తట్టుకోగలరు. లోకరక్షణ కోసం నిన్ను కొద్దిగా తగ్గించాలి అన్నాడు. సరే కానియ్యమని సూర్యభగవానుడు అనుజ్ఞ ఇచ్చాడు. **తత స్తథేతి తం ప్రాహ త్వష్టారం భగవాన్ రవిః** - త్వష్టా అంటే తొలచువాడు మలచువాడు అని అర్థం. శిల్పి, వడ్రంగి వాళ్ళని కూడా త్వష్టా అంటారు. కర్ర కర్రగా ఉంటే మంచం అవుతుందా? టేబుల్ అవుతుందా? దానిని తొలచాలి. రాయి రాయిగా ఉంటే దేనికి పనికి వస్తుంది? దానిని తొలచాలి.

విశ్వకర్మ, త్వష్ట ఈ రెండింటిని జాగ్రత్తగా ఏకాగ్రంగా వింటే మాత్రం ఋషుల విజ్ఞానానికి వారి పాదాల మీద తల వాల్చాల్సిందే.

విశ్వకర్మ అనగా విశ్వాన్ని నడిపే ఈశ్వర చైతన్యం. ఈ నడిపేటప్పుడు ఆయన కూడా అడ్డదిడ్డంగా నడపడం లేదు. దాని వెనకాల ఒక జ్ఞానం ఉంది.

సృష్టిలో జరిగే ప్రతి పనివెనుక ఒక జ్ఞానం కనబడుతుంది. ఆ జ్ఞానం ఈశ్వరజ్ఞానం. చెట్టు ఎలా ఉండాలి? పశువు ఎలా ఉండాలి? ఈ రూపాలన్ని మలచినవాడు విశ్వకర్మ. విశ్వం పనిచేసే వాడే వాటి వాటి కర్మలకు అనుగుణంగా రూపాలను మలచుతున్నాడు.

మనలో మళ్ళీ రకరకాల ఇంద్రియాలు – గుండె దానికో రూపం, జీర్ణకోశం దానికో రూపం ఇలా ఒకొక్క దానికి రూపాన్ని ఇస్తున్నవాడు ఆ ఈశ్వరుడు. ఒక అద్భుతమైన శిల్పం ఎవరైనా చెక్కితే ఆహా! ఎంత బాగుందో అని మెచ్చుకొంటామే! మనకి ఇంత నిర్దిష్టమైన రూపం ఇచ్చిన ఈశ్వరుని మెచ్చుకోకుండా బ్రతికేస్తున్నాం.

విశ్వకర్మ పని, త్వష్టగా రూపాలు మలిచే శక్తి ఈ రెండింటికి మధ్యలో ఎలా మలచాలనే జ్ఞానమే మన **అవబోధనే –విశ్వకర్మా మనుస్త్వష్టా** అని చూపిస్తున్నారు.

ఆ విశ్వకర్మే త్వష్టయై ముందుగా ఆ సూర్యుని మలచుతున్నాడు. ఆ మహాతేజస్సుని సృష్టికి అనుగుణంగా మలచుట.

ఆ విశ్వకర్మ శక్తి కూడా సూర్యశక్తే భిన్నమేం కాదు. సంజ్ఞా, ఛాయా కూడా ఆయనకు భిన్నం కాదు. మనకి కథారూపంలో చూపిస్తూ ధర్మబోధ చేస్తూ లోపల ఆ సూర్యునికున్న విశ్వకర్మా, మనుస్త్వష్టా ఇత్యాది రకరకాల శక్తులను చూపిస్తున్నారు.



**త్వష్టా రూపస్య కర్తా** అని చెప్పబడుతున్నది. **విశ్వకర్మా త్వనుజ్ఞాత శాకద్వీపే వివస్వతః** – శాకద్వీప మనే ద్వీపంలో ఆయన మలచడం ప్రారంభించాడు. ఏ ఉలి పట్టుకుని ఎలా మలచాడో! అంత మహామండలాన్ని కదుపుతూ మలచుతూ ఉంటే గ్రహాలు, నక్షత్రాదులతో సహా మొత్తం విశ్వచక్రం అంతా కదలడం మొదలు పెట్టింది. అంతటికి ప్రధానంగా ఉన్నవాడు సూర్యుడు.

ఆయన పై ఆధారం చేసుకుని ఉన్న మొత్తం జగమంతా కదలడం మొదలు పెట్టింది. ఎలాగంటే ఒక పెద్ద బండిలో చక్రం మధ్య భాగాన్ని ఏదో చేద్దామని కదిపితే మొత్తం బండి అంతా ఒక్కసారి కదులుతుంది. కారణం దానికి అది ప్రధానంగా ఉంటుంది.

**వేగభ్రమణ సంజాత వాయుక్షిప్తాః సమన్తతః**
**వ్యశీర్యంత మహామేఘా ఘోరరావ విరావిణః**

మొత్తం అంతా ఒక పెద్ద కుదుపు వచ్చింది. అకాలప్రళయం లాంటి పరిస్థితి ఏర్పడింది. దానిని ఎవరు నియంత్రించ గలరు?

మలచుతూ ఉన్న విశ్వకర్మ నమస్కారం చేస్తుంటే దేవతలందరూ కూడా వచ్చి సూర్య భగవానునికి నమస్కారం చేస్తున్నారు. తమరే మలచబడుతూ ఇవన్నీ కదలకుండా

జాగ్రత్తగా చూడాలి అని ప్రార్థన చేసారు. వారి ప్రార్థనను ఆలకించుతూ ఆ పారవశ్య భావనలో తాను నిశ్చలంగానే ఉంటూ విశ్వకర్మకి అవకాశం ఇచ్చాడు. తద్వారా తాను ఈ విశ్వం దెబ్బతినకుండా ఒక వైపు కాపాడుతూ, తన రూపం మలచుకునే అవకాశం విశ్వకర్మకి ఇచ్చి కూర్చున్నాడు సూర్యభగవానుడు. ఈ ఘట్టం వింటే ఒక యజ్ఞవిశేషం.

లోకక్షేమంకరమైన ఒక త్యాగకర్మే యజ్ఞం. సూర్యభగవానుడు అదే చేస్తున్నాడు. విశ్వకర్మ ప్రధానంగా ఉన్నాడు.

ఆ సమయంలో ఎవరెవరు సూర్యభగవానుని ఎలా స్తుతించుతున్నారో వర్ణిస్తూ

**ఋషయశ్చ తతః సప్త వసిష్ఠాఽత్రిపురోగమాః**
**తుష్టువుర్వివిధైః స్తోత్రైః స్వస్తిస్వస్తీతి వాదినః**

వశిష్ఠుడు మొదలైన ఋషులందరూ వచ్చి రకరకాల స్తోత్రాలు చేస్తూ ఉన్నారు. అదేవిధంగా వాలఖిల్యులు అనబడే ప్రత్యేకమైన ఋషులు ఉన్నారు. వీరు సూర్యునికి చాలా ప్రధానమైనవారు- స్తుతించుతున్నారు.

అలాగే విద్యాధరులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు ఆ సమయంలో సూర్యుని స్తుతిస్తూ ఉన్నారు. వీరంతా సూర్యశక్తి వల్ల జీవిస్తున్నవారు, ఎప్పుడూ సూర్యగమనాన్ని ఆధారం చేసుకుని ఉంటారు. క్రమంగా అప్సరసలు వచ్చి స్తుతిస్తున్నారు.

**విశ్వాచీ చ ఘృతాచీ చ ఊర్వశ్యథ తిలోత్తమా**
**మేనకా సహజన్యాచ రంభా చాఽప్సరసాం వరా**
**ననృతుర్జగతా మీశే లిఖ్యమానే విభావసౌ**

రకరకాల అప్సరసలు ఆయన ముందు నాట్యం చేస్తుంటే, ఇక నారద తుంబుర, గంధర్వాదులు

**తతో హాహా హూహూశ్చైవ నారదస్తుంబురు స్తథా**
**ఉపగాయితు మారబ్ధా గాంధర్వం కుశలా రవిమ్**

హాహా హూహూ గంధర్వుల పేర్లు వాళ్ళు వచ్చి రకరకాల సంగీతాలతో ఆయన స్తుతిస్తున్నారు. ఒక వైపు సంగీతం, మరొక వైపు నృత్యం, ఇంకొక వైపు వేద పూర్వకమైన స్తుతులు. ఇవన్నీ వింటూ తనను మలచుకునే అవకాశం ఇస్తున్నాడు సూర్యభగవానుడు. దీనిని సూర్యతనూలేఖనం అంటారు. లేఖనం అంటే లిఖించుట, మలచుట, చెక్కుట, ఒక రూపుని ఇచ్చుట ఇన్ని అర్థాలు తీసుకొనవచ్చు. సూర్యతనూలేఖనమనే రమ్యమైన సమయంలో...

**తతః కృతాంజలి పుటా భక్తినమ్రాఽత్మమూర్తయః**

**లిఖ్యమానం సహస్రాంశుం ప్రణేముః సర్వదేవతాః**

సర్వ దేవగణాలు వచ్చారు.

**తతః కోలాహలే తస్మిన్ సర్వదేవ సమాగమే**

**తేజసః శాతనం చక్రే విశ్వకర్మా శనైః శనైః**

సర్వదేవ సమాగమమైన కోలాహల సమయంలో నెమ్మది నెమ్మదిగా ఎప్పుడైతే ఈ లేఖనం పూర్తి అయిందో సూర్యభగవానుడు మహా అందగాడిగా సౌమ్యంగా గోచరించాడు. తీవ్రత అంతా తగ్గి ఒక ప్రత్యేకమైన రూపం అయ్యింది.

ఆ మిగిలిన ముక్కలన్నీ ఏమయ్యాయి? అయితే లిఖించేటప్పుడు ఆ సూర్యుని యొక్క గొప్పతనం విశ్వకర్మకు బాగా తెలుస్తున్నది. సూర్యుడు ఇచ్చిన శక్తితో విశ్వకర్మ ఆనందంతో తనూలేఖనం చెయ్యగలుగుతున్నాడు. విశ్వకర్మ సూర్యతనూలేఖనం చేసి ఒక్కసారి సూర్యుని స్తుతించాడు. విశ్వకర్మ చేసిన సూర్యస్తుతి చాలా విశేషమైంది.

**వివస్వతే ప్రణత హితాఽనుకంపినే మహాత్మనే సమజవ సప్తసప్తయే**

**సుతేజసే కమల కులాఽవబోధినే నమ స్తమఃపటల పటాఽవ పాటినే**



అద్భుతమైన ఛందస్సుతో వ్యాసదేవుడు మార్కండేయపురాణంలో అందించాడు. సూర్యుని నుంచి ఏ ఏ దేవతలు ఏలా పోషింపబడతారో అన్నీ చూపించారు. ఇలాగా ప్రధానంగా ఆ సూర్యుడు రథస్థమైన, మండలస్థమైన స్వరూపం- **తేజసః షోడశం భాగం మండలస్థ మధారయత్** -ఆయన తేజస్సులో పదహారవ భాగం మాత్రమే కనిపిస్తున్నది.

ఆ మహా తేజస్సులో ఈ భూమికి ఇత్యాదులకు లభించేది కేవలం షోడశం. మిగిలిన భాగములు ఏమయ్యాయో చూపిస్తున్నాడు

**శాతితై స్తేజసో భాగైర్దశభిః పంచభిస్తథా**

**అతీవ కాంతిమచ్చారు భానోరాసీత్తథావపుః**

మిగిలిన తేజస్సుని శత్రువినాశనార్థం వినియోగించారు. కేవలం వెలుగు కాదు దానిలో చాలా శక్తి ఉంది. ఆ సౌరశక్తి విశేషం చూపిస్తున్నారు.

పృథ్వ్యాదులకు పోషకం తనలోని కొద్ది భాగంతో మాత్రమే ఇస్తూ మిగిలినవి ఎలా తయారయ్యాయో చూపిస్తున్నారు. అందులో కొంత క్రమంగా విష్ణువునకు సుదర్శన చక్రంగా, శివునికి త్రిశూలం, కుబేరునకు పల్లకి, యమునికి దండం, కార్తికేయునకు శక్తి, అలా సమస్త దేవతలకు వారివారి ఆయుధాలుగా మారినది.

సూర్యుని యొక్క మిగిలిన వెలుగు లోకరక్షణకోసం ప్రపంచాన్ని నడుపుతున్న దేవతా శక్తులలోకి ప్రవేశించింది. అదితీ పుత్రునిగా వచ్చిన మార్తాండుడు ఒక సుందరాకృతి ధరించి సంజ్ఞాదేవి తపస్సు చేస్తున్న అరణ్యానికి బయలు దేరాడు. ఆమె అశ్వరూపంలో ఉందని తెలిసి ఈయన కూడా అశ్వరూపంలో వెళ్లాడు.

అప్పుడు ఆమె ఎవరో పురుషుడు వస్తున్నాడని వెనక్కి తగ్గబోతే ఈయన మహావేగంగా ముందుకు వెళ్ళగానే ఆ ముఖస్పర్శలోంచి సూర్యతేజస్సు ప్రవేశించి అశ్వరూపంతో ఉన్న సంజ్ఞకు సంతానం కలిగారు. మొట్టమొదట సంజ్ఞకు కలిగిన సంతానం, ఆమెకి ఛాయా రూపంతో కలిగిన మరో సంతానం, అశ్వరూపంతో కలిగిన సంతానం మొత్తం మూడు భూమికలలో సూర్యునికి కలిగిన సంతానం ఒక్క స్త్రీకి కలిగినవారే.

అశ్వరూపంలో ఆమెకు కలిగిన ఇద్దరు పుత్రులు నాసత్యుడు, దస్రుడు. అశ్వరూపంలో కలిగిన సూర్యుని నుంచి వచ్చారు కనుక వీరిని అశ్వనీదేవతలు అన్నారు. మిగిలిన తేజస్సునుంచి వచ్చినవాడు-

**మార్తాండస్య సుతా వేతా వశ్వరూప ధరస్యచ**
**రేతసోఽ_తే చ రేవంతః ఖడ్గీ ధన్వీ తనుత్రభృక్**



తరువాత వచ్చినవాడు ఒక అద్భుతమైన రూపంతో అశ్వారూఢుడై వచ్చాడు. ఇతని పేరు రేవంతుడనే మనువు.

సూర్యసంతానం గురించి చూస్తే మొదటిగా సంజ్ఞకి కలిగినవాడు వైవస్వతుడు మనువు, యముడు, యమున. యమునే నది అయినది. తరువాత ఛాయకు కలిగినవారు సావర్ణి మనువు, శని, తపతి... ఈమె కూడా నదియే.

పైగా శనికి యముడు అధిదేవత. ఇవన్నీ గ్రహ విశేషాలు. ఒక జ్యోతిర్మండల రహస్యాన్ని దైవికమైన విజ్ఞానంతో కథారూపంగా చూపించారు. జ్యోతిర్మండలంలో జరిగిన పరిమాణాలు కాకతాళీయాలు కావు. వైవస్వతమనువు, యముడు, యమునా, సావర్ణి మనువు, శని, తపతి. యమునా, తపతి నదులలో సూర్యతేజస్సు ఒక ప్రత్యేకంగా ఉంటుంది.

తరువాత నాసత్యుడు, దస్రుడు. మనువు రైవతుడు. వీరందరికి ఉత్తమమైన స్థితులను ఇచ్చాడు. రైవత మన్వంతరం కూడా ఉంది. సావర్ణి, వైవస్వతుడు, రైవతుడు ముగ్గురు మనువులు. అశ్వనీదేవతల విశేషం రోగచికిత్స, రోగనిర్మూలన. ఇవి సూర్యకిరణాల వల్లనే కలుగుతున్నాయి.

అశ్వం అంటే గుర్రం అని మాత్రమే అర్థం కాదు. **అశు వ్యాప్తౌ** అనే ధాతువు నుంచి అశ్వ శబ్దం వచ్చింది. కొత్తకోణంలో ఆలోచిస్తే అనేక జంతువుల పేర్లు సూర్యునికి కని పిస్తాయి. హంస, ప్లవంగం, కపి, వరాహం, సింహః ఇవన్నీ సూర్యకిరణాలకు ఉన్న పేర్లు. ఆ కిరణజాలాల లక్షణం బట్టి ఒకొక్క పేరు చూపిస్తున్నారు.

దుముకుతూ వెళ్ళే లక్షణం **ప్లవంగమః**. తేజోమయంగా ప్రకాశించేటప్పుడు **హంసః**. కపిర్వరాహ శ్రేష్ఠశ్చ - ఇత్యాది మంత్రాలు కూడా కనిపిస్తున్నాయి. **వరాహ, కపి** శబ్దం సూర్యపరంగానే చెప్పబడుతున్నాయి. **కం పిబతి ఇతి కపిః** - జలాన్ని లాగేవాడు. కపిల అంటే జలాన్ని స్వీకరించి తిరిగి అనుగ్రహించే సూర్యతేజస్సు. ఆ పేర్లే జంతువులకి పెట్టడం జరిగినది.

అశ్వ అంటే అశు వ్యాప్తౌ అని శీఘ్రంగా వ్యాపించే లక్షణం కల కిరణజాలాలు అశ్వాలు. సూర్యుడు అశ్వారూఢుడు అంటే కిరణాలతో ఉన్నవాడే.

సూర్యునికి సప్తాశ్వాలు. **హరిదశ్వః సహస్రార్చిః సప్తసప్తిర్మరీచిమాన్** - **సహస్రార్చిః సప్తసప్తిః...** వెయ్యి, ఏడు. లక్షణాలను బట్టి ఎన్నెన్ని రకాలుగా చూడవచ్చో చూపిస్తున్నారు. ఆ విభాగం చెయ్యడంలోనే సౌర విజ్ఞానాన్ని ఏ తీరులో వేదం ఇచ్చిందో అర్థం చేసుకోవాలి మనం.



హరిదశ్వః ఆకుపచ్చని గుర్రాలంటే ఆ కిరణాల వల్ల వచ్చే పత్రహరితం వల్ల వృక్షాదులు ఆకుపచ్చదనం పొందగలుగుతున్నాయి.

సృష్టికి ఆకు పచ్చదనం సూర్యకిరణాల వల్ల వస్తోంది.

వృక్షాలు కూడా సూర్యకిరణాల ద్వారా ఆహారాన్ని పొంది ఆకుపచ్చగా తయారవు తున్నాయి. ఆకుపచ్చదనంలోనే ప్రాణశక్తి ఉంది. అది స్వీకరించి మనం ఆహారాన్ని పొందుతున్నాం. మనం సూర్యుని ద్వారా వచ్చిన ఆహారాన్నే పరోక్షంగా పొందుతున్నాం. ప్రత్యక్షంగా వృక్షాలు పొందుతున్నవి.

సూర్యకిరణాల నుంచి నేరుగా ఆహారాన్ని పొందగలిగే తపో విధానాన్ని ఋగ్వేదం వర్ణించింది. అది సూర్యపానప్రక్రియ. ఇది ఇటీవల కాలంలో వేదాన్ని ఆధారం చేసుకుని ఒక మహాత్ముడు చేసి చాలాకాలం బ్రతికాడు చాలాకాలం క్రితం Indian Express దినపత్రికలో వచ్చింది.

ఈయన్ని తిండి కూడా తినకుండా ఎలా ఉండగలిగావంటే కేవలం వేదాలలో ఉన్న సూర్యమంత్రాలను ఆధారం చేసుకుని నేను ఈ ప్రక్రియ చేసానని చెప్పాడు. దీనిని బట్టి

ఋషులు ఆహారాదులని విడిచిపెట్టి పర్వతాలలో ఎలా తపస్సు చేసారో తెలుస్తుంది. ఇంత విజ్ఞానం అక్కడ కనపడుతుంది.

సూర్యుడు అన్నప్రదాత. అన్నీ కేవలం జడంగా యంత్రాల ద్వారా తీసుకోవాలనే తెలివితేటలే తప్ప సూక్ష్మంగా మనలో ఉన్న శక్తిని జాగృతపర్చి ఆ అనంతశక్తిని ఎలా పొందాలనే ఆలోచనని విస్మరిస్తున్నాం.

**ఏకోఅశ్వోవహతి సప్తనామా** ఒకే అశ్వానికి ఏడు అని పేరు. సూర్యకిరణాలలో ఉన్న రోగహరణశక్తులే అశ్వినీ దేవతలు. రోగాన్ని పోగొట్టమని ప్రార్థిస్తే సూర్యుడు అశ్వనీదేవతల రూపంగా అనుగ్రహిస్తాడు. జ్ఞానాన్ని అడిగితే ఇంకొక రూపంగా అనుగ్రహిస్తాడు.

సూర్యవంశపు రాజులు అని చెప్తూ ఉంటారు. వీరంతా ఎక్కడనించి దిగారు ఇదంతా కల్పన అంటే ఇక్కడ సూర్యునినుంచి ప్రపంచానికి పనికి వచ్చేవారు ఇద్దరే. మిగిలిన వాళ్ళందరూ వాళ్ళవల్ల బ్రతికినవారే. ఒకడు జ్ఞాని, మరొకడు రక్షకుడు.

జ్ఞానం ఐహిక జ్ఞానం కావచ్చు. పారమార్థిక జ్ఞానం కావచ్చు. జ్ఞాని తన జ్ఞానంతో ప్రపంచానికి పనికివచ్చే పనులు చేస్తాడు. రెండవవాడు రక్షించేవాడు. వీరిద్దరే కావాలి. ఈ రెండూ భూమికి సూర్యభగవానుని వల్లనే రావలసినది.



సూర్యునిలో ఉన్న ఆ జ్ఞానస్వరూపమైన అంశాలు ఋషులని, రక్షణస్వరూపమైన అంశాలు క్షత్రియులు అని చెప్పబడతారు. వారే పాలకులు. మొదటి రాజు సూర్యుడు. కనుకనే సూర్యునిలో ఉన్న రక్షణాస్వరూపమంతా సూర్యవంశ క్షత్రియులు అని చెప్ప బడుతున్నది.

పురాణాలలో రాజవంశ చరిత్రలు అని ప్రత్యేకించి చెప్పడానికి కారణం ఆ సూర్య తేజోగతమైన రక్షణ తెలపడం. భారతీయ సంస్కృతి ప్రకారంగా ఆది రాజు సూర్యుడు. అటు తరువాత వైవస్వతుడు, అటు తరువాత వచ్చినవి సూర్యవంశం ఇత్యాదులు చెప్ప బడుతున్నాయి. ఇది పరంపర.

సూర్యగతమైన జ్ఞానాంశే ఋష్యత్వం పొందినది. ఋషులు, క్షత్రియులు సూర్యుని స్వరూపాలే. ఈ దృష్టితో చూడగలిగితే మనకి కావల్సిన జ్ఞానం, రక్షణ సూర్యుని నుంచే పొందగలం. ఈ పరంపరే మనకి ఋషివంశం, రాజవంశం అనే రెండు భాగాలుగా పురాణం మనకి అందిస్తున్నది.

చంద్రవంశమన్నా సూర్యసంబంధమైనదే. మనకి రక్షణవ్యవస్థని, జ్ఞానవ్యవస్థని సూర్య సంబంధంగా ముడిపెట్టి చెప్పడంలో ఉన్న అంశాన్ని గమనించాలి. వసిష్ఠుడు, మరీచి,

ఇత్యాదులందరూ ఆ సూర్యగతమైన తేజస్స్వరూపాలే. సూర్యుని చుట్టూ మహర్షులు ఇత్యాదులు పూజించడం మనకు వర్ణనలో కనబడుతున్నది. ఋషి మండలముల చేత ఆరాధింపబడుతున్న వాడు.

మార్కండేయ పురాణం విస్తారంగా చెప్పిన సౌరవిజ్ఞానం కథారూపంగా ఇస్తే దాన్ని సంక్షిప్తంగా చెప్పుకున్నాం. మూడు దశలలో సంజ్ఞాదేవికి కలిగిన సంతానం వారి ప్రత్యేకత. యమునా, తపతి అని చెప్పడం సూర్యునినుంచి వచ్చిన జలవ్యవస్థ. మనువులంటే జ్ఞాన వ్యవస్థ. ఈ సూర్యతనూలేఖనం వర్ణిస్తూ ఏవరైతే దీనిని శ్రద్ధగా వింటారో వారికి కలిగే ఫలితాన్ని చెప్తూ

> **ఇదం యో జన్మ దేవానాం శృణుయాద్వా పఠేతవా**
> **వివస్వత స్తనూజానాం రవే ర్మాహాత్మ్యమేవచ**
> **ఆపదం ప్రాప్య ముచ్యేత ప్రాప్నుయాచ్చ మహాయశాః**
> **అహోరాత్రకృతం పాప మేతచ్ఛమయతే శ్రుతమ్**
> **మాహాత్మ్య మాదిదేవస్య మార్తండస్య మహాత్మనః**

మొత్తంగా ఈ ఆదిత్యుని వంశం, ఆయనకు కలిగిన సంతానం, ఈ మాహాత్మ్యం వినడంచేత ఎటువంటి ఆపదలు ఉన్నా దానినుంచి బయట పడతారు. సత్కీర్తి లభిస్తుంది. దీనిని ఒక్క మారు వినడం చేత పగలు, రాత్రి చేసిన పాపం నశిస్తుంది అని చూపిస్తున్నారు. ఇప్పటి వరకు రకరకాల యజ్ఞాంశాలు కలిగిన సూర్యకథని మార్కండేయపురాణం ఆధారంగా చెప్పుకున్నాం.

ఆదిత్య ఆరాధన మహిమ పది అధ్యాయాలు అయిన వెంటనే ఒక ప్రత్యేక కథలో మార్కండేయపురాణం చెప్తోంది. ఆ చెప్పిన పద్ధతిలో మార్కండేయుడు ఒక క్రమపద్ధతిని చూపిస్తున్నాడు. ఆదిత్యుడంటే ఎవరు? ఆయన చరిత్ర ఏమిటి? ఆయన్ని ఆరాధించడం వలన ఫలితం ఏమిటి? మొదలైన అంశాల గురించి ఒక ఉదాహరణ చూపిస్తాడు.

పురాణం ఎప్పుడూ ప్రమాణాన్ని చూపిస్తుంది. అది శాస్త్రపమాణం, చారిత్రక ప్రమాణం. ఒక మహాత్ముడు ఎలా ఉపాసించి తరించాడో చెప్పడం. సూర్యోపాసన వల్ల తరించిన మహాత్ముల గాథలు వేదంలోనే చాలా కనబడతాయి. పురాణాలలో బహుసంఖ్యాకంగా కనబడతాయి.

పురాణపురుషులు కూడా సూర్యోపాసనవలన ధన్యులైనవారు. రామచంద్రమూర్తి సూర్యోపాసకుడని ప్రధానంగా చెప్పుకొన్నాం. సూర్యోపాసనలేని ఉపాసన లేదు. ముందు

సంధ్యావందనం చెయ్యనిదే ఏ మంత్రం చేసినా ఫలించదు.

న గాయత్ర్యాః పరం మంత్రం - సంధ్యావందనం చెయ్యనప్పుడు ఎన్ని పెద్ద యజ్ఞాలు చేసినా అవన్ని పునాది లేని మేడలే. సంధ్యావందనమంటే సూర్యోపాసనే. గాయత్రీమంత్రం సంపూర్ణంగా సూర్యమంత్రమే. సూర్య ఉపనిషత్తుల్లో ప్రత్యేకించి చెప్పేటప్పుడు గాయత్రీ మంత్రంతోనే దాన్ని ప్రారంభిస్తారు.

అసురశక్తుల వినాశనం కోసం అదితీదేవి ఆదిత్యునే తనయునిగా కన్నది. దీన్ని బట్టి అసురశక్తులు వినాశనం కావాలంటే ఆదిత్యుని అనుగ్రహం కావాలనేది స్పష్టమైంది. అసురశక్తులంటే మనల్ని బాధించే శక్తులు. అవి వ్యక్తిని బాధించే శక్తి కావచ్చు లేదా సమాజాన్ని బాధించే శక్తి కావచ్చు, లేదా ధర్మాన్ని బాధించే శక్తి కావచ్చు.

బాధాకరమైన శక్తుల నాశనానికి మహాప్రతాపశక్తి సంపన్నుడైన సూర్యుడు రావలసిందే. ఆ సూర్యుడు విశ్వకర్మ చేత తన రూపాన్ని తాను సంక్షిప్తపరచుకొని ఒక విధంగా కన బడినప్పటికి తన మిగిలిన పదిహేనుభాగాలను కూడా వివిధ ఆయుధాలుగా మార్చి విష్ణువునకు, శివునకు తన ఆయుధశక్తులను ఇచ్చాడంటే వారి చేతులలో ఉన్నది సూర్యశక్తే అని గ్రహించాలి. వారు లోకరక్షణ చేసేది కూడా సూర్యశక్తితోనే జరుగుతున్నది.



దేవతలు చేసే రక్షణశక్తి కూడా సూర్యుడి వల్లనే జరుగుతున్నదని స్పష్టమైంది. దేశరక్షణకి, ధర్మరక్షణకి ఆదిత్యభగవానుని అనుగ్రహం చాలా అవసరం.

చాలా కాలం క్రితం జరిగిన సంఘటన-బదరీ ద్వారక పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ స్వరూపా నందేంద్రసరస్వతీ స్వాములవారు అప్పటికి మహావృద్ధులై ఉన్న సమయంలో వారు ఒక ఉద్యమం తీసు కొచ్చారు.

మొత్తం ఉత్తరాది అంతా ఇది జరిగింది. అదేమిటంటే శ్రీరామ జయరామ జయజయ రామ అనే మంత్రాన్ని 108 మార్లు జపంచేసి ఆదిత్యహృదయాన్ని బహుసంఖ్యతో పారా యణ చేసి మళ్ళీ శ్రీరామ జయరామ జయజయరామ 108 మార్లు జపం చెయ్యడం. ఇలా సంపుటీకృతం చేసి దేశరక్షణ కోసమని ఉద్యమం చేసారు. ఇప్పటికి మహాత్ములు ఇలాంటివి చేస్తూ ఉంటారు కనుకనే మనం క్షేమంగా ఉన్నాం.

ఆదిత్య ఉపాసనకి మనకి దొరికిన పెద్ద ఆయుధం ఆదిత్యహృదయం. సులభంగా తరించడానికి గొప్ప ఉపకరణం ఆదిత్యహృదయం. ఆదిత్యహృదయం ముందే అగస్త్యుడు సూర్యుని ఆరాధించడం వలన ఏమేమి అభీష్టసిద్ధులు లభిస్తాయో చెప్తారు. అలాంటి రమ్యమైన ఫలాలు ఆదిత్యోపాసన వలన ఉన్నాయని చెప్పడం అగస్త్యుని హృదయం.

ఆదిత్యుడు బాధాకరమైన శక్తులను నాశనం చేస్తాడు కాబట్టి ఆయన ఆరాధన చాలా అవసరం. వివిధకాలాలలో వివిధవిధాలుగా ఆదిత్యోపాసన శాస్త్రాల యందు చెప్తున్నారు.

**'కిం కిం న సవితా సూతే కాలే సమ్యగుపాసితః**
**ఆయురారోగ్యమైశ్వర్యం వసూనిచ పశూంస్తథా**
**మిత్ర పుత్ర కళత్రాణీ క్షేత్రాణీ వివిధానిచ**
**భోగానష్టవిధాంశ్చైవ స్వర్గంచాప్యపవర్గకం'**

అని స్కాందపురాణం చెప్తోంది. సూర్యభగవానుని ఉదయించేటపుడు **'కాలే'** అనే మాటకి ప్రాతఃకాలమని ప్రధాన అర్థం.

'సూతే' – సూర్యుడు ఉదయిస్తున్నప్పుడు ఆ ప్రాతఃకాలంలో చక్కగా శాస్త్రవిధితో ఉపాసిస్తే ఆయువు, ఆరోగ్యం, ఐశ్వర్యం, రకరకాల సంపదలు లభిస్తాయి, పశుసంపద లభిస్తుంది. మిత్ర, పుత్ర, కళత్రాది జనసంపద లభిస్తుంది. క్షేత్ర ఆగార ఇత్యాది పుష్టులు లభిస్తాయి. అష్టవిధ భోగాలు లభిస్తాయి. ఇలా జీవితం ఉన్నంతకాలం లభించి ఆ తరువాత సద్గతులు లభిస్తాయి.

జ్ఞానపరమైన ఉద్దేశంతో జిజ్ఞాసువులై సూర్యభగవానుని ఆశ్రయిస్తే **అపవర్గకం** – చిత్తశుద్ధిని ఇచ్చి క్రమంగా బ్రహ్మజ్ఞానాన్ని తద్వారా మోక్షాన్ని కూడా అనుగ్రహిస్తాదని స్కాందపురాణంలో వ్యాసదేవుని వచనం.



## భానుభక్తిలో శక్తి

మార్కండేయపురాణంలో సూర్యోపాసనా రహస్యాన్ని వ్యాసదేవుడు ఒక అద్భుతమైన కథ ద్వారా చూపిస్తున్నాడు. సూర్యారాధకులు ప్రధానంగా శ్రవణం చేయవలసిన ఘట్టం. ఈ కథలో అనేక సందేశాలు కూడా ఉంటాయి. ఇది యుగాలనాటి కథ.

రాజ్యవర్ధనుడు అనే రాజు ఉండేవాడు. ఆయన పాలన చాలా కాలం చేసాడు. ఆనాటి యుగాల లెక్క ప్రకారం కొన్ని వేల సంవత్సరాలు చేసాడు. పుష్టిగా, ఆరోగ్యంగా ఉన్నాడు. చక్కటి సంతానం, మంత్రులు, సామంతులు ఉండేవారు. ఆయన ఏలుబడిలో చాలా విస్తారమైన భూమి ఉండేది. విస్తారమైన రాజ్యపాలన చేసాడు.

ఒకప్పుడు ఆయన ఒక పర్వదినం వేళ అభ్యంగ స్నానం చేస్తుంటే భార్య తలంటు పోస్తోంది. ఆయన తొడమీద వేడినీటి చుక్క పడింది. అదేంటని చూస్తే అది భార్య కన్నీటిచుక్క అని గ్రహించాడు. భార్య ఏడుస్తోందని చూస్తే భార్య చెప్తోంది "నేను మీ తలంటుతుంటే అందులో ఒక తెల్ల వెంట్రుక కనపడింది. మీరు పెద్దవారు అయిపోతు

న్నారు అలా అనిపించగానే మనస్సుకి ఏదో అనిపించి కన్నీరు వచ్చింది" అని చెప్తే రాజ్యవర్ధనుడు మాట్లాడుతూ మంచిమాట చెప్పావు అన్నాడు.

జుట్టు నెరసిందంటే ఇంక నువ్వు ప్రయాణం చెయ్యాల్సిన సమయం దగ్గర పడింది అని భగవంతుడు వర్తమానం పంపినట్లే. దేనిని ఎలా స్వీకరించాలో తెల్సుకోవాలి. ప్రాకృతిక పరిణామాలని మనం స్వీకరించడంబట్టి ఉంటుందికాని వాటికి దుఃఖించ కూడదు. జీవుడు ఎప్పుడు నశించిపోడు, శరీరం నశిస్తోంది. కాని ఈ శరీరంతో మనం భౌతికంగా ఏం సాధించాలో అవన్ని సాధించావు. తరువాత నీ కోసం సద్గతికి ఏం చేసుకొన్నావో జాగ్రత్త పడమని నాకిది చూపిస్తున్నది. ఆనాటి యుగాలకాలం కనుక చాలా కాలం తరువాత జుత్తు నెరిసింది.

ఇప్పుడు లెక్కల ప్రకారం సూచనలు ఇంకోరకంగా వస్తూ ఉంటాయి.

వ్యక్తి ఐహికంగా, ధర్మబద్ధంగా ఎంత ప్రయత్నించాలో పారమార్థికంగా కూడా ప్రతిక్షణం ప్రయత్నిస్తూ ఉండాలి. భగవంతుడు మనకి రెండు కాళ్ళు ఇచ్చినట్టుగా రెండు రకాల సాధనలు ఉండాలి.



ఐహికంగా మనకి ఇబ్బంది లేకుండా ఉండడం కోసం ధర్మబద్ధమైన సుఖజీవన ప్రయత్నాలు చెయ్యవచ్చు. 'ధర్మబద్ధమైన' అనే మాటని మర్చిపోకుండా సుఖజీవన ప్రయత్నాలు చెయ్యవచ్చు. కాని అదే సమయంలో పరమార్థ దృష్టిని విస్మరించరాదు. అదెప్పుడో చూద్దామని కాకుండా మొదటినుంచి చూసుకోవాలి.

ధర్మసంగ్రహం దగ్గరికి వచ్చేటప్పటికి– **'కర్తవ్యో ధర్మసంగ్రహః నిత్యం సన్నిహితో మృత్యుః'** అని తెల్సుకోవాలి. రాజ్యవర్ధనుడు వెంటనే స్పందించాడు. నల్లరంగు పూసుకొని దాన్ని కప్పుకోవడానికి ప్రయత్నించలేదు. కాలధర్మాన్ని ఏ విధంగా స్వీకరించాలో ఆ విధంగా తీసుకోవాలి.

వెంటనే ఆయన చేసిన పని "ఇంక నేను వానప్రస్థానికి వెడతాను. ఆత్మకి ఏది అవ సరమో దాని పరమైన సాధన చేసుకొంటాను" అన్నాడు. అంతవరకూ ఆధ్యాత్మికసాధన చెయ్యలేదని కాదు. ఇంతవరకూ గృహస్థజీవితంలో ఆధ్యాత్మికసాధన, లౌకికజీవయాత్ర కల్సి సాగుతుంది. ప్రవృత్తి మార్గంలో రెండు కల్సి సాగుతాయి.

కాని ఒక దశకి వచ్చేటప్పటికల్లా మనం పొందవల్సిన పరమైనది తెల్సుకోకుండా చిట్టచివర వరకూ ఇంకా ఐహికంగా ప్రాకులాడుతున్నామంటే మనం చాలా నరకాలకి ద్వారాలు తెరుచుకొంటున్నామని అర్థం. ఒక సమయం వచ్చేటప్పకి కేవలం పరమార్థ

జీవితానికి అంకితమైపోవాలి.

ప్రాణరక్షణకోసం కావల్సిన భౌతిక ప్రయత్నమే తప్ప ఇంక ఐహిక సముపార్జనైన ధర్మార్థ కామసంపాదన ఇంకేం లేదు. కేవలం మోక్షానికి అవసరమైన ధర్మమే వానప్రస్థంలో ఉంటుంది. అంతవరకూ అర్థకామాల నిమిత్తమైన ధర్మం అవసరమే. ఇప్పుడు మోక్షానికి అవసరమైన మోక్షధర్మాలు చూసుకోవాలి. నేను వానప్రస్థానికి వెడతానని అంటే నేనూ వస్తానని భార్య అంది. ఆవిడ కూడా బాధపడలేదు.

వానప్రస్థాశ్రమానికి వెళ్ళేటప్పుడు భార్య కూడా అనుగమించవచ్చు. సన్యాసాశ్రమానికి మాత్రం కుదరదు. వానప్రస్థాశ్రమానికి భార్య వస్తానంటే తీసుకెళ్ళవచ్చు. నేను పిల్లల దగ్గరే ఉంటా మీరు వెళ్ళండంటే సరే! అని వెళ్ళాలి తప్ప భార్యని బలవంతంగా తీసుకెళ్ళరాదు. వానప్రస్థాశ్రమంలో నిత్యనైమిత్తిక కర్మలు మానరాదు.

ఆధ్యాత్మికసాధన అంతర్ముఖ దృష్టితో చేసుకోవాలి. వానప్రస్థధర్మం అద్భుతమైన ధర్మంగా చెప్పబడింది. క్షత్రియులకి పెద్దవాళ్ళు ఈ ధర్మాన్ని ప్రధానంగా చెప్పారు. అతను భోగ సంపాదన చేస్తున్నప్పుడే ఒకప్పుడు ఇవన్నీ విడిచిపెట్టాలనే స్పృహ వారికి ఉంటుందంటే నిరాసక్తితో కూడిన ధర్మంతో పాలన చేసేవారు.



అలా వానప్రస్థాశ్రమంలో మిమ్మల్ని అనుగమిస్తానని అనగానే రాజ్యవర్ధనుడు మంత్రులని, సామంతులని పిలచి తన పుత్రుడికి రాజ్యం పూర్తి బాధ్యతను అప్పజెప్పాలని నిర్ణయించుకొన్నాడు. కాని వాళ్ళందరూ కూడా ఏకకంఠంతో రాజ్యవర్ధనుడితో మీరు వెళ్ళడానికి వీలులేదు. మీరు మమ్మల్ని పాలించవల్సిందే అన్నారు.

ఇంకా ఎన్నాళ్ళు పాలిస్తానయ్యా నాకు ఆయువు దగ్గరకి వస్తోంది నేను వెళ్ళక తప్పదు అన్నాడు కాని పుత్రునితో సహా మంత్రులు, సామంతులు దానికి అంగీకరించలేదు. ఆ రోజుల్లో ప్రజలకి పాలకులకి ఎటువంటి అనుబంధం ఉందో గమనించాలి. పురోహిత వర్గాన్ని పిలిచారు. మంత్ర సహాయంతో సాధించవల్సిన ప్రయోజనాలని చెప్పే వర్గం పేరు పురోహితవర్గం.

భౌతికమైన వాటితో సాధించలేని దాన్ని **'ప్రత్యక్షేణానుమానేన యస్తూపాయోన్ నవిద్యతే'** అని చెప్పినట్టుగా ప్రత్యక్షప్రమాణాలతో, అనుమాన ప్రమాణాలతో సాధించలేనిదాన్ని చెప్పడానికి పనికొచ్చేదే శాస్త్రం. దానిలో పండినవారు పురోహితులు. వారు చెప్పిన ప్రకారంగా అందరూ కలిసి సూర్యారాధన చేస్తున్నారు.

ఒక్కొక్కరు ఒక్కోరకంగా చేస్తూ ఉంటే ఆ సమయంలో సుధాముడనే గంధర్వుడు

వీరు చేస్తున్న సాధన చూసి ఆశ్చర్యచకితుడైయ్యాడు. ప్రజలందరూ తమ పాలకుడిని బ్రతికించుకోవడం కోసం ఆరాధన చేస్తున్నారు. ఈ అద్భుతమైన అనుబంధాన్ని చూసి గంధర్వులే సంతోషించారు.

దీన్ని బట్టి మనం ఒక ధర్మబద్ధమైన అనుష్ఠానం చేస్తూంటే తెలిసో తెలియకో లేదా తెలిసినదానినిబట్టి ప్రారంభిస్తే తరువాత ఏంచెయ్యాలో అనేదానికి దేవతలే సహకరిస్తారు. మనం ఒక మంచిపని కోసమని భగవంతుడికి సంబంధించిన సాధన చేస్తూంటే అది దేవతలే సహకరిస్తారు. ఇది దీనిలో మనకి అందుతున్న అంశం.

సుధాముడు వారివద్దకు వచ్చి వారితో మీరు ఇక్కడ సాధనచేస్తే లాభంలేదు. గురు విశాలం అనే ఒక మహారణ్యంలో కామరూపమనే ఒక పర్వతం ఉంది. అది ఒక మహాక్షేత్రం. ఆ క్షేత్రం వద్ద మీరు తపస్సు చేయండి. సూర్యుని ఉద్దేశించి ఆరాధన చేయండి. అప్పుడు సూర్యుడు మిమ్మల్ని అనుగ్రహిస్తాడు మీ కోరిక తీరుతుందని చెప్పాడు.

రాజు యొక్క పుత్రులు, ప్రజలు, మంత్రులు, సామంతులు వీరందరూ ఆ క్షేత్రానికి బయలుదేరి వెళ్ళి అక్కడ సాధన చేసారు. ఆ సాధన ఎలా చేసారనే విషయాన్ని మార్కండేయపురాణం చక్కగా వర్ణిస్తుంది. కొందరు సూర్యభగవానుని ఋక్కులతో స్తుతించారు. కొందరు యజుస్సులతో యజించారు. కొందరు సామంతో గానం చేసారు అని చెప్పింది.



అదే విధంగా హోమాదులు వివిధాలైన ప్రక్రియలతో ఆహుతులు సమర్పణ చేసారు. కొంతమంది జపం చేసారు. కొందరు ధ్యానం చేసారు. కొందరు యోగప్రక్రియని అవలంబించి సూర్యుని వివిధ చక్రాలయందు ఆరాధన చేసారని రకరకాలుగా వర్ణించారు.

భగవదారాధన శాస్త్రం చెప్పిన విధంగా ఎన్నెన్నిరకాలుగానైనా చేయవచ్చు. కొందరు స్తోత్రాలు, కొందరు పారాయణలు రకరకాలు చేస్తున్నారు. కొందరు నమస్కారాలు, కొందరు అర్ఘ్యాలు ఇవన్ని సమర్పణ చేసారు. ఆఖరుకి సూర్యుడు చాలా సంతోషించి వారిముందు ఆ మండలంలోంచి దిగి వచ్చాడు. వారు చేసిన సమూహ స్తోత్రం చాలా దివ్యమైంది. అందులో కూడా సూర్యతత్త్వం మొత్తం చెప్పబడుతోంది.

వాళ్ళు సూర్యుని స్తుతిస్తూ పగటిపూట నీవే దినమును కల్పన చేసి సర్వజగతికి ప్రేరణ కల్పిస్తావు. ఆ నీవే లోకరక్షణకోసం రాత్రిని కల్పన చేస్తావు. అప్పుడు నువ్వు చంద్రుడవై సౌమ్యరూపం ధరించి సస్యాదులను కలిగిస్తున్నావు. ఈ విధంగా నీ యొక్క తేజోమయ, సౌమ్య ఉభయ రూపాలతో ఈ ప్రపంచాన్ని నడుపుతున్నావు.

నీ తేజోమయరూపాలన్ని అగ్నిమయాలుగా గోచరిస్తూ ఉంటాయి. నీ సౌమ్యరూపాలన్ని సోమరూపాలై రసస్వరూపాలై గోచరిస్తూ ఉంటాయి. ఈ అగ్నిషోమాత్మకంగా నీ స్వరూపం ఈ జగత్తుని నడుపుతూ ఉంటుంది. సూర్యుడు ప్రపంచాన్ని అగ్నిషోమాలనే తత్త్వంతో నడుపుతూ ఉంటాడు.

జలతత్త్వం కూడా ఆయనదే. తేజస్తత్త్వం ఆయనదే. సూర్యుడంటే కేవలం తేజోరూపం మాత్రమే కాదు. ఉభయస్వరూపాలతో జగత్తుని నిర్వహించే పరమాత్ముడు. ఈ విధంగా వారు ప్రార్థించగానే సూర్యుడు మండలంనుండి దిగి వారిముందుకి వచ్చి రాజుగారికి కొన్ని వేల సంవత్సరాల దృఢమైన ఆరోగ్యాన్ని సర్వానుకూలమైన సంపదలను అను గ్రహించాడు.

వారంతా ఆనందభరితులై తిరిగి వచ్చి రాజ్యంలో ఉత్సవం చేశారు. రాణిగారి సంతోషం కూడా పట్టలేనంతయ్యింది. తన భర్త మళ్ళీ చిరంజీవి అయ్యాడని ఆనందం. రాజుగారి ముఖం మాత్రం పాలిపోయింది. ఇక్కడే అసలు కథ మొదలౌతోంది. రాజుగారు "నాకు చాలా దుఃఖంగా ఉంది ఏం సంతోషం లేదు" అన్నాడు.

నాకిన్నివేల సంవత్సరాల ఆయువుని ఇచ్చారు. మీ ఆయువులెంత? నేను జీవించి ఉన్న కాలంలోనే నాపై ఇంత ప్రేమ కలిగి, పుత్రులు, ప్రజలు, సామంతులు వీరంతా నా కళ్ళముందే పోతుంటే నేను చూస్తూ బ్రతకాలా? ఇంతకంటే నరకం మరొకటుందా? ఎక్కువ కాలం బ్రతకడం గొప్పవిషయం కాదయ్యా! కాలంలో పరిణామం సహజం ఆత్మీయులందరూ తన ముందే నశించిపోతుంటే నాకు వరం వల్ల ఒక అసహజమైన స్థితి మీరు కల్పించారు.



కాని మీరందరూ సహజమైన మరణాదులకు లోనైపోతుంటే నేనెలా తట్టుకోగలను! అన్నాడు. మీ సుఖం మీరు చూసుకొన్నారుగాని మరి నా సుఖం నేనే చూసుకోవద్దా! ఈ విషాదమైన సంఘటనని నేను తట్టుకోలేనని అంటే మాకదేం ఫరవాలేదన్నారు. మేము వెళ్ళిపోతుంటే మీరు మా ఎదురుగా ఉంటే మాకేం బాధలేదు అంటుంటే రాజ్యవర్ధనుడు చాలా బాధపడ్డాడు. ఇంతవరకు ప్రజలకి రాజుపట్ల ఉన్న ప్రేమని చూపించారు. ఇప్పుడు రాజుకి ప్రజలపట్ల ఉన్న ప్రేమని చూపిస్తున్నారు.

రాజ్యవర్ధనుడు వెంటనే ఈ దుఃఖం నుంచి ఉపాయం లభించింది మీరేంచేసారో అదే నేను చేస్తానని ఆయన తిన్నగా ఆ కామరూపపర్వతానికి వెళ్ళి సూర్యుని ఉద్దేశించి తపస్సు చేసారు. సూర్యుడు సంతసించి ఈ పరస్పర ప్రేమపూర్వకమైన అనుబంధం

చూసి అనుగ్రహించాడు. ఆహా! ఇది సాధారణంగా కృతయుగాల్లాంటి యుగాల్లో ఉంటాయి. కలియుగంలో ఉండాల్సిన వాళ్ళ మధ్య కూడా ఉండవు.

రాజుకి ప్రజలకి మధ్య ఉన్న ప్రేమానుబంధాన్ని చూసి ఆశ్చర్యం! రాజ్యవర్ధనుడు కొద్దిపాటి సాధన చేసాడు. సూర్యవరప్రసాదం ఉంది కనుక సూర్యుడు వెంటనే అనుగ్రహించి "నీ ధర్మబద్ధమైన ఈ తపస్సు నాకు చాలా సంతోషం కలిగించింది. మీరు ధన్యులై మీరు ప్రజలు వలసినంతకాలం తృప్తిగా ఉండమ"ని ఆశీర్వదించాడు. ఈ విధంగా ప్రజలు కూడా దీర్ఘాయువులయ్యారు.

ఆ సమీపంలో తపస్సు చేసుకొంటున్న భృగువంశీకుడైన ప్రమతి అనే మహర్షి సంతోషించి సాటి ఋషులతో అంటున్న మాటలను మార్కండేయ పురాణం చెప్తోంది.

**భానుభక్తేః అహోశక్తిః** – సూర్యభక్తిలో ఎంత శక్తి ఉందో అన్నాడు.

**యద్రాజా రాజ్యవర్ధనః ఆయుషావర్ధనో జాతః**
**స్వజనస్యచ ఆత్మనః**

తనకు, తనవారికి ఆయుష్షుని వర్ధిల్లచేయగలిగాడయ్యా రాజ్యవర్ధనుడు ఆహా! అని ప్రమతి ఆ సూర్యుని భక్తి గురించి తన తోటి ఋషులతో ఉపన్యసించాడు. ఈ ఘట్టం మార్కండేయపురాణం అంతవరకూ సూర్యచరిత్రని చెప్పి చివరకి ఉపసంహారంగా చెప్తున్నది. దీన్నిబట్టి సూర్యారాధన వల్ల అసాధ్యాలను కూడా సాధ్యంచేసుకోవచ్చనే అంశాన్ని మనకి మహర్షి సూచన చేసారు.



ఆరాధన చెయ్యడంలో బహుపద్ధతులు ఉన్నాయని ఈ కథలోనే చూపించారు. వేదాదులు తెల్సినవారు ఆ ప్రకారంగా చేస్తారు. ఎవరెవరు ఎలా చెయ్యాలో పద్ధతులు ఉన్నాయి.

కలియుగంలో వేదశాస్త్రం ప్రకారం చెయ్యగలిగే అధికారం ఉన్నవారు కూడా అర్హతలేని పరిస్థితులు ఏర్పడుతున్నాయి. సూర్యారాధన చెయ్యకపోతే కొన్ని దోషాలు ఉన్నాయి. పూజ చేస్తే పుణ్యం. అసలు సూర్యుని పట్ల అపచారం చేస్తే కొన్ని దోషాలు ఉన్నాయి.

ముఖ్యంగా అనునిత్యం కూడా నియమబద్ధమైన జీవితం ఉండాలి. కాలకర్త సూర్య భగవానుడు. ప్రతిరోజూ సూర్యుడికి ప్రధానమైనప్పటికీ ఆదివారం ప్రధానంగా చెప్పారు. రవివారవ్రతమని సూర్యుని సంబంధించిన వ్రతం ప్రధానంగా చెప్తున్నారు.

మరొకటి తిథి. తిథులలో సప్తమి. వారాలలో ఆదివారం. సప్తమీ వ్రతం కూడా ఉంది. సప్తమీ–ఆదివారం కలిసి వచ్చాయా మహాయోగం. దాన్ని భానుసప్తమీ అని అంటాం. శాస్త్రపరిభాషలో దీనికి విజయాసప్తమీ అని పేరు. ఆ రోజు వ్రతాన్ని అవలంబిస్తే

ఎలాంటి అసాధ్యమైనదైనా సాధ్యమౌతుంది.

ఈ సప్తమీ వ్రతాలుచేసే పద్ధతులు రకరకాలుగా చూపించారు. దీనికి కూడా ఉద్యాపనలు పద్ధతులు ఉన్నాయి. ఏకాదశీ వ్రతం వలే సప్తమీ వ్రతం కూడా మనకి ప్రధానంగా చెప్పబడుతోంది. రవివారవ్రతం కూడా చెప్పబడుతున్నది. ఇందులో ఏది చేసినా ఒక మంచి మాసంలో సంకల్పం చేసుకోవాలి. ముందు శుక్లపక్షం ఎంచుకోవాలి. రవివారవ్రతాన్ని చెస్తే శుక్లపక్ష రవివారంతో ప్రారంభించుకోవాలి. ఆ మాసంలో ఆదిగా వచ్చే ఆదివారం. అలాగే సప్తమివ్రతం చేస్తే శుక్లసప్తమి ప్రధానం.

ఈ వ్రతాచరణకి శ్రేష్ఠమైన మాసాలు మార్గశీర్షమాసం, మాఘమాసం, వైశాఖమాసం ప్రధానంగా చెప్పారు. సూర్యుడికి ప్రతిమాసం ప్రీతేకాని ప్రధానంగా వ్రతనియమం స్వీకరించడానికి మాత్రం ఇది ముఖ్యం. అక్కడ్నించి మళ్ళీ సంవత్సరం వరకూ చేయవచ్చు. అలా చెయ్యడం దానికి ఉద్యాపనవిధి ఇవన్ని చెప్పారు.

సప్తమీతిథులకి ప్రత్యేకించి పేర్లు కూడా ఉన్నాయి. వ్రతం చేసినా చెయ్యకపోయినా ప్రతివారు ఆదివారం మాత్రం కొన్ని నియమాలు పాటించాలి. అవి **స్త్రీ తైల మధు మాంసాని రవివారే విసర్జయేత్** - ఆదివారంనాడు స్త్రీ, తైల, మధుమాంసాలను స్వీకరించరాదు. మాంసాదులను తరువాత స్వీకరించవచ్చా అని తర్కం చేయరాదు.



మాంసస్వీకారం కూడదని ఎవరికైతే నిషేధించారో వారికి ఎప్పుడూ నిషేధమే. కాని కొన్ని వర్ణాలవారికి ఫరవాలేదు. వారి వారి జీవనశైలిని బట్టి ఆహారాదులలో విధి, నిషేధాలు ఉంటాయి. వీరు విధిని అతిక్రమించి స్వీకరిస్తే దోషం. వారు స్వీకరిస్తే దోషం కాదు. స్వీకరించకపోతే దోషమని చెప్పలేదు. వారు మానివేస్తే మాత్రం గొప్పదే. కాని ఆదివారం మాత్రం స్వీకరించితే దోషం లేదనేవారు కూడా మాంసభక్షణం చెయ్య రాదు. ఇది పెద్దనియమం.

మనకి ఆదివారం సెలవు వచ్చిందని చెప్పి చాలా మంది మాంసభక్షణ ప్రీతి కలవారు ఆ రోజున చేస్తున్నారు. ఇది పాపం మూట కట్టుకోవడమే. తెలియనివారు తెల్సుకొని తెలియనివారికి తెలియజేయాలి. వీలైనంత వరకు సదాచారం చెప్పడం మా పని కనుక ఈ మాటని అనేక మార్లు చెప్పడం జరిగింది.

ఇలా టి.వి.లో చెప్పినపుడు ఒక పల్లెకి చెందినవారు విని మరునాడు శివాలయం దగ్గరకి వెళ్ళి ఇకపై ఆదివారం మేం మాంసం తినమని ఒట్టు పెట్టుకొన్నారుట. వాళ్ళ వీధుల్లో మాంసపు దుకాణాలు లేకుండా చేసారు. ఇలా వస్తేనే దేశం బాగుపడుతుంది.

ఈ మధ్యకాలంలో సద్గురు శివానందమూర్తిగారు మాట్లాడుతూ– 'సూర్యారాధన వీలై నంత ఎక్కువ చేయండ'ని చెప్పారు. నమస్కారమో, పూజో ఏదో ఒకటి సూర్యుడికి ఎదురుగా నిలబడి చెయ్యాలి. సూర్యాపచారాలు ఎక్కువ జరుగుతున్నాయన్నారు. సూర్యాపచారాలలో ఒకటి చెయ్యకూడని పనులు.

అసలు దివాస్త్రీ సంగమం ఎప్పుడూ దోషమే. ఆదివారం సంపూర్ణంగా వర్జనీయం. తైల స్వీకారం కూడా వర్జనీయం. మధు సేవనం కూడా వర్జనీయమే. మధుసేవనం కొందరికి నిషేధంగా లేదు కాని అటువంటివారు కూడా ఆ రోజు స్వీకరించరాదు.

ఆదివారం నియమబద్ధమైన జీవితం గడపాలి. ఆదివారం క్షురకర్మ చేయించరాదు. మరి నిత్యం చేసేవాళ్ళు గురించి కూడా శాస్త్రం కొన్ని నియమాలు చెప్పింది. నిత్యక్షురకర్మ దోషం చాలా ఎక్కువే. కొంతమంది ఉద్యోగులకు కొన్ని మినహాయింపులు ఉన్నాయి. కాని తద్దోషపరిహారార్థం ఒక మంత్రం చెప్పింది.

**ఆనర్తనో అహిఃఛత్రో పాటలిపుత్రో జనార్దనః** ఈ మంత్రం చదివితే తద్దోషం పోతుంది. ఇది కొన్ని ఉద్యోగాదుల ధర్మాలలో ఉన్నవారికి చెప్పింది. కాని ఆదివారం మాత్రం ఎట్టిపరిస్థితులలో చెయ్యరాదు. ఈ మంత్రం చెప్పినా దోషం పోదు. పాటించకపోతే ఏమౌతుందంటే అది మనం నేటి సమాజంలో ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం. భయంకర మైన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. అప్పటికవి తెలియబడవు కాని తరువాత తరువాత చాలా విషాదకరమైన పరిస్థితులు ఎదుర్కొనక తప్పదు.



భారతంలో "మానవునికి నూరేళ్ళు ఆయువు అంటారే కాని అంతకాలం బ్రతకట్లేదు. ఒకవేళ బ్రతకాలని ప్రయత్నించినా బ్రతికి చచ్చినట్లే రోగాలతో బ్రతుకు తున్నారు కారణం ఏమిటి? శాస్త్రం తప్పిపోలేదా? అని ధర్మరాజు భీష్ముడిని అడిగాడు. దానికి భీష్ముడు ఆయువు తగ్గడానికి కారణం అనాచారం నాయనా!" అని సమాధానం చెప్తాడు. సూర్యాపచారాల్లో ఇది ఒకటి.

మరొకటి ముఖ్యంగా రజస్వలా దోషం ఇళ్ళల్లో కలుపుకొన్నా, రజస్వలా దోషంతో కూడిన అన్నాన్ని తిన్నా,వారి గాలి తాకినా, వారితో సంభాషణ చేసినా అది సూర్యాపచారం అవుతోంది. మహాఘోరమైన విపత్తు అది. తరువాత వంశం మీద చూపిస్తుంది. దానివల్ల ఇహమూలేదు, పరమూలేదు, పరమార్థంలేదు.

ఈ మధ్య చాలా బాధాకరమైన అంశం కొంతమంది "మేము వేదాంతమార్గంలో ఉన్నాం. మాకీ ఆచారాలవీ అక్కర్లేదు" అనేవారున్నారు.

మనం వేదాంతపు కబుర్లాడుతూ ఆచారాన్ని విడిచిపెడితే ఆ వేదాంతం ఎక్కడు సరికదా, అదికూడా ప్రమాదహేతువు అవుతుంది. ఈ మధ్యన కొందరు వేదాంతోపన్యాసకులు కూడా "ఇవన్నీ అక్కర్లేదు తీసేయ్యండి, ఛాదస్తం" అని అంటూ మనల్ని భ్రష్టు పరుస్తున్నారు. వేదాంతం, ఉపనిషత్తులు సరిగ్గా చదివితే అవి ఏం చెప్పాయో తెలుస్తుంది. ఇవన్నీ విడిచి పెట్టమని చెప్పలేదు. పాటించలేని పరిస్థితులు చాలా వస్తున్నాయి, పాటించగలిగిన వాటిని పాటిస్తూ, పాటించలేనివి పాటించలేకపోతున్నామని రోజుకు ఒక్కసారి అయినా ఏడిస్తే దోషం పోతుంది.

అదే **'స్మరణాన్ముక్తిః'** చెయ్యలేకపోయినా స్మరించమని. సదాచారాలను వాటిని విస్మరించ రాదు. సూర్యాపచారాలలో ఇది ఒకటిగా చెప్పారు కనుక సూర్యుని ఎలా ఆరాధించాలో చెప్పే ముందు సూర్యారాధకులు ఎలా ఉండాలో చెప్తున్నారు.

సదాచారం చాలా ప్రధానంగా చెప్పబడుతున్నది. ఆచారంతో సూర్యారాధన చేస్తే తప్పకుండా సత్ఫలితం వస్తుంది. ఇవేవీ కష్టం కాదు. దశాబ్దాల క్రితం ఇవన్నీ చాలా అలవోకగా చేసేవారు. దయచేసి సదాచారం పాటించండి అది సూర్యునికి మహాప్రీతికరం.

"అశాస్త్రీయమైన యజ్ఞాలు చెయ్యడం వలన సూర్య మండలం క్షోభిస్తోంది" అని సద్గురు శివానందమూర్తి గారు చెప్పిన గొప్ప విషయం.



తద్దోషం పోవడానికి మనం నమస్కారాదులతో, స్తోత్రాదులతో సూర్యుని శాంతింప చేస్తే కనీసం ఆ నమస్కరించినవాడినైనా అనుగ్రహిస్తాడు సూర్యుడు. సూర్యుని అనుగ్రహం పొందామా అసాధ్యం అనేదే లేదు - దేనినైనా సాధించగలం.

## అర్ఘ్యం-నమస్కారం

సూర్యునికి ఇష్టమైనవి అర్ఘ్య ప్రధానం, నమస్కారం అని శాస్త్రం చెప్తోంది. నమస్కారం బహువిధాలు. సూర్య నమస్కారాలనే ప్రక్రియ ఉంది. అవి వేదాదుల నుంచి మనకి క్రమంగా వచ్చింది. సౌర మంత్రాలను స్వీకరించి ఒక్కొక్క రకమైన ఆసన భంగిమలతో నమస్కరించాలి. అంటే యోగాన్ని, మంత్రాన్ని కలపడం అన్నది మన శాస్త్రములలో ఎంత చక్కగా ఉందో చూడండి.

యోగ శాస్త్రం చెప్తున్నది నమస్కార భంగిమలు, మంత్రం చెప్తున్నది వేదం. ఆ రెండింటికి ఉన్న అనుబంధం చెప్తున్నది ఆగమం. ఈ ఆగమం ప్రకారంగా యోగాన్ని, మంత్రాన్ని కలబోసి చెయ్యడం ఉంది. అలా సూర్య నమస్కార పద్ధతి ఉంది.

ఇప్పటికీ చాలా మందికి యోగా క్లాసులలో కూడా సూర్యనమస్కారాలు చేయిస్తున్నారు.

కాని ఆచార రహితమైన యోగం కూడా ఆధ్యాత్మిక అభివృద్ధిని కలిగించదు. కొంత మంది యోగా చేస్తే ఆరోగ్యం వస్తుంది. ఆరోగ్యమే ఆధ్యాత్మికత అనుకుంటున్నారు.

ఆధ్యాత్మిక సాధనకు ఆరోగ్యం సహకారి. ఆరోగ్యమే సంపూర్ణమైన జీవన ప్రయోజనం కాదు. జీవనగతికి సహకారి. ప్రధానంగా మనం ఆచార సహితమైన యోగం, ఉపాసనా సహితమైన యోగం, సత్కర్మతో కూడిన యోగమే క్రమంగా మనస్సు ఏకాగ్రతకి, చిత్తశుద్ధికి సహకరిస్తుంది. మోక్షానికి నేరుగా హేతువుకాదు.

సూర్యారాధనలో యోగశాస్త్రంతో కూడిన ఆసనాలతో కలిపి సూర్య నమస్కార పక్రియలు ఉన్నాయి. పూర్వకాలంలో చాలా ఎక్కువ మందికి తెలుసు, ఇప్పటికీ సూర్యనమస్కారాలు చేసేవారు ఉన్నారు. ఇది చెయ్యాలంటే శారీరక పుష్టి ఉండాలి. అది చెయ్యడం మొదలు పెడితే ఆయనే ఇస్తాడు.

మనకి నమస్కారాలు చెయ్యడం చేతకాకపోతే చెయ్యగలిగేవారి ద్వారా వివరణ తీసుకుని చెయ్యడం ద్వారా అనారోగ్య పరిస్థితుల నుంచి బయట పడడం స్పష్టంగా చూస్తూ ఉన్నాం. నమస్కార పక్రియలకి మంత్రం తీసుకుని ఆ మంత్రంతో నమస్కారం చేస్తారు. మంత్రాలు, తంత్రాలు లేకపోతే కనీసం రెండు చేతులు దోయిలించి తలవాల్చి నమస్కరించడం చేతనైనా అదేం తక్కువ కాదు. ఇది మనం రోజు చెయ్యగలం. మన ఓపిక. సాష్టాంగ నమస్కారం కూడా చెప్పారు. యోగ పక్రియలతో కూడిన నమస్కారాలు సరియైన శిక్షణ తీసుకొని మాత్రమే చెయ్యాలి.



సూర్యునికి అర్ఘ్యం ఎలా ఇవ్వాలో కృష్ణపరమాత్మ అర్జునునికి చెప్పింది భవిష్యోత్తర పురాణంలో కనపడుతోంది. పైగా సూర్య భగవానునికి రాగిపాత్రతో ఇచ్చే అర్ఘ్యం ఇష్టం. ఆదిత్య పురాణంలో స్వయంగా సూర్యభగవానుడే "నాకు తామ్ర పాత్రతో చేసే ఆరాధన చాలా ఇష్టమ"ని చెప్తాడు. చాలా శుభ్రమైన తామ్రపాత్ర. అది ఎప్పటికప్పుడు శుద్ధి చేసినదై ఉండాలి. పాత్రశుద్ధి లేకుండా చేస్తే దానిలో ఉన్న జలం కూడా అశుచే అవుతుంది.

అర్ఘ్యం ఇచ్చేటప్పుడు వివిధ మంత్రాలు, శ్లోకాలు ఉన్నాయి. శ్లోకాలతో కూడా అర్ఘ్య ప్రధానం ఇవ్వడం కనిపిస్తోంది.

మనకు ఇష్టమైనవి తృప్తిగా చేసుకోగలిగేవి–

***మిత్రాయ నమః, రవయే నమః, సూర్యాయ నమః, భానవే నమః, ఖగాయ నమః, పూష్ణే నమః, హిరణ్యగర్భాయ నమః, మరీచయే నమః, ఆదిత్యాయ నమః, అర్కాయ నమః, సవిత్రే నమః, భాస్కరాయ నమః*** ఇత్యాది పన్నెండు మంత్రాలు మనకి చెప్పబడు

తున్నాయి. వీటితో సూర్యునికి అర్ఘ్యప్రదానం. ఇవి ద్వాదశాదిత్యుల పేర్లు అని కూడా చెప్తారు. వీరి పేర్లు ఒకొక్క పురాణంలో కొద్ది మార్పులతో కనపడుతున్నాయి. అంత మాత్రం చేత ఏది నిజమని సందేహపడనక్కర్లేదు. ఆ ద్వాదశాదిత్యులని రకరకాల నామాలతో ఉచ్చరించవచ్చని స్పష్టమవుతోంది.

ఒక క్రమం మనం చెప్పుకున్నాం.

**మిత్రరవిసూర్యభానుఖగపూషహిరణ్యగర్భమరిచ్యాదిత్యదిసవిత్రార్కభాస్కరేభ్యో నమో నమః**

అదే విధంగా ఆకాశ బీజమైన "హ" కారానికి , తేజో బీజమైన "ర" కారం కలుపుకుని హ్రాం చేసి ఇత్యాదులతో గురుముఖతః గ్రహించి ఆ బీజాక్షరాలతో వీటిని సంపుటితం చెయ్యడం కనపడుతుంది. ఆకాశం, తేజస్సు కలిస్తే సూర్యతత్త్వం అందులో వచ్చింది. పైగా హృదయబీజం కూడా హ కారమే. వేదమంత్రాలతో చేసేవాళ్ళు చేస్తారు. చెయ్యగలిగేవాళ్ళు వారితో చేయించుకోవచ్చు.

**తిలతండుల సంయుక్తం కుశైర్గంధోదకేన చ**
**రక్తచందన మిశ్రాణి కృత్వావై తామ్రభాజణే**



తామ్రపాత్రలో జలంతో దూర్వాంకురాలు, ఎర్ర చందనంతో తీసిన గంధం శ్రేష్ఠం, ఎర్రని పువ్వులతో సూర్యభగవానునికి అర్ఘం ఇవ్వాలి. ఇచ్చేటప్పుడు కూడా

**ధృత్వాశిరసి తత్పాత్రం జానుభ్యాం ధరణిం స్పృశన్**
**మంత్ర పూతం గుడాకేశ! స్పూర్ఘ్యందత్వా గభస్తయే**

ఆ పాత్రని శిరస్సు దాకా ఎత్తి, మోకాళ్ళు రెండూ భూమి మీద పెట్టి స్వామికి సమర్పణ చెయ్యాలని చెప్పారు. ***సాయుధం సరథం చైవ*** – సర్వాయుధాలతో, సపరి వారంతో ఉన్న ఆదిత్యభగవానుని ధ్యానించాలి. పైగా ఆయన చుట్టూ పరివారం చాలా ఉన్నది.

**ఆదిత్యైరప్సరోభిర్మునిభిరహివరైర్గ్రామణీయాతుధానైః**
**గన్ధర్వైర్వాలఖిల్యైః పరివృతదశమాంశస్య కృత్స్నంరథస్య**

ఆయన పరివారంలో ద్వాదశాదిత్యులు ఉంటారు. ఒక సంవత్సరకాలంలో పన్నెండు రూపాలతో వచ్చే సూర్యశక్తులే ద్వాదశాదిత్యులు.

**ఆదిత్యైః** ఆదిత్యులు పన్నెండు మంది. అప్సరోభిః – అప్సరసలు, గంధర్వులు, ఇలా చిట్టచివరికి వాలఖిల్యులనపడే మహర్షులు. మొత్తం స్వామివారి దగ్గర ఉండే గణాలు ఏడు. ఇవి ఆయనచుట్టూ ఎప్పుడూ ఉంటాయి.

ఒక్కొక్క గణంలో మళ్ళీ పన్నెండేసి మంది చొప్పున ఉంటూ ఉంటారు. ఆదిత్యులు, అప్సరసలు, గంధర్వులు, గ్రామణులు, రాక్షసులు, యాతుధానులు (రాక్షసులు)... రాక్షసులంటే దుర్మార్గులని కాదు అదొక జాతి- సూర్యునికి ఉపచర్యలు చేస్తూ ఉంటారు.

పదివేల యోజనాల నిడివితో సూర్యభగవానుని రథం ఉంటుంది. దాని మొదటి భాగంలో వెయ్యి యోజనాలలో గణాలు ఉంటారు.

ఆ తరువాత తొంభై యోజనాలు స్వామి మండలమని పురాణాల ఆధారంగా అప్పయ్యదీక్షితుల వారు వర్ణించారు.

**విస్తారాయామమానం దశభిరుపగతో యోజనానాం సహస్రై**
**శ్చక్రే పఞ్చారనాభిస్త్రితయవతి లసన్నేమిషట్కే నివిష్టః**
**సప్తచ్ఛన్దస్తురఙ్గాహితవహనధురో హాయనాంశత్రివర్గ**
**వ్యక్త్యాక్లుప్తాఖిలాఙ్గః స్ఫురతు మమ పురః స్యన్దనశ్చణ్డభానోః**

అని సూర్యరథాన్ని ధ్యానించితే ఒక ప్రయోజనం. ధ్యానమే. సూర్యరథం మన కంటికి కనపడేది కాదు. సూర్యుని భౌతికస్వరూపం కూడా మనం మన కంటితో చూడగలమా! మనకు ఆయన ఎంత అనుగ్రహించాడో అంత మాత్రమే చూడగలం.



తేరిపారా రెండు నిమిషాలు చూస్తే మూడో నిమిషం ప్రపంచాన్ని చూడలేం. అలాంటి తేజస్సు అది. కాని జ్ఞానంతో సులభంగా చూడవచ్చు. అందుకని శాస్త్రం దివ్యస్వరూపం ఎలావుంటుందో వర్ణించింది.

దాని మధ్యలో ఆ మండలం. ఆ మండలం మధ్యలో స్వామి వారు.

**మండలాంతరగతం హిరణ్మయం**
**భ్రాజమానవపుషం శుచిస్మితం**
**చండదీధితిమఖండితద్యుతిం**
**చింతయేన్ముని సహస్రసేవితం**

రథం, గుర్రాలు, పగ్గాలు వీటన్నిటికి ఒక వ్యవస్థ ఉంది. ఇవన్నీ వైజ్ఞానికాంశాలే. విశ్వవిజ్ఞాన విశేషాలే అశ్వాలుగానూ, చక్రాలుగానూ చెప్తున్నారు. ఆ రథస్వరూపం కూడా తరువాత తెలుసుకుందాం.

అర్ఘ్యవిధిని పద్యరూపంలో అందిస్తూ శ్రీనాథమహాకవి చెప్తారు.

**మోకాళ్ళు భూమిపై మోపి హస్తాంబుజ**
**ద్వయమున దామ్రపాత్రము ధరించి**

**యర్ఘ్యోదకంబులయందు దూర్వాంకురా**
**క్షతలు నవరక్త చందనంబు**
**కరవీర ముఖ్య రక్తప్రసూనంబులు**
**వైచియొక్కొక్క పేర్వరుసతో, న**
**మోంతంబుగా జతుర్థ్యంతంబుగా బ్రణ**
**వాదిగా బఠియించు చర్ఘ్యపాత్ర**
**మౌళి పర్యంత మెత్తుచు మాటి మాటి**
**కర్ఘ్యమిచ్చిన బ్రీతుడై యర్కుడొసగు**
**సేవకుల కాయురారోగ్య వివేక**
**భాగ్యసౌభాగ్యవైభవ ప్రాభవములు**

కరవీరం అంటే ఎర్రగన్నేరు. ఒక్కొక్క నామం తీసుకొని దానికి నమస్కారం కలిపి ఆ నామానికి చతుర్థ్యంతం చేయమన్నారు. **మిత్ర** అనే నామానికి **నమః** అని చేర్చితే **మిత్రాయ నమః** అవుతుంది. ఈ అర్ఘ్యాన్ని సూర్యద్వాదశనామాలకే కాదు డెబ్బై రెండు నామాలతో అర్ఘ్యమిచ్చే విధానం పురాణాలలో చూపించారు. కొందరు మొత్తం అన్ని నామాలతో ఒకేసారి అర్ఘ్యం ఇస్తారు. కాని సూర్యునికి పన్నెండు సంఖ్య ప్రీతి కనుక ద్వాదశనామలతో అర్ఘ్యమివ్వడాన్ని చెప్పుకొన్నాం.

**ఏవార్ఘ్యం సంప్రయచ్ఛంతి సూర్యాయనియతేంద్రియః।**
**బ్రాహ్మణాక్షత్రియావైశ్యాః స్త్రియఃశూద్రాశ్చ సంయుతః॥**
**భక్తి భావేన సతతం విశుద్ధేనాంతరాత్మనా।**
**తేభుక్త్వాభిమతాన్ కామాన్ ప్రాప్నువంతి పరాంగతిమ్॥**

భక్తి భావంతో శుద్ధమైన అంతఃకరణంతో ఏ వర్ణంవారైనా, ఏ లింగంవారైనా సరే నియతేంద్రియులై అంటే ఇంద్రియనిగ్రహంతో, భక్తిభావంతో ఇలా సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేస్తే వారి కోరికలన్ని తీరి చివరకు పరమగతి పొందుతారని శాస్త్రం చెప్తున్న మాట. ఇదొక పద్ధతి.

ఇక సూర్యభగవానుని స్తుతిలో ఉన్న మహిమ. ఇదొక ప్రక్రియ. ఆయన దగ్గర ఎప్పుడూ ఇలా స్తుతి చేస్తున్నవారు ఉంటారని చెప్పుకొన్నాం. వాళ్ళు ఋషులు. స్తుతి దేవతకి ప్రేరణ కల్పిస్తుంది. దేవతకి కూడా ఉత్సాహం ఇస్తుంది స్తుతి. స్తుతి నుంచి వచ్చే శబ్ద చైతన్యం దేవతని మరింత జాగృతపరుస్తుంది. దేవతలు ఎప్పుడూ మంత్రా శ్రితులు.

మంత్ర చైతన్యమే వారు. స్తుతిలో వచ్చే మంత్రశక్తి వల్ల దేవతలకి మరింత ఉత్సాహం. ఋషుల పని సూర్య భగవానుడు ఉదయిస్తున్నప్పుడు స్తుతి చెయ్యడం. అప్సరసలు నృత్యం చేస్తారు. గంధర్వులు గానం చేస్తారు. వీటన్నిటితో ఆయన పేరోలగం అక్కడ్నించి వస్తుంది. ఒట్టిరాజులకే పెద్దకొలువు.

సూర్యభగవానుడు రాజులకి రాజు. ఆయన దగ్గర ఎప్పుడూ వీరంతా ఉంటారు.

ప్రాతఃకాలంలో ఆయన మహాసందడిగా వస్తాడు. అలా వచ్చేటప్పుడు దేవాసురగణాః - ఉభయగణాలు ఉంటాయి 'రశ్మిమంతం సముద్యంతం దేవాసురనమస్కృతం' అన్నారు. 'సముద్యంతం' - 'సమ్'-'ఉద్యన్తమ్' - చక్కగా ఆయన ఉదయిస్తున్నప్పుడు అందరూ నమస్కరిస్తూ ఉంటారు.

మామూలుగా ఒక రాజుగారు సభలోకి వచ్చేటప్పుడే బహుపరాకులు, వందిమాగధులు... ఇవన్నీ ఉంటాయి. రాజాధిరాజు ఆయన. రాజు అంటేనే ప్రకాశస్వరూపుడు. రంజన కారకుడు. సూర్యునికంటే ప్రకాశస్వరూపుడు రంజనకారకుడు ఉంటారా! కనుక అసలైన రాజు ఆయనే. ఆయన అనుగ్రహం ఉంటేనే ఎవరైనా రాజు కాగలరు.



ఆయన్ని ఆనందింపజేయడానికి ఉన్న పద్ధతులు **స్తుతి జాప్య ఉపహారేణ పూజయాపి వివస్వతః** - స్తోత్రము, జపం, ఉపహారం అంటే ఆయనకి ఏదైనా సమర్పించుట(పాయసం, రక్తచందనం, ఎర్రని కుసుమాలు ఇత్యాదులు) ఇలా వాటితో పాటు షోడశోపచారాది పూజలు చేస్తూ **ఉపవాసేన** వారి శరీరానుకూలతని బట్టి ఉపవాసాదులు చేస్తే **సర్వపాపైః ప్రముచ్యతే** - సర్వపాపాల నుంచి బయటపడతారని చెప్తున్నారు.

**ప్రసాదాయ శిరోభూమ్యాం నమస్కారం కరో తియః।**
**తత్ క్షణాత్ సర్వపాపేభ్యో ముచ్యతే నాత్రసంశయః॥**

తలను నేలకు తాకించి నమస్కరిస్తే ఆ క్షణంలోనే సర్వపాపనాశనం జరుగుతుంది. పురుషులు సాష్టాంగనమస్కారం, స్త్రీలు పంచాంగనమస్కారం చేసేటపుడు శిరస్సు భూమికి తగిలించి నమస్కరించాలని చెప్తున్నారు. ఇదొక ప్రధానమైన నమస్కారంగా చెప్తున్నారు.

సూర్యునికి ప్రదక్షిణ నమస్కారం కూడా ఉంది. అయితే సూర్యునికి ప్రదక్షిణ నమస్కారం ఎలా చేస్తాం? మనసిధ్యాత్వా అని చెప్తున్నారు బ్రహ్మపురాణంలో. సూర్యనమస్కారం గురించి చెప్తూ మన హృదయంలో సూర్యభగవానుడిని ధ్యానం చేసుకొంటూ ఆయన చుట్టూ మనం ప్రదక్షిణ చేస్తున్నామనే భావనతో ప్రదక్షిణచేస్తే వారు సర్వదేవతలకి ప్రదక్షిణ చేసిన పుణ్యాన్ని పొందుతున్నారని చెప్పారు. సూర్యుడు సర్వదేవతాత్మకుడు.

సూర్యభగవానుని ధ్యానం వల్ల శారీరక సౌందర్యం వస్తుంది. **ఆప్రణఖాత్ సర్వయేవ సువర్ణః** – అయన బంగారుదేహచ్ఛాయ కలిగినవాడు. కనుక సౌందర్యకాములు కూడా ఆయన ఆరాధన వలన సిద్ధి పొందవచ్చు.

సూర్యభగవానుడికి దీపం సమర్పణ చేస్తే ఈ జన్మలోనే కాదు ఏ జన్మలోనైనా అంధత్వం రాదు. దీపదానం వల్ల కంటికి సంబంధించిన సర్వదోషాలు పోతాయి. వీటి ఆధారమైన గాథలు కూడా పరిశీలిస్తే వీటి యందు మరింత దృఢవిశ్వాసం ఏర్పడుతుంది.

## సాంబుని ద్వారా లభించిన సూర్యమంత్రాలు

ఇపుడు సాంబుడు చేసిన ద్వాదశార్యాస్తుతి అనే పన్నెండు చిన చిన్న శ్లోకాలలో ఉన్న అంతరార్థాలను పరిశీలిద్దాం.

ద్వాదశార్యాస్తుతి నిత్యపారాయణ చేసుకోవచ్చు. దీని మహిమ అత్యద్భుతమైంది. సౌరమంత్ర పాఠంలో ఉన్న మహామంత్రాల రహస్యాలను ఇందులో నిక్షిప్తం చేసారు. కొన్ని అరుణమంత్ర విశేషాలుకూడా ఉన్నాయి. వేదపండితులు ఈ శ్లోకాలను చూస్తే వాటికి సంబంధించిన వేదంలో గల మూలమంత్రాలను వారు చెప్పగలరు.

ఆ వేదమంత్రాలు తెలియకపోయినా ఈ ద్వాదశార్యాస్తుతి చదివితే వేదంలోని సౌరమంత్ర పాఠం చదివిన ఫలితం వస్తుంది. వేదాదులు గురుముఖతః నేర్చుకొని స్వరాదినియమాలతోనే చదవాలి. కాని వేదమంత్రరహస్యాలని నిక్షిప్తం చేసిన ఈ స్తుతిని మామూలుగా చదివితే పాపాన్ని పోగొట్టుకొని పుణ్యం సంపాదించవచ్చు.



దీన్ని బట్టి చూస్తే ఋషులకి మనమీద ఎంత దయ ఉందో తెలుస్తుంది. కష్టపడేవాడు కష్టపడి ఎలాగైనా సాధిస్తాడుగాని ఏమీ తెలియనివారికి ఎలాగని ఇది ఇచ్చారు. ఆర్యా ఛందస్సులో సూర్యుడి పై చాలా స్తుతులు ఉన్నాయి. ఈ స్తుతికి స్వరాది నియమాలు లేక పోయినా ఉచ్చారణాదోషం లేకుండా చదువుకోవచ్చు.

**ఉద్యన్నద్యవివస్వాన్ ఆరోహనుత్తరాన్దివం దేవః**
**హృద్రోగం మమ సూర్యో హరిమాణం చాశు నాశయేదఖిలం**

ఉద్యన్నద్యమిత్రమహః అని మహాసౌరమంత్రాలలో ప్రారంభం. దాన్ని తీసుకొని మొదటిశ్లోకంగా ఇచ్చారు. ఉద్యన్నద్యవివస్వాన్ అంటే ఈ రోజున ఉదయిస్తున్నవాడు. ఉత్తరాందివం అన్నిటికంటే ఉత్కృష్టమైన స్థానమందు ఉదయిస్తున్నవాడు.

ఆయన ఎక్కడ్నించి కనబడుతున్నాడో చెప్తూ **దివం అంటే ద్యులోకం** నుంచి స్వామి ప్రకాశాన్ని ఇస్తుంటే మనకి ఇక్కడ కనపడుతోంది. ఆరోహన్ అంటే పైకి వచ్చేటప్పుడు

కనిపిస్తున్నాడు. వివస్వాన్ – వివస్వంతం అనే మాట ఆదిత్యహృదయంలో మొదలుపెడతారు. చాలా మూలతత్త్వం ఈ నామంలో ఉంది.

వైవస్వత – వివస్వాన్. **వివస్వాన్** అంటే **ప్రభయా ఆచ్ఛాదయతే విశ్వమితి** – నిరుక్తంలో సాయణాచార్యులవారు చెప్పారు. వివస్వాన్ శబ్దానికి తన కాంతితో విశ్వాన్నంత టిని కప్పువాడని అర్థం. అధిక తేజస్సుతో అంతా ప్రకాశింపజేయువాడు.

**దేవః – దేవః** అనే మాటకి శాస్త్రీయమైన అర్థం స్వయంప్రకాశస్వరూపుడు. ఆదిత్యమండలరూపంలో కనబడుతున్న సూర్యుడు ఒక వెలుగు మాత్రమే కాదు. ఈ వెలుగు సర్వజీవులలో ప్రకాశించే పరంజ్యోతియే. **ఏకోదేవః సర్వభూతేషుగూఢః** – ఆయనే ఈయన. ఆ అనుసంధానం కావాలి. సూర్యమండలమే భగవంతుడా అంటే– కాదని కాదు గాని అవునని కూడా అంగీకరించవచ్చు.

సూర్యమండలానికి పరిమితమై లేదు ఆ పరంజ్యోతి. అది సర్వవ్యాపకం. అది సూక్ష్మం. ఇంద్రియగోచరం కాదు. ఆయన ఈశ్వరవిభూతిగా సూర్యమండలం ద్వారా ప్రపంచాన్ని నిర్వహిస్తున్నాడని గ్రహించగలగాలి. సూర్యమండలాన్ని **అసావాదిత్యోబ్రహ్మ** అని పరమాత్మ స్వరూపంగా ఉపాసించాలి.



అలా ఉపాసించడం వల్ల అసౌ అని చెప్పున్నది క్రమంగా **అహంబ్రహ్మాస్మి** స్థితి దాకా తీసుకువెడుతున్నది. అదే శుద్ధికి హేతువు అవుతున్నది. అటువంటి సూర్యుడు నా హృద్రోగాన్ని, నా హరిమాణమును పోగొట్టుగాక!

హరిమాణము అంటే కామెలరోగం. ఈ వ్యాధినే పచ్చకామెర్లు అంటారు. కామెలరోగాన్ని పోగొట్టుగాక! అనే అర్థాన్నే భాష్యకారులందరూ ఇచ్చారు. **హృద్రోగం** అంటే గుండెజబ్బు. చాలా కాలం క్రితం 77 ఏళ్ళ వ్యక్తి గుండెజబ్బుతో ఆసుపత్రిపాలైనపుడు మొత్తం ఈ శ్లోకాలన్నీ పారాయణం చేసుకోలేదని ఈ ఒక్క శ్లోకం పారాయణ చేసుకోవడానికి ఇస్తే తరువాత కొంతకాలం హాయిగా బ్రతికాడు. ఈ శ్లోకానికి అంతశక్తి ఉంది. హృద్రోగం అనగా గుండెజబ్బులు పోగొట్టడం. మరొకటి కామెలవ్యాధి.

ఇంకో అర్థాన్ని నిరుక్తకారులు అద్భుతంగా చెప్పారు. హృత్ అంటే కనబడకుండా ఉండేదని అర్థం. బయటకి కనపడదు రహస్యం. కామెలరోగమంటే బయటికి కనపడేది చర్మసంబంధమైన రుగ్మతగా దాన్ని చూపిస్తున్నారు.

హృద్రోగం, హరిమాణం అనే రెండు మాటలకి అర్థం మానసికమైన రోగాన్ని హృద్రోగం గాను, శారీరకమైన రోగాలను హరిమాణశబ్దం చేత చెప్పడం వలన ఆధివ్యాధులు రెండు

పోగొట్టుగాక! అని అర్థం. మొదటిశ్లోకంలోనే మనకి కావలసినవన్నీ ఉన్నాయి.

సూర్యుని ధ్యానించే ప్రక్రియలో పురుషధ్యానం ఒకటుంది. రథధ్యానంలో ముందు అశ్వాలు, తరువాత రథస్వరూపం మొత్తం, దాని తరువాత మండలము, దాని మధ్యంలో పురుషుడు. మండలమనగానే కాంతితో కూడిన మండలాన్ని ధ్యానించాలి. లోపల పురుషుని ధ్యానించాలి. ఆయనే ప్రధానం, పరమం.

హిరణ్మయపురుషుడు. ఆయన బంగారు రంగుతో ఉంటాడు. ఆయన్ని ధ్యానించి ఉపాసిస్తే క్రమంగా మనకి మోక్షహేతువవుతుందని ఛాందోగ్యోపనిషత్తు చెప్తోంది.

**య యేషోంతరాదిత్యే హిరణ్మయఃపురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుః**
**హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః.**

అంతరాదిత్య పురుషుడైన ఆతనిని ధ్యానించమని చెప్తున్నారు. పరమేశ్వరుడు ఆకారరహితుడైనా జగతిని అనుగ్రహించడం కోసం దివ్యమంగళ విగ్రహాన్ని **స్వమాయయా స్వీకృతః** అన్నట్టుగా ఆయన అక్కడ ఉంటాడు. ఇదే విషయాన్ని బ్రహ్మసూత్ర భాష్యంలో **అంతస్తద్ధర్మోపదేశాత్** అనే సూత్రం దగ్గర శంకరులు చాలా విశేషంగా సూర్యుని అలా ఉపాసించడం మంచిదే అని బోధించారు.



మండలంలో ఉన్న సూర్యభగవానుడు ఏ విధంగా చూడాలో చెప్తూ

**ధృతపద్మద్వయం భానుం తేజోమండల మధ్యగం**
**సర్వాధివ్యాధిశమనం ఛాయాశ్లిష్టతనుం భజే!**

సంజ్ఞాదేవితో కలిపి రెండు చేతులతో రెండు పద్మాలను ధరించి ఉంటాడు. ఇదొక రకమైన ధ్యానం. మరొక రకమైన ధ్యానంలో నాలుగు చేతులలో పైన రెండు చేతులతో శంఖచక్రాదులు, క్రింది రెండు చేతులలో రెండు పద్మాలు పట్టుకొని ఉన్న చతుర్భుజధ్యానం చూపిస్తున్నారు. కాని ప్రధానంగా ద్విభుజధ్యానమే ఎక్కువగా చెప్తారు.

ఆయన బంగారురంగుతో ప్రకాశిస్తూ ఉంటారు. **హిరణ్యశ్మశ్రుః** – గడ్డాలు మీసాలు ఉన్నాయి. అవి కూడా బంగారు రంగే. కాలికొనగోటి నుంచి పైన శిరస్సువరకూ బంగారురంగే. దీన్నే ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః – అలా బంగారుస్వామి అన్నారు. ఆ స్వామిని ధ్యానిస్తే హృద్రోగం హరిమాణం ఆశు నాశయతు – ఆశు అంటే వెంటనే పోగొట్టుగాక!

**నిమిషార్థేనైకేన ద్వేచశతేద్వేసహస్రే ద్వే క్రమమాణ** – ముందు శ్లోకంలో ఉదయిస్తున్న సూర్యుని స్తుతించి, దీనిలో అయన ఎంత వేగంతో ప్రయాణిస్తున్నాడో చెప్తున్నారు.

సగం రెప్పపాటు కాలంలోనే 2,200 యోజనాలు దాటే ఓ నళినినాథా! - పద్మాలను వికసింపజేసే స్వామీ! నీకు నమస్కారం. దీనిలో వైజ్ఞానికమైన అర్థం మునుపే చెప్పు కున్నాం.

**కర్మజ్ఞానఖదశకం మనసిచ జీవ ఇతి విశ్వసర్గాయ।**
**ద్వాదశధా యోవిచరతి సద్వాదశమూర్తి రస్తు మోదాయ॥**

స్వామీ! విశ్వనిర్వహణకోసం పన్నెండు రూపాలు ధరించి తద్వారా లోకానికి ఆనందం కలిగిస్తున్నావు.

ఈ ద్వాదశాదిత్యులని కాలాత్మకంగా చూస్తే సంవత్సర పురుషుడు ఆదిత్యుడు. ఆయన వల్లనే సంవత్సరం కలుగుతోంది.

సంవత్సరంలో చైత్రం మొదలుకొని చివరదైన ఫాల్గుణం వరకూ లెక్క వేసుకొంటే ఒక్కొక్క మాసంలో స్వామి ఒక్కొక్క రాశి సంక్రమణం చేస్తూ వస్తుంటే ఒక్కొక్క మాసంలో ఒక్కొక్క పేరుతో వ్యవహరింపబడుతుంటాడు.

**ఇంద్ర, ధాత, ఖగ, పూషా, మిత్ర, వరుణ, అర్యమ, అర్చి, వివస్వాన్, త్వష్టా, సవితా, విష్ణుః** అని మొత్తం పన్నెండు మంది ఆదిత్యులని చూపిస్తున్నారు.



ఖగ అనబడే సూర్యుడు చైత్రానికి, ధాత వైశాఖానికి ఇలా చిట్టచివరకు ఫాల్గుణ మాసానికి విష్ణువని ఒక్కొక్క మాసానికి ఒక్కొక్కరు మాసాధిపతులుగా వర్ణించడం శాస్త్రంలో కనపడుతుంది. ఇలా బయట చెప్తూ ఆ ఆదిత్యుడే మనలో ప్రాణాంశగా ఉంటాడు.

**నిర్గచ్ఛన్తోఽర్కబిమ్బాన్నిఖిలజనిభృతాం హార్దనాడీప్రవిష్టాః**
**నాద్యాం వస్వాదిబృన్దారకగణమధునస్తస్య నానాదిగుత్థాః**

అని అప్పయ్యదీక్షితులవారు అంటారు. సూర్యమండలంనుంచి మన హృదయ మండలంలోనికి శక్తి ప్రసరిస్తుంది. ఇది గొప్ప విజ్ఞానం. సూర్యుడు లేనప్పుడు మన బ్రతుకులు ఎలా ఉంటాయో ఊహించుకోవాలి. సూర్యోదయం వరుసగా కొన్ని రోజులు లేకపోతే రోగాలు వచ్చి ప్రాణశక్తి నశించిపోతుంది.

సూర్యుడు ఉంటేనే ప్రాణశక్తి. సూర్యుడు లేకపోతే ఉత్సాహమనేది ఉండదు. ఆయనే ప్రాణశక్తి ప్రదాత. ఆయన ఉదయించిన వెంటనే ఆయన్నించి వచ్చిన కిరణజాలాలలోంచి ప్రాణశక్తి సర్వజీవుల హృదయమండలంలో ప్రవేశించి అక్కడినుంచి రశ్ములు అనగా నాడులలోకి ప్రాణాలరూపంతో వెడుతూ శరీరమంతా ప్రకాశింప చేస్తుంది.

మనలోపల ప్రాణశక్తికి ఆదిత్యమండలానికి సంబంధం ఉంది. గగనమండలంలో

ఆదిత్యునికి హృదయమండలంలో ఆత్మకి ఉన్న అద్భుతమైన సమన్వయం దర్శించాలి. అది దర్శిస్తే అక్కడ పన్నెండు రూపాలతో కాలచక్రం నడుపుతూ, మనలో కూడా పన్నెండు చోట్ల కూర్చుని మన జీవితరథాన్ని నడుపుతున్నవాడు తెలియబడతాడు.

పన్నెండు మంది ఆదిత్యులు నడపకపోతే మన బ్రతుకులేదు. కర్మజ్ఞానఖదశకం - ఖ అంటే ఇంద్రియం అని అర్థం. ఖ దశకం అంటే పది ఇంద్రియాలు. కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు. వీటితోపాటు **మనశ్చజీవ**-మనస్సు, జీవుడు. అంతఃకరణ మంతా కలిపి ఒక్కటే మనస్సు.

వీటినన్నిటిని కలబోసుకొని **నేను భోక్తను** అనుకుంటున్న వాడు జీవుడు.

ఈ పన్నెండురకాల చైతన్యాలే బయట కనపడుతున్నవి. వీటన్నిటికి మూలమైన ఒకటుంది దాని వెలుగు పడితేనే ఇవన్నీ పనిచేస్తున్నాయి. ఇలా ప్రతి జీవుడిలో పది ఇంద్రియాలుగా మనస్సుగాను, జీవుడిగాను పన్నెండురూపాలతో నడుపుతున్న ఆదిత్య భగవానుడా! నీకు నమస్కారం అన్నారు.

ద్వాదశార్యాస్తుతిని ఇచ్చిన సాంబుడే సాంబపంచాదశి అనే గ్రంథంలో మొత్తం ఏభైశ్లోకాలు దానిలో దీనికి దగ్గర ఉన్న శ్లోకాన్ని చూస్తే

**యస్త్వక్చక్షుశ్రవణరసనాఘ్రాణపాణ్యంఘ్రివాణీ**
**పాయూపస్థస్థితిరపిమనోబుద్ధ్యహంకార మూర్తిః**
**తిష్ఠత్యంతఃబహిరపిజగద్భాసయన్ ద్వాదశాత్మా**
**మార్తాండం తం సకలకరణాధారమేకం ప్రపద్యే**

అన్ని కరణాలకు ఆధారమైన ఆదిత్యునకు నమస్కారం. ఈ భావంతో ప్రార్థిస్తే ఇంద్రియ లోపాలు ఉండవు. ఇంద్రియవైక్లబ్యం అంటే వికలాంగులవడం, మరొకటి వయస్సు పెరుగుతున్న కొద్దీ ఇంద్రియ పటుత్వం తగ్గిపోవడం వంటి బాధలు లేకుండా ఉండాలంటే ఈ స్తోత్రం అనుసంధానం చేసుకోవాలి.

ద్వాదశార్యాస్తుతిలో క్లుప్తంగా చెప్పి సాంబపంచాశికలో దీన్ని విస్తారంగా చెప్పారు. ఈ పన్నెండు మనలోనే కాదు బయటా ఉన్నాయి. ఇదే మనకి **అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః** అని స్పష్టంగా చూపిస్తున్నాయి. ఇలా ప్రపంచాన్ని భాసింపజేస్తున్న ద్వాదశాత్మవై, మార్తాండుడవై అన్ని ఇంద్రియాలకు ఆధారమైన నిన్ను శరణు వేడుతున్నాను స్వామీ! అంటాడు.

**త్వంసామఃత్వంయజురసి** దీన్నే మరొకపాఠంలో **త్వంహి యజూఋక్సామః** అని ఉంది

ఏది చదివినా ఫరవాలేదు. నువ్వే యజుస్సులవు. నువ్వే ఋక్ స్వరూపుడవు. నువ్వే సామరూపుడవు. ఋగ్యజుస్సామాలు ఆయన స్వరూపాలు ఎలా అయ్యాయనేది మునుపే వివరించుకొన్నాం

ఋగ్యజుస్సామరూపాలు ఎలా అయ్యాయి అన్నదానికి వేదప్రమాణం మళ్ళీ అద్భుతంగా కనబడుతున్నది.

స్వామి ఉదయిస్తున్నప్పుడు ఆయన మండలంలో మూడు రూపాలున్నాయి. అవే ఋక్కు, యజస్సు, సామములు.

దీనికి తైత్తరీయంలో...

**ఆదిత్యోవా ఏష ఏతన్మండలం తపతి**
**తత్ర తా ఋచః ఋచామండలం**
**స ఋచాం లోకోథ య ఏష ఏతస్మిన్ మండలేర్చిష్యతే**
**తాని సామాని చ సామ్నాంలోకః**

అని వేద ప్రమాణం. ఋగ్యజుస్సామవేదాత్మకుడవైన నీకు నమస్కారం. నువ్వు ఆగమ స్వరూపుడవు అంటే వేదాల భావనలు తెలియ చేసే ఇతర శాస్త్రాలు ఆగమాలు, మంత్ర శాస్త్రములు. అవి అన్నీ నీ స్వరూపములే.



వషట్కారం నువ్వు. వషట్కారం అనగా యజ్ఞ స్వరూపం. సూర్యుడే యజ్ఞస్వరూపుడు. యజ్ఞం అనగానే కేవలం అగ్నిహోత్రములో నేయి వేసేదే కాదు. నమస్కారములు, జపము కూడా యజ్ఞమే. ఇవన్ని సూర్యుని అధారం చేసుకున్నవే. ఆయన లేనిదే ఏం చెయ్యడానికి లేదు.

యజ్ఞమంతా సూర్యునికి సంబంధించినదే. సర్వదేవతాత్మకుడు సూర్యుడు. ఏ దేవతని ఆరాధించాలన్నా సూర్యునికే ఇవ్వాలి. ఆహుతులు తీసుకువెళ్ళి ఎవరైనా సూర్యమండలంలో ఇవ్వగలరా?

సూర్యునిలో ఉన్న అగ్నినే పొందుతోంది ప్రకృతి. దానిని మథనం ద్వారా మనం గ్రహించి యజ్ఞాగ్నిని రగుల్చుతున్నాం.

ఆ రగిల్చిన అగ్ని ఆ సూర్యుని స్వరూపమే అని భావన చేసుకుని ఆ పరమేశ్వరాగ్నిని సంస్కరించి అగ్నిహోత్రం చేసి దేవతలకు ఇవ్వవలసి నవన్ని అందులో వేస్తున్నాం.

అలా వేసిన హవిస్సుని అగ్నిహోత్రుడు తీసుకెళ్ళి సూర్యమండలానికి ఇస్తున్నాడు. అక్కడినుంచి వృష్టి కురుస్తోంది. ఆ వెళ్ళే విధానం చూస్తే ...

**అగ్నౌ ప్రాస్తాహుతిసమ్యక్ ఆదిత్యముపతిష్ఠతి**
**ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నాః తథాప్రజాః**

అని శాస్త్రాలు చెప్తున్నాయి. ఇది మనుస్మృతిలో వాక్యం. అగ్నియందు ఇవ్వబడిన ఆహుతులు అగ్నిదేవునిద్వారా ఆదిత్యమండలంలోకి వెళ్ళి తద్వారా సర్వదేవతలు పొంది మనకి వర్షరూపంలో ఇస్తున్నారు. వర్షమంటే నీరే కాదు– సంపదలు కూడా.

సర్వదేవతలు యజ్ఞాలద్వారా అనుగ్రహించి సంపదల రూపములో మనకి ఇస్తారు. ఆదిత్యునికి ఇస్తే ఇది అందరికి వెడుతోంది అని చెప్పడం ఆయన సర్వదేవతాత్మకుడు. ఇక్కడే స్పష్టంగా తనస్వరూపాన్ని చూపిస్తున్నారు. యజ్ఞాలస్వరూపమే ఆదిత్యుడు. ఇది తెల్సి ఆదిత్యునికి నమస్కారం చేస్తే అదే ఎన్నో యజ్ఞాలు చేసినంత ఫలితం.

**వషట్కారః** అంటే యజ్ఞస్వరూపుడు.

త్వం విశ్వం త్వం హంసః త్వంభానో పరమహంసశ్చ – హంస, పరమహంస అనే శబ్దం వాడేటపుడు స్వామీ! నువ్వు కాంతిస్వరూపుడవై గమనం చేయువాడవు. **గతి అర్థంతో హంస** శబ్దం చెప్పబడుతోంది. పరమహంస కేవల జ్ఞానస్వరూపుడవని చెప్పడం. హంస అంటే శ్వాసరూపం, ప్రాణరూపం. ఇలా బహురూపాలతో భాసించువాడు.



**శివరూపాత్ జ్ఞానమహం త్వత్తోముక్తిం జనార్దనాకారాత్**
**శిఖిరూపాదైశ్వర్యం త్వత్తశ్చారోగ్యమిచ్ఛామి**

స్వామీ! నువ్వు శివరూపంతో జ్ఞానం ఇస్తావు. శివాయగురవేనమః. శివస్వరూపంగా భావిస్తే ఆయన మనకి జ్ఞానాన్ని ఇస్తున్నాడు లేదా మనం సూర్యుని ఆరాధిస్తే శివరూపంతో జ్ఞానం ఇస్తాడు.

జనార్దనునిరూపంతో ముక్తిని ఇస్తావు. శివుడు ముక్తిని ఇవ్వడా అంటే శాస్త్రం ప్రకారం జ్ఞానమే ముక్తి. జనార్దనుడు అంటే జనులచే అర్థింపబడేవాడని అర్థం చెప్పారు. సర్వజనులని ప్రళయకాలంలో లీనం చేసుకొనేవాడు అదీ రుద్రతేజమే.

అగ్నిరూపంతో ఐశ్వర్యాన్ని ఇస్తావు. అగ్నినారయిమశ్నవత్ అని వేదవాక్యం చెప్తున్నది. అగ్నిభట్టారకుడే ఐశ్వర్యాన్ని ఇస్తాడు. ఆ అగ్నిభట్టారకుని రూపమే ఆయన. ఆయనలేనిదే అగ్ని ఎక్కడుంది?

సూర్యుని ప్రత్యేక దేవతాస్వరూపంగా చెప్తున్నప్పుడు ఆరోగ్యాన్ని ఇస్తున్నావు. ఆయనే నాలుగు రూపాలతో జ్ఞానం, ఐశ్వర్యం, మోక్షం, ఆరోగ్యం ఇవన్నీ ఇస్తాడు.

శివుడు–సూర్యుడు. శివునికి జ్యోతిర్లింగమని పేరుంది.

జ్యోతిర్లింగాలు అంటే క్షేత్రాలయందు ఉన్నాయని అనుకుంటాం అవి కాదనికాదు కాని, అసలు సూర్య భగవానునికే జ్యోతిర్లింగమని పేరు. మరి శివుడో? శివుడే సూర్యుడని స్పష్టంగా చెప్తున్నారు.

**ఆదిత్యంచ శివం విద్యాత్ శివమాదిత్యరూపిణం।**
**ఉభయోరంతరం నాస్తి ఆదిత్యస్య శివస్యచ॥**

అని కృష్ణుడు అర్జునునితో చెప్పిన మాట. సూర్యమండలంలో ఉన్నవానిని ఎలా ధ్యానించాలయ్యా అంటే

**హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయ హిరణ్యరూపాయ హిరణ్యపతయ**
**అంబికాపతయే ఉమాపతయే పశుపతయే నమో నమః (యజుర్వేదం)**

ఈ మాట తీసుకొని అప్పయ్యదీక్షితులవారు చెప్తూ

**ఆదిత్యే మణ్డలార్చిః పురుషవిభిదయాద్యన్తమధ్యాగమాత్మ**
**న్యాగోపాలాఙ్గనాభ్యో నయనపథజుషా జ్యోతిషా దీప్యమానమ్।**
**గాయత్రీమన్త్రసేవ్యం నిఖిలజధియాం ప్రేరకం విశ్వరూపం**
**నీలగ్రీవం త్రినేత్రం శివమనిశముమావల్లభం సంశ్రయామి॥**



అన్నారు. అది ఆదిత్యస్తోత్రరత్నంలో చివరశ్లోకం. ఆదిత్యుని యందు మండల - మండలంగాను, అర్చిః - వెలుగుగాను, పురుషః - పురుషుడుగాను ఉంటూ అందరిచేత చూడబడుతూ గోపాలాంగనాభ్యో - **ఉతైనంగోపా అదృశన్నదృశన్ఉదహార్యః.**

ఆయన గాయత్రీచే ప్రతిపాదింపబడిన బ్రహ్మ, విష్ణు, శివుడని అన్ని ప్రతిపాదనలు ఉన్నాయి. **భర్గః** అనేది శివనామం.

అది గాయత్రియందు స్పష్టంగా కనపడుతోంది. నీలగ్రీవం - నీలకంఠుడు. **త్రినేత్రం** - మూడు కన్నులు గలవాడు. ఆ సూర్యుడే చంద్ర, అగ్ని, సూర్యదృక్కులతో ఉన్న మూడు కళ్ళవాడు.

**శివం అనిశం ఉమాపతయే నమోనమః** అని ఆ మంత్రమంతా అక్కడ చూపిస్తున్నాడు.

## సూర్యలింగం

సూర్యుని లింగం అని అనాలి. చాలా మంది శివలింగమే లింగం మిగిలినవి కాదను కొంటారు. ఒక దేవతని ఒక మూర్తితో చెప్పేటప్పుడు దానిని లింగమంటారు. పాండు రంగడిని స్తుతిస్తూ శంకరభగవత్పాదులవారు **పరబ్రహ్మలింగం భజే పాండురంగం** అన్నారు. పరబ్రహ్మ స్వరూపం అనే భావనతో చెప్పారు.

లింగమంటే రూపం, మూర్తి, చిహ్నం అని అర్థాలు. ఒక దేవతని ఫలానారూపంతో ఆరాధించేటప్పుడు అది ఆయనకి లింగమౌతుంది. ఇది శాస్త్రం.

శివునికి లింగస్వరూపం ప్రసిద్ధిగా చెప్పబడుతోంది. సూర్యునిని కూడ లింగమంటారు. సూర్యుడు కూడా శివలింగాకారంలోనే ఉంటాడు.

బిందువు ఆకృతిలో ఉంటాడు. బిందువంటే శ్రీచక్రానికి ఆధారం మధ్యలో బిందువే. బిందువంటే నిజానికి వృత్తమే. సంక్షిప్తమైపోయిన వృత్తమే బిందువు. బిందువు విస్తరిస్తే వృత్తమే.

శ్రీవిద్యారహస్యం తెల్సిన ఒక ఆయన అద్భుతమైన వ్యాఖ్య చేసారు.

శ్రీచక్రంలో ఉన్న బిందువుని దాని నుంచి పైకి లాగితే ఒక స్తంభంలా బారు సాగుతుంది. ఆ బిందువుని అలా బారుగా పైకి లాగినపుడు అగ్నిస్తంభలింగంగా మారింది అన్నాడు. ఆ బిందువే లింగం. ఆ బిందువు చుట్టూ ఉన్న త్రికోణమే ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకమైన పానవట్టం. అదే వియచ్చక్రం. అదే సూర్యమండలము నందు ఉంది.

సూర్యమండలమే శ్రీచక్రమనే భావన రావాలి. ఉపాసనా బలం ఉంటే దర్శనం లభిస్తుంది. అదే వియచ్చక్రం. అదే దహరచక్రం. ఉపనిషత్తుల్లో చెప్పిన దహరవిద్యే శ్రీవిద్యోపాసన విద్యాతంత్రంలో ఉంది.



ఆ సమన్వయం చేతనై ఆ దృష్టితో ఒక్కసారి చూస్తే...

**పాశాంకుశధనుర్బాణధరాం అరుణవిగ్రహాం**
**సూర్యమండల మధ్యస్థాం ధ్యాయే త్రిపురసుందరీం**

వేదంలో గౌరీ అనే పేరు సూర్యునికి చెప్పారు. గౌరీ అంటే మహాతేజస్స్వరూపం. తేటయైన కాంతిని గౌరీ అంటారు. స్వచ్ఛమైన కాంతి కలది. అమ్మా! అని పిలిస్తే సూర్యుడు వెంటనే అనుగ్రహిస్తాడు. అక్కడ లలితామహాత్రిపురసుందరిని ధ్యానించాలి. లింగము అనాలంటే దానిలో మొత్తం ఏభైఐదు రుద్రకళలు కలవాలి. జ్యోతిర్లింగమనే మాట ఎక్కడ్నించి వచ్చిందో పరిశీలిస్తే...

**ఏకే చ పంచాశద్రుద్రా యత్రసమాశ్రితాః।**
**తదేకం లింగమాఖ్యాతం తత్రేదం సర్వమాస్థితం॥**

అని శాస్త్రం చెప్తున్న నిర్వచనం. ఒక లింగం అనాలంటే దానిలో ఏభై ఐదు రుద్రకళలు ఉండాలి. 5 X 11 =55. ఈ ఏకాదశతత్త్వమే ప్రపంచమంతా వ్యాపించి ఉంది. విశ్వమంతా రుద్రమయం.

ఈ ప్రపంచమంతా అధియజ్ఞం, అధిభూతం, అధ్యాత్మము, అధిదైవము, అంతరిక్షం.

అధియజ్ఞం - యజ్ఞసంబంధంగా పదకొండుమంది రుద్రులు ఉంటారు. ఇందులో ఒక్కొక్క రుద్రుడికి మూడేసి పనులు ఉంటాయి.

**1.సమ్రాట్ 2.విభు 3.అవస్యు 4.అంధారి 5.ఉక్షిక్ 6.బుధ 7.వహ్ని 8.స్వాత్ర, 9.శుంధ్యు, 10. అహిర్బుధ్న్య 11.అజ ఏకపాత్.** వీటికి ఒకోదానికి మూడేసి పేర్లు ఉన్నాయి.

ఇక అధిభూతంగా- అంటే మనం చూస్తున్న భూతాలు ఇవి పృథ్వీ, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, ఆత్మ, పవమాన, పావక, శుచి. ఇవి కనపడే పదకొండు రుద్రులు.

అధ్యాత్మయజ్ఞం - అంటే మన శరీరంలో అని అర్థం. ఈశ్వరుడు అధియజ్ఞముగా యజ్ఞమునందు, అధిభూతముగా భూత సృష్టియందు ఉంటాడు, అధ్యాత్మంగా మన యందు ఉంటాడు. అధిదైవముగా దేవతలుగా ఉంటాడు. అంతరిక్షమునందు ప్రకాశిస్తూ ఉంటాడు. ఇది వేదము చెప్పే దేవతాతత్త్వం.

అధ్యాత్మంలో శ్రోత్ర, చక్షు, నాస, వాక్కు, నాభి, ఉపస్థ, వాయు, ఆత్మా, ప్రాణ



అధిదైవము- దేవతలుగా పదకొండు రుద్రులు విరూపాక్షుడు, భైరవుడు, నకులీశుడు, సేనాని, త్ర్యంబకుడు, సవితా, జయంతా, పినాకీ, అపరాజితా, అహిర్బుధ్న్య, అజేకపాత్

అంతరిక్షంలో - మహా జ్యోతిర్మండలములుగా, మహాజ్యోతిశ్శక్తులుగా ఉన్న పదకొండు రుద్రులు భ్రాజమాన, వ్యవధాత, వాసుకి, వైద్యుత, ధ్రువ, పురుష, శ్యామ, కపిల, అతిలోహిత, ఊర్ధ్వ, అవపత .

అధియజ్ఞం, అధిభూతం. అధ్యాత్మం, అధిదైవం. అంతరిక్షం ఐదింట్లో పదకొండు రుద్రులు చొప్పున మొత్తం 55 రుద్ర కళలతో ప్రపంచమంతా నిండి ఉన్నాడు ఈశ్వరుడు - ఈశావాస్య మిదం సర్వం.

ఈ 55 కళలన్ని ఒక్క చోట ఉంటే దానిని లింగం అనాలి. ఒక్క చోట ఎవరైనా పెట్ట గలరా? విశ్వమంతా కలిపి ఉంది కనుక విశ్వమంతా ఏకలింగం.

**అపాతాళ నభస్థలాంత భువన బ్రహ్మాండమావిస్ఫురత్ జ్యోతిస్ఫాటికలింగం**

ఎక్కడో కనపడని అధోలోకాల నుంచి ఊర్ధ్వలోకాల వరకూ ఈ 55 రుద్రకళలతో వ్యాపించియున్న విశ్వమే ఒక మహాలింగం.

**లోకం లింగాత్మకం జ్ఞాత్వా యోర్చయేత్ శివలింగకమ్** - లోకం లింగాత్మకం అని

తెలిసి ఎవరు శివలింగాన్ని ఆరాధిస్తారో వారు ఇహము, పరము, పరమార్థం పొందుతారని శాస్త్రం చెప్పింది. ఈ 55 రుద్రకళలు విశ్వంలోనే కాకుండా సమగ్రంగా సూర్యుని యందు ఉన్నాయి. కనుకనే సూర్యుని జ్యోతిర్లింగం అన్నారు. ఆయన సంవత్సరకాలంలో నెలకు ఒక్కొక్క పేరుతో చెప్పబడుతున్నాడు కనుక ద్వాదశజ్యోతిర్లింగస్వరూపుడు. ఆ ద్వాదశ జ్యోతిర్లింగాలే మనలో **కర్మ జ్ఞానకఖదశకం మనశ్చ జీవఇతి విశ్వసర్గాయ**. మనలో ద్వాదశ ఇంద్రియాలయందు ఆ జ్యోతిర్లింగాలే ఉన్నాయి. జ్యోతిర్లింగతత్త్వం సూర్యభగవానుడు. ప్రాతఃకాలంలో మొట్టమొదట మనం ఆకాశమండలంలో జ్యోతిర్లింగమైన శివుని చూస్తున్నామనే భావన రాగానే

**నమశ్శివాయ సాంబాయ సగణాయ ఆదిహేతవే।**
**రుద్రాయ విష్ణవే తుభ్యం బ్రహ్మణే సూర్యమూర్తయే॥**

అని శివపురాణంలోని మంత్రం. ఇది స్వయంగా శివుడు దేవతలతో చెప్తూ "నన్ను ఆదిత్య మండలంలో ధ్యానిస్తే తొందరగా వాళ్ళని అనుగ్రహిస్తాను" అంటూ ఉపదేశించిన మంత్రం.

పద్మపురాణంలో కూడా ఆదిత్య మండలంలో నన్ను ధ్యానిస్తూ ఆరాధన చేసేవారు నాలో ప్రవేశిస్తారు. గృహం గృహపతిర్యథా. గృహ - గృహయజమాని ఇంట్లో ప్రవేశించినంత సులభంగా నాలో ప్రవేశిస్తారని శివుడు చెప్పిన మాట. శివసాయుజ్యానికి సూర్యమండలాన్ని శివరూపంగా భావించి ఆరాధించడం ప్రధానమార్గంగా చూపిస్తున్నారు అప్పయ్యదీక్షితుల వారు. శివునిగానే కాదు విష్ణువుగా

**'ఆదిత్యాభిముఖోధీయానః పంచపాతకోపపాతకాత్ ప్రముచ్యతే సర్వవేదపారాయణ పుణ్యం లభతే'** అని నారాయణసూక్తం చెప్తోంది. ఆదిత్యాభిముఖుడై విష్ణుస్వరూపంగా భావిస్తే విష్ణువుతో తాదాత్మ్యం చెందుతున్నారు. అలాగే అమ్మవారినికూడా తలంచవచ్చు.

సూర్యుడు ఉదయించుతున్నప్పుడు నలభై నిమిషాలలోపల జలము తీసుకుని గణపతిని భావన చేస్తూ సూర్యునికి సమర్పణ చేస్తే సూర్యమండలం నుంచి గణపతి అది అందుకుని సర్వ అనర్థాలూ పోగొడతాడు. ఆదిత్యమండలస్థాన గాయత్రీరూపిణి - గాయత్రీరూపంతో ఎల్లవేళ్లలా ఆ సూర్య మండలంలో ప్రకాశిస్తూ **తత్సవితుః వరేణ్యం భర్గః** గా ఉన్నది ఆ తల్లే. సూర్యభగవానుడు సర్వదేవతాస్వరూపుడు.

**శివరూపాత్ జ్ఞానమహం త్వత్తోముక్తిం జనార్దనాకారాత్**
**శిఖిరూపాదైశ్వర్యం తత్తశ్చారోగ్యమిచ్ఛామి** అని నమస్కారం చేసుకోవాలి.

తరువాత శ్లోకాలలో రకరకాల రోగాలను స్వామి ఎలా పోగొడతాడో చెప్తున్నారు. దీనిని బట్టి ఈ స్తోత్రం ఎంత నిత్య పారాయణ యోగ్యమో తెలుస్తున్నది.

**త్వచిదోషాః దృషిదోషాః హృదిదోషాయేఖిలేంద్రియజదోషాః**
**తాన్ పూషా హత దోషః కించిద్రోషాగ్నినా దహతు**

మనకు రకరకాల దోషాలు ఏర్పడడమే రోగాలు. ఒక రోగం కలిగినప్పుడు ఆ రోగాన్ని మించిన రోగం లేదు. అది తగ్గి పోతే బాగుండును అనుకుంటాం. శరీరానికి ఎన్ని రకాల బాధలుంటాయో చూపిస్తున్నారు. త్వచిదోషాః - చర్మానికి సంబంధించిన దోషాలు, దృష్టిదోషాః -దృష్టికి సంబంధించిన దోషాలు, హృదిదోషాః - హృదయానికి సంబంధించిన దోషాలు ఇలా ఒక్కొక్క ఇంద్రియం చెప్తూ అఖిలేంద్రియజ దోషాః - సమస్త ఇంద్రియముల నుంచి కలిగే సమస్త దోషాలను కూడా ఆదిత్యభగవానుడు దహించుగాక!.

ఆదిత్యుడు అంటేనే వేడి ఉంది కనుక దహిస్తాడు. కాని నిజానికి ఆయన వెలుగు పడుతూ ఉంటే మనం దహింపబడటం లేదు. వెలుగుని, శక్తిని కూడా పొందుతున్నాం కాని అనేక సుకుమారమైనవి మాత్రం సూర్యకాంతిలో దహింపబడుతూనే ఉన్నాయి. ఒక్కొక్కసారి తన తీవ్రత పెరిగినప్పుడు మనలాంటి జీవులు కూడా దహింపబడుతూ ఉంటారు.



కాని ఆయన చూపులో దహించేటట్లు చూడమని అడుగుతున్నారు. **కించిత్ రోషాగ్నినా దహతు** - ఓ స్వామీ! కించిద్ నీ రోషాగ్నితో మా దోషాలు, అంటే ఆరోగ్యపరమైన దోషాలను దహించు. భగవానునికి కూడా రోషం కావాలి. రోషం అంటే క్రోధజనితమైన అంశం. కొన్ని దహనం చేయ్యాలంటే వేడి కాస్త ఎక్కువ చెయ్యాలి.

నాలో ఉన్న రోగాలను పోగొట్టాలంటే నీ దాహక శక్తిని పెంచి వీటిని దహింప చెయ్యి అన్నారు. భగవానుని రోషాన్ని వైదిక భాషలో **మన్యువు** అని చెప్తారు. భగవానుని మన్యుశక్తిని ప్రార్థిస్తున్నారు. మన్యుశక్తికి దోషాలను తొలగించే శక్తి ఉంటుంది. మన్యుసూక్తపారాయణమని ప్రత్యేకించి చేస్తారు కదా!.

ఈశ్వరాగ్రహం వికార జనితమైన కోపం కాదు.అది క్షేమం కోసమే, ధర్మరక్షణ కోసమే చూపిస్తున్న ఆగ్రహం కనుక అది ఒక దేవత అయ్యింది. అది మన్యుసూక్తం అయినది. ఇది పారాయణ చేసి దోషాలు పోగొట్టుకుంటున్న వారు ఇప్పటికి ఉన్నారు.

రుద్ర నమకంలో మన్యువుతోనే ప్రారంభం చేసుకుని రోగాలు పోగొట్టుకుంటున్నారు. రుద్ర శబ్దానికి రుజాం ద్రావయతీతి రుద్రః - రోగనాశకుడు అని అర్థాలు చెప్తున్నారు.

భగవానుని తనదైన ఒక తీక్షణమైన చూపు చూడమని ప్రార్థిస్తే రోగాలు దహించుకు పోతాయి. మాములుగా రోగాలు పోవాలంటే వాడేవి ఔషధాలు. ఔషధాలు అంటే ఓషధుల నుంచి తయారైనవే కదా. ఓషధి అన్నా దహించునది అని అర్థం.

ఉషా-ఓషధి ఈ రెండూ ఒకే ధాతు జన్యమైన శబ్దాలు. **ఉషదాహే** అనే ధాతువు ప్రకారంగా దహించే లక్షణం కలదే ఉషః.

ప్రాతఃకాలంలో ముందు వచ్చే ఉషస్సులో ఒక చక్కని వేడితనం ఉంటుంది. ఉషః కాలానికే రోగాలను దహించే శక్తి ఉంది. ఆ ఉషఃకాల లక్షణమే **దహాతు** అని మాటలో చూపిస్తున్నారు. రోగాలను దహించే శక్తి దానిలో ఉంది కనుక దానికి **ఔషధి** అని పేరు.

**రోషాగ్నినా దహాతు** అంటే తన ఓషధీ రూపమైన శక్తితో **మా రోగాలను పోగొట్టుగాక!** అని భావం. సూర్యునికి దణ్ణం పెడితే పోతుందా! ఔషధాలు వాడక్కర్లేదా! అంటే నిజానికి రోగాలకి ఔషధ సేవనం అక్కర్లేకుండానే సూర్యోపాసన వల్ల తగ్గే అవకాశాలు ఉన్నాయి. ఒక వేళ ఔషధం అవసరమైతే సూర్యునికి నమస్కరించడం చేత సరైన ఔషధం దొరికేటట్లు, దొరికిన ఔషధం పనిచేసేటట్లు కూడా జరుగుతుంది.

కేవలం భౌతిక ప్రయత్నాలు చేస్తే చాలదు. ఎందుకంటే భౌతిక ప్రయత్నాల వల్ల మనం అన్నీ సాధించలేమని తెలుస్తూనే ఉంది. అయితే భౌతిక ప్రయత్నం వ్యర్థమ వ్వచ్చేమో గాని భగవత్ప్రార్థన ఎప్పుడూ వ్యర్థంకాదు. భగవంతునికి మొక్కిన మొక్కు ఎప్పుడూ వ్యర్థం కాదు అది శాస్త్రం. మనం వాడే మందు పని చెయ్యక పోవచ్చు. కాని మనం చేసే నమస్కారం మాత్రం వ్యర్థంకాదు.



మొక్కిన వరమీయని వేల్పులు ఉండరు. మన నమస్కారంలో త్రికరణ శుద్ధి ఉంటే తత్క్షణమే ఫలితం ఉంటుంది. శ్రద్ధాపూర్వక నమస్కారం. శ్రద్ధ అంటే అఖండమైన విశ్వాసం. అలాంటి విశ్వాసంతో చేసే నమస్కారానికి వెంటనే స్వామి అనుగ్రహం ఉంటుంది. ప్రధానంగా మూడు దోషాలను చెప్పడంలో ప్రత్యేకత – చర్మానికి , కంటికి, గుండెకి ఈ మూడింటికి ప్రధానంగా సూర్యారాధన పరిష్కారం అవుతుంది. ఈ రోగాలకి సూర్యనమస్కార ప్రక్రియల ద్వారానే విమోచనం కల్పించుకోవచ్చు. ఇప్పటికీ ఇది సాధ్యమే. దీనికి సంబంధించిన మంత్రరాశి వేదంలో ఉంది. చర్మానికి సంబంధించిన మంత్రాలు గాని, కంటికి సంబంధించిన మంత్రాలు గానీ చెప్తారు.

సూర్యుడు చర్మదోషాలను పోగొడతాడు అన్నారు. దీనికి సంబంధించి పద్మపురాణంలో

ఒక అద్భుతమైన కథ చూపిస్తారు. మధ్య దేశంలో భద్రేశ్వరుడు అనే రాజు ఉండేవాడు. ఈయన మంచి సుందరాంగుడు. చక్కని పాలన చేస్తున్నాడు.

కొంతకాలం తరువాత రాజుకి భయంకరమైన శ్వేతకుష్ఠ అనే చర్మ వ్యాధి వచ్చింది. దానితో ఆయన బాధపడుతూ మంత్రులను పిలిచి నేను ఇంతకాలం చక్కని అందగాడైన రాజుగా పేరు పొందాను ఇప్పుడు ఇలా సింహాసనం మీద కొనసాగడం నాకు ఇష్టం లేదు. నా పుత్రులకి రాజ్యభారం అప్పచెప్పి నేను రాజ్యం విడిచి వెళ్ళి పోతాను.

నాకు తెలుసు, పాప ఫలితంగానే రోగం వస్తుంది. పూర్వజన్మకృతంపాపం వ్యాధి రూపేణపీడితం - అదే వ్యాధి రూపంలో బాధిస్తుంది.

**తత్‌శాంతిః ఔషధైః దానైఃజప హోమ సురార్చనైః** అని శాస్త్రం చెప్తోంది. దానిని శాంతింప చెయ్యడానికి ప్రయత్నాలు ఉంటాయి. కానీ నాకు ఈ వ్యాధి రోజు రోజుకి వర్ధిల్లుతున్నది. పరిష్కారం తెలియడం లేదు.

పాపం వల్ల వచ్చినది అని తెలుసు. వ్యాధిని పోగొట్టుకునే ప్రయత్నం కంటే ఇప్పుడు పాపాలను పోగొట్టుకునే ప్రయత్నాలను చెయ్యాలి. తరువాత జన్మలు ఏం ఉంటాయో నాకేం తెలుసు. పుణ్యపాప మిశ్రమమే జీవితం. పుణ్యఫలం ఇంతవరకు అనుభవించాను, ఇంక పాపం తనఫలం ఇవ్వడం మొదలు పెట్టింది.



నేను దేశం విడిచి వెళ్ళిపోయి ఏదో ఒక క్షేత్రంలో సాధన చేస్తూ ప్రాయోపవేశాది దీక్షలతో ఐచ్ఛికంగా నా అంతట నేను ఈ శరీరాన్ని త్యజిస్తాను. అప్పుడు ఆత్మహత్యాదోషం రాదు. ఈ శరీరాన్ని నేను భరించలేను. ఎవరిముందు మసలలేను అని అనగానే వెంటనే మంత్రులు, పురోహితులు ఆయనకి ఒక సలహా ఇచ్చారు.

"నువ్వు ఎక్కడికి వెళ్ళనక్కరలేదు. సూర్యుని ఆరాధించు. కొంతకాలం రాజ్యభారం పిల్లలకి అప్పచెప్పి ఏకాంతంగా సూర్యారాధన చేసుకో" అని సూర్యుని ఆరాధించడానికి సులభమైన పద్ధతి చెప్పే గురువుల వద్ద మంత్రదీక్ష తీసుకొన్నాడు.

ప్రాతఃకాలం లేవడం, సూర్యునికి నమస్కరించడం, ఆయన్ని ఉద్దేశించి మంత్రం చెయ్యడం. సూర్యమంత్రాలు చాలా చాలా శాస్త్రాలలో ఉన్నాయి. మహా బీజాక్షరాలతో వేద పద్ధతులలో కేవలం గురు ఆశ్రయం ద్వారా తెలుసుకోవలసినవి కొన్ని అయితే, పుస్తకాల ద్వారా తెలుసుకుని కాస్త పెద్దవారికి చెప్పి చేసుకోవలసిన మంత్రాలు కొన్ని ఉన్నాయి.

గురువు ద్వారా పొందిన చిన్న మంత్రమైనా దాని శక్తి వేరు. అలా ఒక మంత్రాన్ని

ఆయన గురువు ద్వారా స్వీకరించి ఏకాగ్రంగా అనుష్ఠానం చెయ్యడం మొదలు పెట్టాడు. అతనికి కొన్నిరోజుల్లోనే పరిణామం వచ్చింది. కాని ఆయన నిష్ఠగా సంవత్సరం పాటు దానిని పాటించడంతో మొత్తం రోగమంతా నయమైంది.

దానితో తన రాజ్యంలో ప్రతిఇంట్లో కూడా ఆదిత్య ఆరాధన జరగాలని చాటింపు వేయించి ఒక నియమం పెట్టాడు. తాను బాగుపడితే లాభం లేదు. తన రాజ్యం అంతా బాగుండాలని కోరిక. అలాంటి శాసనం చేసి రాజ్యంలో మొత్తం అందరూ సూర్యభక్తులు అయ్యేలా చేసాడు.

సంవత్సరాంతంలో రాజుకి సూర్యభగవానుడు తనంతతాను ప్రత్యక్షమై నీకు ఇహంలో సుఖమే కాదు, అంతమందు నా దివ్యధామమునకు చేరతావని వరం ఇచ్చాడు. సూర్యలోకం ఒకటి ఉంది. పంచాయతనంలో ఐదుగురికి సమ ప్రాధాన్యం చెప్పబడు తోంది. సూర్యలోక వర్ణన శాస్త్రంలో చెప్పబడుతోంది. సాత్త్వికభక్తితో చేసేవారు సాలోక్యాది మోక్షములు పొందుతారు. జ్ఞానం కోసం స్వామిని ఆశ్రయిస్తే చిత్తశుద్ధిని, క్రమంగా సాయుజ్యముక్తిని కూడా ప్రసాదిస్తాడు.

భద్రేశ్వరునికి ఇహము, పరము సూర్యారాధన వల్ల కలిగిందని పద్మ పురాణంలో ప్రత్యేకించి సూర్యారాధన పద్ధతులు కొన్ని చెప్పారు. ఇది పురాణకథ.



అంతే కాదు ఇక్కడ కొన్ని మంత్రాలు కూడా చెప్పబడుతున్నాయి.

శ్రీ సూర్యాయనమః అనే మంత్రం. దీనికి కొన్ని బీజాక్షరాలు ఉంటాయి.అవి సభలలో చెప్పే కాగితాల మీద వ్రాసుకుని చేసేవికావు. సరైన గురువుని ఆశ్రయించి పద్ధతి ద్వారానే చెయ్యాలి. కాని **శ్రీ సూర్యాయనమః** నామానికి కూడా శక్తి ఉంది.

**శ్రీ సూర్యాయ ఖఖోల్కాదిత్యాయ నమః** అని ఒక మంత్రం చెప్పారు. **ఖఖోల్కాదిత్యాయ** అనగా ఆకాశమందు తేజఃపుంజముగా ప్రకాశించేది. ఖఖోల్కాదిత్య లింగం కాశీక్షేత్రంలో ఉంది. సూర్యగాయత్రిలో కూడా రకరకాలుగా చెప్పబడుతున్న మంత్రరాశి ఉంది.

మహాపాప జీవనులైనా పశ్చాత్తాపం చెంది, అక్కడనుంచి ఆ పాపాచరణ మానివేసి ఆహారాది నియమాలు పాటిస్తూ ఆదివారం రోజున సాధ్యమైనంత ఉపవాసంచేసి సూర్యా రాధన చేస్తూ సూర్యుని పట్ల ప్రవర్తించవలసిన సదాచారములు చేస్తే ఆ పూర్వ పాపాల నుంచి కూడా వారు శుద్ధులై తరువాత సద్గతులకు అర్హులవుతారని పద్మ పురాణములో ఒక కథ ద్వారా చెప్పారు.

ఒక వేశ్య చాలాకాలం నీచమైన వృత్తిలో ఉండి శరీరాన్ని పోషించుకున్నానే అని

సిగ్గుపడి ఇంక ఆ వృత్తిని మాని సద్గురుని ఆశ్రయించి ఆదివారం దీక్ష తీసుకుని భక్తి శ్రద్ధలతో సూర్యారాధన చేసింది.

ఆమె సూర్యానుగ్రహం పొంది అనేకమంది చూస్తూ ఉండగా సూర్యలోకంలోనికి సూక్ష్మదేహంతో ప్రవేశించే ఘట్టం కూడా పద్మపురాణంలో రమ్యంగా వర్ణించారు.

## సూర్యమందిర మహిమ

ఇటీవల కొద్ది దశాబ్దాల క్రితం జరిగిన అద్భుతమైన ఘట్టం ఒకసారి స్మరించుకుందాం. ప్రాతఃస్మరణీయులైన మహాత్ములు శ్రీకాకుళం ప్రాంతంలో శ్రీ ఈశ్వరసత్యనారాయణ శర్మగారని ఉండేవారు. ఈయన శ్రీవిద్యాసంప్రదాయంలో మహర్షి, అమ్మవారి సాక్షాత్కారం పొందినవారు. శ్రియానందనాథ అని ఆయనకి దీక్షానామం.

శాస్త్రిగారు చిన్నతనంలోనే వారి తండ్రిగారి దగ్గర దక్షిణామూర్తి మంత్రాన్ని స్వీకరించి జపం చేసుకుంటూ ఉండేవారు. ఈయన తండ్రిగారు ఆయుర్వేద వైద్యులు, సంస్కృత పండితులు, మంచి ఉపాసకులు, వేదవేత్త.

మొదట్లో ఇంగ్లీష్ చదువులు చదివిస్తున్నా తండ్రిగారు ఆయనతో 'ఆయుర్వేద విద్య నేర్చుకోవాలి, సంస్కృతం నేర్చుకుంటేనే గాని ఆయుర్వేదం పరిపూర్తి కాదు ఇంక ఆంగ్ల అభ్యాసం మాని సంస్కృతం నేర్చుకో' అంటూ సంస్కృతం నేర్పుతూ ఆయుర్వేదంలో ఇతనిని దిట్టని చేసారు.

సత్యనారాయణశర్మగారి చిన్నతనంలో ఒకసారి చాతుర్మాస్యాలకు ఒక యోగి ఆ ప్రాంతానికి వచ్చాడు. శర్మగారు సంప్రదాయ కుటుంబంవారు కనుక ఆ యోగికి దీక్షా వందనం చేసారు. ఆ యోగి శర్మగారిని తీసుకుని వెళ్ళి అరసవల్లి క్షేత్రం దగ్గర తటాకంలో స్నానం చేయించి సూర్యమంత్రోపదేశం చేసారు.

సత్యనారాయణశర్మగారు ఆ మంత్రాన్ని అనుష్ఠానం చేస్తుంటే కొంతకాలానికి ఒక అనుభవం జరిగింది. ఒకసారి వాళ్ళ అమ్మగారికి చర్మవ్యాధి వచ్చింది. మచ్చలు కనపడు తున్నాయి. ఆవిడ సిగ్గుతో బాధపడుతుంటే తండ్రిగారికి కూడా దుఃఖం కలిగిందిట. ఆయుర్వేద వైద్యంలో నిపుణులు కనుక తోచిన వైద్యాలు ఎన్నో చేసారు గానీ ప్రయోజనం కనపడటం లేదు.

వెంటనే నాకు గురువులు అనుగ్రహించిన సూర్యమంత్రం ఉంది. ప్రక్కన సూర్య నారాయణ స్వామి ఉన్నారు కనుక నా ప్రయత్నం నేను చేస్తానని ప్రాతఃకాలంలో వాళ్ళ అమ్మగారి పేరు మీద సూర్యనారాయణస్వామి ఆలయంలో జపం చేసేవారు. తల్లిగారు

ప్రదక్షిణలు చేసేవారు. ఇలా మూడు రోజులు చేసే సరికి నాల్గోరోజు ఏ మచ్చా లేకుండా చర్మం మళ్ళీ యథాస్థితికి వచ్చేసింది అని ఆయన స్వయంగా వ్రాసుకొన్నారు.

ఆయన సౌరమంత్రాలను చాలా చక్కటి తెలుగులో అనువదించి అరసవల్లి (హర్షవల్లిలో) సూర్యనారాయణునికి తన తరఫున ఒక నమస్కారాంజలిగా సమర్పించుకున్నారు.

సూర్యదేవాలయాలు అనేక ప్రాంతాలలో చాలా చోట్ల భారతదేశంలో చాలా శోభగా ఉండేవి. ఇప్పుడు కొన్ని మాత్రమే మిగిలాయి. ఇప్పటికీ పూజాదికాలు జరుగుతూ భారతదేశంలో ప్రధానంగా చెప్పదగ్గది అరసవల్లి సూర్యనారాయణస్వామి వారి దేవాలయం. దీని మహిమ చాలా గొప్పది. అరసవిల్లి సూర్యనారాయణ స్వామిని ప్రార్థించి అనేక రుగ్మతల నుంచి బయటపడ్డవారు చాలామంది ఉన్నారు.

అరసవల్లి క్షేత్రానికి గల ప్రత్యేకతలలో సత్యనారాయణశర్మగారు తన అనుభవాన్ని చాలా అద్భుతంగా తెలియచేసారు. ఈ ఆలయ ప్రత్యేకత సూర్యుని విగ్రహం.

ఇది సామాన్యమైన విగ్రహం కాదు. అందులో ఒక ఎరుపుతనం ఉంది. సూర్యుడే అరుణ స్వరూపుడు.

ఇది అరుణఘనశిలా విగ్రహం అనబడే ఒక ప్రత్యేక శిలతో నిర్మితమైంది. ఈ శిల లోనే సూర్య లక్షణం ఉంటుంది. ఈ శిలానిర్మిత విగ్రహం ఒకటి అరసవల్లిలో ఉంటే మరొకటి తిరుమలగిరి మీద ఉన్న ఆ వేంకటేశ్వరునిది. ఆదిత్య పురాణంలో వేంకటేశ్వరుని మహిమ చాలా ఎక్కువగా చెప్పబడింది. సప్తగిరులకి, సప్తాశ్వాలకి కూడా ఏదో సంబంధం ఉండి ఉంటుంది.



అరసవల్లిలో సర్వాంగీణమైనది సూర్యప్రతిమ. సుమారు ఐదు అడుగుల ప్రతిమ. ప్రత్యేకించి సకలపరివారాలతో ఉంటారు స్వామి. అశ్వాలు ఉంటాయి. అటూ ఇటూ స్వామివారికి మాఠర, పింగళ అనే ఇద్దరు పరిచారికలు ఉంటారు.

ఉషా, పద్మినీ, ఛాయా శక్తులు ఉంటారు.

ఛాయ అంటే సంజ్ఞాదేవే. మరి ఉషా, పద్మిని ఎవరు? వీరు కథలో ఎక్కడా రాలేదు. సూర్యునికి ఇందరూ భార్యలా? పదాలకు అర్థం తెలిస్తే భార్యలంటే ఏంటో తెలుస్తుంది. పురాణ పరిభాషను అర్థం చేసుకోవాలి. ఊరికినే వేదంలో చెప్పరు, కేవలం జ్ఞానతృష్ణ కలిగిన ఏ కొద్ది మందికో తప్ప అందరికి అందులో రసత్వం కలగడం కష్టం. దానిని పాత్రాదిరూపములతో ఇచ్చినప్పుడు దానికో ప్రత్యేకత ఉంటుంది. ఆ పాత్ర రూపంలో జరిగిన కథా క్రమం మన జీవితాలలో కూడా మార్పు తీసుకు వస్తుంది.

మనకున్న అనుబంధాలలో ఒక పరిమాణం తీసుకువచ్చి ధర్మబద్ధమైన స్పృహ కలిగి స్తుంది. మనకి మరింత ఆసక్తి కలిగిస్తుంది. భగవంతునిపై భక్తిని కలిగిస్తుంది. సైన్స్ ఇచ్చే భక్తి కంటే పురాణకథ ఇచ్చే భక్తి చాలా ఎక్కువ. భక్తి జీవితంలోనికి చొచ్చుకు పోవాలి. ఆ టెక్నిక్ కనిపెట్టినవాడు వ్యాసదేవుడు. పురాణాల రూపంలో అద్భుతంగా అందించాడు. ఉషా, పద్మిని, ఛాయా వీరిపేర్లు పెట్టుకున్నా చాలా విశేషం.

ఏ క్షేత్రం కూడా ఏదో బొమ్మపెట్టి మనం దణ్ణం పెట్టుకుంటున్నట్లు అనుకోడానికి లేదు. స్వాభావికమైన క్షేత్రశక్తి అయినా, లేదా ప్రతిష్ఠితమైన యంత్రశక్తి అయినా మన విశ్వాసంతో పనిలేకుండా మన జీవితంమీద ప్రభావం చూపుతుంది. ఇదీ మన ఆలయాల ప్రత్యేకత.

సూర్య సంబంధమైన ఆలయాలు చాలా అరుదు. ఆలయంలో పూజించడం ఒకటి. సూర్య యంత్రం కూడా లిఖించడం కనిపిస్తూ ఉంటుంది. నమస్కారాలు చేసేవారు సూర్యయంత్ర లేఖనం చేస్తారు. ఇది తంత్రశాస్త్రాల నుంచి వచ్చింది. సౌరాగమాలు చాలా ఉన్నాయి. సూర్య యంత్రం, సూర్య విగ్రహం. సూర్య విగ్రహాలలో రకరకాలు రెండు చేతుల సూర్యుడు, నాలుగు చేతుల సూర్యుడు ఉన్నాడు.



సూర్యుడు కూర్చునే పద్ధతులలో కూడా చాలా విశేషాలు ఉంటాయి.

ఆయన చుట్టూ పరివారములు కూడా చెప్తారు. సౌర అష్టాక్షరీమంత్రం తీసుకుని ఉపాసన చేసే వారైతే ఒక్కొక్క ఆవరణలో ఒక్కొక్క దేవతని కూడా ఆరాధన చేస్తారు. ఆ ఆరాధన ఏలా చెయ్యాలో, ఎక్కడ ఏ దేవతని పెట్టి పూజించాలో శ్రీకృష్ణపరమాత్మ స్వయంగా అర్జునునకు భవిష్యోత్తర పురాణంలో చెప్తారు. ఆయన ప్రత్యక్షంగా కనపడు తున్నప్పుడు యంత్రం, విగ్రహం కావాలా? అని చాలా మందికి సందేహం రావచ్చు.

ఈ మధ్య మనకి 'Solar Electricity' వస్తోంది. 'Solar Lamps' కూడా వస్తున్నాయి. సౌరశక్తితో వెలుగుతూ ఉంటాయి. 'Solar energy' ఈ 'Solar Lamps' పొందడానికి మనం యంత్రాలు వాడుతూ ఉంటాం. ఆ యంత్రం ఒక రకమైన ఆ సూర్యశక్తిని గ్రహించి, దానిని విద్యుచ్ఛక్తిగానో, మరో శక్తిగానో మార్చి మనకి ఇస్తున్నది. మరి అక్కడే సూర్యుడు ఉన్నప్పుడు మనకు యంత్రం ఎందుకు? మనం డైరెక్టుగా పొందవచ్చుకదా? దానిలో ఉన్న ఆ శక్తిని గ్రహించడానికి ఒక యంత్రం ఉంది.

ఆ యంత్రము ద్వారా సూర్యునిలో ఉన్న విద్యుత్ శక్తిని మనం పొందుతున్నాం. ఇది భౌతికమైన అంశం.

ఎలాగైతే ఒక భౌతికాంశాన్ని ఒక యంత్రం ద్వారా భౌతికంగా పొందుతున్నామో, అలాగే సూర్యునిలో ఉన్న దేవతాంశని, దానికి సంబంధించిన యంత్రం, విగ్రహం ద్వారా పొందాలి. ఆలయంలో యంత్రప్రతిష్ఠతో విగ్రహం పెడితే ఆ సూర్యునిలో ఉన్న దివ్యశక్తిని తీసుకుంటుంది.

సూర్యుని నుంచి కాంతి వస్తున్నప్పుడు ప్రతీ జీవజాలం వాటి వాటి పద్ధతిలో వాటి శరీర లక్షణం బట్టి ఒకొక్క ఉపాధి ఒకొక్క రకంగా సూర్యశక్తిని తీసుకుంటూ ఉంటాయి. రాళ్ళు, రప్పలు, జలములు, వృక్షములు, కుసుమాలు అన్నీ తీసుకుని వాటి వాటి పరిమాణాలు చూపిస్తూ ఉంటాయి.

చెట్లు సూర్యశక్తి నుంచి పత్రహరితాన్ని (క్లోరోఫిల్) తీసుకుంటాయి. '**అవిర్రైవ్**' అనే వేదమంత్రంలో పత్రహరిత శక్తి గురించి వర్ణించారు. మనం ఇంకొక రకంగా తీసుకుంటాం. ఒకొక్క శరీర ఉపాధి ఒకొక్క రకంగా గ్రహిస్తూ ఉంటుంది.

సూర్యునిలో ఉన్న దివ్యశక్తి పొందాలంటే దానికొక ప్రక్రియ ఉంది. నమస్కారం, ఉపాసన ద్వారా సూర్యునిలో ఉన్న దివ్యశక్తిని మనం పొందగలం. ఆ నేర్పు మన పెద్ద వాళ్ళు మనకి ఇచ్చారు. సూర్యసంబంధమైన ఆలయాలు కొన్ని సహజసిద్ధమైన సూర్య క్షేత్రాలు ఉన్నాయి. కోణాదిత్య క్షేత్రమని బ్రహ్మపురాణంలో ప్రత్యేకంగా చెప్పారు.



కోణాదిత్యుడు angular గా ఉన్న సూర్యశక్తిని పొందిన విశేషం. పూరీ క్షేత్రానికి కొంత దూరంలో, సముద్రతీరంలోనే క్రమంగా చంద్రభాగా అనబడే నదీతీరంలో కోణాదిత్య క్షేత్రం ఉంది. ఇక్కడ సాంబుడు సూర్యభగవానుని ఆరాధించిన వైనం బ్రహ్మ పురాణంలో కనబడుతోంది. ఆ కోణ ఆదిత్యుడే కోణ-అర్క్ – కోణార్క్ అయ్యింది.

తరువాత కాలంలో అక్కడ ఆలయ నిర్మాణం జరిగినది. దానికి కూడా కథ చెప్తారు. క్షేత్రమనగానే ఆలయం ప్రధానమై ఉండక్కర్లేదు. క్షేత్రంలో నైసర్గికంగా శక్తి ఉంటుంది. తరువాత కాలాల్లో మహాత్ములు అక్కడ ఆలయాలను ప్రతిష్ఠ చేసి దానిని ఒక వ్యవస్థ చేస్తారే తప్ప క్షేత్రాలలో ఆలయాదులు అవసరం లేకుండానే శక్తి ఉంటుంది.

ముందు క్షేత్రం, భగవానుని ఆవిర్భావం తరువాత ఆలయ నిర్మాణం జరుగుతుంది. కోణార్క ఆలయం పడిపోయి ఉన్నా ఇప్పటికి అక్కడ అద్భుతమైన దివ్య సూర్యశక్తి ఉన్నది. తంజావూరులో సూర్యన్ కోయిల్ అని ఉంది. అగస్త్యమహర్షి నాడీ గ్రంథాలలో అనేకమైన జాతక దోష పరిహారాలకు ఈ సూర్యుని దర్శించాలని వ్రాసాడు. కర్ణాటకలో కూడా కుండపుర అనే ప్రాంతంలో సూర్యాలయం ఉన్నది.

కొద్దికాలం క్రితం Cambridge University లో Solar energy గురించి రక రకాల Seminors ఏర్పాటు చేసారు.

లండన్‌కి సంబంధించిన ఒక ప్రొఫెసర్ ఒక పత్రాన్ని సమర్పించాడు.

అమెరికాలో గ్రేన్‌ల్యాండ్స్ అనే ప్రాంతంలో త్రవ్వకాల్లో కొన్ని వేల సంవత్సరాల పూర్వానికి సంబంధించి ఒక కెంపు బయటపడింది. ఈ కెంపు బయటపడ్డ చోటున ఒక ప్రాచీన ఆలయం ఉన్న జాడలు బయటపడ్డాయి.

అందులో ఒక కుడ్య చిత్రం– గోడపై చెక్కిన చిత్రం బయట పడినది. నమస్కార భంగిమలో మోకాళ్ళ మీద కూర్చుని సూర్యునికి నమస్కారం చేస్తున్న భారతీయ వైదిక పురుషుని విగ్రహం. దీని ద్వారా ప్రాచీన కాలంలో వైదిక సంస్కృతి విశ్వవ్యాప్తంగా ఉందని మళ్ళీ ఋజువు అవుతున్నది. పురాణాలు ఎప్పటికీ సత్యములే. నేటికీ సత్యమని తెలిస్తే మన ఆస్తికత, శ్రద్ధ మరింత అభివృద్ధి చెందే అవకాశం ఉంది.

సూర్యారాధనని నిత్యజీవితంలో భాగంగా చేసుకోవాలి. ఆదివారం ప్రధానం. మనకి అన్ని రోజులు ప్రధానమే. కాని ఆది అనడంలోనే మొదటి రోజు. గ్రహదోషాలు పోవడం కోసం ఒకొక్క రోజు ఒకొక్కటి చెప్పారు. అయితే మన జాతకంలో ఏ గ్రహదోషముందో మనమే తెలియలేక జ్యోతిషులు మరింత అయోమయం చేసేస్తుంటే పరిష్కారం చెప్పారు.



ఆదివారం నియమబద్ధంగా సూర్యభగవానుని ఆరాధిస్తే ఏ గ్రహదోషమైనా పోతుంది. అలాగే సూర్యుని ఆరాధించాలి అంటే ఒకటి ఆయనకు నమస్కారం. సూర్యుని ఉద్దేశించి అగ్నిహోత్రంలో ఆహుతులు వెయ్యడం. దీపారాధన. అగ్నిహోత్రంలో ఆహుతులు వెయ్యలేకపోతే గోవుకు, దానికి సిద్ధమైన ఆహారాన్ని సూర్యప్రీతిగా సమర్పిస్తే గ్రహదోషాదులు పోతాయి. సూర్యుని ప్రీతిగా ఏదో ఒకటి ఆదివారం రోజున చెయ్యాలని నియమంగా పెట్టుకోవాలి. ప్రతీరోజూ చెయ్యాలి. ప్రత్యేకించి ఒక వారం పాటించాలి.

**త్వచిదోషాః దృషిదోషాః హృదిదోషాయేఖిలేంద్రియజదోషాః**
**తాన్ పూషా హత దోషః కించిద్రోషాగ్నినా దహతు**

రోగనాశకుడైన సూర్యుని గురించి చెప్పేటప్పుడు రెండు శబ్దాలు వాడారు. పూషా హతదోషః. – పూషా సూర్యభగవానుని పేర్లలో ఒకటి. ఉదయం నుంచి సాయంత్రం వరకూ సూర్యునికి ఉన్న ప్రధానమైన పేర్లు చెప్తారు. **ఉదయాత్పూర్వభాగీ సవితా ఉదయాస్తమయ మధ్యవర్తీ సూర్యః** అని సాయణాచార్యులవారు భాష్యం రచిస్తూ చెప్పారు. సూర్యోదయం స్ఫుటంగా వచ్చే ముందు ఆయనికి **సవితా** అని పేరు. దానికంటే

ముందు భాగంలో **ఆదిత్య** అనాలి. సూర్యుడు మనకు కొంత మేరకు తెలిసేటప్పటికే ఆయన ఉదయం ప్రారంభమవుతోంది. అక్కడ నుంచి లెక్కకడతారు. అదే మనకు బ్రాహ్మీముహూర్తం. క్రమంగా **ఆదిత్యుడు**, తరువాత **సవితా**, తరువాత నుంచి సూర్యుడు.

పగటి సూర్యుడులో మళ్ళీ రెండు భాగాలు. ఖగ, పూష. పూష్ణాతీతి పూషా. పోషించు వాడు, పెంపు చేయువాడు. పగటి సూర్యుని లక్షణం అంతా కూడా ప్రాణశక్తి ప్రసారమే.

మనల్ని రక్షించేవాడు కొంచెం రోషం చూపిస్తేనే మనకు ధైర్యం. వాడిని చూసి అవతలి వాడు భయపడతాడు. స్వామి దగ్గర ఉన్న రోషాగ్ని మన రోగాలను దహింప చేసేదే. సూర్యుడు వస్తున్నప్పుడే అనేకమైన రోగకారక శక్తులను నశింప చేస్తాడు అని శాస్త్రం వర్ణిస్తోంది.

తరువాతి శ్లోకంలో ప్రవేశిస్తున్నాం. మనం కొన్ని సంపాదించాలి, దానికి ఇంద్రియాలే గతి. కాని ఇంద్రియాలను రోగాలు కట్టేస్తున్నాయి.

మన ఇంద్రియాలను బంధించే రోగాలని స్వామి ఖండించుగాక అని చెప్తున్నారు.

**ధర్మార్థకామమోక్షప్రతిరోధానుగ్రతాపవేగకరాన్।**
**బందీకృతేంద్రియ గణాన్ గదాన్ విఖండయతు చండాంశుః॥**

గద అంటే రోగం అని అర్థం. గదాన్ అంటే రోగాలను **చండాంశుః** తీవ్ర ప్రకాశం కలిగిన సూర్యుడు. **విఖండయతు** విశేషంగా ఖండించుగాక. మనం శరీరం పొందాక ధర్మం, అర్థం, కామం, మోక్షం నాలుగు సంపాదించుకోవాలి.

ఇవి సాధించే వాడే సంపూర్ణమానవుడు. విజయం సాధించాడంటే నాలుగు సాధిస్తేనే విజయం. వీటిని సాధించడానికి రోగాలు మనల్ని అడ్డుకుంటున్నాయి. రోగాలు పోవాలి.

ఉగ్రతాపకరాన్ – భరించలేనంత తాపాన్ని కలిగిస్తూ ఉన్నాయి. రోగాలు పెట్టే బాధలు. బందీకృతేంద్రియగణాన్ – నా ఇంద్రియాలను హాయిగా స్వేచ్ఛగా ప్రవర్తింప చెయ్యకుండా అడ్డుకుంటున్నాయి. మూడు రకాలుగా నన్ను బాధ పెడుతున్న రోగాలని ఈ **చండాంశుడు** అంటే వాడిఅయిన కిరణములవాడు తొలగించుగాక.

సూర్యుడు లేకపోతే ప్రాణశక్తి ఉండదు.

**యేన వినేదం తిమిరం జగదేత్య గ్రసతి చరమచరమఖిలం**
**ధృతబోధం తం నళినీ భర్తారం హర్తారమాపదామీడే.**

ఆయనే లేకపోతే ఈ చీకటి ఈ చరాచర జగత్తునంతటిని మింగేస్తోంది. ఈయన మెలకువ కలిగించే దేవుడు. ఆయనవల్లే అందరూ మేల్కొంటున్నారు.

ప్రపంచాన్ని మేలుకొలిపే వాడు ఆయన. ధృతబోధం - ఆయన దగ్గర మేల్కొలిపే శక్తి ఉంది. నళినీ భర్తారం - పద్మాలను మేల్కొలుపుతున్నాడు. నళిని అనగా పద్మిని. ఉషా, పద్మిని, సంజ్ఞ (ఈమెయే ఛాయ) ముగ్గురు భార్యలు. భార్యలు అనగా ఆయన్ని వీడని శక్తులు.

ఉషఃకాలంలో నిద్రలేవడం అనే ఒక్క అలవాటు ఉన్నవాడికి రోగాలు సగానికి సగం తగ్గిపోతాయి. ఆ సమయంలో తగిన సాధనలతో సూర్యారాధన చేస్తే వారికి ఇంక బాధే లేదు. ఉషఃకాలం చాలా ప్రధానం. పైగా సూర్యుని పట్ల అపచారాలలో పెద్ద అపచారం ఉదయాస్తమయ సమయాలలో నిద్రపోవడం.

అలా నిద్రించే వాళ్ళని **అనభ్యుదితాః** అని వేదం చెప్పింది.

అభ్యుదయం అంటే ఐహిక జీవనంలో అభివృద్ధి. అన్ని విధాల సుఖపడటం. అనభ్యు దయం అంటే వాళ్ళకింక జీవితంలో అభ్యుదయం ఉండదు. ఉషఃకాలంలో సూర్యుడు **రోచమానా** చాలా ప్రీతి భావంతో ఉంటాడని వేదం చెప్తోంది. ఆ సమయంలో ఎవరు ఏది అడిగినా ఇస్తాడు. ప్రాతఃకాల కిరణాలు తాకిన క్షీరాదులు తీసుకుంటే ఔషధం. ఏవైనా మొండిరోగాలు లాంటివి ఉంటే ఆదివారం ప్రొద్దుట ఉషఃకాలంలో నిద్రలేచి కాలకృత్యాదుల తీర్చుకొని శుచిగా ఒక పాత్రకి పసుపు రాసి బొట్టు పెట్టి దానిలో భారతీయ గోవుపాలు పోసి పొయ్యి మీద పెట్టి మరుగుతూ ఉండగా గుప్పెడుతో ఒక గుప్పెడు బియ్యం తీసుకుని పాలలో వేయాలి. మొత్తం ఉడికిన తరువాత బెల్లం ముక్కని వేసి మూతపెట్టేసి పదకొండు మార్లు అదిత్యహృదయం చదవాలి. సూర్యుడు ఉదయించే సరికే చదివి (ఆరున్నర ఏడు మధ్యలో) దాని మీద సూర్యకాంతి పడేటట్లు చేసి తరువాత దాన్ని సూర్యునికి నివేదించి ఆ ప్రసాదాన్ని తీసుకోవాలి.



ఇలా చేస్తే ఒకటి రెండు వారాలలో ఎటువంటి రోగమైనా పోతుంది. ఇవన్ని సూర్యా రాధనలో ప్రక్రియలు. ఇవన్నీ రోగనాశానానికి పనికి వచ్చే విషయాలు.

పద్మిని సూర్య కిరణాలలో ఉండే వికసింపచేసే శక్తి. సూర్యుడు రాగానే పద్మాలు విచ్చు కుంటాయి. బ్రతుకు విచ్చుకుంటుంది. ప్రకృతి విచ్చుకుంటుంది. అసలు ప్రపంచమే పద్మంలా విచ్చుకుంటుంది.

మనలో ముడుచుకు పోయిన జ్ఞానాన్ని వికసింపచేయడమే విచ్చుకోవడం.

సూర్యోదయ కాలంలో ప్రకృతి అంతా స్పందిస్తుంది. అందరం ప్రకృతిలో భాగమే. మనకు తెలియకుండా మనలో కూడా శారీరక అణువులు, బుద్ధిగతమైన అణువులు

స్పందిస్తాయి. ముందుగా సూర్యుడు రాగానే స్పందించే శక్తి నేత్రానికి, బుద్ధికి ఉంటుంది. సూర్యుడు ప్రధానంగా ఈ రెండింటికి అధిపతిగా ఉంటాడు.

బుద్ధిగతమైన అణువులన్నీ కూడా పద్మాలులా విచ్చుకుంటాయి. అవి విచ్చుకోడానికి సిద్ధమవుతుంటే మనం వాటిని నిద్రపుచ్చడానికి ప్రయత్నించడం ప్రకృతి విరుద్ధం. అది ఎప్పుడైతే చేస్తామో బుద్ధిగతమైన శక్తులన్నీ క్రమంగా క్షీణించిపోతాయి. కనుక ప్రతివారు ప్రాతఃకాలంలో నిద్రలేవడం చాలా ప్రధానం.

రామచంద్రమూర్తి భరతునితో అరణ్యకాండలో కశ్చిత్ సర్గలో "ప్రధానమైన నిర్ణయాలన్నీ తెల్లవారుజాము చర్చలలోనే తీసుకుంటున్నావా?" అంటాడు. పిల్లలు చదువులలో రాణించాలంటే అర్ధరాత్రిదాకా టీలు తాగించి చదివించడం కాదు బ్రాహ్మీమూహర్తంలో చదివించాలి. విశ్వామిత్రునిలా **కర్తవ్యం దైవమాహ్నికం** అని మనం నిద్రలేచి మన పిల్లలని నిద్ర లేప గలగాలి. ఈ సమయంలో బుద్ధి ఎటువంటి మహాశక్తినైనా అందుకునే స్థితిలో ఉంటుంది. ఆ సమయంలో చేసే ధ్యానంగాని, సాధనగాని అద్భుతంగా ఫలిస్తుంది. దివ్యశక్తులు నడయాడే సమయం అది.

గ్రహశక్తులలో యముడు మొదలైనవారు ఆయన పుత్రులు. యముడు అంటే రెగ్యులేటర్. ప్రపంచపు గతి కర్మలు ఉంటాయి. వాటిని రెగ్యులేట్ చెయ్యాలి. అవే పాపం పుణ్యం. వాటిని జాగ్రత్తగా చూసుకునే వాడే యముడు అది ఆయన ఎక్కడో సంయమనీ పురంలో కూర్చోడమే కాదు. ప్రకృతి అణువణువులో సూర్యశక్తి ప్రవేశించే ప్రతీ చోటా యమశక్తి ఉంది.



మనం చేసేవాటిని గమనిస్తూ ఉంటాడు అతడు. ఆయన ధర్మదేవత. ఆయనకొక నమస్కారం చేసుకుందాం. వేదాలలో సూర్యునికి అనేకమంది కుమారులున్నారని చెప్పినా యముడే ప్రధానంగా చెప్పుకుంటున్నాం. సూర్యుడు ఉదయించినప్పుడు ఈ శక్తులన్నీ భూమి మీదకి వస్తాయి. లేకపోతే చీకటి మొత్తం వీటి అన్నింటిని మ్రింగేసేది.

హర్తారమాపదామీడే – ఆపదలను హరింపచేయువాడు. దీనికి చక్కటి ఉదాహరణ మహాభారతం విరాటపర్వంలో ద్రౌపదిని రక్షించిన వైనం మునుపే వివరించుకున్నాం. ఎలాంటి ఆపదల నుంచి అయినా కాపాడగలిగేవాడు సూర్యభగవానుడు.

**యస్యసహస్రాభీశోఃఅభీశులేశో హిమాంశు బింబగతః।**
**భాసయతినక్తమఖిలం భేదయతు విపద్గణానరుణః ॥**

రాత్రి అయితే సూర్యభగవానుడు ఉండడు అనుకుంటాం కాని ఉంటాడు. రాత్రి

అయినా చీకటిగా ఉన్న ప్రాంతాల్లో కూడా సూర్యుని కొన్ని కిరణాలు ఉంటాయి. చంద్రుని రూపంతో సూర్యకిరణాలే కనపడతాయి. ఇవి వైజ్ఞానికంగా కూడా చెప్పవచ్చు.

ఎన్ని సూర్యమండలాలు ఉంటే మనకు ఎందుకు మన బ్రతుకునకు వెలుగు నిచ్చే ఈ సూర్యభగవానుడే మనకు దైవం. సూర్యుని ద్వారా జ్యోతినిస్తున్న నారాయణునే సూర్య రూపంతో ఆరాధిస్తున్నాం. మనకి కనిపిస్తున్న పరిమితమైన మండలమే కాదు దానిద్వారా లభిస్తున్నదంతా ఆ పరమేశ్వరుని పాలనా వ్యవస్థ, కారుణ్య వ్యవస్థ.

భారతీయులకు వైజ్ఞానికంతో కూడిన విశ్వాసమే ఉంది. ఇందరు సూర్యులున్నారా అనడానికి ప్రమాణం భారతంలో వైశంపాయనుడు చెప్పిన మాట **యేత యైవావృతా సహస్రసూర్యతయా** – వేలకొలది సూర్యుల గురించి చెప్పిన మంత్రమిది.

ఇద్దరు ఋషిపుత్రులు సూర్యులని చూడడానికి ప్రయత్నించి ఏడుగురి దాకా వెళ్ళ గలిగారు. కాని ఏడింటికి పైన ఉన్న ఎనిమిదవ దాని దగ్గరకి వెళ్ళలేకపోయాం అన్నారు. ఏడు సూర్యమండలాలను పట్టుకోగలిగే శక్తి మన భారతీయ ఋషులు తపస్సు చేత సాధించారు. ఈ ఋషిపుత్రులు చెప్తున్న ఏడు సూర్యమండలాలు ఉన్నాయి. అవి ఎలా అంటే మేరువు ఒకటుంది. ఏడింటికి పైన అసలు వాడు ఒకడు ఉన్నాడు. ఆయన పేరు **కశ్యపుడు** అన్నారు. ఈయన ఎనిమిదవ వాడు. అష్టమః సూర్యః అన్నారు. ఈ ఏడు కూడా **తే అస్మై కశ్యాపాజ్జ్యోతిర్లభంతే** ఆ కశ్యపుని నుంచి ఈ ఏడు పొందుతున్నాయి. మనం చూస్తున్న సూర్యమండలం **ఆరోగ** అనే సూర్యమండలం. అలాగ రాత్రి వేళల్లో కూడా కొన్ని కిరణాలు **హిమాంశు బింబగతః** చంద్రబింబగతమై రాత్రిని ప్రకాశింప చేస్తున్నాయి.

సూర్యుడే చంద్రుని ద్వారా రాత్రిని ప్రకాశింప చేస్తున్నాడు. **భాసయతి నక్తమఖిలం భేదయతు విపద్గణాన్ అరుణః**– నా విపత్తు సమూహాన్ని ఆ అరుణుడు తొలగించుగాక! అన్నాడు. అరుణుడు అంటే రాత్రి పూర్తి అవుతూ పగటిగా రాబోతున్న వాడు. చంద్రుని చూపించారు, అరుణ చెప్పారు. ఈ చెప్పడంలో క్రమం చూడండి. అస్తమించిన తరువాత వచ్చిన రాత్రిలో చంద్రబింబగతమైన సూర్య కిరణాలు, అవి పూర్తవుతూ ఉండగా అరుణం ఈ రెండింటిని ఒక శ్లోకంలో చెప్పడంలో ఔచిత్యం ఉంది

**తిమిరమివనేత్రతిమిరం పటలమివాశేషరోగ పటలం నః**

**కాశమివాధినికాయః కాలపితారోగయుక్తతాం హరతాత్**

చీకటిని ఎలా పోగొడతాడో అలాగే నా కంటి చీకటిని పోగొట్టుగాక! అనగా కంటికి

సంబంధించిన రుగ్మతలు పోగొట్టుగాక!. ఈ మంచు పొరలను తొలగించినట్లుగా నా రోగాల సమూహాన్ని తన వేడిమితో తొలగించుగాక!.

కాశమివాధినికాయః - అగ్నికి రెల్లు పొదలు ఎలాగైతే వాడిపోతాయో నా మానసిక బాధలను కూడా తొలగించుగాక!. మేము ఎల్లవేళలా రోగముతో ఉండే దుస్థితి ఏదైతే ఉన్నదో దానిని స్వామి తొలగించుగాక!. దీనికి కొన్ని పాఠములలో **రోగశూన్యతాం కురుతాత్** అని కూడా ఉంది. రోగాలను లేని స్థితిని ఇచ్చుగాక! అని.

**కాలపితా** - కాలానికి తండ్రి ఆయన. సూర్యుడు లేకపోతే కాలం లేదు. ఋతుచక్రం అంతా ఆయనవల్లనే కలుగుతుంది. పగలు, రాత్రి ఆయనే ఏర్పరిచాడు. దానిని బట్టి కాల నిర్ణయం చేస్తున్నాం. సూర్యుడు లేకపోతే కాల నిర్ణయం చెయ్యలేం. ఆయన కాలకర్త.

ఒకొక్క ఋతువులో, ఒకొక్క మాసంలో, ఒకొక్క రోజుకి ఒకొక్క లక్షణం ఉంటుంది. ఇది తెలుసుకోవడానికే శాస్త్రం అవసరం అయ్యింది. అదృష్టవశాత్తు ఇది మనకి యుగాల నుంచి ఉంది.

అక్షి ఉపనిషత్తుని పారాయణ చేసుకుని కంటి జబ్బులను పోగొట్టుకునే పద్ధతి కూడా చెప్తున్నారు. దీనిని సరైన గురువుల ద్వారా గ్రహించాలి. ఆ ఉపనిషత్తులో అక్షికి సంబంధించిన మంత్రాలు కనబడతాయి. పైగా సౌర మంత్రములలో కూడా **చక్షుర్నోదేవః సవితా చక్షుర్న ఉతపర్వతః చక్షుర్ధాతా దదాతునః** అని వస్తుంది.



ఇంకోచోట వేదంలోనే **సుసం దృశంవా ప్రతిపశ్యేమ సూర్య** అంటే మిమ్మలను మేము ఎప్పుడూ చూస్తూనే ఉండాలి. చక్కటి చూపుశక్తివైన నిన్ను ఎప్పుడూ చూస్తూ ఉండాలి. అంటే నాకు కళ్ళు ఎప్పుడూ ఉండాలని అర్థం.

**తమాదిత్యం నత్వా చాక్షుష్మతీ విద్యయా తమస్తువత్** - ఆదిత్యుని నమస్కరిస్తూ చాక్షుష్మతీ విద్యని చెయ్యండి అని చెప్పారు. దీనినే చక్షుష్మతీ విద్య అంటారు. ఇది సూర్యగతమైన శక్తి. ప్రతీవారికి తమ కంటి లోపల మధ్యలో గ్రుడ్డులో ఉంటుంది ఆ దేవత. దీనిని అక్షి విద్య అని ఉపనిషత్తులలో ప్రత్యేకించి చెప్పారు.

సూర్య మండలంలో పరమాత్మని ధ్యానించమన్నారు. మన కుడి కంటి మధ్యలో పరంజ్యోతి ఉందని ధ్యానించమన్నాడు, తరువాత మన హృదయకుహర మధ్యంలో ధ్యానించమన్నారు.

ఈ మూడింటిలో ఉన్న పరమాత్మని ధ్యానిస్తే క్రమంగా మనం ఉత్తమ గతిని పొంద గలం అని ఉపనిషత్తు చెప్తున్నది. ఇది దహరవిద్య, అక్షివిద్య, అంతరాదిత్య విద్య.

భారతదేశం ఒకప్పుడు అద్భుతమైన దశలో ఉన్న దేశం ఎందుకిలా అయ్యింది అంటే ఈ సూర్యోపాసన మరవడం వల్లనే.సూర్యోపాసనలోని అద్భుతమైన శక్తిని పోగొట్టుకున్నది. ఇప్పటికైనా మనం అలవాటు చేసుకుని మన పిల్లలకు అలవాటు చెయ్యాలి.

చాక్షుష్మతీ విద్యలో **నమోభగవతే శ్రీ సూర్యాయ ఆదిత్యాయ అక్షితేజసే నమః** అని ప్రధానమంత్రం. ఇది అందరూ చేసుకోవచ్చు. ఇక్కడ చక్షుష్మతీ దేవి ఎలా ఉంటుందో ప్రత్యేకమైన వర్ణన చెప్పారు.

కొంతకాలం క్రితం ఆంధ్రప్రదేశ్ నుంచి నడిమింటి సర్వమంగళ శాస్త్రిగారు అని ఒకాయన పూరి క్షేత్రమునకు వెళ్లారు. అక్కడ ప్రసాదం చాలా ప్రధానం. చర్చకూడా చెయ్యకుండా తినాలి. ఆయన అక్కడ రావి ఆకులో ప్రసాదం తింటున్నారు.

అక్కడ ఒక ఉత్కళ పండితుడు వచ్చి రావి ఆకుని ఎంగిలి చెయ్యకూడదు అది విష్ణుస్వరూపమని అనగానే ఏదో మంచి మాట చెప్పాడని ఊరుకోకుండా ఈయనకు కోపం వచ్చి "మీరు చేపలనే తింటారు మాకు చెప్తున్నారా!" అన్నారు. క్షేత్రంలో ఎవరిలో ఏ ముందో ఎవరికి తెలుసు. అలా ఆ చర్చ ఎక్కడికో వెళ్ళి ఆయన జగన్నాథ ప్రసాదాన్నే తూలనాడాడు. వెంటనే కళ్ళు పోయాయి. జగన్నాథ ప్రసాదాన్ని తూలనాడితే వెంటనే ఫలితం కనిపిస్తుంది. ఆయన ఏడ్చాడు.



ఆ ఉత్కళ పండితుడు సూర్యుని ఉద్దేశించి ప్రార్థించు అని చెప్పగానే అప్పటికప్పుడు ఆ పండితుడు సూర్యుని ఉద్దేశించి

**ఘృణయా భృతసురగణయా జగతఃకృత్స్నం తమోహరతః**
**మామక తమసో హరణే తరణే కస్తే శ్రమోవాస్తే**

ప్రపంచపు చీకటినే పోగొట్టే ఆదిత్యా! నా ఒక్క కంటిచీకటిని పోగొట్టడానికి నీకు ఏం శ్రమయ్యా! అన్నాడు.

పశ్చాత్తప్తుడై జగన్నాథస్వామినే సూర్యస్వరూపంగా, సూర్యునే జగన్నాథస్వరూపంగా భావన చేసి ఆ సముద్రతీరంలో, ఆ కోణాదిత్య క్షేత్రంలో ప్రార్థించ గానే వెంటనే తిరిగి కళ్ళు వచ్చాయి.

సూర్యోపాసన ఏ విధంగా నేత్ర దృష్టిని ఇస్తున్నదో చూపించారు.

స్వామి యొక్క తత్త్వాన్ని చూస్తున్నాం. అయితే ఇక్కడ గమనించవలసినది ఐహికమైన అభీష్టసిద్ధిని ఇచ్చే కామ్య ఆరాధనగా కాకుండా, భక్తి పూర్వకంగా చేస్తే మన ఉపనిషత్తులు చూపించిన అంతర్ముఖ ఉపాసనా మార్గాలుగా సూర్యోపాసనే ఎక్కువగా చెప్పబడుతున్నది.

ప్రశ్నోపనిషత్తుగాని, బృహదారణ్యకంగానీ, ఛాందోపనిషత్తుగానీ మొత్తం అంతా సూర్యసంబంధమైన మంత్రములే. ఆఖరికి ఛాందోగ్యంలో గాయత్రీమంత్రస్వరూపం అంతా చూపిస్తారు. మన హృదయ కుహరంలో ఐదు కేంద్రాలుంటాయి. ఈ ఐదు తేనె పట్టు లోపలి భాగాలులా ఉంటాయి. వీటిని సరఘ అంటారు. అక్కడ ఉన్న ప్రాణశక్తి ఆదిత్యుని వలన పనిచేస్తుంది. వాటిని ఆరాధించే విద్య 'మధువిద్య' అని చెప్తారు.

చాలా రహస్యమైన విద్యలు ఉన్నాయి. ప్రధాన ఉపనిషత్తులలో ముప్పది రెండు సూర్య సంబంధమైన ఉపాసనా విద్యలు ఉన్నాయి. మనం చెప్పుకుంటున్న సూర్యారాధన ఇహానికి, పరానికి, మొత్తానికి పరమార్థానికి పనిచేస్తుంది.

సూర్యుని నమ్మినవాడు ఎట్టి పరిస్థితులలోనూ చెడిపోడు.

ఆయన రా నాన్నా! అని పిల్లవాడికి తండ్రి చెయ్యి ఇచ్చి నడిపించినట్టు నడిపిస్తాడు. ఉత్తమజీవులు శరీరపతనానంతరం సూర్య కిరణాలను పట్టుకుంటూ క్రమంగా పైకి వెడతారు. సూర్యుని రథచక్రాల క్రింద చిన్న గొట్టం ఉంటుంది. దానిలోకి పంపిస్తే దాని నుంచి ఊర్ధ్వలోకాలకి వెడతారు. ఇది ఒక gateway లాంటిది.

సూర్యుని దయ లేకపోతే ఊర్ధ్వగతులు లేవు. మొదటి నుంచి సూర్యుని మంచి చేసు కుంటే మన తరువాతి గతి సద్గతే.



కాలపితా అన్నప్పుడు కాలానికి ఆయనే కర్త. కాలం ఆయన శాసనంలో ఉంది అని స్పష్టంగా తెలుస్తోంది. కర్మఫలం కూడా కాలానుగుణంగా వస్తుంది. ఆ కాలమే ఆయన చేతుల్లో ఉన్నది. ఆ కారణంచేతనే కాలకర్త సూర్యభగవానుడు.

దాన్ని ఆధారం చేసుకొనే మనం ఘడియలు, విఘడియలు, ముహూర్తములు, క్షణములు ఇత్యా దులన్ని నిర్ణయిస్తున్నాం.

రెప్పపాటుకాలం మొదలుకొని కల్పకాలం వరకూ కర్త సూర్యభగవానుడనే విషయం దీనిద్వారా తెలుస్తోంది. నేత్రదృష్టికి సూర్యభగవానుడు ప్రధానమైన దేవత.

**సూర్యఃచక్షుషామధిపతిః సమావతు** – అని అథర్వణవేదంలో మంత్రం ఉంది. చూపుల వేల్పు సూర్యుడు. ప్రధానంగా దృష్టి వేల్పు. ఆయనే పెద్దకన్ను.

జగచ్చక్షుః అని ఆయనకి పేరు. సర్వజగత్తుకి ఆయన చక్షువు. **సర్వజీవనియామకానాం సూర్య ఆత్మాదృగీశ్వరః** – సర్వజీవులు అంటే దేవతిర్యఙ్మనుష్యానాం – దేవతలు, పశు పక్ష్యాదులు, మానవులు, వీరుధములు(వృక్షాదులు), శిలలు వీటిన్నిటికి సూర్యుడే ఆత్మ, ఆయనే చూపు, ఆయనే ఈశ్వరుడు అని చెప్పారు.

సూర్య ఆత్మాజగతస్థుషశ్చ – జగతః తస్తస్థుషశ్చ – జగతః అంటే జంగమ ప్రపంచం. తస్థుషశ్చ అంటే స్థావరప్రపంచం. కదిలేవి కదలనివి. ఈ జగత్తులో ఉన్న జీవజాలమంతా రెండే రకాలు. ఈ రెండిటికి కూడా సూర్యుడే ఆత్మ.

మన శరీరానికి ఏలాగైతే ఆత్మ ఉందో సర్వజగత్తు ఆయన ఆత్మ. వేదవేత్తలు ఆయన్ని అలా దర్శించారు.

ఆయన్ని ఆ విధంగా మనం సంధ్యాసమయంలో నమస్కరించుకొంటున్నాం.

చిత్రం దేవానాం ఉదగాదనీకం చక్షుర్మిత్రస్యవరుణస్యాగ్నే – ఇత్యాది మంత్రాలతో కూడా సూర్యుని ప్రాధాన్యమే చెప్తున్నారు.

సూర్యుడు అత్మ, దృక్, ఈశ్వరః – మనందరికి ఆయన ఆత్మయై ఉన్నాడు. చూపుయై ఉన్నాడు. నియామకుడై ఉన్నాడు. సూర్యుడు దృగ్దేవత. కంటికి సంబంధించిన ఏ బాధ కలిగినా సూర్యుని ఆరాధించి సూర్యారాధనతో సులభంగా బయటపడవచ్చు. అన్ని బాధలను సూర్యుడు పోగొడతాడని చెప్పినప్పటికి ప్రత్యేకించి నేత్రాలగురించి చెప్పడంలో విశేషముంది.



అక్షి ఉపనిషత్తులో వేదమంత్రాలు ఉంటాయి కనుక భావాన్ని మాత్రం తీసుకొని పరిశీలిస్తే ప్రతివారు సూర్యుని ఏ విధంగా నేత్రాలకి వేల్పుగా ఆరాధిస్తారో చెప్పారు. చాక్షుష్మతి విద్యకి వేదంలో ప్రత్యేకమైన పద్ధతి ఉంది.

అది సరియైన స్వరనియమంతో నేర్చుకొని చెయ్యవల్సిందే.

అయితే కంటికి సంబంధించి సూర్యానుగ్రహం కోసం కొన్ని నామాలు చెప్తున్నారు.

**నమో భగవతే సూర్యాయ అక్షి తేజసే నమః**

**ఖేచరాయ నమః**

**మహాసేనాయనమః.**

**తమసే నమః.**

**రజసే నమః.**

**సత్వాయనమః**

**అసతోమాసద్గమయ తమసోమాజ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ...**

వేదంలో మిగిలిన చోట్లలో కూడా ఈ మంత్రం ఉందిగాని అక్షిఉపనిషత్తులో తీసు కొన్నారు. ఈ మంత్రం మనకి దృష్టి ప్రదానం చేస్తుంది. అసత్తు నుంచి సత్తు వైపు, తమస్సు నుంచి జ్యోతి వైపు, మృత్యువు నుంచి అమృతం వైపు నడిపించమని అడుగు

తున్నారు. కేవలం భౌతికమైన చూపుని అడగడమే కాదు మరొక చూపుని కూడా అడుగుతున్నారని దీని అర్థం.

ఉపనిషత్తు భాషలో చెప్తే- అజ్ఞానమే మృత్యువు. **ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి** అని ఉపనిషత్తు చెప్తున్నది. ఆత్మజ్ఞానం లేకపోవడమే మృత్యువు. అందరూ మృత్యువుతోనే బ్రతుకుతున్నాం. అజ్ఞానంతో బ్రతకడం మృత్యువే. మృత్యుదశ నుంచి అమృతం అంటే జ్ఞానం వైపు నడిపించు అని అడిగేటపుడు ఇది మరొక చూపు గురించి కూడా అడుగు తోంది. ఆ చూపు అంతర్దృష్టి. అదే జ్ఞానదృష్టి.

సూర్యుడు రెండు విధాలైన చూపులకు అధిపతే.

కంటిచూపుకి అధిపతి. మనశరీరమందు ఉన్న బుద్ధికికూడా అధిపతి ఆయనే. ఈ బుద్ధిద్వారా మనం లోకంలో ఇతరజంతుజాలాలు సాధించలేనివి సాధిస్తున్నాం. అవి మనలా తిరగలేవు. ఆ బుద్ధి అనే శక్తికూడా ఒక దృష్టే. అది లౌకికం మనం వినియోగించు కొన్నప్పుడు అది ఒక చూపు. మనకి బుద్ధి, బయట ఉంటే నేత్రం ఇలా రెండు రకాల చూపులుంటాయి. ఇది కాక మూడవది చాలా ప్రధానమైంది ఏదైతే సత్స్వరూపమో దాన్ని దర్శించగలిగే చూపు. అదే పరమార్థజ్ఞానం.



ఈ మూడు ఇవ్వగలిగే శక్తి సూర్యభగవానునికి ఉంది. విద్యలలో ఉండే అపరావిద్య ఒక చూపైతే, పరావిద్య మరొక చూపు. ఈ రెండు చూపులు కూడా చాక్షుషీవిద్యే. ఆ విధంగా కూడా మనం భావన చేసి అడిగితే రెండు రకాల దృష్టులని స్వామి అనుగ్రహి స్తాడు. ఇందులో నమస్కారసహితమైన **ఆదిత్యాయ అక్షితేజసే** అని చెప్పుకున్నాం. ఇతరమంత్రాలు కేవలం వైదికం కనుక వాటి ప్రస్తావన ఇక్కడ వివరించడం లేదు.

ఇవి కాక ఆగమశాస్త్రంలో చక్షుష్మతీ అనే విద్యాదేవత రూపాన్ని చెప్పారు. ఇది మన కంటిగ్రుడ్డు లోపల భాగంలో ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ తల్లి గురించి చెప్తూ

**చక్షుఃతేజోమయం పుష్పం**
**కందుకం బిభ్రతీం కరైః**
**రౌప్యసింహాసనారూఢాం**
**దేవీం చక్షుష్మతీం భజే॥**

అని ధ్యానశ్లోకం. ఇది చక్షుష్మతీ మహామంత్రానికి ధ్యానశ్లోకం. దీన్ని కూడా మంత్రంగా చేసుకోవచ్చు. బీజాక్షరమంత్రం సభలలో చెప్పేదికాదు, పుస్తకాలలో ఇచ్చేది కాదు. ఇక్కడ చెప్పేవి మాత్రం సభలలో చెప్పవచ్చు.

దీన్నే మంత్రంగా చేసుకొని ఫలితం పొందవచ్చు.

చాలాకాలం క్రితం జరిగిన సంఘటన చెన్నైలో ఉన్న ఒక మిత్రునికి కంటి ఆపరేషన్ చేసారు. ఆపరేషనులో ఏదో పొరపాటు జరిగి కంటి గ్రుడ్డు కదలడం మానేసింది. డాక్టర్లకి కూడా ఏం జరిగిందో తెలియడంలేదు. అయితే పెద్దలు చెప్పిన అనుభవంతో ఈ ఒక్క శ్లోకాన్ని చెప్పడం జరిగింది. అతడు దీన్ని రోజుకి కొన్నిసార్లు చొప్పున మూడు రోజులు చదివాక ఆ కనుగ్రుడ్డు కదలడం మొదలైంది. డాక్టర్లుకూడా ఆశ్చర్యపోవడం జరిగింది.

ఆ శక్తి ఈ శ్లోకాలలో ఉంది. ఇలా దృష్టిదోషాలు పోవాలంటే **ఆదిత్యంనత్వా తమేవ స్తోత్రంకర్తుం**. ఆదిత్యుడికి నమస్కారం చేసి ఇవి స్తోత్రం చేయాలన్నారు. అక్కడున్న చక్షుష్మతీదేవి మన కంటియందు ఉన్నదని భావన చెయ్యాలి. చక్షుష్మతీదేవి రూపభావన చేసినా రూపంలో శక్తి రూపం ఎలా గమనించారో తెలుస్తుంది.

చక్షుఃతేజోమయం పుష్పం కందుకం బిభ్రతీంకరైః – చేత్తో ఒక బంతి పట్టుకున్నది. మరొక చేత్తో పువ్వు పట్టుకొంది. రౌప్యసింహాసనారూఢాం – వెండి సింహాసనం మీద కూర్చొన్న చక్షుష్మతీదేవిని భావన చెయ్యమని చెప్పారు. ఒక చేత్తో పువ్వు, మరొక చేత్తో బంతి పట్టుకోవడమంటే నేత్రశక్తి రెండు రకాలుగా ఉంటుందని సంకేతం.



ఒకదానికి ప్రతీక కుసుమం. మరొకదానికి ప్రతీక బంతి. బంతి అంటే తిరిగే శక్తి. ముడుచుకోకుండా విచ్చుకొనే శక్తిని కుసుమంగా చూపించారు. దృష్టికి ఉండవల్సిన విచ్చుకొనే శక్తి, అటు ఇటూ భ్రమించే శక్తి గోళాకారం. ఆ రెండిటిని పుష్పంగాను, కందుకంగాను చెప్పారు. మధ్యలో స్వచ్ఛమైన తెల్లని కాంతిలో కూర్చొని ఉంటుంది. దర్శనశక్తికి మూలమది. సూర్యుని అసలు వెలుగు అదే.

బయటికి సువర్ణవర్ణంతో కన్పిస్తున్నా అసలు వర్ణం తెల్లని వర్ణమని మనకి వైజ్ఞానిక శాస్త్రం కూడా చెప్తున్నది. అన్ని వర్ణాలకి అది ప్రధానం. శివాదిరూపాలను కూడా అలాంటి ధవళాకృతిరూపాలుగా భావించడానికి కారణం ఇదే.

అది శుద్ధమైన కాంతి. **రౌప్యసింహాసనారూఢాం** వెండిసింహాసనమని చెప్పడంలో ఉద్దేశం. నేత్రశక్తిని రూపకల్పన చెయ్యగానే దేవతామూర్తిలో ఆ శక్తి కనపడుతోంది. ఇలాగే మనకి ప్రతిదేవతలో శక్తి రూపకల్పనయే కనబడుతుంది. ఈ చక్షుష్మతీ శక్తి సూర్యునిది. ఈ శ్లోకం ఉపనిషత్తుల్లోని భాగమైన నమస్కారంతో శాస్త్రనియమాలకు లోబడి చెప్పుకున్నాం కనుక దీన్ని అందరూ నిత్యం పారాయణ చేసుకొని ఫలితాన్ని పొందవచ్చు.

సాంబుడు రచించిన ఆర్యాస్తోత్రాలు మూడు భాగాలు ఉన్నాయి. ఇప్పుడు చెప్తున్నది ద్వాదశార్యా. ఇది కాకుండా మరో రెండు రకాల ఆర్యలు ఉన్నాయి. అవి సప్త ఆర్యా, మరొకటి నవ ఆర్యా. సప్త ఆర్యాలో ఏడు శ్లోకాలు సౌరాష్టాక్షరీమంత్రంలో ఒక్కొక్క అక్షరాన్ని ఆది చేసుకొని రచించిన శ్లోకాలు. అదొక ప్రత్యేకత.

నవార్యా అనేది నవావరణ సంకేతంగా నవత్వపూర్ణత్వ సంకేతంగా రచించారు. ద్వాదశాదిత్య సంకేతంగా ద్వాదశార్యాస్తుతి. ఈ మూడు ఆర్యాస్తుతులు సాంబునికి సూర్యానుగ్రహం వలన లభించాయి.

**ఘృణయా భృతసురగణయాజగతఃకృత్స్నం తమోహరతః**

**మామకతమసోహరణేతరణే కస్త్రేశ్రమోవాస్తే** అని సాంబుడు రచించిన సప్తార్యలలో రెండవ శ్లోకం.

ఇది సూర్యఅష్టాక్షరీ మంత్రం ఉన్నవారికి తెలుస్తుంది. ప్రణవం తరువాత వెంటనే 'ఘృణి'తో మొదలౌతుంది ఆ అక్షరం.

ఈ శ్లోకం ఘృణయా అని మొదలైంది.

ఇలా ఏడు అక్షరాలతో కూడిన ఏడు శ్లోకాలు. అద్భుతమైన సౌర అష్టాక్షరీ మహితంగా రచించారు. ప్రణవాన్ని తీసుకొని ఆది అంతముల యందు నిక్షిప్తం చేసి దాన్ని అష్టాక్షరీ చేస్తారు. ఆ విధంగా సౌర అష్టాక్షరీ విశేషాన్ని ఆ శ్లోకంలో దర్శించాడు సాంబుడు. ఇలా సూర్యుని దర్శనశక్తి స్వరూపాన్ని భావన చేసిన తరువాత పదకొండవ శ్లోకంలో ప్రవేశిస్తున్నాం. దీనిలో కొన్ని ప్రధానమైన రోగాల పేర్లు చెప్పారు.



**వాతాశ్మరీగదార్శ స్త్వగ్దోషమహోదరప్రమేహాంశ్చ**

**గ్రహణీ భగన్దరాఖ్యాన్ మహతీస్త్వంమేరుజోహంసి**

వాత –వాయుసంబంధమైన వ్యాధి. దాని వల్ల శరీరంలో ఉబ్బసం మొదలైనవి వస్తాయి. అశ్మరీవ్యాధి –మూత్రకోశం రాళ్ళు ఏర్పడే వ్యాధి. అర్శః అంటే మూలవ్యాధి అని అర్థం. త్వక్ దోషం అంటే చర్మవ్యాధులు. మహోదరం అంటే పొట్టకి సంబంధించినది. గ్రహణీ అంటే అతిసారవ్యాధి ఇలాంటి ఎన్నెన్నో రోగాలను భగవానుడువైన నువ్వు తొలగించాలి అన్నారు.

ఈ శ్లోకం సంపూర్ణరోగనివారణకి పనికొస్తుంది. ఎంత నిష్కామోపాసన ఉన్నప్పటికీ ఆరోగ్యం కోసం భగవంతుని ప్రార్థించడం చాలా అవసరం. ఆరోగ్యం లేకపోతే మనం ధర్మార్థకామమోక్షాలు సాధించలేం. ఇది చాలా అద్భుతమైన స్తుతి. నిజానికి పదకొండు

శ్లోకాలతో పూర్తయింది. పన్నెండవది సంపూర్ణశరణాగతి స్తోత్రంగా భావన చెయ్యాలి. ఇది సూర్యశరణాగతి.

ఏ స్తోత్రాన్నైనా శ్రద్ధగా భావస్ఫూర్తితో ఒక్కసారి చేస్తే అది వందసార్లు పారాయణతో సమానం. చదువుతున్నప్పుడు ఆ భావనలో లీనమై మన హృదయం కరిగిపోవాలి. అలా తాదాత్మ్యం భక్తి ఒక్కటే ఇవ్వగలదు. కోరికలతో చేసే స్తోత్రాలకి ఆ శక్తిలేదు. ప్రేమతో చేసిన స్తోత్రం మాత్రమే అలా హృదయాన్ని కరిగించగలదు. ప్రేమస్వరూపుడైన సూర్యుని పై ప్రేముంటే అన్నీ పొందవచ్చు. సూర్యుడు ప్రేమస్వరూపుడని వీటన్నిటి ద్వారా తెలుస్తూనే ఉంది. ఆ ప్రేమలేకపోతే ఆయనకి ఇవన్నీ అవసరం లేదు.

ప్రేమని మనం ఎక్కడ పోల్చగలమంటే తనకేం ప్రయోజనం లేకపోయినా మనకోసం ఏదైనా చేసినపుడు దానిని ప్రేమ అంటారు. అదే అసలైన ప్రేమ.

సూర్యభగవానుడు తనకోసం కాక, అంతా మనకోసమే చేసేది. ఎన్ని రకాలు చేస్తున్నా డంటే అది తెల్సుకోవడానికి మన జీవితం సరిపోదు.

వేదాంతాది సహాయంతో మనం సూర్యుని నుంచి పొందుతున్న ఉపయోగాలు తెల్సు కోవాలి. భగవత్ప్రేమంతా సూర్యరూపంలో కనపడుతున్నది.



రవీంద్రనాథటాగోర్ భగవంతుని ప్రేమ గురించి చెప్తూ "ఈరోజు కూడా సూర్యుడు ఉదయించాడంటే, పరమేశ్వరునికి ఈ రోజు కూడా ప్రపంచంపై ప్రేమ ఉందని అర్థం" అన్నాడు. ప్రతి సూర్యోదయం భగవత్ప్రేమని చెప్తోంది. ఆయన ప్రేమే సూర్యరూపంలో వస్తోంది. ప్రేమ రంగు ఎరుపు. ఆయన మొట్టమొదట ఎర్రగా వస్తాడు. రాగము, అనురక్తి ఇవన్నీ ఇందులో కనిపిస్తాయి.

సూర్యోదయం అంటే పరమాత్మ ప్రేమపూర్వకమైన చూపు. ఆయన చూపే ప్రేమ. విరాట్ పురుషరూపంలో సూర్యుని స్థానం నేత్రస్థానం అని చెప్పారు. అయితే కొందరు చూడ్డం వేరు, చెయ్యడం వేరు. కాని పరమాత్మ చూస్తే చేసినట్టే. 'కేళిలోల విలసత్ దృగ్జాల సంభూత నానా కంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్' అన్నారు పోతన.

ఈక్ష్యత్యాత్మికా శక్తిః స ఐక్షతః –ఆయన చూపే ఆ స్పందనాత్మకమైన శక్తి.

ఆ ఈక్ష్యత్యాత్మకమైన పరమేశ్వర ప్రథమస్పందన శక్తి ఏదైతే ఉందో అది అనిర్వచనమై శాస్త్రగ్రాహ్యమైనది. అది మనకి ప్రత్యక్షంగా విరాట్ పురుషుని నేత్రంగా సూర్యుని రూపంలో కనబడుతుంది. దాన్నించే ఈ సర్వజగత్తుని నడిపిస్తున్నాడు.

గమనశక్తి, దర్శనశక్తి, శ్రవణశక్తి, చైతన్యం సర్వమూ అందులోంచి లభిస్తున్నాయి. తెరచిన కన్నులా ఉన్నాడన్నారు – **'దివీవచక్షురాతతం'** అయిన స్వరూపమది. సూర్యుడు విరాట్ పురుషుని నేత్రస్థానం అని చెప్పడంలో పరమాత్మ తన కనులద్వారానే కారుణ్యాన్ని వర్షిస్తాడు. ఈశ్వరకారుణ్యమంతా మనకి సూర్యుని ద్వారా భూమిపై ప్రసరిస్తోంది. ఇది తెలిస్తే మనం ఎల్ల వేళలా ఈశ్వరకారుణ్యంతో తడిసిపోతున్నామనే భావన వస్తుంది.

కాంతి ధార కారుణ్యధార. ఈ భావనతో సూర్యుని చూస్తే ఆయన తప్పకుండా మనల్ని కరుణిస్తాడు. అన్ని పురాణాలలో సూర్యుని గురించి ఉంది. భాగవతంలో జడ భరతుడు ఆదిత్యమండలంలో పరమాత్మని దర్శిస్తూ హిరణ్మయలోకంలో ప్రవేశిస్తాడు. అది అత్యద్భుతమైన ఘట్టం. బ్రహ్మజ్ఞుడైన భరతుడే ఆ విధంగా దర్శించిన వైనం మనకి కనిపిస్తుంది. అది ఉపనిషత్తులతో సమన్వయింపబడుతుంది.

విష్ణుపురాణంలో సూర్యరథవర్ణన మొదలైన విశేషాలతో ఒక అధ్యాయం మొత్తం వివరణ ఉంది. నారాయణుని సూర్యరూపంతో ఉపాసించు అని చెప్పడం. వైష్ణవాగ మాలలో ప్రాతఃకాలంలో సంధ్యావందనం చేసేటపుడు సూర్యమండలాంతర్వర్తియైన నారా యణుని ఉపాసించు అంటారు. వాళ్ళు సంధ్యావందనం చేస్తే ఆయన విష్ణుస్వరూపంగా, శైవులు చేస్తే శివస్వరూపంగా ఎవరైనప్పటికి సంధ్యావందనం, సూర్యుడు మారవు.

సూర్యునితో మనకి ఎన్ని రకాలుగా అనుబంధం ఉంటుందో పన్నెండో శ్లోకంలో చూపిస్తున్నారు. ఇది మరింత అవగతం కావడం కోసం భవిష్యోత్తరపురాణంలో అత్యద్భుత మైన ఉపదేశం కనబడుతుంది. దీన్ని కథ అనకూడదు. ఉపదేశమనే అనాలి. సుమం తుడనే మహర్షి శతానీకుడు మొదలైన మహర్షులకు సూర్యతత్త్వాన్ని చెప్తాడు. సూర్యుని ఆరాధనకి సంబంధించిన విశేషాలు భవిష్యోత్తరపురాణంలో ప్రత్యేకంగా ఉన్నాయి. అనేక ఉపాసనారహస్యాలు అందులోంచే చెప్పుకుంటున్నాం.

వ్యాసుడు సామాన్యులు కూడా తరించడం కోసం మార్గాలు అక్కడ చెప్పాడు. వేదంలో చెప్పింది యథాతథంగా కాకుండా సులభంగా ఎలా తరించాలో చూపిస్తాడు. శతానీకుడు మొదలైనవారు సుమంతునితో అద్భుతమైన చర్చ చేస్తారు. యోగానికి సంబంధించి ఒక విషయాన్ని చెప్తున్నాను వినమని సుమంతుడు చెప్తాడు.

దాని పేరే **సూర్యయోగం** అని చెప్తాడు.

దీనిగురించి చర్చ బ్రహ్మలోకంలో జరిగిందని సుమంతుడు వారితో చెప్తూ ఒకప్పుడు ఋషులందరూ కలిసి బ్రహ్మని అడుగుతున్నారు 'బ్రహ్మమును శ్రవణ మనన నిధిధ్యాసాలు

చెయ్యాలంటే ప్రధానంగా కావల్సింది చిత్త ఏకాగ్రత. అది కుదరాలంటే అనేకం కుదరాలి. దేహంలో ఉన్నంతకాలం మనస్సు శరీరాన్ని అంటిపెట్టుకొని ఉంటుంది.

మనోగతమైన దోషాలు, శరీరగతమైన దోషాలు రెండూ బుద్ధిని ఏకాగ్రంగా నిలపలేవు. ముందు చిత్తాన్ని శుద్ధం చేసుకోవాలన్నారు. దానికోసం రకరకాల ప్రక్రియలు. సత్కర్మలు గాని, ఉపాసనలుగాని, యోగంగాని అందుకే వచ్చాయి.

**యోగః చిత్తవృత్తినిరోధః** అంటారు పతంజలిమహర్షి. పతంజలి యోగం వేదం లోనిదే. వేదాంతానికి సహకారియే. యోగం లేకపోతే ఏకాగ్రత ఏలా ఉంటుంది? మనం దేనిని చింతన చేస్తాం? శుద్ధమైన చిత్తం లేనివాడు వేదాంతవిచారణ చేసినా ప్రమాదం. చిత్తవృత్తి నిరోధమనే మాట తేలిక గానీ సాధించడం అంత తేలిక కాదని' ఋషులు బ్రహ్మని ప్రశ్నించారు.

బ్రహ్మదేవుడు సమాధానం చెప్తూ చిత్తవృత్తి నిరోధం కొన్ని జన్మలు ఎత్తినప్పటికీ కష్టమే అన్నాడు.

మనస్సును నిలపడమే సృష్టిలో మహాకష్టమైన పని. అదే పరమాత్మ చెప్తూ **'అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహంచలం'** అత్యంత క్లిష్టమే అంటాడు.



చిత్తాన్ని శుద్ధం చేసుకోవడం, ఏకాగ్రం చేసుకోవడం రెండూ కష్టమే. కాని అలాంటి కష్టాన్ని సులభంగా సాధించే ఉపాయం చెప్తాను. ఆ ఉపాయం పేరు సూర్యయోగం అన్నాడు. ఇది ఎలా చెయ్యాలనేదానికి కొన్ని పద్ధతులు చెప్పాడు. ఇవన్నీ చాలా సులభమైన పద్ధతులు. అవి ముఖ్యంగా ప్రాతఃకాలంలో తాను శుద్ధుడై సూర్యభగవానుని ఆరాధించడం. నిరంతరం ఆ సూర్యభగవానుడే సర్వకర్త అనే చింతన చెయ్యడం. ఆయనే మనలో బుద్ధిరూప చైతన్యంగాను, ఆత్మరూపచైతన్యంగాను ఉన్నాడనే భావనతో ఉండడం.

భుజించినా, నిదురించినా, గమనం చేసినా, కూర్చున్నా - గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్రన్ ఉన్మిషన్ నిమిషన్నపి - వీటిల్లో ఏది చేస్తున్నా సూర్యభగవానుని గురించి చింతన చెయ్యాలి. ఆ నిరంతన చింతనే భక్తి.

త్రిసంధ్యల యందు సూర్యభగవానుని ఆరాధించాలి. ప్రాతఃకాలంలో నిలబడి, సాయం సమయంలో కూర్చుని సూర్యుడు ఉదయించేదిక్కు అస్తమించేదిక్కు తిరిగి ఆరాధన చెయ్యాలి. సంధ్యలలో సూర్యుని ఆరాధించని వానికి ఇహంలో సిద్ధిరాదు. బ్రహ్మజ్ఞానం కూడా రాదు.

అహరహఃసంధ్యాం ఉపాసీత - ఇది ప్రధాన ఉద్దేశం. తరించాలనుకొనే ప్రతివాడికి

సంధ్యోపాసన ఉంది. ఉపనయన సంస్కారాదులు ఉన్నవారు ఆ సమయంలో తండ్రిద్వారా బ్రహ్మోపదేశంగా పొందిన మంత్రాన్ని చేస్తారు. ఇతరులు సూర్యభగవానుని యందు ప్రీతితో అనేక స్తోత్రాదులు ఉన్నాయి వాటిన్నిటితో సంధ్యాదుల యందు ఆరాధించాలి. ప్రతివారు సంధ్యలయందు ఆరాధించాలి.

ఎవరైనా సంధ్యలలో నిద్రపోయి అనాచారంగా ఉంటే ఈ జన్మకాదు ఎన్ని జన్మలు ఎత్తినా తరించలేరు. ఇంకో విచారణ చెయ్యకుండా ఇదే చేసుకుంటూ వెడితే ఆ సంధ్యా తత్త్వమే మనల్ని ఆత్మతత్త్వంలోకి తీసుకెడుతుంది.

బుద్ధిని సైతం ప్రేరేపించే ఏ చైతన్యం ఉందో ఆ చైతన్యమే ఆదిత్యమండలంలో ఉన్నది, నా హృన్మండలంలో ఉన్నదని రెండిటిని తాదాత్మ్యం చేసే సాధనే అక్కడున్నది.
మనం ఏ ఆదిత్యోపాసన చేసినా తిన్నగా ఆత్మవైపుకి తీసుకెళుతుంది. గాయత్రీ హృదయమదే!

బుద్ధింయానః ప్రచోదయాత్ - బుద్ధిని ప్రేరేపించే...

**యోదేవఃసవితా అస్మాకం ధియో ధర్మాదిగోచరాః**

**ప్రేరయేత్తస్యయద్భర్గః తద్వరేణ్యంఉపాస్మహే** - అక్కడ స్పష్టంగా చెప్పే బుద్ధులను ప్రేరేపించే చైతన్యం సూర్యమండలంలో ఉంటూనే సమస్తము నందు వ్యాపించి ఉందని ఒక భావం. మన హృదయమండలంలో ఆత్మగా ఉన్నదదేనని స్పష్టం చేస్తున్నాడు. సూర్యోపాసన తిన్నగా ఆత్మజ్ఞానంతో సమన్వయం అవుతోంది.



ఇలాగే చూస్తే ఇది ఆదిత్యహృదయంలో కనపడుతుంది. ఆలోచిస్తే ఆదిత్య హృదయం కూడ ఉపనిషత్తే. అద్భుతమైన జ్ఞానం అందులో చూపిస్తారు. ఆ క్రమంలోనే అద్భుతమైన పద్ధతి ఉంది. వేదరహస్యాలన్ని కొద్దిపాటి శ్లోకాలలో చెప్పారు.

**నాశయత్యేషవైభూతం తదైవ సృజతి ప్రభుః పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః** అనే శ్లోకం దగ్గర సృష్టిస్థితిలయకారకుడైన ఈశ్వరుడు ఇతడు అని ఈశ్వరభావంతో సూర్యుని చూసారు.

తరువాత **ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః** -- నిద్రించే సమయంలో, మెల కువగా ఉన్న సమయంలో కూడా సర్వభూతాల యందు ఇతడే పరినిష్ఠితుడై ఉన్నాడంటే ఆయన ఆత్మస్వరూపుడైన సూర్యుడే.

మనం నిద్రపోయినా మనలో 'నేను' అనే చైతన్యంగా ఉన్నవాడు. వేదాంతం చెప్పిన జ్ఞానమార్గంలోనూ ఆయనే కనపడుతున్నాడు. **ఏషచైవాగ్ని హోత్రం చ ఫలం చైవాగ్ని**

**హోత్రిణాం వేదాశ్చక్రతువశ్చైవ క్రతూనాం ఫలమేవచ యానికృత్యేషులోకేషు సర్వహ్యేష రవిప్రభుః** – సర్వ ఏష రవి ప్రభుః అని చెప్పడం అచ్చంగా **సర్వంఖల్విదం బ్రహ్మ** అనే వాక్యంతోనే అది పూర్తి చేసాడు. అదే **సర్వం బ్రహ్మమయం జగత్.**

ఏషచైవాగ్ని హోత్రం చ ఫలం చైవాగ్ని హోత్రిణాం అని చెప్పినప్పుడు యజ్ఞానికి సూర్యునికి ఉన్న అనుబంధమంతా అక్కడ కనపడుతుంది. అలాగే వేదంలో చెప్పబడ్డ కర్మకాండ అంతా ఆయనే. జ్ఞానకాండ అంతా ఆయనే. ఉపాసనా కాండ ఆయనే. మూడు ఆయనే అనే సమన్వయం అందులో కనిపిస్తోంది. ఈ భావంతో నిరంతరం ఎవరైతే ఆదిత్యుని ఉపాసిస్తూ ఆయన దివ్యనామాల్ని మననం చేసుకొంటూ ఉంటారో ఆ సూర్యయోగం క్రమంగా చిత్తాన్ని శుద్ధిచేసి చిత్తాన్ని ఏకాగ్రపరచి మనలో ఉన్న ఆ సర్వవ్యాపక ఆత్మతత్త్వాన్ని మనకి ఎరుకపరుస్తుందనే విషయాన్ని బ్రహ్మదేవుడు ఋషులకు చెప్పగా వారు ఆ సూర్యయోగాన్ని అవలంబించారని భవిష్యోత్తరపురాణంలో అద్భుతమైన భాగం కనపడుతుంది.

అటుతరువాత సూర్యుని విరాడ్దర్శనం, సూర్యుని స్థూలరూప, సూక్ష్మరూప వర్ణనం చూపిస్తాడు. సూక్ష్మరూపం అంటే ఆత్మరూపమని, అదే విధంగా శబ్దాలలో ప్రణవం సూర్యుని సూక్ష్మరూపమని చెప్తారు. ఇంకో రహస్యమైన విషయం ఆగమశాస్త్రంలో కనపడుతుంది. సూర్యభగవానుడు **సర్వేషాం అక్షరగణానాం పతిః భాస్కరః** అన్నారు. చాలా ఆశ్చర్యకరమైన మాట. అక్షరాలన్నిటికి పతి.

**ఓంకారస్వరూపుడైన సూర్యుడు దాన్నించి జనించిన సర్వాక్షరాలకి ప్రభువు.** అక్షరజ్ఞాన మంతా సూర్యుని నుంచే లభిస్తున్నది. మనం వైఖరీ రూపమైన వాక్కుని సూర్యభగవానుని వల్లే బయటకి పలకగలుగుతున్నాం. వాగ్రూపంగా వెలికి వచ్చిన పలుకులు ప్రధానం ఏడు ఛందములుగా ఉంటాయి. ఆ ఏడు ఛందాలే సప్తాశ్వాలు.

శబ్దరూపుడైన సూర్యుడు సప్తాశ్వఛందస్సులో వస్తాడు. మనం ఎన్ని మాటలు మాట్లాడినా ప్రతిదానికి ఒక స్వరం ఉంటుంది. మనకి తెలియకపోయినా మన ధ్వనిలో స్వరం దాగి ఉంటుంది. ఆ స్వరాన్ని పద్ధతిగా తెల్సి అంటే సంగీతం అవుతుంది. లేకపోతే శబ్దం అవుతుంది. స్వరంలేని శబ్దం భూమి యందు లేదు. ఈ స్వరాలు సంపూర్ణంగా ఏడు పలుకగలిగే శక్తి భగవంతుడు మానవునికి మాత్రమే ఇచ్చాడు. మిగిలిన జంతు జాలాల్లో ఏదో ఒక్క స్వరం పలుకుతుంది.

మనం లక్షలు మాట్లాడినా స్వరాలు మాత్రం ఏడే. మనలో ఉన్న నాదరూప సూర్య

చైతన్యం సప్తస్వరాలనే అశ్వాలతో పనిచేస్తుందన్నారు. సప్తస్వరాలే సప్తాశ్వాలు. ఈ తత్త్వాన్ని సాంబుడు పంచాశికలో చెప్తాడు. మామూలుగా సూర్యమండలంలో ఏడు గుఱ్ఱాలవాడు కాకుండా మన హృన్మండలంలో కూడా ఏడు గుఱ్ఱాలవాడు కనపడతాడు.

సూర్యభగవానుని **అంతర్బహిశ్చతత్సర్వమ్** అన్నట్టుగా తెల్సుకొని సాధన చెయ్యాలి. సూర్యోపాసన క్రమక్రమంగా అంతర్బహిర్వ్యాపకమైన ఏకచైతన్యాన్ని ప్రస్తావించడానికి దోహదపడుతోంది. మనస్సు పెట్టి చెయ్యాలి. దాన్నే శ్రద్ధ అన్నారు.

మహాపండితునికైనా శ్రద్ధరావడం మహాకష్టం. పాండిత్యం రావడం సులభమేమోకాని శ్రద్ధరావాలంటే మాత్రం అనేక జన్మల సుకృతం ఉండాలి. కొందరికి ఏ పాండిత్యం ఉండదు శ్రద్ధ ఉంటుంది. ఆ జన్మే చివర జన్మ చేసుకొంటారు.

సూమారు ఏభై సంవత్సరాల క్రితం అప్పటి జ్యోతిష్మఠ పీఠాధిపతులైన శంకరాచార్యులవారు వద్దకు ఒకాయన వచ్చి అయ్యా! 'నేను చాలా దుఃఖాలలో ఉన్నాను' అన్నాడు. ఎక్కడి నుంచి వచ్చావంటే 'నేను వ్రజవాసిని' అన్నాడు. అంటే 'బృందావనంలో ఉండేవాడు'. దర్శనం కోసం ఆ స్వామివారి వద్దకు వచ్చాడు. నీ సమస్య ఏంటి నాయనా! అని అడిగితే 'నేను చాలా చదువుకున్నాను. కాని నాకు ఏ ఉద్యోగం రావడం లేదు. ఆధారం లేదు. శరీరానికి ఎప్పుడూ ఏదో ఒక రోగం, అని చెప్తే నీ పుట్టక ఏంటి? అని అడిగారు. బ్రాహ్మణుడిని అన్నారు.



"బ్రాహ్మణపుట్టక పుట్టి ఈ ప్రశ్నలు ఎలా అడుగుతున్నావు? నీకు ఉపనయనం అవుతుంది. అప్పటి నుంచి సూర్యుని సంధ్యలలో ఆరాధించుకోవాలి. అర్ఘ్యప్రధానం చెయ్యాలి. ఉపనయనం చేసేటప్పుడు ఒట్టు పెట్టావు? అది మానేసి బ్రతికితే వాడు పరమపాపాత్ముడవుతాడు నాయనా! సంధ్యారాధనలేని జీవితమంత వ్యర్థజీవితం మరొకటి లేదు. ఎంతో సంపాదించినా చిట్టచివరకి మనగతి చూసుకోవాలి. దానికేం చేసుకొన్నామో చూసుకోవాలి. సంధ్యాక్రియలు లేకుండా ఎన్ని చేసినా లాభం లేదు. కాబట్టి సూర్యుని ఆరాధించు నాయనా!" అని చెప్పారు.

వాళ్ళ సంప్రదాయం ప్రకారంగా ముందు వర్ణం అడిగేవారు. ప్రతివర్ణంవారికి ఒక్కొక్కరికి ఒక్కో పద్ధతిలో సూర్యారాధన చెప్పేవారు. స్త్రీలకి కూడా సూర్యారాధన ఉంది. సర్వవర్ణాలవారికి సూర్యారాధన ఉంది. ఎవరి పద్ధతిలో వారికి ఉంది. విప్రుడికి మాత్రం ఉపనయనం అయిన దగ్గర్నుంచి చివరి వరకూ సంధ్యావందనం చెయ్యవలసిందే అని శాస్త్రం నిర్దేశించింది.

సన్యాసాశ్రమం తీసుకొన్నవారికి ఆ నియమాలు పాటిస్తూ ప్రణవోపాసన చేస్తే అది వేరే విషయం. కాని గృహస్థ జీవితం గడుపుతూ మధ్యలో ఏవో ఉపనిషత్తులు చదివానని చెప్పి మనం భ్రష్టులమై సంధ్యావందనం చెయ్యడం మానివేసి ఇతరుల చేత చెయ్యడం కూడా మానిపిస్తే అలాంటివి పతనహేతువులే తప్ప వృద్ధికారకాలు కావు.

వేదాంతం సులభంగా అనిపిస్తున్న రోజుల్లో ఉన్నాం కనుక ఇంత నిష్కర్షగా వివరణ ఇవ్వడం. కర్మలనుంచి భ్రష్టులవ్వడానికి కొంతమంది వేదాంతాన్ని అలుసుగా తీసు కొంటున్నారు. కర్మలని చక్కగా ఆచరిస్తే వేదాంతం దానంతట అదే అబ్బుతుంది.

పీఠాధీశ్వరులు ఆ విప్రునితో "రోజూ ఆ సూర్యభగవానునకు అర్ఘ్యప్రధానం చెయ్యి. నీ సమస్యలన్ని చక్కబడతాయి" అనిచెప్పి పంపించారు. ఆ చెప్పిన ప్రకారంగా చేసి వెంటనే కొద్దిరోజులలోనే సూర్యారాధన వల్ల అతడు ఫలితాన్ని పొందాడు. అతడికి చక్కటి ఉపాధి లభించింది. తరువాత శరీరానికి వచ్చిన అనారోగ్యాలు పోయాయి.

కాశీలో అసీఘాట్ దగ్గర హరిహరానందస్వామి అని సంప్రదాయబద్ధమైన యతీశ్వరులు ఉండేవారు. బెనారస్ హిందూ యూనివర్సిటీ స్థాపించిన శ్రీ మదన్మోహన్ మాలవ్యా ఆ యతీశ్వరుల దర్శనానికి తరచూ వెళ్ళేవారు.



ఈయన దృష్టిలో ఆయన సాక్షాత్తు విశ్వనాథుడేనని భావించేవారు. ఆ యతీశ్వరుల వద్దకు ఎవరు ఏ సమస్యతో వచ్చినా అద్భుతమైన పరిష్కారం చెప్పేవారు. ఇవన్ని రామచరణ్దాసు అనే మహాత్ముడు గ్రంథస్థం కూడా చేసారు.

ఎవరొచ్చినా వారి సమస్యలను విని వారి వివరాలను తెల్సుకొని వారితో ముందు గంగలో స్నానం చెయ్యమని, తరువాత ఆ గంగనీరు దోసిట నిండా తీసుకొని సూర్యునికి నమస్కారం చేసి ఆ గంగని సూర్యునికి సమర్పించి నిరంతరం రామనామ జపం చేసుకో మని చెప్పేవారు. ఇలా చేస్తూ ధర్మబద్ధమైన జీవితాన్ని గడపమని చెప్పేవారు.

సత్యం, అహింస, శౌచ, అస్తేయాలు మాత్రం విడిచిపెట్టరాదు. అవి చాలా ప్రధానం. అవి పాటిస్తూ ఇవి చెయ్యాలి. ఇలా సూర్యారాధన చేస్తే తప్పకుండా ఇహానికి, పరానికి హేతువు అవుతుంది. ఇలా చేస్తున్నప్పుడు సూర్యుని పట్ల ఉండవల్సిన భావం చెప్తున్నారు.

**త్వంమాతా త్వం శరణం త్వం ధాతా త్వం ధనం త్వమాచార్యః**
**త్వం త్రాతా త్వం హర్తావిపదాం అర్కప్రసీద మమభానో**

పై శ్లోకాన్ని చదివేటప్పుడు మాత్రం శ్లోకాన్వయం జాగ్రత్తగా చూసుకోవాలి. త్వంమాతా- త్వంశరణం- త్వంధాతా- త్వంధనం -త్వమాచార్యః- త్వంత్రాతా-

త్వంహర్తావిపదాం– అర్కప్రసీదమమభానో. ఇది ఆఖరి శ్లోకం. శరణాగతి. ప్రసీద మమ భానో – నా యెడల నువ్వు ప్రసన్నుడవు కమ్ము అంటే స్వామీ! నా పై అనుగ్రహం చూపించు అని అడుగుతున్నారు.

ఆయన అనుగ్రహాన్ని పొందాలంటే ఆయనపై మన భావన ఎలా ఉండాలో చెప్తూ త్వంమాతా– నువ్వు నా తల్లివి. జగన్మాత సూర్యభగవానుడనడంలో సందేహం లేదు. ఆయనే జగన్మాత, ఆయనే జగత్పిత. ఎలాగైనా భావించుకోవచ్చు. అందుకే ఆయన కేవలం జ్యోతిరూపంగా ఉన్నాడు.

మనం ఏ భావంతో ఆరాధించినా తద్భావంతో అనుగ్రహించగలడు.

సూర్యభగవానుని అమ్మరూపంతో ఆరాధిస్తే ఆదిత్యమండలస్థానా పరబ్రహ్మస్వరూపిణీ – ఆదిత్యమండలంలోని పరబ్రహ్మస్వరూపిణి గాయత్రీదేవి అయిన త్రిపురసుందరీ అన్నారు. త్రిపదా –గాయత్రీ ఆ తల్లే.

యాజ్ఞవల్క్యుడు కూడా గురుశాపంతో విద్యనంతటిని పోగొట్టుకొన్న తరువాత సూర్యుని ప్రార్థిస్తే ఆ సూర్యమండలం ద్వారా సరస్వతీదేవి వచ్చి ఆయనకి విద్యని ప్రసాదించినట్టుగా దేవీభాగవతం. కొన్ని చోట్ల సూర్యుడే విద్యని ప్రసాదించాడని చెప్పారు. ఏది నిజమంటే రెండూ నిజమే. ఆ సూర్యుని ఆశ్రయించడంచేత ఆ సూర్యబింబమందు సరస్వతి ఆవిర్భవించి అనుగ్రహించింది. ఇది అన్వయించుకోవల్సిన పద్ధతి.



లక్ష్మీదేవి అయినా, సరస్వతీ అయినా, దుర్గ అయినా ఎవరైనా అందులో నుంచి అనుగ్రహించవలసిందే. **జాతవేదసే సునవామ** అని అగ్నిహోత్రుని ప్రార్థించి ఆ రూపంతో రమ్మని అడుగుతాం. అది మనం భౌతికంగా రగిల్చిన అగ్నిహోత్రమేకాదు సూర్యమండలం లోంచి అనుగ్రహించే మహాలక్ష్మి రూపం కూడా అదే.

సూర్యుని కాంతికి లక్ష్మి అని పేరు. లక్ష్మి అనే మాటకి శోభ, కాంతి ఇత్యాది అర్థాలు. సూర్యకాంతే పెద్ద శోభ. అదే సౌందర్యం. అదే ఉత్సాహజనకం. అన్ని లక్ష్ములు అక్కడ ఉన్నాయి. బంగారంలా మెరిసిపోతోంది అంటామే ఆ బంగారపుకాంతి. ఆ హిరణ్యవర్ణమైన లక్ష్మీకళంతా ఆయన కాంతి అయితే, ఆ కాంతి ఎవరిదో ఆయన నారాయణుడు. రెండూ కలిపి చూస్తే లక్ష్మీనారాయణస్వరూపం.

త్రిశక్తులు – ముగురమ్మలుగాని, ముగురయ్యలుగాని వారి స్థానం అదే.

**త్వం శరణం – శరణం** అనేమాటకి **ఆశ్రయం** అని అర్థం. మాకు నువ్వే దిక్కు. ఆ మాట నిజంగా మనం అనగలిగితే సూర్యశరణాగతి చాలా ప్రత్యేకమైన పద్ధతి.

**త్వం ధాతా** - నువ్వు మాకు పోషకుడవు. మా బరువు బాధ్యతలన్నీ నీవే.

**త్వం ధనం** - నువ్వు మా ఐశ్వర్యానివి అన్నారు. సర్వదారిద్ర్యనిర్మూలనం.

**త్వం ఆచార్యః** - నువ్వు మా గురువు అన్నవారిలో గట్టివాడు ఆంజనేయస్వామి.

రామాయణంలో పెద్దజ్ఞాని ఆయన. ఆయన గురించి పరిచయం చేస్తూనే 'హనుమాన్ వాక్యకోవిదః' అంటారు వాల్మీకి. హనుమాన్ శబ్దానికే **జ్ఞానవాన్** అని అర్థం.

**అగ్నిర్మేవాచిశ్రితః** - అగ్ని వాక్కు, ఆ అగ్నిస్వరూపుడే అగ్నిందూతరవృణీమహే అని చెప్పినట్టుగా రామదూతగా వచ్చిన జ్ఞాని. ఆయనకి అంత శక్తి, గొప్పతనం ఎలా వచ్చింది? హనుమంతుడు రుద్రాంశ అనే విషయం ప్రక్కనపెట్టి వారు మనకి ఆదర్శాన్ని చూపిస్తారు కనుక దాన్ని పరిశీలిద్దాం.

హనుమ బాల్యాన్ని చూస్తే పసితనంలోనే సూర్యుని చూసి పండని పైకి ఎగిరాడు. అసలు పసివారైనా పెద్దవారైనా ఎగరగలరా? అక్కడే హనుమ సామాన్యుడు కాదని తెలుస్తుంది. ఎగిరి సూర్యుని వద్దకు వస్తుంటే ఆయన ఆనందించాడు. ఆయనకి హనుమ ఎవరో తెల్సు. వెంటనే హనుమకి ఇబ్బంది లేకుండా ఆయన తేజస్సుని ఉపసంహరించు కొన్నాడు.



ఉపసంహరణం కూడా సూర్యభగవానుని చేతిలోనే ఉంది. ఆయన నిగ్రహానుగ్రహ సంపన్నుడు. తననితాను తగ్గించుకొంటే హనుమ కూర్చుని ఆడుకొంటున్నాడు. ఆ తరువాత ఇంద్రుడు రావడం, వజ్రాయుధంతో కొట్టడం మిగతా కథ. మొత్తానికి అక్కడే సూర్యుడు ఆయన్ని అనుగ్రహించాడు.

ఆ తరువాత ఇంద్రుడు తన వజ్రాయుధంతో కొట్టడం, వాయుదేవుడు వాయువుని స్తంభింపజేయడం, బ్రహ్మదేవుడు వచ్చి పిల్లవాడ్ని పూర్తి బలోపేతుని చేసినపుడు సర్వదేవతలు వారివారి తేజస్సుని హనుమకి ఇస్తారు. అందుకే హనుమ సర్వదేవతాత్మకుడు. అపుడు సూర్యుడు తనలో నూరవవంతు తేజస్సుని హనుమకి ఇచ్చాడు. హనుమకి విద్యని ఇస్తానని చెప్తాడు. సరే అంతా అయ్యింది అప్పటికి హనుమ చిన్నవాడు. తరువాత విద్యాభ్యాస దశ రాగానే హనుమ నేను సూర్యుడి వద్ద చదువుకుంటా అన్నాడు.

హనుమకి సూర్యభగవానుడు సర్వవేదవిద్యలు ఇచ్చాడు. హనుమంతుని జ్ఞానాన్ని చూసి శ్రీరాముడు కూడా ఆశ్చర్యపడ్డాడు. సర్వవేదాలు, సర్వశాస్త్రాలు ఆయనకి కరతలా మలకం అయ్యాయి. హనుమ మూర్తీభవించిన జ్ఞానమూర్తి. విద్యని తెల్సుకొవడమే కాదు అనుక్షణం విద్యని తన ప్రవర్తనలో ఆయన ప్రదర్శించాడు. విద్యాధిదేవత హనుమ. ఆచార్యస్థానాన్ని

పొందాడు. కారణం సూర్యుని **ఆచార్యః** అని శరణువేడడం.

హనుమ ప్రతిక్షణం సూర్యభగవానుని తలంచుకోవడం మనకి రామాయణంలో కనపడు తుంది. సముద్రలంఘనం ముందు **ససూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే-** అని ఇంద్రుని పవనుడు, స్వయంభువు అని సూర్యాత్మకంగా ఉపాసన చేసాడు.

మనకి పంచభూతవ్యవస్థ సూర్యుని నుండే వస్తోంది.

ఇంద్రశబ్దం కూడా సూర్యపరమైనదే. ద్వాదశాదిత్యులలో ఇంద్ర శబ్దం ఉంది. ఇంద్రుడు బలానికి స్వరూపం. మన వైదికదేవతా వ్యవస్థ చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

సూర్యుని ఇంద్రరూపంతో ఆరాధన చేస్తే వారికి వజ్రసమానమైన బలం వస్తుందని చెప్పారు. హనుమంతుని బలశక్తిలో అది కూడా ఒకటి.

**వజ్రసంహననోపేతో హనుమాన్ మారుతాత్మజః** అని చెప్పినట్టుగా ఆయన బలానికి స్వరూపం. జగచ్చక్షువైన సూర్యభగవానుని అనుగ్రహంతో రామాయణంలో ఎన్నో సాధిం చారు హనుమ.

పిల్లలకి తెల్లవారుజామున లేచి సూర్యునికి నమస్కారం పెట్టే అలవాటు చిన్నతనం నుంచి చెయ్యాలి. ఆ సంస్కారం నేర్పగలిగితే వారి భవిష్యత్ సూర్యభగవానుడే చూసు కొంటాడు.



మనం మన పిల్లలని తీర్చిదిద్దలేకపోతే ఇలాంటి సంస్కారవంతమైన అలవాట్లు చేసి తీర్చిదిద్దమని సూర్యునికి అప్పగించాలి. కనుక పిల్లలచేత స్నానం చేసిన వెంటనే సూర్యుని నమస్కారం చేయించండి.

**త్వం త్రాతా** – నువ్వు రక్షకుడవు. తల్లి తండ్రి సూర్యుడే అన్నాడు. ఈ శరీరానికి ఈ తల్లి కనబడినప్పటికి ఆ తల్లి శరీరంలో ఉన్న చైతన్యంగా మనం గర్భంలో ఉన్నప్పుడు మనల్ని పోషించింది సూర్యుడే. ఇది ఒక వైజ్ఞానిక రహస్యం. మనశరీరాలు రావడానికి కారణం సూర్యుడే తల్లిదండ్రులవలే అనుగ్రహిస్తున్నాడు. అందరిలో ప్రాణశక్తి సూర్యుడే.

ఒక్కొక్క ఉపనిషత్తు సూర్యుని ఒకోలా చూపిస్తోంది. ప్రశ్నోపనిషత్తులో చాలా భాగం సూర్యుని ప్రాణస్వరూపుడిగా చూపిస్తుంది. ప్రాణప్రదాత సూర్యుడు.

మాతృగర్భంలో ఉన్నప్పుడుగాని, జీవనిర్మాణంలో గాని, వృష్టిద్వారా జీవుడు ప్రవేశించి నపుడు గానీ ఆ వృష్టికారకుడైనవాడు సూర్యభగవానుడే.

మన బ్రతుకంతా సూర్యకిరణాలపై ఆధారపడి ఉంది. అధోగమనంగాని, ఊర్ధ్వ గమనంగాని అంతా ఆయనపై ఆధారపడి ఉంది.

ప్రాప్యం, ప్రాపకం - పొందించే వాడు ఆయన. పొందబడే స్థానం కూడా ఆయనే అన్నారు అప్పయ్యదీక్షితులవారు.

క్రమముక్తిలో హిరణ్యగర్భలోకానికి వెళ్ళే పద్ధతిగాని, హిరణ్యగర్భరూపంలో ఉన్న తేజస్సుగాని సూర్యుడే అన్న విషయాన్ని మనకి శాస్త్రంచెప్తోంది.

దాన్ని గ్రహించి ఆయన మనకి చూపిస్తున్నారు. అది పొందించేవాడు ఆయనే.

పొందాక ఆ స్థానంలో ఆ హిరణ్య గర్భరూపంలో భాసించేవాడు ఆయనే.

**త్వంహర్తావిపదాం** - విపత్తు కలిగిన వెంటనే సూర్యుని ఆశ్రయిస్తే విపత్తు నుంచి తొలగిస్తాడు. అర్క అని సూర్యుడికి పేరు. **అర్చనీయః** అని అర్క శబ్దానికి అర్థం చెప్పారు. పూజింపబడేవాడు, పూజింపదగినవాడు. పూజించదానికి సరియైన స్థానమదే.

మిగిలివన్నీ తరువాతే. విగ్రహాలకంటే ప్రధానం సూర్యభగవానుడు. ఆది సూర్య భగవానుడు. తరువాత అగ్నిహోత్రం. ఆ తరువాత ప్రతిమ, యంత్రం మొదలైనవి.

అసలు హృదయమండలమే ప్రధానంగాని అది అంత తేలికగా రాదు. దగ్గర ఉంది కనుక దొరకదు. ముందు ఆదిత్యమండలంలో మొదలుపెడితే క్రమంగా మన హృదయ మండలంలోని పరమాత్మ దర్శనం కలుగుతుంది.



**ప్రసీదమమ భానో**-ఇలా స్వామి ప్రసన్నతను పొందే పన్నెండుశ్లోకాల సారమే ద్వాదశార్యాస్తుతి.

అధర్వణ వేదంలో సూర్యుని గురించి చెప్తూ **సనఃసూర్యప్రతిర దీర్ఘమాయుర్మారిషా సుమతేతేశ్యామ** - నువ్వు మాకు దీర్ఘాయువును ప్రసాదించేవాడవు. మాకు ఏ వేదనా లేకుండా చేసేవాడవు. నువ్వు సుమతిగా మమ్మల్ని అనుగ్రహించు అన్నారు.

సుమతిగా అంటే **శివోనస్సుమనాభవ** అన్నట్టుగా సుమతిగా - అంటే మా ఎడల కృప చూపిస్తూ ఉండు. భగవంతునికి మన యందు సద్బుద్ధి అంటే మన ఎడల కారుణ్యమే సద్బుద్ధి. మా పట్ల కారుణ్యంతో అనుగ్రహించమని ప్రార్థిస్తున్నారు.

ఋగ్వేదం మొదలుకొని అధర్వణవేదం వరకూ అనేకం సూర్యసంబంధమైన మంత్రాలు మనకి గోచరిస్తూ ఉంటాయి. సర్వమంత్రాలు సూర్యుని వైపు అన్వయించుకోవచ్చు.

ప్రశ్నోపనిషత్తు సూర్యుని గురించి చెప్తూ -

**అథోత్తరేణతపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మానమన్విష్యాదిత్యమభిజాయంతే**
**ఏతద్వైప్రాణానాం ఆయతనం ఏతదమృతం అభయం**
**ఏతత్పరాయణం ఏతన్నపునరావర్తంతా**

**ఉత్తరేణ తపసా** – శ్రేష్ఠమైన తపస్సుతో అని అర్థం. తపస్సు అంటే నియమపాలన అని ఒక అర్థం ఉంది. మన స్వధర్మపాలనే తపస్సు. అది ఉత్కృష్టంగా చెయ్యగలగాలి. నియమపాలన చేద్దామంటే విఘ్నాలు వస్తాయి. తట్టుకొని దాన్ని సాధించాలి అదే ఉత్తరేణ తపసా. శ్రేష్ఠమైన తపస్సు చేయాలి.

తపసా అంటే ఆలోచన అని కూడా అర్థం. ఒక్కొక్క భావాన్ని శ్రవణం మననం చేసుకోవాలి. అలా నిరంతరం ఆలోచనాత్మకంగా విచారణ చెయ్యగలగాలి. **బ్రహ్మచర్యేణ** – గృహస్థులకి కూడా ప్రాజాపత్య బ్రహ్మచర్యం ఇత్యాదులు వారికి ఉన్నాయి. ఎప్పుడైనా దీక్షగా ఉపాసన చేసేటప్పుడు గృహస్థైనా బ్రహ్మచర్యపాలన చెయ్యాలి.

**శ్రద్ధయా– శ్రద్ధ అంటే ఆస్తిక్యబుద్ధి.**

**విద్యయాఆత్మానమన్విష్య** – ఆత్మాభిముఖులై దాన్ని తెల్సుకొంటూ ఆదిత్యమభి జాయంతే – ఆదిత్యారాధన చేయాలి. ఏతద్వైప్రాణానామాయతనం – ఆయన ప్రాణాలకు ఆయతనం. ఆయతనం అంటే స్థానం. సర్వప్రాణశక్తికి ఆయనే స్థానం.

ఏతదమృతం – ఆయన అమృతస్వరూపుడు. అభయం – ఆయన అభయస్వరూపుడు. ప్రాణసూక్ష్మాంశమేకం – సర్వప్రాణుల సూక్ష్మాంశలు సూర్యమండలంలో ఉన్నాయన్నారు. సూక్ష్మాంశ అంటే సారం. సారవస్తువది. ఆదిత్య ఆరాధన వల్ల అటువంటి శక్తిని మనం పొందగలుగుతున్నాం.



అమృతం, అభయం, పరాయణం – పరాయణమంటే శ్రేష్ఠమైన గతి. ఎవరు తెల్సుకొని ఈ విధంగా ఉపాసిస్తున్నారో వారు న పునరావర్తంతా– మళ్ళీ జన్మపరంపరలలోకి రారనే విషయాన్ని అభయవచనంగా చూపిస్తోంది ఉపనిషత్తు.

## శ్రీకృష్ణుని నోట ఆదిత్య మహిమ

కృష్ణపరమాత్మ సూర్యుని గురించి చెప్తూ...

> **ఆదిత్యాన్నాపరోదేవః ఆదిత్యః పరమేశ్వరః**
> **ఆదిత్యమంత్రసంయుక్తః ఆదిత్యో భువనేశ్వరః**
> **ఆదిత్యమర్చయేత్ బ్రహ్మా శివ ఆదిత్యమర్చయేత్**
> **యథాదిత్యమయం తేజో మమతేజస్తథార్జున** (భవిష్యోత్తరపురాణం)

బ్రహ్మమయమై శివమయమై ఉన్న ఆదిత్యుడు నా తేజస్సే.

**ఆదిత్యం యే ప్రపశ్యంతి మాంపశ్యంతి నసంశయః** – సూర్యుని చూస్తున్నారంటే నన్ను చూస్తున్నారనే అర్థం అన్నాడు. కృష్ణుడు కనపడట్లేదని అంటున్నాంగాని కనపడే

సూర్యుడే కృష్ణుడని తెల్సుకోలేకపోతున్నాం.

మనలో అజ్ఞానం ఎంత పేరుకుపోయిందంటే భగవంతుడు జ్యోతిస్స్వరూపుడన్నప్పుడు ఎదురుగా కనపడే మహాజ్యోతైన సూర్యుడే భగవంతుడు అని గుర్తించలేకపోతున్నాం.

గీతలో **యదాదిత్యగతం** తేజో అన్నప్పుడు ఇదే చెప్పాడు. మరొక చోట **ప్రభాఽస్మి శశి సూర్యయోః** అని తన విభూతిగా సూర్యుని చూపించాడు.

అదే ఇక్కడ చెప్తున్నాడు **త్రిసంధ్యమర్చయేత్ సూర్యం** – సూర్యుని త్రిసంధ్యలలోను ఆరాధించాలి. స్మరేద్భక్త్యాతి యో నరః–భక్తితో స్మరించాలి. స న పశ్యతి దారిద్ర్యం జన్మ జన్మని చార్జున–వాడికి దారిద్ర్యమనేది ఏ జన్మకు ఉండదు అన్నారు.

ఐశ్వర్యదాయకుడు సూర్యుడు.

> **ఏతత్తేకథితం పార్థ ఆదిత్యహృదయం మయా**
> **ముచ్యతే సర్వపాపేభ్యో సూర్యలోకే మహీయతే**

ఆదిత్యహృదయాలలో రెండు రకాలున్నాయని చెప్పుకున్నాం. రెండిటిలో దేనికదే ప్రత్యేకం. భవిష్యోత్తరపురాణంలోని ఆదిత్యహృదయం ఏడు అధ్యాయాల విస్తారగ్రంథం. అందులోవే కొన్ని కొన్ని ప్రధానమైనవి చెప్పుకుంటున్నాం. ఈ ఆదిత్యహృదయంలో ఒక సమగ్రత కనిపిస్తుంది. ఆ సమగ్రతని పరిశీలిస్తే గ్రహదోషనివారణకి సంబంధించిన అంశాలు ఉన్నాయి. కొన్ని కొన్ని ఎంపిక చేసుకొని చెప్పుకొంటున్నాం.

దాని శ్రవణఫలం కూడా మనకి వస్తుంది.

> **అక్షరశ్చాక్షరశ్చైవ**
> **ప్రభాకరవిభాకరౌ**
> **చంద్రఃచంద్రాంగదఃసౌమ్యో**
> **హవ్యకవ్య ఫలప్రదః**

సూర్యగ్రహస్వరూపం తరువాత చంద్రగ్రహ ప్రస్తావన తెచ్చారు. చంద్రగ్రహ స్వరూపుడైన సూర్యుడు. ఇక్కడ నవగ్రహవిజ్ఞానం చెప్పారు. దీని గురించి గ్రహపూజలు చేసుకొంటున్న వారికి కూడా తెలియడం లేదు. అదో పెద్ద విజ్ఞానరహస్యం.మన బ్రతుకులన్ని గ్రహాధీనాలే.

మన జాతకస్థానాలలో గ్రహాలు అటూ ఇటూ కూర్చొంటే మనం ప్రయత్నించి ఎన్ని సాధనలు చేసినా లాభం లేదు. అవి ఏడిపిస్తాయి. మరి వాటికి తలవంచవలసిందేనా అంటే అవి కూడా సరియైన సాధన చేసే మానవులకి అనుకూలిస్తాయి.

మానవజన్మకి ప్రారబ్ధం నుంచి బయట పడడానికి తగ్గ ప్రయత్నాలు ఉన్నాయి. గ్రహాలు

అనుకూలించనపుడు ప్రయత్నాలు గట్టిగా చెయ్యాలి. కొందరికి గ్రహాలు అనుకూలిస్తాయి. గ్రహస్థానం సరిగ్గా లేకపోతే అసలు మోక్షకాంక్ష కలుగదు. విచారణ మార్గం రాదు.

ప్రపంచం ఉన్నంతకాలం ఈ విజ్ఞానం కూడా ఉంటుంది. ఈ గ్రహవిజ్ఞానమంతా సూర్యాత్మకమని గ్రహించాలి. ఈ గ్రహాన్ని ఆ గ్రహాన్ని పట్టుకోవడం కంటే సర్వగ్రహపతిగా సూర్యుని ఆరాధించమని చెప్తున్నారు.

గ్రహమని పేరు పెట్టడంలోనే ప్రత్యేకత ఉంది. దేని ప్రభావం మన జీవితం మీద ఉంటుందో దానికి గ్రహమని పేరు. సూర్యుడు గ్రహమౌతాడా? అంటే గ్రహమనే దానికి 'Planet' పర్యాయపదం కాదు.

భూతాదులను కూడా గ్రహాలనే అంటారు. భూమి యందున్న జీవుల జీవనంపై ప్రభావం చూపించేవన్నీ గ్రహాలే. ప్రధానంగా నవగ్రహాలు చెప్పినా ముఖ్యంగా సప్తగ్రహాలే. మిగిలిన రెండు ఛాయలే అని శాస్త్రం చెప్తోంది. వాటిని గ్రహాలని ఎందుకన్నామంటే వాటి ప్రభావం కూడా మనపై ఉందికనుక గ్రహమని చెప్పాం.

సూర్యుని ఆధారం చేసుకొనే సర్వగ్రహాలు ఉన్నాయి. సూర్యుడు గ్రహము అంటే మనమనుకొనే 'Planet condition' లో గ్రహం కాదు.



సూర్యకిరణాలలోనే నవగ్రహశక్తులు ఉంటాయి. ఈ విషయం వేదం చాలా స్పష్టంగా చెప్పింది. ఎక్కడో ఉన్న గ్రహప్రభావం ఇక్కడేంటని చాలా మంది అడుగుతుంటారు. సూర్యుని నుంచి ప్రసరించే కిరణాలలో రకరకాల శక్తులు ఉంటాయి. ఆ శక్తులు వాటికవి స్వతంత్రంగా పనిచేస్తాయి.

కిరణజాలం యొక్క విభజనలోనే అవి ఎన్నెన్ని రకాలుగా ఎక్కడెక్కడ ప్రభావం చూపిస్తాయో చెప్తారు. తొమ్మిది రకాల శక్తులు సూర్యకిరణాలలో ఉన్నాయన్నారు. ఆ లెక్కలో చూస్తే సూర్యునికి తొమ్మిది కిరణాలు చెప్తారు. సప్తకిరణాలు కూడా ప్రధానంగా చెప్తారు. ఇవి గ్రహశాస్త్రానికి చాలా ముఖ్యం. ఈ సప్తకిరణాలలో ఒక్కొక్క కిరణం ఒక్కొక్క గ్రహాన్ని పోషించడానికి పనికొస్తుంది.

అక్కడ అన్నీకలసి మనకి వస్తాయి. అలా వచ్చి భూమిలో ప్రవేశించాక రకరకాల బీజాలు, రకరకాల శిలలు ఒక్కొక్కరకమైన గ్రహశక్తిని పొందుతాయి. అలా పొంది ఒక్కొక్క గ్రహ కిరణశక్తితో తయారైన విత్తనాన్ని, గింజని ఆ గ్రహధాన్యం కింద చూస్తారు. ఇదో ప్రత్యేకత.

ఆ గ్రహధాన్యంలో ఆ కిరణం ఉంటుంది. ఆ గ్రహశాంతికి ఆ ధాన్యం దానం చేస్తారు.

ఇదంతా ఒక క్రమమైన పద్ధతి. ఇది మనం తెల్సుకోవడమేకాని తయారుచేసేవాడు ఆయనే. రత్నాల తయారీలో కూడా పూర్తిగా సూర్యకిరణప్రభావమే.

లోపల ధాతునిర్మాణంలో కూడా సూర్యకిరణ ప్రభావం ఉంటుంది. ఆ ధాతునిర్మాణంలో కూడ ఒక్కొక్క రత్నం తయారవ్వాల్సిన పరిస్థితులలో ఆ గ్రహసంబంధమైన కిరణం అక్కడ ఉంటుంది. సూర్యుని యందు సప్తగ్రహభావన చేసి ఆరాధిస్తే గ్రహదోషం పోతుంది. అందుకే గ్రహదోషనివారణకు సూర్యారాధన అనేది ప్రత్యేకంగా చెప్తున్నారు.

**చంద్రఃచంద్రాంగదఃసౌమ్యో హవ్యకవ్య ఫలప్రదః** – సూర్యునిలో ఉన్న చంద్రశక్తిని మనకి చూపిస్తున్నారు. ఈ ఆదిత్యహృదయం మనకి గ్రహదోషాలను పోగొట్టుకోవడానికి పనికొస్తున్నది. హవ్యకవ్యఫలప్రదుడు– చంద్రుడులో ఉన్న రసశక్తివల్ల దేవతలను ఉద్దేశించి ఇచ్చే యజ్ఞద్రవ్యం హవ్యం. పితృదేవతలను ఉద్దేశించి ఇచ్చేది కవ్యం. ఆ రెండు యజ్ఞరూపఫలాలను ఇచ్చేవాడు చంద్రరూపుడైన సూర్యభగవానుడు.

**అంగారకోంగదోహస్తీ రక్తాంగశ్చాంగవర్ధనః**

– గ్రహలక్షణం, ఆ గ్రహప్రభావం చెప్తున్నారు.

**బుధోబుధ్ధాసనోబుద్ధి ర్బుధ్యాత్మాబుద్ధివర్ధనః**

– బుధగ్రహం ప్రభావం, అనుగ్రహం చూపించారు.

**బృహద్భానుర్బృహద్భాసో బృహద్ధామాబృహస్పతిః** – బృహస్పతి ప్రభావం చూపించారు. ఇది వింటూ ఉంటేనే తన్మంత్ర ప్రభావం కనుపడుతూ ఉంటుంది.

మనల్ని సులభంగా తరింపజేయడం కోసం వ్యాసుడు చక్కగా సమకూర్చి ఇచ్చాడు.

**శుక్రస్త్వం శుక్రరేతాస్త్వం శుక్లాంగః శుక్లభూషణః**

– శుక్ర గ్రహప్రభావం, గ్రహానుగ్రహం చిన్న చిన్నమాటలలో చూపిస్తున్నాడు.

**శనిమాంశ్చనిరూపస్త్వం శనైర్గలతిసర్వదా** – శనిగ్రహస్వరూపాన్ని చూపించారు.

**అనాదిరాదిరాదిత్యః తేజోరాశిర్మహాయశాః** – మూడు శ్లోకాల్లో గ్రహవిజ్ఞానమంతా చూపించారు.

సూర్యుడు ఒక్కొక్క గ్రహంద్వారా ఏమేమి చేస్తున్నాడు. ఒక్కొక్క గ్రహానికి ఆయన పంపించే కిరణం పేరు తెల్సుకొందాం. ఆ కిరణాలన్ని మన శరీరంలో ఉంటాయి. ఆ కిరణప్రభావం చేత ఒక్కొక్క శరీర అవయవం తయారు అవుతుంది.

మనలో ఏ ఏ భాగంలో ఏ ఏ గ్రహాలు ఉన్నాయో శాస్త్రం చెప్పింది. తత్సంబంధమైన కిరణాలు అలా పనిచేస్తాయి. ఆ గ్రహసంబంధమైన దోషాలను అనుసరించి ఆయా

అవయవాలలో రోగాదులు ఏర్పడుతుంటాయి. జ్యోతిర్వైద్యమని ఒక పద్ధతి వస్తోంది. కొత్తదేం కాదు ఉన్నదే మనం మర్చిపోతున్నది తిరిగి జాగ్రత్తగా ఉద్ధరించవల్సింది. వైద్యం చేసే ముందు జాతకాన్ని పరిశీలిస్తే వాడికున్న గ్రహస్థితిబట్టి వాడి శరీరావయవం ఏది రోగగ్రస్తం అవుతుంది? ఆ గ్రహాన్ని ఏలా శాంతింప చేసుకోవాలో తెల్సుకోవచ్చు. అలాంటి సులభమైన ఉపాయాలతో తొందరగా బయటపడవచ్చు.

చంద్రుని యందు సుషుమ్న, కుజుని యందు సంపద్వసు, బుధునియందు విశ్వకర్మా, బృహస్పతి యందు అర్వా గ్వసు. శుక్రుని యందు విశ్వవ్యచస్సు, శని యందు స్వరాట్ అనబడే శక్తి కిరణాలు. నక్షత్రకాంతి యందు ఉండే కాంతికి సంబంధించిన కిరణాలకి పేరు హరికేశ. నమకంలో చెప్పే **హరికేశాయోపవీతినే** అనే మంత్రానికి ఈ అర్థం కూడా తీసుకోవచ్చు.

హరికేశ అంటే నక్షత్రాల యందు ఉండే కాంతి అన్నారు. సూర్యుడు ఒక మహానక్షత్ర మని ఒప్పుకుంటున్నాం. ఆరింటికీ మూలమైన ఈ సూర్యుని యందు మనం చూస్తున్న ప్రధానవర్చస్సు హరికేశ.

సూర్యుని యందు మాత్రమే హరికేశ ఉంటుంది. మిగిలిన గ్రహాలలోకి ఇది వెళ్ళలేదు. మనకి వచ్చేటప్పటికి ఈ ఏడు ఆయన కాంతిపుంజం ద్వారా లభిస్తున్నాయి కనుక ఈ గ్రహాల సమిష్టిప్రభావం భూమి యందు ఉన్నవారికి లభిస్తుంది.

ఒక్కొక్క మాసంలో సూర్యుని ఏ ఏ పేర్లతో ఆరాధించాలో చెప్తూ **అరుణో మాఘమాసేతు** అని మాఘమాసంతో ప్రారంభిస్తారు. మాఘమాసం సూర్యునికి చాలా ప్రధానం. ఏకాదశులలో ముక్కోటి ఏకాదశి, మాసశివరాత్రులు మహాశివరాత్రికి ఎంత ప్రాధాన్యమో అలా మాఘమాసంలో వచ్చే రథసప్తమి అత్యధిక ప్రాధాన్యం ఉన్నది. ఒక్కొక్క మాసంలో వచ్చే సప్తమికి పేర్లు ఉన్నాయి.

సప్తమీ వ్రతాల పేర్లు చెప్పారు అవి కళ్యాణ సప్తమి, కమల సప్తమి, రథాంకసప్తమి, మహాసప్తమి, జయాసప్తమి, భద్రసప్తమి, విజయసప్తమి, మార్తాండసప్తమి, అర్కసంపుట సప్తమి, రథసప్తమి, నందాసప్తమి, ఆనందసప్తమి, అపరాజితాసప్తమి, అభ్యంగసప్తమి, రహస్యరోగహరాక్ష్యసప్తమి, సౌమ్యసప్తమి, సరార్థవపుషసప్తమి, పాపనాశినీసప్తమి.

సప్తమి, ఆదివారంతో పాటు సూర్యునికి ప్రీతిపాత్రమైనది సంక్రమణం. రాశి సంక్రమణం సూర్యుని వల్లే వస్తుంది.

రాశిసంక్రమణం కూడా సప్తమివలె ప్రాధాన్యం. ప్రధాన సంక్రమణం ఉత్తరాయణంలో

వచ్చే మకరసంక్రమణం. ఉత్తరాయణం ప్రవేశించినపుడు మొట్టమొదట వచ్చే శుద్ధసప్తమి మాఘశుద్ధసప్తమి. ఉత్తరాయణంలో వచ్చే మాఘశుద్ధసప్తమి మొదట వచ్చింది కనుక దానికి రథసప్తమి. మాసానికో పేరు సూర్యునికి చెప్తూ

**అరుణో మాఘమాసే తు సూర్యో వై ఫాల్గునే తథా**
**చైత్రమాసే తు వేదాజ్ఞో భానుర్వైశాఖతాపనః**
**జ్యేష్ఠ మాసే తపేదింద్రః ఆషాఢే తపతే రవిః**
**గభస్తిభిః శ్రావణే మాసే యమో భాద్రపదే తథా**
**ఇషేసువర్ణరేఖాశ్చ కార్తికేచ దివాకరః**
**మార్గశీర్షే తపేన్మిత్రః పౌషే విష్ణుఃసనాతనః**
**పురుషస్త్వధికే మాసే మాసాధిక్యేతు కల్పయాత్**
**ఇత్యేచేద్వాదశాదిత్యాః కాశ్యపేయా ప్రకీర్తితాః**
**పాతకాన్ముచ్యతే పార్థ వ్యాధిశ్చ నసంశయః**
**ఏక సంధ్యం ద్విసంధ్యంవా సర్వపాపాత్ప్రముచ్యతే**



వీటిలో పాఠభేదాలు, అభిప్రాయభేదాలు ఉండవచ్చు. ఇవన్నీ భవిష్యోత్తరపురాణం ప్రకారం చెప్పింది. అధికమాసం వచ్చినపుడు పురుషుడు అనాలి. అధికమాసానికి **పురుషోత్తమ మాసమని** పేరు. దాని ప్రాధాన్యం దానికి ఉంది. అధికమాసం అప్రాధాన్యం కాదు. కొన్ని పనులకు నిషిద్ధం కాని కొన్నిటికి మంచిదే. సృష్టిలో చెడ్డకాలం లేదు. కాని దేనికి మంచి, దేనికి చెడ్డ చూసుకోవాలి. ఇవన్నీ సంవత్సరరూపుడైన ఆదిత్యుడి అను గ్రహం పొందడానికి భవిష్యోత్తపురాణంలో కృష్ణుడు సూర్యుని ఉద్దేశించి చెప్పిన ప్రత్యేక నామాలు. చాలా మహిమాన్వితమైనవి.

**వికర్తనో వివస్వాంశ్చ మార్తాండో భాస్కరో రవిః**
**లోకప్రకాశకః శ్రీమాన్ లోకచక్షుర్మహేశ్వరః**
**లోకసాక్షీ త్రిలోకేశః కర్తా హర్తా తమిస్రహా**
**తపనస్తాపనశ్చైవ శుచిఃసప్తాశ్వవాహనః**
**గభస్తిహస్తో బ్రహ్మణ్యో సర్వదేవ నమస్కృతః**

ఈ నామాలతో ఎవరైతే ప్రాతఃకాలంలో లేచి నమస్కరిస్తారో – వారికి ఏ రోగభయం ఉండదన్నారు. పాతకాలు, వ్యాధులు తొలగుతాయి. రెండు సంధ్యలలోను లేదా ఒక సంధ్యలోనైనా పఠిస్తేవారు **లభేశ్చపరమం పథం** – క్రమంగా పరమపదాన్ని పొందుతారు.

**యదహ్నాత్కురుతే పాపం**
**తదహ్నాత్ప్రతిముచ్యతే**
**యద్రాత్ర్యాయాత్కురుతే పాపం**
**తద్రాత్ర్యాయాప్రతిముచ్యతే**

సూర్యోపాసన ఎప్పటి పాపం అప్పుడే కడిగేస్తుంది.

**సర్వవ్యాధిమహారోగాభూతాబాధాస్తథైవచ**
**డాకినీ శాకినీశ్చైవ మహారోగభయంకృతః**
**యేచాన్యే దుష్టరోగాశ్చ జ్వరాపస్మారకాదయః**
**జపమాత్రేన నశ్యంతి జీవేశ్చ శరదాం శతం**

సూర్యనామాల ప్రత్యేకత భవిష్యోత్తర పురాణంలోనే కాకుండా సాంబపురాణం అనే ఉపపురాణంలో చాలా విశేషంగా చెప్పబడినది. సాక్షాత్తు సూర్యభగవానుడే సాంబునితో ఈ నామాల ప్రత్యేకత చెప్తాడు. ఈ నామాలని పద్ధతిగా గానీ అనుష్ఠానం చేసినట్లయితే అనేకములైన సత్ఫలితాలను పొందవచ్చు.

నామాలు చూస్తే చాలా తేలికగా ఉన్నా ఫలితాలు చాలా అద్భుతమైనవి.

మొత్తం ఇవి ఏకవింశతి నామాలు (ఇరవై ఒక్కటి). అనగా 7×3 = 21 అవుతాయి. సప్తసంఖ్య త్రిగుణమైనది. ఈ నామాలను అదే వరుసలో పఠించాలి. ఈ నామాలు రెండు, మూడు పురాణాలలో ప్రత్యేకించి చెప్పారు.

సూర్యుడు వీని గురించి చెప్తూ ...

**ఏకవింశతి ఇత్యేషః స్తవ ఇష్టం సదామమ** – ఇవి 21 నామాలే కాదు, స్తవం అన్నాడు. స్తవరాజమనే పేరు కూడా ఉంది.

**శరీర ఆరోగ్యదశ్చైవ ధనం వృద్ధిః యశః స్మృతిః**
**స్తవరాజ మితిఖ్యాతః త్రిషులోకేషు విసృతః**

అని సాంబపురాణంలో చెప్పినమాట. ఈ నామాలను గురించి శ్రీకృష్ణుడు ప్రాతరుత్థాయ ప్రాతఃకాలంలో, త్రిసంధ్యలలో పఠిస్తే (సాంబపురాణంలో అస్తమయ సమయాల్లో కూడా పఠించమన్నాడు) త్రిసంధ్యం జపమానస్తు లభేశ్చపరమంపదం – ఇది అప్పటికప్పుడే పాపనాశనం చేసి, రోగాలను పోగొట్టడమే కాకుండా కనబడని గ్రహబాధలు ఏవైతే భూతాదుల వల్ల కలుగుతాయో అలాంటి పీడలను కూడా తొలగిస్తున్నది.

మరణము తథ్యం అన్నవాడు కూడా దీనిని పఠించి మృత్యుబంధనం నుంచి విడివ

దగలదు. ఇవి అంత మహిమాన్విత నామాలు. వీని తరువాత సూర్యస్తుతి చెపూ మరి కొన్ని ప్రక్రియలు చెప్పారు.

**యదాచానుగ్రహం తస్య కర్తుమిచ్ఛేచ్ఛుభఙ్కరం**
**తదాసలిలమాదాయ జపేన్మన్త్రమిదం బుధః**

దీనిని ఎవరైనా సరే జ్వరపీడితుడైనప్పుడు ఆ బాధలను తొలగించుటకు మంత్రాన్ని జపించాలి. ఒక శుద్ధ తామ్రపాత్రలో జలం పోసి ఈ మంత్రంతో అభిమంత్రించి అతని పై స్నానంగాని, ప్రోక్షణగాని చేస్తే జ్వరాదిబాధలు పోతాయి.

**నమో భగవతే తుభ్యం ఆదిత్యాయ నమో నమః**
**జయాయ జయ భద్రాయ హరిదశ్వాయనమోనమః**
**స్నాపయేత్తేనమన్త్రేణ శుభం భవతి నాన్యథా**
**అన్యథాచ భవేద్దోషా నశ్యతే నాత్ర సంశయః**

ఇలా సూర్యునికి సంబంధించిన విషయాలన్నీ చెప్పాడు కృష్ణపరమాత్మ. స్వామికి అర్ఘ్యం ఇచ్చే మంత్రరాశి చెప్పబడుతోంది.



భవిష్యోత్తరపురాణంలోని ఆదిత్యహృదయం ఒక సంపూర్ణమైన ఆదిత్యహృదయంగా కనిపిస్తుంది. ఇది కేవలం పారాయణగానే కాకుండా కొన్ని ప్రయోగాలు ఇందులో చూపిస్తున్నారు. ప్రయోగం అంటే మనం ఒక ప్రయోజనం కోసం ఎలా వాడుకోవాలో చెప్పే విధులు.

**నమో భగవతే తుభ్యం నమస్తే జాతవేదసే**
**దత్తమర్ఘ్యం మయాభానో త్వం గృహాణ నమోస్తుతే**

అని చెప్పి అర్ఘ్యప్రధానం చెయ్యమన్నారు.

**ఏహి సూర్యసహస్రాంశో తేజోరాశే జగత్పతే**
**అనుకమ్పయ మాందేవ గృహాణార్ఘ్యం నమోస్తుతే**

వీనిని అర్ఘ్యస్తుతులు అంటారు. వేలకిరణాలుకల సూర్యభగవానుడా రావయ్యా, అంటూ ఆహ్వానం పలుకుతూ, నా పై దయ చూపించి నా అర్ఘ్యములు స్వీకరించు.

**సర్వదేవాది దేవాయ ఆధి వ్యాధి వినాశినే**
**ఇదం గృహాణ దేవేశ సర్వవ్యాధీన్వినశ్యతు**

ఆధివ్యాధులను పోగొట్టే దేవాదిదేవా మా ఆధివ్యాధులను పోగొట్టు అని వ్యాధినాశనం కోసం చేసే అర్ఘ్యం. ఇవన్నీ సర్వులు స్నానాదులు చేసి శుచిగా చెయ్యవచ్చు.

**నమః సూర్యాయ శాంతాయ సర్వరోగ వినాశినే**

**మమేప్సితం ఫలం దత్వా ప్రసీద పరమేశ్వర!**

**నమోస్తు సూర్యాయ సహస్రభానవే నమోస్తు వైశ్వానర జాతవేదసే**

**త్వమేవ చార్ఘ్యం ప్రతిగృహ్యదేవ! దేవాది దేవాయ నమోనమస్తే**

ఈ శ్లోకంతో మొత్తం ఐదు అయ్యాయి. ఈ ఐదు శ్లోకాలతో అర్ఘ్యం ఇవ్వడం అంటే ఐదు అర్ఘ్యములన్నమాట. లేదా ఒకొక్క దానితో మూడు చొప్పున కూడా ఇవ్వవచ్చు. మన ఓపిక.

ఇంకా కొన్ని బీజాక్షర సంపుటులు ఉన్నాయి కానీ అవి గురూపదేశం ద్వారానే పొందాలి. అవి లేకున్నా పైన చెప్పినవి మాత్రం సర్వులు చేసుకోవచ్చు.

ఇంకోచోట **శ్రీ శివాయ నమః** అని అర్ఘ్యం ఇవ్వమన్నాడు. దానికి స్వాహాదికాలు ఉన్నాయి కాని వాటికి తగినన్ని సంస్కారాలతోనే స్వాహాకారం పలకాలి. లేనప్పుడు శ్రీశివాయ నమః కేవలం శివస్మరణే.

కృచ్ఛాదిచాంద్రాయణ వ్రతంలో సూర్యభగవానుని చూస్తూ కొన్ని మంత్రాలు చేస్తే ఎలాంటి పాపమైనా పోతుందని మంత్రాలు చెప్పారు. దాని నిండా **చంద్రశేఖరాయ, ఉమారమణాయ, శివాయనమః** ఇత్యాది మంత్రాలున్నాయి. ఇది గౌతముడు రచించిన కల్పసూత్రాలలో కనపడుతుంది.



సూర్యుని శివభావనతో ఆరాధన చేస్తే రోగనాశనం, పాపనాశనం చాలా సులభంగా జరుగుతున్నది. అదొక ప్రాయశ్చిత్త విధి క్రింద పని చేస్తుంది. కృచ్ఛాదివత్రాల యందు శివరూపంగా ఉపాసించబడి అనుగ్రహించేది సూర్యభగవానుడనే విషయాన్ని అప్పయ్య దీక్షితుల వారు తన యొక్క ఆదిత్య స్తోత్రరత్నంలో ప్రకటిస్తారు.

**ఆయురారోగ్యమైశ్వర్యం దేహిదేవ నమోస్తుతే**

**నమో భగవతే తుభ్యం ఆదిత్యాయ నమోనమః**

ఈ పరంపరంలోనే ప్రసిద్ధి చెందిన శ్లోకం కృష్ణుడు చెప్పినది

**ఉదయే బ్రహ్మణోరూపం**

**మధ్యాహ్నేతు మహేశ్వరః**

**అస్తమానే స్వయం విష్ణుః**

**త్రిమూర్తిస్తు దివాకరః**

అటు తరువాత చివరికి వచ్చేటప్పటికల్లా ఈ అధ్యాయాలలో ప్రత్యేకించి స్వామి

మండలం పై ఒక స్తుతిని చెప్తున్నాడు కృష్ణపరమాత్మ. ఈ స్తుతి చాలా విశాలమైనది. మండల రహస్యములన్నీ అందులో చూపిస్తాడు.

**యన్మండలం దీప్తికరం విశాలం రత్నప్రభం దీప్తమనాది రూపం।**
**దారిద్ర్యదుఃఖ క్షయకారణం చ పునాతు మాం తత్సవితుర్వరేణ్యమ్॥**

గాయత్రి ప్రథమ పాదంతో పూర్తయ్యేటట్లుగా మొత్తం ఈ శ్లోకాలన్నీ కూర్చబడు తున్నాయి. ఇవన్ని కూడా సూర్యమండలస్తుతి. మండలం అంటే గుండ్రని ఆకారంలో కనపడే తేజఃస్వరూపం. మండలమంటే సమూహం అని అర్థం. సర్వశక్తి సమూహమైన సూర్యమండలాన్ని మనం నమస్కారం చేస్తున్నాం. ఆ శక్తులేమిటో చూపిస్తున్నాడు.

**యన్మండలం దీప్తి కరం విశాలం** – అది కేవలం తేజమిస్తున్న విశాలమైన మండలం.

**యన్మండలం దేవగణైస్సు పూజితం** – దేవ గణాల చేత పూజింపబడే మండలం.

**యన్మండలం జ్ఞానమయంచ రమ్యం** – ఆ మండలం కేవలం కాంతి పుంజమే కాదు. జ్ఞానపుంజం. దాని నిండా జ్ఞానముంది. వేదమంత్ర రాశి ఉంది. మనకి కనపడుతున్నది కేవలం కాంతిగా. కాని లోపల ఎన్ని ఉన్నాయో చెప్తూ–



**యన్మండలం గూఢం అతి ప్రబోధం** – గూఢమైన ఎన్నో రహస్య స్వరూపాలున్నాయి. దాని వల్లనే ధర్మస్య వృద్ధిం కురుతే జనానాః – జనుల ధర్మాలు వృద్ధి చెందుతున్నాయి ఆ దివ్యమైన మండలం వల్ల.

తనని ఆశ్రయించిన వారికి ఆ మండలం **యస్సర్వపాపక్షయకారణంచ** – పాపనాశనం చేసే ఆ మండలం. మనకు కనపడేది కేవల మండలస్వరూపమే. ఆ మండలస్వరూపంలో ఇన్ని విషయా లున్నాయి అని భావించడానికి ఈ శ్లోకాలు మనకు ఆధారమవుతున్నాయి. ఈ శ్లోకాల ఆధారంగా సూర్యమండలంలోని శక్తులేమిటో తెలుసుకుంటున్నాం. ఆ శక్తులు ఉపాసకుని ఎలా అనుగ్రహిస్తున్నాయంటే **దారిద్ర్యాః దుఃఖ క్షయకారణం చ** – దారిద్రాలను దుఃఖాలను పోగొడుతున్న మండలం.

**యన్మండలం వ్యాధి వినాశదక్షం యదృగ్యజుస్సామసుసంప్రణీతమ్।**
**ప్రకాశితం యేన చ భూర్భువస్సువః పునాతుమాం తత్సవితుర్వరేణ్యమ్॥**

కృష్ణపరమాత్మ గాయత్రీమంత్ర రహస్యాలన్నీ ఈ మండలం ద్వారా గ్రహించేలా కూర్చాడు.

**యన్మండలం సర్వగణైస్సు పూజితం జ్యోతిశ్చకుర్యాదిహమర్త్యలోకే।**
**యత్కాల కాలాది మనాది రూపం పునాతుమాం తత్సవితుర్వరేణ్యమ్॥**

అని మొత్తం మండలాన్ని చెప్పి మండలమధ్యవర్తి అయిన పరమపురుషుని వర్ణిస్తున్న ప్రసిద్ధశ్లోకం భవిష్యోత్తరపురాణం లోనిదే.

**ధ్యేయస్సదా సవితృమణ్డల మధ్యవర్తీ**
**నారాయణస్సరసిజాసన సన్నివిష్టః**
**కేయూరవాన్మకరకుణ్డలవాన్కిరీటి**
**హారీ హిరణ్మయ వపుర్ధృత శఙ్ఖచక్రః**

ఉపనిషత్తులు చెప్పిన హిరణ్మయపురుషుని ధ్యానిస్తున్నాం. శంఖచక్రాలు ధరించి, రెండు చేతులతో పద్మాలు ధరించి చతుర్భుజుడైన సూర్యనారాయణమూర్తిని ఇక్కడ వర్ణించారు. ఈయన శరీరం గురించి వర్ణిస్తూ

**వేదవేదాంగ శారీరం దివ్యదీప్తికరం పరం**
**రక్షోఘ్నం రక్తవర్ణంచ సృష్టిసంహార కారకం**
**లోకప్రభాకరశ్చైవ లోకచక్షుర్మహేశ్వరః**
**తపనఃపావన శ్చైవ సప్తసప్తాశ్వవాహనః**

ఆయన సప్తాశ్వవాహనుడు, ఏకచక్ర రథుడు.

**ఏకచక్రరథోయస్య దివ్యఃకనకభూషితః**
**సమే భవతు సుప్రీతః పద్మహస్తో దివాకరః**



సప్తాశ్వతత్త్వం పురాణాలలో చాలా విస్తారంగా చెప్పబడుతున్నది.

సృష్టిస్థితిలయకారకుడై సర్వజీవుల హృదయంలో ఆత్మరూపంగా ఏ పరమేశ్వరుడు ఉన్నాడో, ఆ పరమేశ్వరుని తేజస్సుని మనం సూర్యమండలంద్వారా దర్శిస్తూ, ఆ మండలం ద్వారా ఆ పరమేశ్వరుని సూర్యరూపంతో ఉపాసిస్తున్నాం.

సూర్యుని గురించి చెప్పేవన్ని ఈశ్వరసంబంధ విశేషాలే. ఈశ్వరుడు అనగా సమస్త విశ్వానికి, లోకాలకి పాలకుడు. సూర్యుడు ఒక బింబం అనుకుంటే పరిమిత భావం ఏర్పడుతుంది.

కాని ఈ పరిమితంలోనే అపరిమితమైన తేజస్సు ఉన్నదనే అన్వయం కావాలి.

సూర్యుని గురించి చెప్పేటప్పుడు క్రమంగా ఈశ్వర భావనలోకి పరమాత్మభావనలోకి తీసుకుని వెళ్ళిపోతుంది. అప్పుడే ఉపాసన పరిపూర్ణమై **యఃసూర్యః సోహమేవచ** అనే స్థితికి వెళ్ళిపోతుంది.

ఉపాసన సోహం భావంలోకి వెళ్ళితే పరిపూర్ణమవుతుంది. సోహం భావేన పూజయేత్

అని మనం నిత్యం చేసే కర్మకలాపాలలో కూడా, ఎప్పటికైనా మనం వెళ్ళవలసింది **అహంబ్రహ్మాస్మి** భావనకే అని తెలియజేయడం.

సహకరించే శక్తి ఉపాసనకి ఉంది కనకనే ఉపాసనకి సంబంధించిన ఉపనిషత్తులు కొన్ని ఉన్నాయి.

అలాంటి వాటిల్లో సూర్య ఉపనిషత్తు అని కూడా ఉన్నది.

సప్తాశ్వవిషయాల్లో రెండు రకాలు. 1. కనబడుతున్న ఆదిత్య మండలంలో కేవలం ఉపాసనదృష్టికి గోచరించే సూర్యభగవానుని **సప్తాశ్వరథమారూఢం** అని భారతీయ ఋషులు దర్శించారు. ఇందులో వైజ్ఞానికాంశం, దేవతాంశం రెండూ ఉన్నాయి. ఒకొక్కసారి ఈ రెండూ పొసగక పోవచ్చు. కారణం ఈ రెండు దృష్టికోణాలు వేరు. ఒకటి ఉపాసనా దృష్టికోణం, మరొకటి భౌతికదృష్టికోణం.

ఒకొక్కసారి ఉపాసనా అంశాలని విశ్లేషిస్తే వైజ్ఞానికాంశాలు స్ఫురిస్తూ ఉంటాయి. ఉపాసనా అంశం చాలా విస్తారమైంది, వైజ్ఞానికాంశం చాలా అల్పమైంది. ఉపాసన అలౌకికం. వైజ్ఞానికం లౌకికం.



కానీ అలౌకికంలో లౌకికాంశం ఉండవచ్చు కాని లౌకికంలో అలౌకికాంశం ఉండదు.

సూర్యమండలంలో పరమపురుషుడు ఉపాసనా దేవతా రూపంతో సప్తాశ్వరథ మారూఢునిగా ఉన్నాడని ఒక దృష్టి.

ఈ విశ్వమంతా కలుపుకుంటే సప్తాశ్వతత్త్వం. గోచరాగోచరమైన సర్వజగత్తు అంతా సప్తాశ్వాలే. ఈ సప్తాశ్వరథాన్ని సూర్యుడు నడుపుతున్నాడు.

సప్తాశ్వమనే ఈ విశ్వరథాన్ని పరమేశ్వరుడు నడుపుతున్నాడు. పరమేశ్వరుడే సూర్యుడు.

రథసప్తమినాడు మనం చిక్కుడుకాయలతో రథం చేసి పూజించడం ఉంది.

ఇది చూసి 'Indians' చాలా 'Silly' అనుకొంటారు. గగనమండలంలో జరిగిన మార్పుని ఇక్కడ చిక్కుడు కాయలలో దర్శించగలిగే జ్ఞానాన్ని సంపాదించగలిగారని అనలేక పోతున్నారు.

రథం, రథంలో మార్పు. రథంమారతాడు అని సామాన్యభాషలో చెప్తాం.

రథం అనే మాటకు వేదంలో అర్థం ఉంది. రథం =రంహణ స్వభావం రథం. రంహణ అంటే గమన లక్షణం. రథం అనగా గమనం చేయునది.

ప్రపంచం గమనం చేస్తోంది గనుక సప్తాశ్వరథం అన్నాం. నిరంతర గమనశీలమైనదే ప్రపంచం. గమనం అంటే పరిణామం. శరీరం కూడా రథమే.

ఇదీ గమనం చేస్తూ ఉంటుంది. సూర్యమండలం ఒకరథం, విశ్వమంతా ఒక రథం, మన శరీరం ఒక రథం. ఈ మూడు రథాలను నడిపే ఈశ్వరుడు ఒక్కడే అని దర్శిస్తే

**ఈశ్వరః సర్వ భూతేషు హృద్దేశే అర్జున తిష్ఠతి।**
**భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥**

అన్నప్పుడు స్పష్టంగా తెలుస్తోంది. రథమే చైతన్యం అనుకోకు, రథానికి చేతనత్వాన్ని కలిగించేవాడు ఒకడు ఉన్నాడు. వానిని చూడాలి. వేదవాఙ్మయం, వేదాంతవాఙ్మయం తీసుకొని వీటిని జీర్ణించుకుని సూర్యోపాసన చేసి దివ్యవాక్కులు పలికిన సాంబుడు సాంబపంచాశికలో చెప్పిన శ్లోకాలు పరిశీలిస్తూ ఉంటే హృదయం ద్రవీభూతమవుతుంది.

**సప్తయుఞ్జన్తి రథమేక చక్రమేకో అశ్వోవహతి సప్తనామా**
**త్రినాభిచక్రమజర మనర్వంయత్రేమా విశ్వాభువనాధితస్థుః**

రథానికి గుర్రాలు ఏడు, చక్రం మాత్రం ఒకటే. ఈ చక్రానికి చాలా లక్షణాలు చెప్పారు.

**విస్తారాయామమానం దశభిరుపగతో యోజనానాం సహస్రై**
**శ్చక్రే పఞ్చారనాభిత్రితయవతి లసన్నేమిషట్కే నివిష్టః**
**సప్తచ్ఛన్దస్తురఙ్గాహితవహనధురో హాయనాంశత్రివర్గ**
**వ్యక్త్యాక్లుప్తాఖిలాఙ్గః స్ఫురతు మమ పురః స్యన్దనశ్చణ్డభానోః**

అంటున్నారు అప్పయదీక్షితులవారు. నా ముందు ఆ దివ్యరథం ప్రకాశించుగాక! అని ధ్యానం చేస్తే ఈ శరీరరథం బాగుంటుంది. ఈ చక్రానికి ఐదు అరలు ఉన్నాయి. ఇవి ఐదు సంవత్సర సంఖ్యను తెలియచేస్తాయి.

సంవత్సరాలు అరవై కదా అంటే వైదిక లెక్కప్రకారం అరవై అంటే అవి పన్నెండు. ఐదు లెక్కపెట్టి, మళ్ళీ ఐదు లెక్కపెట్టి ఇలా చేస్తే ఐదు సంవత్సరములే ఆవృతిగా వస్తుంటాయి. ఈ పన్నెండు ఐదులని ఆవృతిగా పెట్టుకొని అరవైగా చేసుకున్నాం.

ప్రభవాది సంవత్సరాలలో మొదటిదానికి **సంవత్సరం** అని పేరు. రెండవది **పరివత్సరం,** మూడవది **ఇద్వత్సరం,** నాల్గవది **అనువత్సరం,** ఐదవది **వత్సరం.** మళ్ళీ వచ్చేవాటికి అవి ఆవృతి అవుతూ ఉంటాయి. ఇది కాలరూపచక్రం.

ఇక **త్రినాభిచక్రం** అనగా మూడు నాభులుకలవు. అవి ఉదయం, మధ్యాహ్నం, రాత్రి. ఆరు నేములు ఉన్నాయి. నేములు అనగా చివరిభాగంలో పెట్టే ఇరుసులు. ఇవి ఆరు ఋతువులు. గుర్రములు ఏడుగా వ్యవహరిస్తున్నా అది ఒకటే దినము. కాని వ్యవహారంలో ఏడు రోజులుగా చెప్తున్నాం. కాంతి ఒక్కటే.

ఆ కాంతిని మనం పరా వర్తనంగా విశ్లేషిస్తే ఏడు వర్ణాలు అవుతోంది.

అశ్వము అంటే కిరణమని ప్రధాన అర్థం తీసుకోవాలి. సూర్యుని కాంతికిరణాన్ని అశ్వం అంటారు. సాంబపంచాశికలో సాంబుడు చేసిన వర్ణన ప్రకారం-

ఒకొక్క గ్రహమందు ఉన్న సప్తాశ్వతత్త్వం.

కాలం ప్రకారంగా ఏడు రోజులుగా కాలంలో కనపడుతోంది.

సప్తఛందస్సులు గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి వైదిక ఛందస్సులు

శరీరరథపరంగా చూస్తే మనలో బుద్ధిస్థానంలో, నేత్రస్థానంలో సూర్యభగవానుని ప్రధానదైవంగా చూడాలి. ముఖం జ్ఞానేంద్రియస్థానం. అక్కడ జ్ఞానచైతన్యం ప్రసరిస్తేనే శరీరానికి అంతటికి కదలిక వస్తుంది.

కర్మేంద్రియస్థానం కంఠానికి అధోభాగమైతే, జ్ఞానేంద్రియస్థానం కంఠాదూర్ధ్వం. విషయాన్ని తెలుసుకోవాలన్నా, తెలియజేయాలన్నా ఆధారం ముఖస్థానమే. ఇది సప్తాశ్వరథం. జ్ఞానేంద్రియస్థానంగా చెప్పేటప్పుడు ఏడు గుర్రాలు - రెండు నేత్రాలు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రాలు, ఒక నోరు. ఈ ఏడింటిద్వారానే జ్ఞానం అంతా కదులుతోంది కనుక సప్తాశ్వరథమారూఢం.



నేత్రంలో జ్ఞాన రూపంగా ఉన్నా హృదయం కూడా ఆయన స్థానమే. శరీరమే రథం. శరీరాన్ని నడుపుతున్న ధాతువులున్నాయి. చర్మం, మాంసము, మజ్జ, అస్థి, మేధస్సు, శుక్రం, రక్తం అని మొత్తం ఏడు ధాతువులు. ఈ సప్తధాతువులతో నడపబడే శరీరమే రథం. దాన్ని నడిపేవాడు సూర్యుడు.

యోగశాస్త్రపరంగా చూస్తే **వియత్పథం** అనే బ్రహ్మనాడి పేరుతో మనలో ఉంటాడు. బ్రహ్మరంధ్రం నుంచి మూలాధారం వరకు ప్రధాననాడి సుషుమ్నా. ఇది బ్రహ్మనాడి. ఇది సూర్యరూపం.

ఇడా, పింగళ మధ్యలో అగ్ని-చంద్రనాడులతో నిర్వహిస్తుంటాడు. ఈ మూడు ఆయన స్వరూపాలైనా ప్రధానమైన బ్రహ్మనాడి పేరుతో యోగమార్గంలో ఉపాసింపబడతాడు. దీనిని ఊర్ధ్వగతిలో ప్రయాణింపచేస్తే మూలాధార,స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞ, సహస్రార అనేవి ఏడే. ఇదే సప్తాశ్వరథం.

విశ్వపరంగా చూస్తే చాలా దివ్యమైనది. ఇది శాస్త్రీయపరమైన భావన. దీనికే గౌరవం, మర్యాద, మంత్రభావం ఉంటుంది. సాంబపంచాశికలో దీని గురించి వర్ణిస్తూ...

**యే పాతాలో దధిమునినగద్వీపలోకాధిబీజ**
**చ్ఛన్దో భూతస్వరముఖనదత్సప్తసప్తమ్ ప్రపన్నాః**
**యేచైకాశ్వం నిరవయవవాగ్భావమాత్రాధిరూఢం**
**తే త్వామేవ స్వరగుణకలావర్జితం యాన్త్యవశ్యమ్**

అన్నాడు. అశ్వసహితుడు, అశ్వరహితుడు అయిన సూర్యభగవానుని గురించి చెప్పారు. పరమాత్మని రెండు రకాలుగా ఉపాసించవచ్చు.

**ద్వే బ్రహ్మణి వేదితవ్యే మూర్తంచాఽ మూర్తంచ** అన్నట్టుగా. దీనినే కృష్ణపరమాత్మ వ్యక్తావ్యక్తతత్వాలు అన్నాడు. అవ్యక్తమైన ఈశ్వరతత్త్వం కేశోధికతరః కనుక వ్యక్తమైన ఈశ్వరతత్త్వాన్ని భావించాలి.

వ్యక్తరూపమంటే కనిపించే ప్రపంచం ఈశ్వరుని చేత నియమింపబడుతూ ఆయన విభూతులతో నిండియున్నది అని తెలుసుకోవాలి. దీనిని నిర్వహిస్తున్నవాడు, దీనికి అతీతుడు క్రమంగా తర్వాత తెలియబడతాడు. మనం ఏ విశ్వంలో భాగమో ఆ విశ్వ మంతా ఈశ్వరమయం అనే ఎరుక ముందు గ్రహించాలంటే, విశ్వమంతా భిన్నభిన్నంగా కనిపిస్తున్న వాటి యందు ఏకమై ఉన్న ఈశ్వరుడు ఒకడే అనే ఎరుక సంపాదించుకోవాలి.



రెండు రకాలుగా ఒకటి అశ్వసహితుడుగా, రెండు అనశ్వుడుగా ఉపాసించాలి. ఎవరైతే ఈ రెండింటిని భావన చేస్తారో వారు నీ అనశ్వతత్త్వాన్ని తెలుసుకుంటారు. ఉపాసనా విషయంలో సగుణబ్రహ్మమైన నిన్ను ఆరాధన చేస్తే క్రమంగా గుణాతీతుడైన నీ తత్త్వాన్ని పొందుతారు.

విశ్వం నడిపే విశ్వేశ్వరుడు అని చూసినప్పుడు విశ్వతత్త్వాలంతటా ఆయనే వ్యాపించా డని, విశ్వంతో కలిపి చూస్తే అది సగుణబ్రహ్మోపాసన – వ్యక్తోపాసన. విశ్వానికి అతీతంగా చూస్తే – అవ్యక్తజ్ఞానం అవుతుంది. వ్యక్తంలోంచి అవ్యక్తంలోకి వెళ్ళే క్రమం చూపిస్తున్నాడు. విశ్వమంతా సప్తాశ్వరథమే అయితే ఈ విశ్వంలో ఎన్ని సప్తాశ్వాలు ఉన్నాయో చూస్తే ఇక్కడ పది సప్తములు చెప్పాడు.

**అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాల** అనే సప్తపాతాళములు
**క్షీర, దధి, సర్పి, ఇక్షురస, మధిర, స్వాదు, క్షార** అనే ఏడు సముద్రములు
**గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వశిష్ఠ, కశ్యప, అత్రి** అనే సప్తఋషులు
**మహేంద్ర, మలయ, సహ్య, శుక్తి, ఋక్ష, వింధ్య, పారియాత్ర** అనే సప్త కులపర్వతాలు
**జంబు,కుశ, శాక, క్రౌంచ, శాల్మలి, గోమేధ, పుష్కర** అనే సప్త ద్వీపములు

**భూ, భువః, సువః, మహః, జనః, తపః, సత్య** అనే ఏడు ఊర్ధ్వ లోకములు

**మోహ, మద, గర్వ, విషాద, క్రోధ, భయ, హర్ష** అనే అధులు-మానసికంగా కలవరపరచే రోగాలు

**గోధుమ, ధాన్యం, మినుగు, కందులు, పెసలు, తిలలు, శనగలు** అనే సప్తబీజములు

**గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి** ఛందస్సులు ఏడు

**షడ్జమ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాద** అనే సప్తస్వరములు **సరిగమపదని**

ఈ పది రకాల ఏడులతో కూడిన విశ్వమనే సప్తాశ్వరథాన్ని నడుపుతున్నది సూర్య భగవానుడు. ఆయనే సప్తాశ్వరథారూఢుడు.

**యేచైకాశ్వం నిరవయవవాగ్భావ మాత్రాధిరూఢం** -సప్తాశ్వరథారూఢుడవైన నిన్ను ఏకాశ్వం వాడని, అందుకే ఏకో అశ్వో వహతి సప్తనామా తీసుకొని అద్భుతమైన వాఖ్యానం చేసారు. సప్తాశ్వములుగా గోచరించే ప్రపంచం కనపడుతుంది అనేకములుగా. ఇలా అనేకములుగా కనిపించడం ప్రపంచం యొక్క లక్షణం. దీన్ని నడుపుతున్న నిన్ను ఏకంగానే ఉన్నావు కనుక **ఏకో అశ్వో వహతి సప్తనామా** అన్నారు.



అక్కడికి వచ్చేసరికి నీ తత్త్వం **నిరవయవం** అనగా **నిష్కలం.**

నీ సప్తాశ్వతత్త్వాన్ని, నిరవయవం అయిన నీ ఏకకాంతి తత్త్వమును ఉపాసన చేసేవాళ్ళు **తే త్వామేవ స్వరగుణకలావర్జితం యాన్త్యవశ్యమ్** ఏ అశ్వం లేని నిన్ను క్రమంగా పొందుతున్నారు. విశ్వాతీతమైన నీ పరతత్త్వాన్ని ఈ సప్తాశ్వతత్త్వంతో ఉపాసించినవాడు క్రమక్రమంగా పొందుతున్నాడు.పరమేశ్వరుని సప్తాశ్వభావనతో ఆరాధన చేస్తూ సప్తాశ్వాలు నడుపుతున్నాడే గాని సప్తాశ్వవికారాలు ఆయనకి లేవు. గుఱ్ఱాలు నడిపేవానికి గుఱ్ఱాల వికారాలు ఉంటాయా!.

ప్రపంచం సప్తాశ్వరథమారూఢమే కాని ఆయన ప్రపంచానికి అతీతుడు. ఈ తత్త్వమే విష్ణుసహస్రంలోను, భాగవతంలోను కనపడుతుంది.

**విశ్వకరువిశ్వదూరుని విశ్వాత్మకు విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మప్రభు నీశ్వరునిం బరమపురుషు నే సేవింతున్**

విశ్వాన్ని చేస్తున్నాడు. విశ్వమంతా వ్యాపించివున్నాడు కాని విశ్వానికి అతీతుడు. ఆయన లేకపోతే ఏడుగుఱ్ఱాలకు ఏ శక్తీ లేదు. ఆయన చైతన్యం వల్ల మనలోని జ్ఞానేంద్రియాలు పనిచేస్తున్నాయి కాని అవి ఆయన్ని చూడలేవు. ఆయన వీటికి అతీతంగా ఉన్నాడు.

దీనిలో వ్యక్తావ్యక్తమైన ఉపాసన చూపిస్తూ ఉపాసనకి పరమార్థం- అవ్యక్తమైన ఈశ్వరతత్త్వంతో తాదాత్మ్యం చెందడమే అని చెప్తున్నారు.

ఇలా సప్తాశ్వ, ఏకాశ్వ, అనశ్వతత్త్వాలను అద్భుతంగా చూపించిన సాంబుడు ఋషిత్వం పొందాడు.

## కాశీలో సూర్యక్షేత్రాలు

ద్వాదశాదిత్యులు ఉన్న ప్రధాన క్షేత్రం కాశీ క్షేత్రం. సమస్త విశ్వానికి మూలం కాశీ. షణ్మతాలు వేటికవే పూర్ణంగా కాశీ క్షేత్రంలో కనపడతాయి. మనం ఎక్కడున్నా సరే క్షేత్రాలని తలంచుకొంటే క్షేత్రాదిదేవతలు స్పందించి అనుగ్రహిస్తారు.

కాశీక్షేత్రం వరణ, అసీ అనే రెండు నదుల మధ్య ఉంది. ఆ రెండు నదులు గంగలో కలిసే చోటు కాశీ. కాశీలో లోలార్కుడు అసీఘాట్‌లో ఉంటాడు. ఇదికాశీకి ఒక అంచు. ఇంకో అంచు ఆదికేశవుడు. కాశీని ధనుస్సుతో పోల్చుతారు.

***కాశినగరి ధనుర్వల్లి గంగనారి, కోటియుగ్మంబు లోలార్కకుదరధరులు, వృషము బాణంబు లక్ష్యంబు వృజినరాజి, విశ్వనాథుడు ధన్వి ఉర్వీకళత్ర*** అని వర్ణిస్తాడు శ్రీనాథుడు.

అలాంటి దివ్యధనుస్సులో మొదటికొన లోలార్కుడు. దివోదాసుడు పాలించినప్పుడు అతన్ని ఖాళీ చేయించడానికి శివుడు ముందు పంపించినవాడు ఆదిత్యుడు.



ఆ వచ్చిన వాడు కాశీలో తిరిగి తిరిగి కాశిలో లోలతతో అక్కడ ఉండిపోయాడు కనుక లోలార్కుడు అయ్యాడు. అక్కడ కుండంలో ఎంతమంది స్నానం చేసినా స్ఫటికంలా స్పష్టంగా ఉంటుంది. ఇది తులసీఘాట్ సమీపంలో ఉంది.

**రెండవది ఉత్తరార్క క్షేత్రం** – కాశీలో అలైపురా అనే ప్రాంతంలో ఉంది. ఈయనకి పుష్యమాస ఆదివారం ప్రత్యేకించి ఆరాధన చేస్తారు. ఇక్కడ వర్కరీ కుండం (ఉత్తరార్క కుండం) అని కుండం ఉంది.

అర్క కాస్త వర్కరీకుండమై క్రమంగా వ్యవహారంలో బకరియాకుండ్ అయ్యింది.

ఒకప్పుడు దైత్యుల బాధ ఎక్కువైతే దేవతలందరూ సూర్యభగవానుని ప్రార్థించగా సూర్యుడు నేను మీకు ఒక రాయి ఇస్తాను అది విశ్వకర్మచేత గంగానదీతీరంలో కాశీ క్షేత్రంలో నా విగ్రహంగా చెక్కించండి అన్నాడు. అలా నా రూపాన్ని చెక్కగా మిగిలిన ముక్కలు సామాన్యంకావు అవి మీరు ఆయుధములుగా ఉపయోగించి అసుర సంహారం సులభంగా చెయ్యండి అన్నాడు.

ఇలా విశ్వకర్మ సుందరమైన సూర్యవిగ్రహం చెక్కగా మిగిలిన శకలాలను తీసుకుని

దేవతలు అసురసంహారం చేసారు. దీని గురించి చెప్తూ **లభతే వాంఛితార్థం.** అక్కడ సూర్యుని ఆరాధన చేస్తే వాంఛితార్థం లభిస్తుంది అన్నారు.

**మూడవది సాంబాదిత్యక్షేత్రం** – సాంబుడు భారతదేశం అంతా తిరుగుతూ వివిధ క్షేత్రాలలో సూర్యప్రతిష్ఠ చేస్తూ కాశీలో సూర్యోపాసన చేసి చేతిగంజ్ నుంచి గదోలియా సెంటరుకి వెళుతున్న మార్గంలో ధ్రువుడు ప్రతిష్ఠించిన ధ్రువేశ్వరుడనే శివుడు ఉన్నాడు. అక్కడ ప్రక్కనే సూర్యకుండం, సాంబాదిత్యుడు ఉన్నారు. ఈయనకి చైత్ర ఆదివారం గొప్పది.

**నాల్గవవాడు ద్రుపదాదిత్యుడు** – విశ్వనాథమందిరం దగ్గర దక్షిణం వైపు అక్షయవటం సమీపంలో శనైశ్చరుని విగ్రహానికి ఎదురుగా ఉంటాడు. ద్రౌపదీదేవి అక్కడ శివుని కోసం తపస్సు చేసి భర్తకావాలని ఐదుమార్లు అనడం కథ ఉంది. ఆయనకి ప్రతి ఆదివారం శ్రేష్ఠం. ఆయన్ని సేవిస్తే క్షుధాజనితమైన కష్టం – అంటే ఆకలికి సంబంధమైన బాధలు పోగొడతాడు.

**ఐదవది మయూఖాదిత్యుడు** – మయూఖ అంటే కిరణం. కిరణాదిత్యుడు. కిరణ, ధూతపాప, ధర్మ అనే పేరుతో కాశీ క్షేత్రంలో మూడు చిన్ననదులు ఉన్నాయి. వీటితో గంగా, సరస్వతి కలుస్తున్నాయి. మొత్తం ఐదు నదులు కలిసేచోటు పంచగంగాఘాట్. దీని తీరంలోనే బిందుమాధవస్వామి ఉన్నాడు.

ఇది విష్ణుకాశీ. అక్కడ మంగళగౌరీదేవి, గభస్తీశ్వరుడు ఉన్నారు.

గభస్తీశ్వరుని సూర్యుడు ప్రతిష్ఠించాడు. అక్కడ ఉన్నవాడు మయూఖాదిత్యుడు. కార్తీక మాసంలో గంగ ప్రవాహం కొద్దిగా ఉన్నప్పుడు ఈ పంచగంగాఘాట్ దగ్గర మూలల నుంచి చిన్నపాయలు గోడల సందులలోంచి వస్తూ ఉంటాయి.

ఇవే ఈ మూడు నదులు. కిరణానది ఉత్పత్తిచోటు గభస్తీశ్వర ఆలయం దగ్గర. అక్కడ ఒక గుండ్రటి ఆకారంతో ఉంటాడు మయూఖాదిత్యుడు. ఆలయం అంతా పొడిగా ఉంటే మయూఖా దిత్యుడు దగ్గర తడిగా ఆర్ద్రంగా ఉంటుంది.

అంటే అక్కడినుంచి కిరణానదికి సంబంధించిన అంశం ఉంది. అక్కడ సౌరశక్తి విశేషం ఏదో ఉంది. యముడికి సంబంధించిన నది ధర్మానది.

**ఆరవది అరుణాదిత్యుడు**– కాశీ క్షేత్రాన్ని విశ్వనాథఖండం, కేదారఖండం, ఓంకార ఖండం అని మూడు ఖండాలుగా భావన చేస్తే ఓంకారేశ్వర క్షేత్రంలో త్రిలోచనేశ్వరుడు అనే శివుడు ఉన్నాడు. ఈయనకి సమీపంలో కామేశ్వరుడు అని మరో శివుడు ఉన్నాడు.

కాశీలో చేసిన పాపం పోవాలంటే ఈ త్రిలోచనేశ్వరుని దర్శించి, ప్రదక్షిణలు చెయ్యాలి. ఈ త్రిలోచనేశ్వరుని (ఈయనకే త్రిలోకేశ్వరుడని పేరుంది.)

**ఏడవది ఖఖోల్కఆదిత్యుడు–** త్రిలోచనేశ్వరుని మందిరంలో ఆ అరుణాదిత్యుడు ఉన్నాడు. వీరికి దగ్గరలో కామేశ్వర మహదేవ్ దేవాలయంలో ఈ ఖఖోల్కాదిత్యుడు ఉన్నాడు. ఈయనకే **వినతాదిత్యుడు** అనే మరో పేరు ఉంది.

వినతాదేవి గరుత్మంతునితో చెప్తూ "ఆ సూర్యుని అనుగ్రహం చేత నా దాస్య విముక్తి జరిగింది" అంది. కనుక నేను అక్కడ సూర్య ఆరాధన చేసి శివలింగ ప్రతిష్ఠ చేశానన్నది. వెంటనే గరుత్మంతుడు మాతృదాస్యవిముక్తి చెయ్యడమే కాకుండా తల్లి కోరిక తీర్చడం కోసం కాశీక్షేత్రానికి తల్లిని తీసుకువెళ్ళగా ఆమె శివుని, ఆదిత్యుని ప్రతిష్ఠ చేయగా వారు ఉభయులు దర్శనమిచ్చి ఆమెను అనుగ్రహించారు.

**ఖఖోల్క** అనే పేరు రావడానికి ప్రత్యేకత ఉన్నది. సూర్యమంత్రాలలో ఖఖోల్క అనే శబ్దం ప్రత్యేకమైనది. మంత్రశాస్త్రంలో కూడా **శ్రీ సూర్యాయ ఖఖోల్కాయనమః** అనే మంత్రం ఉంది. ఈ అక్షరాలు లెక్కిస్తే తొమ్మిది అక్షరాలు వస్తాయి. దీని అనుష్ఠాన పద్ధతి పురాణాలలో ప్రత్యేకంగా చెప్పారు.



ఖఖోల్కాయ అనేదానిలో రెండు సార్లు ఖ శబ్దం వస్తుంది. ఖ అంటే ఆకాశం. ఖే,ఖే అంటే ఆకాశమందు. ఆకాశంనందు జ్వలించువాడు అని అర్థం. ఖం అంటే ఆకాశమని, ఇంద్రియం అని కూడా అర్థం ఉంది.

ఖఖోల్క అనే దానికి నిర్వచనం విద్యారణ్యులవారు చెప్తూ "ఖే ఆకాశే సూర్యరూపేణ ఖే ఇంద్రియేషు ఆత్మరూపేణ ఉల్కాయివ" అన్నారు. ఆకాశమందు సూర్యరూపంతో, ఇంద్రియాల యందు చైతన్యరూపంతోనూ ప్రకాశించేవాడు గనుక ఖఖోల్కాదిత్యుడు.

అంతర్బహిత్వప్రకాశత్వాత్ –అంతర్బహి ప్రకాశకుడు అన్నారు. మన లోపల, వెలుపల ప్రకాశిస్తున్నాడు. కనుక ఖఖోల్క. దీని గురించి విశ్వనాథుడు విశాలాక్షితో చెప్తూ

**ఇత్థం ఖఖోల్కాదిత్యః కాశీవిఘ్నతమోహరః।**
**తస్యదర్శన మాత్రేణ సర్వపాపైఃప్రముచ్యతే।।**

ఆయన్ని దర్శిస్తే కాశీలో ఉండకుండా అడ్డుకునే విఘ్నాలు తొలగిస్తాడు. పైగా సర్వ పాపాల నుంచి విముక్తి కలిగిస్తాడు.

**ఎనిమిదవది వృద్ధాదిత్యుడు** – ఇదొక అద్భుతమైన సూర్యాలయం. కొన్ని కొన్ని ఆలయాలు ఇప్పటికీ అంతతేలిగ్గా చూడలేం. కొన్ని నిగూఢంగాను, కొన్ని అగూఢంగాను,

కొన్ని గూఢాగూఢంగాను ఉంటాయి. కేవలం తరించే యోగం ఉన్నవారు మాత్రమే వాటిని దర్శించి సేవించుకోగలరు.

కాశీలో ఒక ఋషి వృద్ధాదిత్యుడనే సూర్య ప్రతిష్ఠ చేసి తాను వృద్ధాప్యపుబాధ నుంచి బయట పడ్డాడు. వృద్ధాప్యపు బాధలు పోవాలంటే ఈ వృద్ధాదిత్యుని ఆరాధన చెయ్యాలి. ముసలి సూర్యుడు. ఎప్పటివాడో అతడు.

ఎంత ముసలి వాడైనా నిత్యం మంచి యవ్వనంలో ఆయన ఎలా ఉంటాడో ఆయన ఆరాధించిన వారిని కూడా అలాగే అనుగ్రహిస్తాడు. ఈ క్షేత్రం విశాలాక్షీదేవికి దక్షిణం వైపు ఉందని పురాణంలో వర్ణించారు. సరిగ్గా లెక్కకట్టి చూస్తే మీర్‌ఘాట్ దగ్గర హనుమాన్ మందిరంలో ఉన్నవాడు వృద్ధాదిత్యుడు.

**తొమ్మిదవది కేశవాదిత్యుడు** –అసీఘాట్లో లోలార్కుడు ఉన్నట్టుగా వరణానది గంగానదితో కలిసే చోటు గంగావరణల సంగమం అక్కడకి విష్ణువు మొట్టమొదటిగా వచ్చి ఆదికేశవరూపంతో ఉన్నాడు. అక్కడ రెండు మూడు కేశవ రూపాలున్నాయి. కేశవుడు శివ ధ్యానం చేస్తూ ఉంటే సూర్యుడు ఆయన దగ్గరకి వచ్చి నాకు శివతత్త్వం గురించి నువ్వు చెపితే వినాలని ఉంది అన్నాడు. కేశవుడు శివతత్త్వాన్ని బోధిస్తుంటే అలా వింటూ ఉండిపోయాడు సూర్యభగవానుడు. కేశవుని ద్వారా వచ్చి ఉన్న ఆదిత్యుడు కేశవాదిత్యుడు అనే పేరుతో వరణానది సంగమం దగ్గర ఉన్నదని కాశీ ఖండం చెప్తోంది.

**కేశవాదిత్యమారాధ్య వారాణశ్యాం నరోత్తమః ।**
**పరమం జ్ఞానమాప్నోతి యేన నిర్వాణభాగ్భవేత్॥**

కేశవాదిత్య ఆరాధన వల్ల మోక్షానికి అనువైన జ్ఞానము లభిస్తున్నది.

**పదవది విమలాదిత్యుడు** – ఈ పేరు రావడానికి కారణం. విమలుడు అనే రాజు ఉండేవాడు. ఆయనకు ఒకసారి భయంకరమైన చర్మవ్యాధి వచ్చింది. ఆయన కాశీ క్షేత్రానికి వచ్చి హరికేశవనం అనే మహావనంలో సాధనచేసి సూర్యానుగ్రహం ద్వారా తిరిగి ఆరోగ్యవంతుడయ్యాడు. హరికేశవనం ప్రస్తుతం జంగన్‌వాడి మఠం.

ఇక్కడికి సమీపంలో విమలాదిత్యక్షేత్రం ఉంది.

కొన్ని దశాబ్దాల క్రితం అనేక మహావనాలు ఉండేవి. ఇవి అన్నీ శాస్త్రంలో వర్ణించ బడ్డాయి. అలాగే అంధువుల సంఖ్య లెక్కింప అలవికాదు. వాపికల సంఖ్య లెక్కింప వలను కాదు అంటాడు శ్రీనాథమహాకవి. అనేక బావులు, నూతులు ఉన్నాయి.

అవి అన్నీ ఇప్పుడు మూసుకుపోయాయి. కొన్నిచోట్ల ఇప్పటికి మూతపెట్టి వాడు

కుంటుంటారు. కాశీ ఒక ఆశ్చర్యకరమైన క్షేత్రం.

**పదకొండవది గంగాదిత్యుడు** – ఈ ఆదిత్యుడు వచ్చి గంగాదేవిని స్తోత్రం చేసాడు. సర్వనదులు, తీర్థాలు ఇవన్నీ కూడా సూర్యుని వల్లనే లభిస్తున్నాయి. విష్ణువు నుంచి వచ్చిందంటే విష్ణువే సూర్యభగవానుడు.

మనం మాములుగా జలం పెట్టుకున్నా దానికి సూర్యకిరణాలు తాకితే తీర్థత్వం వస్తుంది.

సూర్యకిరణ స్పర్శ లేనిదే పుణ్యనదులలో స్నానం చెయ్యరాదు అంటారు. సర్వదేవతల చేతా నమస్కరింపబడే గంగాదేవిని నమస్కరించాడు. కాశీలోని గంగ అంటే దాని ప్రత్యేకతే వేరు. సూర్యుడు వస్తూనే గంగాదేవిని స్తుతించాడు. ఎక్కడ నిలబడి గంగను స్తుతించాడో అక్కడ తాను స్వయంభువై ఉన్నాడు. అదే గంగాదిత్య క్షేత్రం.

ఇది లలితాఘాట్ అని చెప్పబడుతుంది. అక్కడే చౌషష్ఠీ ఘాట్ ఉంది.

ఇప్పటికీ రహస్యంగా మనము మాములు కంటితో చూడలేని దివ్య శ్రీవిద్యోపాసకులైన ఋషులు ఉన్నారక్కడ. వారిని చూస్తే పిచ్చివాళ్ళల్లా కనపడతారు. వారి భూమికలు వేరు. అవి మనకి చిన్ని చిన్ని గూడుల్లా కనపడతాయి.

కాని అనేకమైన రహస్యాలు ఉన్నాయి, ఇప్పటికి అక్కడ ఒక చోట కేవలం మౌనంతో ఎవరితో మాట్లాడని ఒక మహాయోగి ఉన్నాడు. ఒక అద్భుతమైన క్షేత్రం.

**పన్నెండవది యమాదిత్యుడు** – ఈ క్షేత్రం గురించి ప్రత్యేకించి చెప్పారు. ఈ యమాదిత్య క్షేత్రం దగ్గర గంగలో స్నానం చేసి యమాదిత్యుని దగ్గర పితృకర్మగాని చేస్తే ఆ పితృదేవతలు సద్గతిని పొందుతారు, ఆ చేసినవాడు ధన్యుడవుతాడు. వాడికి యమబాధ ఉండదు. అక్కడ శివుని, యమాదిత్యుని దర్శించాలి అని ప్రత్యేకంగా విధి కూడా బోధించి చూపించారు.

ఇక్కడ భౌమచతుర్దశి చాలా గొప్పగా చేస్తారు.

మంగళవారం చతుర్దశిగాని కలిస్తే అది అలభ్యయోగం. ఇది సరిగ్గా సంకటాఘాట్ అనే చోట ఉంది.

**పన్నెండవది ఆదిత్యుడు:–** ఇలా కాశీలో పన్నెండు ఆదిత్యక్షేత్రాలు ఆవిర్భవించాయి. ఆ ద్వాదశ ఆదిత్యులకి నమస్కారం చేసుకుందాం.

ద్వాదశాదిత్యులలో ఒక్కో ఆదిత్యుడికి ఒక్కో మహిమ ఉంది. తరువాత దివ్యమైన సూర్యతత్త్వంలో మరో విశేషంలోకి ప్రవేశిస్తున్నాం.

**విశ్వరూపం హరిణం జాతవేదసం**
**పరాయణం జ్యోతిరేకం తపంతం**
**సహస్రరశ్మిం శతధావర్తమానః**
**ప్రాణప్రయాణముదయత్యే చ సూర్యః**

సూర్యప్రశ్నోపనిషత్తులోని మంత్రం ఇది. ప్రజల యొక్క ప్రాణం సూర్యరూపమై ఉదయిస్తున్నది అన్నారు. అనగా ప్రశ్నోపనిషత్తు సూర్యుని ప్రధానంగా ప్రాణశక్తి స్వరూపంగా అనేక మంత్రాలలో చూపిస్తున్నది. **ఆదిత్యో హవై ప్రాణః** అని ఒక మాట ఉన్నది. ఈ ఆదిత్యుడే ప్రాణ స్వరూపుడు. ఆ భావనతో సూర్యుని మనం ఉపాసించాలి.

ఆదిత్యుడు ఎలా ప్రాణాన్ని ఇస్తున్నాడో సాంబపంచాశికలో సాంబుడు చెప్తున్నాడు. దీని ద్వారా ప్రాణశక్తిని, అన్నశక్తిని ఆదిత్యుని ద్వారా ఎలా పొందుతున్నామో తెలుసుకుందాం.

**దివ్య జ్యోతిఃసలిల పవనైః పూరయిత్వా త్రిలోకీ**
**ఏకీభూతం పునరపి చ తత్సారమాదాయ గోభిః॥**
**అంతర్లీనో విశసి వసుధాం తద్గత స్సాయసేన్నం**
**తచ్చ ప్రాణాస్త్వమితి జగతాం ప్రాణభృత్సూర్య ఆత్మా॥**



అని సాంబుడు ఎంతో అందంగా అనువదించాడు. 'దివ్యమైన జ్యోతి అంటే కాంతి' సలిలము, పవనము. అంటే అగ్ని, జలము, వాయువు ఈ మూడింటిని తన శక్తి ద్వారా సూర్యభగవానుడు ప్రపంచమంతా నింపి, ఈ మూడింటిని తాను మళ్ళీ స్వీకరించి భూగర్భంలో ప్రవేశించి అన్నాన్ని సృజిస్తాడు. ఈ విధంగా అన్న సృజన చేస్తున్నాడు సూర్యుడు.

అత్తి ఆదత్తి అనే శబ్దాల ప్రకారంగా ఆదిత్యుడు అంటే **తినువాడు, తినిపించేవాడు** అని రెండు అర్థాలు. తన కిరణాల ద్వారా అన్నీ తింటాడు. మళ్ళీ మనచేత తినిపిస్తాడు. **అన్నప్రదాత** అనే ఆదిత్య శబ్దంలో ఉన్నది. ఆ కారణం చేతనే ధర్మరాజు వనవాసానికి వెళ్ళేటప్పుడు ధర్మం ప్రక్కకే వచ్చారు గాని ఋషులందరూ, అధర్మమైన దుర్యోధనుని దగ్గరకి వెళ్ళలేదు. ఇది భారతం చూపిస్తున్న గొప్ప విషయం.

సూర్యుని ఉద్దేశించి అష్టోత్తర శతనామాలు చెయ్యడమే కాకుండా, ధర్మరాజు హృదయం నుంచి కొన్ని మాటలు వస్తాయి. అవి చెపితే పెద్ద వాఖ్యానం అవుతుంది కనుక రెండు మూడు చెప్పుకుందాం.

**ఆదిదేవోసి దేవానాం ఐశ్వర్యాయ త్వమీశ్వరః**
**ఆదికర్తాసి భూతానాం దేవదేవో దివాకరః**
**ద్వాదశాత్మా రవిర్దక్షః పితామాతా పితామహః**
**స్వర్గద్వారం ప్రజాద్వారం మోక్షద్వారం త్రివిష్టపమ్**

స్వర్గానికి నువ్వే మూలం. ఉత్తమ సంతానానికి నువ్వే మూలం. మోక్షం పొందలన్నా నువ్వే మూలం. స్వర్గస్వరూపుడవు. పైగా ముల్లోకాలు నీ రూపమే అని నమస్కారం చేస్తాడు ధర్మరాజు. అప్పుడు సూర్యుడు ప్రత్యక్షమయ్యాడు.

ప్రత్యేకించి సూర్యుడు ఉపదేశించిన ఆత్మజ్ఞానగ్రంథం ఉంది. అది 'సూర్యగీత'. షణ్మతాలలో ఆరుగురికి సంబంధించి గీతా జ్ఞానం ఉంది. ఏ గీతలోనైనా ప్రధానాంశం బ్రహ్మవిద్యే. బ్రహ్మవిద్య చెప్పబడిన చోటునే గీత అనాలి.

ఈ బ్రహ్మవిద్య చెప్పే తీరులో తేడా ఉంటుందిగాని, పారిభాషిక పదాలు, చెప్పిన మార్గాలలో తేడా లేదు. హైందవుల ఏ గ్రంథం తీసినా మార్గం మాత్రం ఒకటే. చెప్పడంలో కొత్తకొత్త ఆకర్షణీయమైన పద్ధతులు ఉంటాయి.

ఉపాసనాపరంగా మనం ఒక దైవాన్ని ఎంచుకున్నప్పుడు ఆ దైవాన్ని ప్రధానంగా చేసుకుని మొత్తం విద్య చెప్పడం అందులో కనబడుతుంది.

అన్వయం పట్టుకోగలిగితే అన్ని గీతలలో ఒకటే మాట అందుతుంది.

సూర్యగీత మాత్రం చాలా చిత్రమైన గతిలో ఉంటుంది. ఒకప్పుడు బ్రహ్మ దగ్గరకి అనేక మంది ఋషులు వచ్చి ఈ కర్మగతి గురించి ప్రశ్న వేస్తారు. ఈ కర్మలు ఏమిటి? ఇవి ఎలా వచ్చాయి? వీటి పరిస్థితి ఏమిటి? ఈ కర్మ పక్వమైన లోకం ఏ విధంగా తరిస్తుంది? పరీక్ష్యలోకాన్ కర్మ చితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్' అని ఉపనిషత్తు చెప్పినట్లుగా కర్మ పచితమైన ఈ లోకం ఎలా తరిస్తుంది?

కర్మ గురించి చెప్తూ ఉంటే స్పష్టత బ్రహ్మకే రాలేదు. వేదాంతవిద్య అంత తేలికకాదు. మహాగహనమైనది. ఆఖరికి బ్రహ్మ వారితో నాకే ఒక స్పష్టమైన జ్ఞానం కావాలయ్యా అని ధ్యానంలోకి వెళ్లాడు. **'శివాయ గురవే నమః'** పరమేశ్వరుడు దక్షిణామూర్తిరూపంలో దర్శనం ఇచ్చి, ఆయనకి కర్మజ్ఞాన మార్గాలు ఇత్యాదులు బోధించిన విజ్ఞానం పేరు సూర్యగీత.

దీనికి 'సూర్యగీత' అని ఎలా పేరు వచ్చిందంటే, "ఈ కర్మలు, కర్మగతులు గురించి సూర్యునికి, అనూరునికి జరిగిన సంభాషణను చెప్తున్నాను విను" అంటాడు దక్షిణామూర్తి.

అనూరుడు సూర్యరథసారథి. ఈయనకు అరుణుడు అని కూడా పేరు.

ఉదయం పూట సూర్యుడు రావడానికి ముందు వచ్చేది అరుణమే. అచ్చం సారథిలాగే ఉంటాడు. సూర్యునకు, మనకు మధ్యలో సారథిగా అనూరుడు.

వినతాదేవికి ఇద్దరు పుత్రులు అనూరుడు, గరుత్మంతుడు. అనూరుడు సూర్యనారాయణుని సారథి ఐతే, గరుత్మంతుడు నారాయణునికి వాహనం. వీరిద్దరూ విష్ణుతత్త్వమే. అనూరుడు ఊరువులు లేనివాడు అని చెప్పడం చలనములేని కాంతిశక్తికి సంకేతం. 'Static Energy. అశ్వాలు ముందు ఉన్నాయి. అవి కదలే లక్షణం. Dynamic Energy. రెండు ఎనర్జీలకు మూలమైన ఎనర్జీ సూర్యభగవానుడు వెనకాల ఉన్నాడు. స్థిరచైతన్యం, చరచైతన్యం. చరచైతన్యం సప్తాశ్వములు, స్థిరచైతన్యం అనూరుడు. రెండింటి నియామకుడైన అసలు చైతన్యం సూర్యభగవానుడు.

ఒకసారి అనూరుడు రథాన్ని నడుపుతూ క్రిందకు చూసి "రోజూ చూస్తూనే ఉన్నాను ఈ ప్రపంచాన్ని ఎంత భయంకరంగా ఉందయ్యా ఈ లోకం! ఈ జీవులు అజ్ఞానం చేత పుడుతూ-చస్తూ, చస్తూ-పుడుతూ ఈ చర్విత చర్వణ సంసార చక్రంలో తిరుగుతూనే ఉన్నారు. కానీ దీని నుంచి బయటపడే ఆలోచనా లేదు, ప్రయత్నమూ లేదు. ఎందువల్ల వీరందరూ ఇలా తిరుగుతున్నారు? వీళ్ళు ఎలా తరిస్తారు?" అంటాడు.



నువ్వు క్రింద చూస్తున్న ఈ సమస్త జీవులలో ఎన్ని రకాలు ఉన్నాయో గమనించు. తిర్యక్ జంతువులు చాలా ఉన్నాయి. ఇవి సంపూర్ణంగా కర్మకు అధీనాలే. వీటికి కర్మను నియంత్రించగలిగే శక్తి లేదు. పూర్తి కర్మాధీనములే. సంసారం నుంచి తరించాలనే ఆలోచన లేని మానవులు కూడా కర్మాధీనులే. మానవుడు సరైన వివేచన చేసి కర్మచక్రం నుంచి బయటపడే అవకాశం ఉందయ్యా!

అసలు కర్మ ఎలాంటిది? కర్మలోనే పుట్టి కర్మలోనే తిరుగుతున్నవాళ్ళు కర్మనుంచి అతీతమైన మోక్షాన్ని ఎలా పొందగలరు? కర్మలో ఉన్నవారు, కర్మ చెయ్యాలని ప్రేరణ పొందుతున్నవారు ఏవిధంగా కర్మను చేస్తే దాని నుంచి బయటకు రాగలరు?

కర్మయోగంతో ప్రారంభిస్తూ, క్రమ క్రమంగా దానిని ఉపాసనా పరంగా తీసుకువచ్చి, ఆత్మజ్ఞానపరంగా అన్వయిస్తూ వేదాంతంగా అచ్చం భగవద్గీత అంతా అక్కడ చూపిస్తాడు. అనూరునికి, సూర్యునికి జరిగిన చర్చ సూర్యగీత. ఇది నిజానికి బ్రహ్మపదార్థం గురించి చెప్తున్న మాట. గీతలో నేనే సర్వభూతాల యందు ఉన్నవాడిని అని కృష్ణుడు చెప్పినట్లే ఇక్కడ సూర్యుడు చెప్తున్నాడు.

**సర్వేషాం జ్యోతిషాం జ్యోతిః ప్రకాశానాం ప్రకాశకః** - జ్యోతిస్సులకు జ్యోతి

**జ్యోతిషామపి యజ్జ్యోతిః**

**తమేవభాంతి మనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి**

ఉపనిషత్తుల్లో, గీతలోని భావాలే ఇవి.

**సర్వేషాం జ్యోతిషాం జ్యోతిః ప్రకాశానాం ప్రకాశకః**
**అహమేవాస్మి సర్వాసాం శక్తీనాం ఆశ్రయస్తథా**

సర్వశక్తులకు, జ్యోతులకు నేనే ఆశ్రయమైవాడను.

**అన్యయేచగ్రహా విప్రాః తథైవోపగ్రహాశ్చయే**
**నిత్యం ప్రదక్షణీ కృత్యా మామైవేతాః సమాశ్రితాః**

'గ్రహాదులన్నీ కూడా నన్నే ప్రదక్షిణం చేస్తూ నన్నే ఆశ్రయించి ఉన్నాయి.' సూర్యుని చుట్టూ గ్రహాలన్ని తిరగడం గురించి పురాణవేత్తకి ఏనాడో స్పష్టమైన ఖగోళజ్ఞానం ఉంది. అలాగే-

**బ్రహ్మాండం దేహపిండంచ సర్వంమే సత్తయాస్థితం**

బ్రహ్మాండము నందు పిండాండము నందు సత్తగా, అంటే కేవలం ఉనికి మాత్రంగా సత్పదార్థముగా ఉన్నవాడను నేను. ఇలాంటి సూర్యాదిలోకాలెన్నో నా యందు ఉన్నాయి.



**1. అనంత సూర్యలోకాస్తు ఉపగ్రహకనైగ్రహైః, 2. అనంతైః సహ మే సత్తా ఆజ్ఞానాం పాలనేనఘ, 3. తథా సంఖ్యావిహీనాస్తే లోకాస్సూర్యాదినామకాః**

ఈ సూర్యాది లోకాలన్నీ కూడా ఆద్యంత రహితమైన నా విరాట్పురుష దేహము నందే ఉన్నవి. గీతలో లాగానే ఆదిత్యుడు విరాట్ స్వరూపం చూపడాన్ని వర్ణించారు. ఇది నా యొక్క స్థూలమైన అనంత రూపం. ఇది గ్రహించడం మహా కష్టమే.

సర్వవ్యాపకమై ఆకాశము కంటే సూక్ష్మమైన నా సూక్ష్మతత్త్వము తెలుసుకోడమూ కష్టమే. నా స్థూలం, సూక్ష్మం రెండూ అనంతమే అని చెప్తూ, దానిని భక్తితో కూడిన విచారణా మార్గంతో ఆచరించినవారు సులభంగా తెలుసుకోగలరు. ఇలా సూర్య గీతాదులలో చూపించిన అంశాలన్నింటిని సాంబపంచాశికలో ఒక శ్లోకంలో చెప్తూ

**స్థూలత్వం తే ప్రకృతిగహనం నైవ లక్ష్యం హ్యనన్తం**
**సూక్ష్మత్వం వా తదపి సదసద్ వ్యక్తభావాదచిన్త్యమ్।**
**ధ్యాయా మీత్థం కథ మవిదితం త్వా మనాద్యన్తమన్త**
**స్తస్మా దర్క! ప్రణయిని మయి స్వాత్మనైవ ప్రసీద॥**

ఈ శ్లోకాలలో సాంబుదు సూర్యుని ముందు మనస్సుని భక్తితో విప్పి చూపిస్తాదు. నీ స్థూల శరీరం, అనగా ఇంద్రియగ్రాహ్యమైన స్వరూపం అలక్ష్యం. దానిని తెలుసు కోలేం. అది అనంతం. స్థూలప్రపంచాన్ని మన కన్ను ఎంత వరకు విస్తరింప చేసి ఎంత పట్టుకోగలం?

సూక్ష్మత్వం చెప్పాలంటే అది కార్యకారణాలకు కూడా అందదు. అచింత్యమైనది. నీ సూక్ష్మత్వం అదీ అందుబాటులో లేదు. నిన్ను ఎలా పట్టుకుంటానయ్యా! నీ స్థూలత్వం, సూక్ష్మత్వం రెండూ పట్టుకోలేను. కానీ పట్టుకోవలసినది నిన్నే. మాకేమీ తెలియదని నిన్ను పట్టుకుంటే తరించిపోతాం.

ఓ అర్కుడా! నీ అంతట నువ్వే నన్ను అనుగ్రహించాలి తప్ప తెలుసుకుని అనుగ్రహం పొందగలశక్తి నాకు లేదయ్యా! అలాగని ప్రయత్నం లేదని కాదు. నిన్ను తెలుసుకోగలిన అపరిమిత శక్తి నాకు లేదు. నేను పరిమితుడిని. స్వామీ! నేను నీ పై ప్రేమ కలిగిన వాడను. నీ అంతట నువ్వు నన్ను అనుగ్రహించాలి. ఇది అహంకారరాహిత్యం.

మనకు ఏమీ తెలీయకపోయినా స్వామి పై ప్రేమ ఉంటే చాలు. ఆయనే నా సర్వస్వం, ఆయన నా దైవం అని ప్రేమ భావం ఉంటే తనంత తాను అనుగ్రహించి మనకు కావలసినది ఇస్తాదు.



ప్రేమ పూర్వకంగా ఆశ్రయించడమే భక్తి. స్వామీ! నాకు అంతఃకరణరహితమైన జ్ఞానం తెలియదు. అంతఃకరణాదులతో బంధింపబడిన నేను జ్ఞానాన్ని తెలుసుకోలేను.

**జ్ఞానం నాస్తకరణరహితం విద్యతేఽస్మద్విధానాం**
**త్వం చాత్యన్తం సకలకరణాగోచరత్వాదచిన్త్యః**
**ధ్యానాతీతస్త్వమితి న వినా భక్తియోగేన లభ్యః**
**తస్మాద్భక్తిం శరణ మమృతప్రాప్తయేఽహం ప్రపన్నః**

నాకున్న లక్షణం ఇంద్రియాదులకు ఏది దొరుకుతుందో అది మాత్రమే నేను పట్టుకోగలను. అది తప్ప ఇంకొకటి చెప్తే నాకు అర్థంకాదు. సకల కరణాలకు అగోచరుడవై అచింత్యస్వరూపుడవు నువ్వు. నిన్ను నేను ఏ విధంగా ధ్యానం చేస్తానయ్యా! నువ్వు నాకు అందవని వదలను. ధ్యానాతీతుడవైనప్పటికి భక్తియోగం లేకపోతే దొరకవు, కనుక భక్తి యోగంతో నిన్ను శరణు వేదుతున్నాను. ప్రేమపూర్వకమైన ఆశ్రయమే భక్తి. కనుక నేను ప్రపన్నుడిని భక్తి యోగంతో నిన్ను శరణు వేదుతున్నాను. నాకు అమృతప్రాప్తిని నువ్వే అనుగ్రహిస్తావు... అని సంపూర్ణ శరణాగతితో సూర్యుని స్తుతించాదు సాంబుదు.

## సూర్యోపనిషత్-భావం

'సూర్యోపనిషత్' అని ఒక ఉపనిషత్తు ఉంది. ఉపాసనా పరమైంది. ఇది అధర్వణ వేదానికి సంబంధించింది. దీన్ని అధర్వశీర్షం అని కూడా అంటారు. మనం ఏ ఉపాసన లో ఉంటామో ఆ ఉపాసనామార్గాన్ని ఉపనిషత్తత్త్వంతో అన్వయించుకోవడం కోసం వీటికి ఋషులచేత ఉపనిషత్ స్థానం కల్పించబడింది.

సూర్యోపనిషత్తులో కొన్ని ప్రధానమైన వాక్యాలు చూస్తే 'సూర్య ఆత్మ జగతస్థస్తుషశ్చ' - సూర్యుడు స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తుకి ఆత్మగా ఉన్నవాడు. ఈ మంత్రం మనకి వేదంలో అనేక భాగాలలో కనపడుతుంది. ఉపనిషత్తులో కూడా స్వీకరించడం జరిగింది.

**సూర్యాద్వైఖల్విమాని భూతాని జాయంతే**
**సూర్యాద్యజ్ఞః పర్జన్యోన్నమాత్మా**
**నమస్తే ఆదిత్య**
**త్వమేవ ప్రత్యక్షం కర్మ కర్తాసి**

సృష్టిస్థితిలయకారకుడైన పరమేశ్వరునిగా సూర్యుని ఇందులో చెప్పడం జరిగింది. యజ్ఞానికి, పర్జన్యానికి, అన్నానికి ఇతడు కారణమైనవాడు. యజ్ఞస్వరూప, పర్జన్యస్వరూప, అన్నస్వరూపుడు.

కారణం అతడే, స్వరూపమూ అతడే. దీని క్రమం చూస్తే యజ్ఞం ద్వారా పర్జన్యం, పర్జన్యం ద్వారా అన్నం చెప్పారు. కనుక సూర్యుడు సంపూర్ణంగా యజ్ఞస్వరూపుడు. అలాంటి ఆదిత్యునికి నమస్కరిస్తూ

**త్వమేవ ప్రత్యక్షం కర్మ కర్తాసి**
**త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి**
**త్వమేవ ప్రత్యక్షం విష్ణు రసి**
**త్వమేవ ప్రత్యక్షం రుద్రోసి**
**త్వమేవ ప్రత్యక్షం ఋగసి**
**త్వమేవ ప్రత్యక్షం యజురసి**
**త్వమేవ ప్రత్యక్షం సామాసి**
**త్వమేవ ప్రత్యక్షం కర్మ అథర్వాసి**
**త్వమేవ ప్రత్యక్షం కర్మ ఛందోసి**

ఋక్కులు మొదలుకుని సర్వవేదాలు నీ స్వరూపం.

బ్రహ్మవిష్ణురుద్రాత్మకుడవు నువ్వు అని వేదం చెప్తున్న మాట. అలాగే...

**ఆదిత్యాద్వాయుర్జాయతే**
**ఆదిత్యాత్ భూమిర్జాయతే**
**ఆదిత్యా దాపోజాయన్తే**
**ఆదిత్యాత్ జ్యోతిర్జాయతే**
**ఆదిత్యా ద్వ్యోమదిశో జాయన్తే**
**ఆదిత్యా ద్దేవా జాయన్తే**
**ఆదిత్యాత్ వేదా జాయన్తే**

పంచభూతాలు, దేవతలు, వేదాలు ఇవన్నీ కూడా ఆదిత్యాత్మకంగా దర్శించి ఉపాసించాలని తెలియజేస్తూ

**అసావాదిత్యోబ్రహ్మ** - ఈ ఆదిత్యుడే బ్రహ్మ. వేదాలలో వివిధ సందర్భాలలో చెప్పిన సూర్యతత్వాన్ని అంతా ఉపనిషత్తులలో సమీకరిస్తున్నాడు మహర్షి.



**ఉద్యంత మస్తంయన్తమాదిత్య మభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణో విద్వాన్ సకలం భద్రమశ్నుతే** - ఉదయించేటప్పుడు, అస్తమించేటప్పుడు ఆదిత్యుని ఆరాధించేవారు సకల భద్రాలు పొందుతున్నారు.

ఆదిత్యుని అంతఃకరణ చైతన్యంగా దర్శించే విధానం కూడా చెప్తూ-

**ఆదిత్యో అంతఃకరణమనోబుద్ధిచిత్తాహంకారః**
**ఆదిత్యో వై వ్యానస్సమానోదానాపానాఃప్రాణః**
**ఆదిత్యో వై శ్రోత్రత్వక్చక్షూరసనఘ్రాణాః**
**ఆదిత్యో వై వాక్పాణిపాదపాయూపస్థాః**
**ఆదిత్యో వై స్పర్శశబ్దరూపరసగన్ధాః**
**ఆదిత్యో వై వచనాదానాగమనవిసర్గానన్దాః**
**ఆనందమయో విజ్ఞానమయ ఆదిత్యః**

సర్వాత్మకస్వరూపంపరంగా ఆదిత్యుని ఉపాసించడానికి భక్తునికి ఆదిత్యుని పట్ల దృష్టి ఎలా ఉండాలి?

దృష్టిబట్టే ఆరాధన ఉంటుంది. సర్వ బ్రహ్మభావంతో ఆదిత్యుని ఉపాసించాలి.

**నమో మిత్రాయ భానవే మృత్యుర్మే పాహి**
**భ్రాజిష్ణవే విశ్వహేతవే నమః**
**సూర్యాద్భవంతి భూతాని**
**సూర్యేణ పాలితాని తు**
**సూర్యేలయం ప్రాప్నువంతి**
**యస్సూర్యస్సోహమేవచ**

ఆ సూర్యుడే నేను. సూర్యుని యందు తేజస్సు, నా యందు ఉన్న తేజస్సు రెండూ పరమాత్మయే అనే భావనతో ఉండాలి. ఇవన్నీ అహం గ్రహోపాసనా అని ఉపనిషత్తులో చెప్పబడుతున్న తత్త్వాన్ని వ్యక్తం చెయ్యడమైంది.

**ఆదిత్యాయ విద్మహే**
**సహస్రకిరణాయధీమహి**
**తన్నో సూర్యః ప్రచోదయాత్**

సూర్యగాయత్రీలు ఎన్నో ఉన్నాయి గాని ఇది ప్రత్యేక గాయత్రీ. సర్వజపయోగ్యమైన గాయత్రీ.



**సవితా పశ్చాత్తాత్ సవితా పురస్తాత్**
**సవితోత్తరాత్తాత్ సవితాధరాత్తాత్**
**సవితా నః సువతు సర్వతాతిగ్ం**
**సవితా నో రాసతాం దీర్ఘమాయుః**

ఇత్యాది మంత్రాలు వేదమునందు ప్రసిద్ధిగా ఉన్నాయి, సూర్యోపనిషత్తులో కూడా స్వీకరించడం జరిగింది.

సూర్యమంత్రాన్నిగాని. సూర్యస్తుతినిగాని సూర్యునికి అభిముఖంగా నమస్కరిస్తూ జపిస్తే

**సూర్యాభిముఖో జప్త్వా**
**మహావ్యాధిభయాత్ ప్రముచ్యతే**
**అలక్ష్మీర్నశ్యతి అభక్ష్యభక్షణాత్ పూతో భవతి**
**అగమ్యాగమనా త్పూతోభవతి**
**పతితసంగభాషణాత్ పూతోభవతి**
**అసత్య సంభాషణాత్ పూతోభవతి**

మహావ్యాధి భయం నుంచి బయటపడతాడు. సకల దారిద్ర్యనిర్మూలనం జరుగుతుంది.

పాపశోధనం జరుగుతుంది. శాస్త్రంలో మనల్ని శుద్ధి చెయ్యడానికి సూర్యకిరణాలను మించినవి లేవు అన్నారు. ఆ కిరణాలలో మనల్ని శుద్ధి చేసే గొప్ప ప్రక్రియ ఉంది.

ప్రయాణసమయాలలో ఎక్కడైనా వినరానివి విన్నా, చూడరానివి చూసినా, జరగ రానిది జరిగినా ఆ దోషం పోవాలంటే వెంటనే కుడిచెవిపై చేతిని ఒకసారి స్పర్శించి సూర్యమండలాన్ని చూసి నమస్కారం చెయ్యమన్నారు.

విష్ణుపురాణంలో దీని గురించి ప్రత్యేకమైన ఘట్టమే చెప్పారు. ఇలా చెయ్యడం వల్ల మహా పాపం నుంచి ఒక స్త్రీ మూర్తి బయట పడుతుంది, కాని ఆమె భర్తమాత్రం ఆ పని చెయ్యకపోవడం వల్ల కొన్ని జన్మలు పశు జన్మలు పొందుతాడు.

నాలుగు ఆశ్రమాలలో ఏ ఆశ్రమానికీ చెందని వాడిని నగ్నుడు, పాషండుడు అంటారు. ఒక రాజు ఒకానొక సమయంలో అటువంటివారితో సంభాషించవల్సిన పరిస్థితి ఏర్పడు తుంది. వెంటనే ఆయన భార్య మాత్రం చూడరానివాడిని చూసినందకు దోషం పోవడం కోసం సూర్యుని చూసి నమస్కారం చేసుకుంటుంది. ఆమెకు దోషం పోతుంది.

భార్య చెప్పినా రాజు మాత్రం ఆ పని చెయ్యనందుకు వరుసగా ఏడు జన్మలు పశుపక్ష్యాది జన్మలు ఎత్తుతాడు. ఈమె మాత్రం శుద్ధురాలై ఉత్తమమైన క్షత్రియకన్యగా అవతరిస్తూ, అతడు ఏ ఏ జన్మలలో ఎలా ఉన్నాడో పోల్చుకుని అతనిని శుద్ధి చేస్తూ వెడుతుంది. చివరి జన్మలో అతనిని బాగు చేసింది భార్య.



***కలియుగంలో ఏ ఏ విధులు ఉన్నాయో తెలియదు గానీ సూర్యుడు ఉన్నాడు, ఆయన కాంతి ఉంది. ఆయనకు నమస్కరించడం కోసం భగవంతుడు రెండు చేతులు ఇచ్చాడు, ఎలా భావించాలో చెప్పడానికి భారతీయ ఋషులు విజ్ఞానం ఇచ్చారు. ఈ విజ్ఞానాన్ని అంది పుచ్చుకుని ఆయన్ని ఆరాధించాలి.***

**మధ్యాహ్నే సూర్యాభిముఖః పఠేత్**
**సద్యోత్పన్న పంచమహాపాతకాత్ ప్రముచ్యతే**

ఇంతవరకూ చెప్పిన దీనిని సూర్యాభిముఖంగా చేస్తే ఎలాంటి పాతకం నుంచైనా బయటపడతాడని చాలా విశేషాలు చెప్పారుగాని ముఖ్యమైనవి మాత్రమే చెప్పుకుంటున్నాం.

పాయసాన్నప్రియుడు సూర్యుడు. పాయసం యజ్ఞయోగ్యమైన ద్రవ్యం. గోక్షీరంతో వండిన పాయసానికి మించిన మహాపదార్థం లేదు.

సూర్యుడు స్తుతి ప్రియుడు అన్నారు.

**స్తుతి స్తోతా రణప్రియః ... స్తోత్రప్రియా స్తుతిమతీ శ్రుతిసంస్తుతవైభవా** అంటున్నాం.

స్తోత్రం భగవత్స్వరూపం. స్తోత్రంలో భగవంతుని రూపం, నామం, మహిమ, లీల, గుణం, తత్త్వం ప్రతిపాదింపబడతాయి. పొగడ్తకు ఒక దైవీయమైన శక్తి ఉంది.

స్తుతికి యోగ్యమైన సర్వగుణాలు, మహిమలు, తత్త్వములు కలవాడు కనుక ఆయనను రవి అన్నారు.

## సూర్యశతకంలో అద్భుతాలు

మయూరకవి రచించిన స్తోత్రకావ్యం సూర్యశతకం చాలా అత్యద్భుతమైన మహిమాన్వితమైన గ్రంథం. ఈ గ్రంథం సంస్కృత సాహిత్యంలో చాలా అగ్రస్థానంలో ఉంది. లక్షణగ్రంథాలలో అలంకారాలు గురించి చెప్పేటప్పుడు మయూరుని సూర్యశతకాన్ని ఉటంకించారు. అన్ని అలంకారాలకు ఈ గ్రంథం ఆధారం. మయూరకవి కాళిదాసు లాంటి మహాకవులతో సమానస్థాయి కలవాడు. దండి ఈయనకు సమకాలికుడు అంటారు.

కూరనారాయణ కవి అనే వైష్ణవపండితుడు సూర్యశతకానికి ప్రతిగా సుదర్శనశతకాన్ని రచించారు. ఇది కూడా నూరు శ్లోకాలు స్రగ్ధరా ఛందస్సులో వ్రాసారు. దీని గమనం కూడా సూర్యశతకంలానే ఉంటుంది. సూర్యశతకాన్ని చదవడం ఎంత క్లిష్టమో సుదర్శన శతకం కూడా చదవడం అంత క్లిష్టమే.



క్లిష్టంలో ఉన్న మాధుర్యం ఇష్టంగా కొందరికి తెలుస్తూ ఉంటుంది. ఆ సుదర్శన శతకంలో ఒక మాధుర్యం ఉంది. దానిని పారాయణ చేసినవారికి కూడా మంచి ప్రభావం ఉంది. తెలుగులో ఒక ప్రౌఢకవి మీద ఈ సూర్యశతక ప్రభావం ఉంది. కొన్ని స్రగ్ధరలు తీసుకొని తెలుగులో అందించారు. సూర్యశతకంలోని ఎన్నో శ్లోకాలకి ఆయన తెలుగులో అనువాదం చేసి తన ప్రబంధంలో కలిపారు. ఆ మహాత్ముడు శ్రీనాథమహాకవి.

ఆయన వ్రాసిన కాశీఖండంలో సూర్యవర్ణన వచ్చినపుడు ఇదంతా వివరించి చూపించాడు. మూలంలో కూడా అంత వర్ణన లేదు ఇదంతా సూర్యశతకం లోంచి తీసుకొచ్చారు. సూర్యశతకానికి తగ్గట్టుగా తెలుగులో వ్రాయాలంటే చింతామణి సరస్వతీ ఉపాసకులైన శ్రీనాథులవారికే సాధ్యమయింది.

సూర్యశతకం సూర్యపారమ్యాన్ని చెప్పే ఒక ఉపాసనా గ్రంథం. దీనిలో అనేక అద్భుతాలు ఉన్నాయి. స్తుతి అంటే వాగ్రూపం. వాక్కుకి ఉన్న శక్తే మంత్రం. మౌనంగా వాక్కుని మననం చేసుకొన్నా రక్షిస్తోందంటే వాక్కుకి అంత శక్తి ఉన్నది.

సూర్యుడు తేజస్స్వరూపుడు. ఆయనకు, వాక్కునకు అనుబంధం ఉంది. ఛాందోగ్యో

పనిషత్తు మనం తినే పదార్థాలు అన్నం, సలిలం, తేజస్సు అని మూడు రకాలుగా ఉంటుందని చెప్తున్నది. అన్నాన్ని వండుతున్నామంటే అగ్నిగుణం దానిలో ప్రవేశిస్తుంది. తైలాదులు కూడా అగ్నిపదార్థాలే అని చెప్పారు. ఘృతం జ్ఞానానికి హేతువు అని చెప్తారు.

ఈ మూడు లోపలకి వెళ్ళి స్థూల, మధ్యమ, సూక్ష్మ అనే మూడు రూపాలు తీసు కుంటాయి. అన్నం యొక్క స్థూల భాగం మాలిన్యంగా వెలికి వస్తుంది, మధ్యమభాగం ఎముకగా మారుతుంది, సూక్ష్మభాగం మనస్సుగా మారుతుంది.

నీరు స్థూలభాగం మూత్రంగా, చిట్టచివరికి సూక్ష్మభాగం ప్రాణంగా మారుతుంది. అన్నం యొక్క సూక్ష్మరూపం మనస్సు.. త్రికరణాలు ఈ రెండే. ప్రాణము అంటే దైహిక క్రియ అంతా ప్రాణం వల్ల జరుగుతుంది కనుక కాయికం. మనస్సు అన్నం వల్ల ఏర్ప డుతుంది. ఎక్కడ పడితే, ఏది పడితే అది తినేవాడికి మంచి ఆలోచనలు ఎలా వస్తాయి?

అగ్ని యొక్క సూక్ష్మాంశ వాక్కుగా మారుతుంది. వాక్కు తేజస్సు యొక్క సూక్ష్మాంశ. సూర్యభగవానుడు తేజఃస్వరూపుడు. తేజస్స్వరూపుడైన ఆయన ప్రసన్నత తీసుకోవాలంటే ఆయన సూక్ష్మరూపమైన వాక్కు ద్వారా ప్రసన్నం చేసుకోవచ్చు. ఇది అర్థమైతే సూర్య మండలాన్ని ఋగ్యజుస్సామాత్మకం అని ఎందుకన్నారో తెలుస్తుంది. వాక్కు ఋగ్యజు స్సామాత్మకంగానే ఉంటుంది. అపౌరుషమైన వాక్కు అనగా మానవ సృజనకాకుండా తనంతతాను ఆవిర్భవించిన దివ్యవాక్కు స్వరూపమే ఋగ్యజుస్సామాత్మకం. ఋగ్యజుస్సామపారగః అని ఆదిత్య హృదయం చెప్తోంది. శబ్దానికి, సూర్యునికి స్పందించే లక్షణం అది. ఈయన స్వరూపమే వాక్కు



సూర్యభగవానుని వాక్కు ద్వారా స్తుతితో ప్రసన్నం చేసుకోవచ్చు. దేవతలందరూ కూడా ఆయన్ని స్తుతితో ప్రసన్నులను చేసుకుంటున్నారు. యజ్ఞంలో నెయ్యి వేస్తే దానికి వాగ్రూపమైన మంత్రం కలిస్తేనే అది ఏ దేవతకైనా వెళ్ళుతుంది. వాక్కు లేకపోతే వ్యవ హారమే లేదు. ఆ వాక్కు సూర్యుని యొక్క స్వరూపం. ఆంజనేయుడు వేదాలను నేర్చుకున్నాడు, యాజ్ఞవల్క్యుడు తిరిగి వేదాన్ని పొందగలిగాడు.

సూర్యశతకంలో వాగ్రూపంలో సూర్యుని అద్భుతమైనస్వరూపాన్ని ఆవిష్కరిస్తున్నారు. దీనిలో చూపించిన కల్పన కేవలం భావుకతతో కాకుండా వైదికభాషలో చేసారు. ఇందులో వాడిన శబ్దాలు కూడా సామాన్యం కావు. వినడానికి సంగీతంలా ధ్వనిస్తూ, నోరారా చదువుతూ ఉంటే కొన్ని జబ్బులు పోతాయి. అలాంటి అత్యద్భుతమైన నూరు శ్లోకాల శతకం. శతకం రెండు రకాలు. ముక్తకప్రాయంగా ఉంటుంది. ముక్తకము అంటే తరువాతి

శ్లోకంతో అవసరం లేకుండానే శ్లోకాన్ని చెప్పడం.

సూర్యశతకాన్ని కూడా ముక్తకశతకం అనవచ్చు. ఇది ప్రబంధకం కూడా. ప్రబంధకం అంటే పూర్వాపర సంబంధంతో కూర్చబడుతుంది. ఇలా ఒక క్రమం ఉంది. ఏ శ్లోకానికి ఆ శ్లోకం భావం పూర్తి అయిపోతుంది. మరొక శ్లోకంతో సంబంధం కూడా ఉంటూ ఉంటుంది. ఇలా రచించడం సామాన్యమైన విషయం కాదు.

సూర్యకిరణాలు లోకానికి ఐశ్వర్యాలు ఇచ్చుగాక! అని ఒకచోట, సూర్యకిరణాలు మాకున్న రోగాలు తొలగించుగాక! అని మరొకచోట అంటాడు. ఇలా ప్రతీ శ్లోకంలో ఒక ఆకాంక్ష ఉంటుంది. నాకు ఏదో ఇచ్చుగాక! అనికాకుండా మీకు లేక లోకానికి అని వహ వహ శబ్దం ఎక్కువ వాడతారు. తన క్షేమం కోసం కాకుండా లోక క్షేమం కోసం చెప్పినట్లుగా కనిపిస్తుంది కనుకనే సూర్యభగవానుడు ఈయనకు క్షేమం కలిగించాడు. కొందరు సాహితీవేత్తలు అంగీకరించకపోయినా ఒక కథ చెప్తారు. మయూర కవికి ఒక మహావ్యాధి రాగా నూరు శ్లోకాలు చెప్పగానే వ్యాధి తొలగిపోయింది. అలాంటి మహిమను ఇప్పటికీ అనుభవిస్తున్న వారు ఉన్నారు.

మయూరశతకం మొత్తం ఆరు భాగాలుగా శాస్త్రీయంగా చాలా చక్కగా చేసారు. మొట్ట మొదటగా సూర్యప్రభావర్ణనం. ప్రభ అనగా కాంతి. తరువాత అశ్వవర్ణన అనగా సూర్యుని గుఱ్ఱాల వర్ణన. సారథి అయిన అనూరుని వర్ణన, రథవర్ణన, మండల వర్ణన, పురుషవర్ణన ఇలా ఆరు భాగాలు. ఈ వర్ణన మొత్తం ఆగమ, నిగమాలను అనుసరించి రచించాడు. అప్పటికప్పుడు కలిగిన స్ఫూర్తితో చెప్పినా ఎన్నాళ్ల నుంచో ఉపాసన చేస్తే తప్ప ఇలాంటి విషయాలు చెప్పలేరు. దీనిలో ఈయన తీసుకున్న ఛందస్సు స్రగ్ధరా. దీనికి వైదిక ఛందస్సుకు సంబంధముంది. ఇందులోని ప్రతీ అక్షరాల సంఖ్యకి సూర్యునికి సంబంధ ముంది. ఇలా 21 అక్షరాలు త్రిసప్తస్సమిధకృతా అనే భావాన్ని చూపిస్తూ ఏడు అక్షరాలకు ఒక విరుపు వస్తుంది. గణపతికి, సూర్యునికి 21 సంఖ్య చాలా ప్రీతి. స్రక్-ధర - మాలను ధరించిన ఛందస్సు అని చెప్పడం. స్రగ్ధరుడు అంటే కిరణమాలి అయిన ఆ సూర్యభగవానుడు మనకు దర్శనం ఇస్తాడు. ఈ స్రగ్ధరా ఛందస్సునే మాలలు చేసి పరమాత్మకి సమర్పించాడు మయూరకవి.

కేవలం భావుకతే ప్రధానం కాకుండా ఉపాసనా దృష్టితో పఠించిన వాడికి, భావించిన వాడికి సత్ఫలం లభించాలనే ఉద్దేశ్యంతో సూర్యమంత్రాలకు అన్వయించే భావంతో భక్తి భావలను కలిగించే శ్లోకాలను కొన్నింటిని గ్రహించే ప్రయత్నం చేద్దాం.

నూరు శ్లోకాలలో 43 శ్లోకాలు ప్రభావర్ణనే చేసారు. ప్రభావర్ణనలో ప్రత్యేకత ఏమిటంటే ఆ ఉషః కాలంతో పాటు సూర్యప్రభ పెరుగు తుంది. లేత ఎండతో మొదలుకుని తీక్ష్ణమైన ఆతపం వరకు, అక్కడ మొదలుకుని మళ్ళీ అస్తమయ కాంతి వరకు. ప్రభలలో ఉన్న మార్పులను రకరకాల అంశాలను ఈ శ్లోకాలలో చూపిస్తారు.

**జంభారాతీభకుంభోఽ ద్భవమివ దధత-స్సాంద్రసిందూరరేణుం**
**రక్తాస్సిక్తా ఇవౌఘై-రుదయగిరితటీ-ధాతుధారాద్రవస్య**
**ఆయాంత్యా తుల్యకాలం-కమలవనరుచేః-వారుణా వో విభూత్యై**
**భూయాసుర్భాసయంతో-భువనమభినవా-భానవో భానవీయాః**

ఉదయిస్తున్న సూర్యకాంతి ఎలా ఉన్నదంటే- జంభాసురునికి శత్రువైన ఇంద్రుని వాహనం ఐరావతం. ఆ ఐరావత కుంభస్థలం పై అలంకారంగా సిందూరం చల్లి ఉంచారు. ఆ సింధూరం గానీ తీసుకుని వస్తున్నాడా! అన్నట్లు ఉంది ఎర్రని కాంతి. స్వామి మొదట దివి, తరువాత అంతరిక్షం, తరువాత పృథ్వికి వస్తాడు.

ఉదయపర్వతంపై గైరికాది ధాతువులు కరిగినప్పుడు ఎర్రగా ఉంటాయి. అలాగ తాను భూమి మీద మెట్టినప్పుడు ఆ పర్వత గైరికధాతువుల ఎర్రని రసాన్ని తీసుకుని వస్తున్నాడా అన్నట్లు ఉంది ఆ ప్రొద్దుటి కాంతి. అదే సమయంలోనే కమలాలు విచ్చుకుంటున్నాయి. ఆ విచ్చుకొనే ఎర్రదనం కూడా చూపిస్తున్నాడా! అన్నట్లు ఉంది. ఐరావత సింధూరం, ఉదయగిరిపై గైరికధాతు ద్రవం, కమలముల ఎర్రదనం ఇలా చెప్పడంలో క్రమం చూడండి. దివి, ఉదయగిరి, కమలములు... వీటియందు సూర్యకాంతి ప్రసరించిన వైనం ఆ ఇది. ఆయన ఎరుపుకాంతిని ముందు చూపిస్తున్నారు. ఇంద్రుడు అని మొదలు పెట్టడంలో ఒక ప్రత్యేకత - సూర్యుడు ఉదయించేది తూర్పున ఆ దిక్కుకి అధిపతి ఇంద్రుడు. కొన్ని శ్లోకాలలో సూర్యుని విష్ణుస్వరూపంగా చూపిస్తూ నువ్వే త్రివిక్రముడవు అంటున్నాడు. ఇది వైదిక దర్శనం.



**బిభ్రాణా వామనత్వం-ప్రథమమథ తథై-వాంశవఃప్రాంశవో వః**
**క్రాంతాకాశాంతరాళా-స్తదను దశదిశః-పూరయన్తస్తతోఽపి**
**ధ్వాంతాందాచ్ఛిద్య దేవ-ద్విష ఇవ బలినో-విశ్వమాశ్వశ్నువానాః**
**కృచ్ఛ్రాణ్యుచ్ఛాయహేలో-పహసితహరయో-హారిదశ్వా హరంతు**

**కృచ్ఛ్రాణి హరంతు** - మన యొక్క భరించలేని కష్టాలను ఆ స్వామి కాంతులు, కిరణాలు హరించుగాక! అన్నారు. ఈ కిరణాలు మొట్టమొదట వామనంగా అనగా అల్పంగా

వచ్చి, క్రమంగా ఆయన అంశువులన్నీ ప్రాంశువులైపోయాయి అన్నారు. ప్రాంశు అంటే పొడగరితనం.

**ఉపేంద్రో వామనఃప్రాంశుః** అని విష్ణుసహస్రం చెప్తుంది. పొడగరి పొంది త్రివిక్రము నిలా పైన, క్రింద, మధ్యలో ఆక్రమించుకుంటూ దింగతరాలలో కూడా వ్యాపించి పోయాడు. వ్యాపకతత్వాత్ విష్ణుః అన్నారు. వామనుడు బలి చేత నుంచి లోకాలను లాక్కున్నట్టు చీకటిచేతిలో ఉన్న లోకాలన్నింటిని లాక్కొని వెలుగులోకి తెచ్చాడు. ఆ విధంగా ప్రాతఃకాలంలో గగనమండలంలో అణోరణీయాన్ మహతోమహీయాన్ అన్నట్టుగా వామనత్వం నుంచి త్రివిక్రముడి వరకూ చూపించిన సూర్యనారాయణునకు నమస్కారం. తరువాత శ్లోకంలో సూర్యునిలో సుబ్రహ్మణ్యస్వామిని చూపిస్తున్నాడు.

**బంధధ్వంసైకహేతుం-శిరసి నతిరసా-బద్ధసంధ్యాంజలీనాం**
**లోకానాం యే ప్రబోధం-విదధతి విపులాం-భోజషం(ఖం) దాశయేవ**
**తే యుష్మాకం స్వచిత్త-ప్రథిమ(త) పృథుతర-ప్రార్థనాకల్పవృక్షాః**
**కల్పం తాం నిర్వికల్పం-దినకరకిరణాః కేతవః కల్మషస్య**

తారకని అధిగమించి వచ్చాడు అన్నారు. నక్షత్రకాంతులని అధిగమించి రావడమని అర్థం. అలాగే తారకాసురుని అధిగమించి వచ్చిన సుబ్రహ్మణ్యుని చూపిస్తున్నారు. స్వామి కిరణాలను ప్రార్థించేవారికి కల్పవృక్షములని వర్ణిస్తున్నాడు. బంధాలను ధ్వంసం చెయ్యడంలో ప్రధాన సాధనాలు. సంసారబంధాన్ని పోగొట్టి మోక్షం ఇవ్వడం.



కొంతమంది ఉదయించే సూర్యభగవానుని ఉద్దేశించి రెండు చేతులు శిరస్సుపై పెట్టుకుని అంజలి ఇస్తున్నారు. ఇది ఎలా ఉందంటే పద్మాలు నెత్తిమీద పెట్టుకుని దణ్ణం పెడుతున్నట్టు ఉందన్నారు. వెంటనే పద్మాలను వికసింపచేసినట్లు ఆయన వారిలోని జ్ఞానాన్ని వికసింపచేస్తున్నాడు.

ఇలాంటి స్వామి మన చిత్తానికి అభీష్టసిద్ధి కలిగించాలి, ఆ కిరణాలు మన కల్మషాలను అంటే పాపాలను నశింపచేసే ధూమకేతువులు కావాలన్నాడు.

**ధారా రాయో ధనాయా-పది సపది కరా-లంబభూతాః ప్రపాతే**
**తత్త్వాలోకైకదీపా-స్త్రిదివపతిపుర-ప్రస్థితా వీథ్య ఏవ**
**నిర్వాణోద్యోగియోగి-ప్రగమనిజతను-ద్వారి నేత్రాయమాణా**
**స్త్రాయంతాం తీవ్రభానో-ర్దివసముఖసుఖా-రశ్మయఃకశ్మలా(ల్మషా)ద్వః**

కిరణాలు మనల్ని పాపాల నుంచి, మాలిన్యాలనుంచి కాపాడతాయి. ఈ కిరణాలు

నమస్కరించిన వారికి ధనవిషయమైన కోరిక కలిగినప్పుడు ఆపదల సమయంలో ధనపుధారలా ఈ కిరణాలు పనిచేస్తున్నాయి. ధనాలు ధారపాతంగా వర్షిస్తాయి. సూర్యోపాసన వల్ల దారిద్ర్యం పోతుందని చెప్పడం.

పడిపోతున్నవాడికి ఈ కిరణాలు చేతికర్రలా పనిచేస్తున్నాయి. పడిపోవడం అంటే ధర్మమార్గం నుంచి, క్షేమ మార్గం నుంచి పతనమైపోయేవాడికి తిరిగి ఉద్ధరింపబడాలంటే ఈ కిరణాల ద్వారానే ఉద్ధరణ కలుగుతుంది. పాపం చేత భ్రష్టులైనవారు దుఃఖపడితే ఈ కిరణాలు ఆలంబనగా తిరిగి వారిని ఉద్ధరిస్తాయి.

ఇవి తత్త్వాన్ని చూపించే దీపాలు అన్నారు. తత్త్వం అనే మాటకి **యాథార్థ్యే బ్రహ్మణి** అని రెండు అర్థాలు చెప్పారు. సూర్యుడు వస్తే యథార్థం ఎంటో తెలుస్తుందన్నారు. ఈయన వస్తే లోకం యొక్క అసలు రంగు బయటపడుతున్నది. ఉపాసించే భక్తులకు బ్రహ్మజ్ఞానాన్ని అందించే దీపాలు. కిరణాలు ఎన్ని రకాలుగా ఉన్నాయో చెప్తూ - ధారలు = ధనధారలు. కర్రలు = ఊతంకర్రలు. దీపాలు = తత్త్వాని చూపించే దీపాలు అన్నారు.

స్వర్గాది ఊర్ధ్వలోకములకి వెళ్లాలంటే ఈ కిరణాలే వీధులు అన్నారు. ఐరావతవీధి, జారద్గవవీధి అని సూర్యకిరణాల వీధుల గురించి వేదం చాలా అద్భుతంగా వివరించింది. ఈ దారుల ద్వారానే జీవుడు ఊర్ధ్వగతులలోకి ప్రవేశిస్తాడు.



**ద్వావిమౌ పురుషవ్యాఘ్రౌ సూర్యమండలభేదినౌ**
**పరివ్రాడ్యోగయుక్తశ్చ రణేచాభిమూఖోహతః**

పరివ్రాట్ అయిన యోగి, యుద్ధంలో వీరమరణం పొందిన వీరుడు మాత్రమే ఈ సూర్యమండలాన్ని ఛేదించుకొని ఊర్ధ్వలోకాలకి వెడతారు అని మహాభారతం చెప్తోంది. తండ్రి చెయ్యి పట్టుకొని పిల్లాడు నడిచినట్టు ఉపాసకుడు సూర్యభగవానుని కిరణాలనే చేతులు పట్టుకొని తరించిపోతాడు. సూర్యమండంలోకి వెళ్లేటప్పుడు ఈ కిరణాలు, ఇటూ అటూ బెత్తం పట్టుకున్న భటులలా ఉంటాయి.

**బిభ్రాణశ్శక్తిమాశు-ప్రశమితబలవ-త్తారకౌర్జిత్యగుర్వీం**
**కుర్వాణో లీలయాధ-శ్శిఖినమపి లస-చ్చంద్రకాంతావభాసమ్**
**ఆదధ్యాదంధకారే-రతిమతిశయినీ-మావహ న్వీక్షణానాం**
**బాలో లక్ష్మీ మపారా-మపర ఇవ గుహో౽హర్పతేరాతపోవః**

అహర్పతి అనగా పగటికి ప్రభువు. బాలసూర్యుడిని బాలసుబ్రహ్మణ్యుడితో పోల్చి చూపిస్తున్నారు. ఈ బాలభానుడు రెండవ గుహుడా అన్నట్టుగా ఉన్నాడు. ఈయన శక్తి

ధరుడై యున్నాడు. అపార శక్తిసంపన్నుడు. తారకల మిడిసిపాటు తనాన్ని వస్తూనే అణచివేసాడు సూర్యుడు. తారకాసుని ఉద్ధతిని పుడుతూనే అణచివేసాడు బాల సుబ్రహ్మణ్యుడు. విశేషమైన కాంతి కలిగిన అగ్నిని కూడా ఓడించేసాడు. మనం రాత్రిపూట కాంతి కొరకు రకరకాల జ్వాలలు వెలిగించుకొంటాం కాని సూర్యుడొచ్చాక ప్రతి జ్వాల వెలవెల బోతుంది. సూర్యపరంగా అగ్ని అని, సుబ్రహ్మణ్యుని పరంగా **శిఖి** అంటే నెమలి అని చెప్పవచ్చు. నెమలి మీద కూర్చున్న సుబ్రహ్మణ్యుని చూపించారు.

సూర్యుడు చంద్రకాంతిని కూడా అవభాసం చేసాడు. చంద్రకాంతికి శాస్త్రంలో నెమలి పింఛం అని అర్థం. నెమలిపింఛం అలంకరించుకొని ప్రకాశిస్తున్నాడు సుబ్రహ్మణ్యుడు. అంధకారంలో ఏ వస్తువు సరిగ్గా కనిపించక బాధపడే కన్నులకు ఆనందం కలిగిస్తున్నాడు సూర్యుడు. చీకటిలో ఉన్న కళ్ళకి సూర్యుడు రాగానే ఆనందం కలిగింది ఇది సూర్య పరమైన అర్థం.

అంధకుడనే రాక్షసుడిని సంహరించినవాడు శివుడు. అంధకారి. ఆయన కన్నులకు ఆనందం కలిగించినవాడు సుబ్రహ్మణ్యుడు. ఇలాంటి బాలగుహుడిలా ప్రకాశిస్తున్న బాలసూర్యభగవానుడు మనకి లక్ష్మిని (ఐశ్వర్యాన్ని) అఖండంగా అందించుగాక!.



**తీవ్రం నిర్వాణహేతుర్యదపి చ విపులంయత్ప్రకర్షేణ చాణు**
**ప్రత్యక్షం యత్పరోక్షం యదిహ యదపరం నశ్వరం శాశ్వతంచ**
**యత్సర్వస్య ప్రసిద్ధం జగతి కతిపయే యోగినో యద్విదంతి**
**జ్యోతిస్తద్ద్విప్రకారం సవితురవతు వోబాహ్యామాభ్యంతరం చ**

ఇందులో రెండు రకాలుగా ఉన్న సవిత యొక్క జ్యోతి గురించి చెప్తున్నారు. ఆ రెండు రకాల జ్యోతులు నా బాహ్య, అభ్యంతరాలలో ఉన్న రెండు రకాల చీకటిని పోగొట్టుగాక!. పరస్పర విరుద్ధమైన రెండు రకాల కాంతులు ఈయన దగ్గర ఉన్నాయి.

సూర్యకాంతి తీవ్రంగా ఉందని అది వద్దని అనగలమా!. ఈయన తీవ్రంగా ఉన్నా మోక్షానంద హేతువు. ఈయన విస్తారమైన స్వరూపుడే కాదు అత్యంత సూక్ష్మరూపుడు కూడా. స్థూలేంద్రియాలతో దర్శించలేని దానిని సూక్ష్మం అంటారు.

సూర్యుడు విస్తారంగా కనపడినప్పటికి సూక్ష్మంగా ఉన్న ఆయన అసలు స్వరూపం గోచరించదు. సూర్యమండల మధ్యంలో బిందురూపమైన తేజోరూపంతో ఆయనే ఉంటాడు. ఆయన ప్రత్యక్షం. ఆయనే పరోక్షం. ప్రత్యక్షమంటే కంటి ముందు కనబడు తున్నాడు. కాని కంటి ముందు కనబడుతున్నదే ఆయన రూపం కాదు. మనం కంటితో

చూడలేనిదే మిగిలినదంతా. ఆయన అసలైన మహాతేజస్సు మన కంటికి కనబడేదేనా?

మనం కంటితో చూడగలిగినంత మాత్రమే అక్కడ ఉన్నాడుగాని ఇంకా కనపడనిది యత్పరోక్షం అన్నారు. ఆయన ఎక్కడున్నాడంటే భూమి మీదా ఉన్నాడు, పైనా ఉన్నాడు. భూమి మీదే సూర్యుడు ఉన్నాడు. చాలా దగ్గరగా ఉన్నాడు కనుక చాలా దగ్గరవాడు సూర్యుడు. కాని ఆయనే చాలా దూరం వాడు. సూర్యుడిని బాగా పరిశీలిస్తే ఆత్మతత్త్వం అర్థమౌతుంది. తద్దూరే తద్వదంతికే - అతి దగ్గరవాడు ఆయనే. అతి దూరం వాడు ఆయనే అని ఉపనిషత్తు చెప్తోంది.

ఆయన అందరికీ ప్రసిద్ధిగా జగత్తులో ఉన్నది తెల్సు. కాని ఆయన గురించి ఏ కొద్దిమంది యోగులు మాత్రమే తెలుసుకోగలరు. ఆబాలగోపవిదితా - అందరికి పరమాత్మ తెల్సినవాడే. భజంతిత్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం - ఏ కొద్దిమంది ధన్యులు మాత్రమే తెల్సుకోగలరు. పరమాత్మ అందరిలో ఉన్నవాడైనా ఉన్నాడని తెల్సుకొని అనుభవించేవారు కొందరే.

**కశ్చిత్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్** - అందరిలో పరమాత్మ ఉన్నా ఎవరో ధీరుడైనవాడు మాత్రమే తెల్సుకోగలడు. ఇలా రెండు విధాలుగా ఉన్న సూర్యభగవానుడు మా లోపలా, బయటా అజ్ఞానపు అంధకారాన్ని పటాపంచలు చేయుగాక! అనే భావాన్ని ఇందులో చూపించారు. బయట చీకటిని పోగొట్టడమే కాదు అజ్ఞానమనే అసలు చీకటిని గూడా పోగొడుతున్నాడు. ఈ భావంలో ఉన్న ఔచిత్యంతో సూర్యుడి సర్వపరతత్త్వ స్వరూపాన్ని వైదికవాఙ్మయం ప్రకారంగా అందిస్తున్నాడు.



స్వామి ప్రతీరోజూ ప్రాతఃకాలం ఉదయించేటప్పుడు ఒక సన్నివేశం జరుగుతుంది. ఇది అందరికి కనిపించదు. సూక్ష్మప్రపంచంలో జరుగుతుంది. భూమికి ఆయన వస్తున్నప్పుడు ఇది జరుగుతుంటుంది. ఇది మనం దర్శించలేం కేవలం భావించడమే. భావనతో దర్శించే ప్రయత్నం చేద్దాం. దాని గురించి చెప్తూ-

> **గంధర్వైర్గద్యపద్యవ్యతికరితవచోహృద్యమాతోద్యవాద్యై**
> **రాద్యైర్యో నారదాద్యైర్మునిభి రభినుతోవేదవేద్యైర్విభిద్య**
> **ఆసాద్యాపద్యతే యంపునరపిచ జగద్యౌవనం సద్య ఉద్య**
> **న్నుద్యోతో ద్యోతితద్యౌర్ద్యతు దివసకృతోసావవద్యాని వోద్య**

అవద్యములను తొలగించుగాక! అన్నారు. అవద్యము అంటే దోషం. సూర్యకిరణ సంపుటిని వర్ణిస్తున్నారు. దీన్ని గంధర్వులు స్తుతిస్తున్నారని చెప్పారు.

ఈయన చెప్పిన తీరులో ఉన్న ఔచిత్యం చూస్తే దేనికదే వేర్పాటుగా తెలిసేటట్టుగా గద్యాలతో పద్యాలతో గంధర్వులు స్తుతిస్తున్నారు. గద్యం శైలి వేరు. పద్యం శైలి వేరుంటుంది. దానికి తగ్గ సంగీతం కూడా ఉంది. గంధర్వులు సంగీత స్వరూపులు.

సూర్యకిరణాలలో శబ్దశక్తి ఉంది. తేజస్సు యొక్క సూక్ష్మరూపం శబ్దం. సూర్యోపాసన వల్ల శబ్దం శబ్దజనిత జ్ఞానం లభిస్తుంది. రాత్రంతా నిశ్శబ్దజగత్తు సూర్యకిరణాలు ప్రసరించ గానే కిలకిలారావాలతో శబ్దిస్తూ ఉదయిస్తుంది.

**ఆతోద్యవాద్యం** గానం చేసేటపుడు గాత్రానికి సహకారిగా వివిధ వాద్యాలు వాడితే దాన్ని ఆతోద్యవాద్యం అనాలి. దానికి సహకారిగా ఏవేవీ వాద్యాలు కలిపితే ఆతోద్యం అవుతుందో శాస్త్రం చెప్పింది.

**తతం వీణాదికం వాద్యమానద్ధం మురజాదికం**
**వంశాదికంతు సుషిరం కంస్యతాలాదికం ఘనం**
**చతుర్విధమిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్**

తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనబడే పరికరాలు కలిస్తే దానికి ఆతోద్య వాద్యమని పేరు. తతము అంటే తీగతో మ్రోగించే వాద్యాలు. వీణ, సితార్ మొదలైనవి.



ఆనద్ధము అంటే కొయ్యతోనో, మట్టితోనో, లోహపు గొట్టంతోనో ఒక బోలు పాత్రచేసి, దానికి రెండు వైపులా చర్మం కప్పి, దాని మీద చప్పుడు చేస్తే అది ఆనద్ధం. ఢక్కా మద్దెల, తబలా, డమరుకం మొదలైనవి.

సుషిరము – గొట్టం తీసుకొని రంధ్రాలు పెట్టి ఊదితే పలికేవి. వేణువు, నాదస్వరం, బాకా మొదలైనవి

ఘనము – గట్టిగా ఉండే లోహాలు కంచుతో చేసిన తాళాలు, కొయ్యతో చేసే కోలాటపు కర్రలు, చిడతలు మొదలైనవి

ఈ నాలుగు రకాల వాద్యపరికరాలు గానం చేసేటపుడు వాడితే దాన్ని ఆతోద్యవాద్యం అంటారు. నారదాది మునులు ఆయన్ని స్తుతిస్తున్నారు. స్తుతించాలంటే ఆయనకి సంబంధించిన జ్ఞానం ఉండాలి. ఆ జ్ఞానం ఋషులకి ఉంది. ఋషులే అతీంద్రియజ్ఞానం కలిగివారు కనుక వారు ఆయన్ని స్తుతిస్తున్నారు.

వేరు వేరుగా వారి యొక్క దర్శనాలను అనుసరించి సూర్యుడి గురించి వివిధ సూక్తా లతో స్తుతిస్తున్నారు. ఆ ఋషులందరూ వేదాలద్వారా తెలియబడే వారు అని చెప్పారు. వైదిక ఋషులని అర్థం. నారదుడు, వశిష్ఠుడు, అగస్త్యుడు, వాల్మీకి వీరంతా వైదికఋషులు.

వైదికమంత్రద్రష్టలైన ఋషులు సూర్యుని స్తుతిస్తున్నారు.

సూర్యుడు రావడం వల్ల జగతికి యవ్వనం వచ్చిందన్నారు. రాత్రితో ముసలితనం వచ్చింది. రాత్రి కాలమనే సర్పం కాటు వేస్తే అందరూ విషమెక్కి చచ్చిపోయారని మరొక చోట చెప్తారు. చచ్చిపోయిన వాళ్ళందర్నీ సూర్యభగవానుడు తన కిరణాలనే అమృతాన్ని జల్లి లేపాడని చెప్పారు. చచ్చిపోవడమంటే నిద్రపోవడం. నిద్రరూపంలో చచ్చిపడి ఉన్నట్టే ఉన్నారు అంతా. ఇంద్రియాలు పనిచేయట్లేదు. కళ్ళు మూసేసారు. జడీభూతంగా నిద్ర అనే విషమెక్కి పోయిన వాళ్ళందర్నీ ప్రొద్దున తనకిరణాలతో లేపుతున్నాడు.

యవ్వనం వచ్చినపుడు అన్ని ఇంద్రియాలు వికసించినట్టుగా సూర్యుడు రాగానే ప్రకృతి అంతా వికసిస్తుంది. అలా వికసింపజేయడమే యవ్వనం ఇవ్వడమంటే. అలా పగటిని ఏర్పరిచే స్వామి మా దోషాలను ఖండించుగాక! గంధర్వుల చేత, ఋషులచేత స్తుతులందు కుంటున్న స్వామి స్వరూపాన్ని అద్భుతంగా ఆవిష్కరించారు

**నోదన్వాఞ్జన్మభూమి-ర్న తదుదరభువో బాంధవాః కౌస్తుభాద్యాః**<br>
**పాణౌ పద్మం న యస్యాః న చ నరకరిపూరస్థలీ వాసవేశ్మ**<br>
**తేజోరూపాః పరైవ-త్రిషు భువనతలేష్వాదధానా వ్యవస్థాం**<br>
**సా శ్రీః శ్రేయాంసి దిశ్యాదశిశిరమహసోమండలాగ్రోద్గతా వః**



సూర్యుని నారాయణుడని భావిస్తే కాంతి, శోభ వీటిని లక్ష్మీ అంటారు. ఇక్కడొస్తున్న లక్ష్మి సముద్రం లోంచి పుట్టలేదు. సూర్యమండలం లోంచే పుట్టింది. ఆమెకి కౌస్తుభాదులు బంధువులు కారు. చేతిలో పద్మం పట్టుకోలేదు. పైగా ఈవిడ విష్ణువు వక్షఃస్థలంలో కూర్చోదు. సూర్యకిరణాల నించి వస్తున్న లక్ష్మి సర్వవ్యాపినియై మనల్ని అనుగ్రహించ డానికి దిగివస్తున్నది. అలాంటి లక్ష్మి మనకి శ్రేయస్సు ఇచ్చుగాక!

సూర్యకాంతిని లక్ష్మీరూపంలో చూపించారు. లోపల కూర్చున్న లక్ష్మిని బయటకి తేవడం కోసం సూర్యుడు వచ్చి పద్మాల తలుపులు తెరుస్తున్నాడన్నారు. లోపల ముడుచుకు పోయిన లక్ష్మిని తలుపులు తెరిచి బయటకి తెస్తున్నాడంటే ఐశ్వర్యాన్ని అలా కురిపిస్తున్నాడు సూర్యభగవానుడని అర్థం.

**హిరణ్మయేనపాత్రేణ సత్యస్యా హితం ముఖం** – స్వామీ! బంగారు పాత్రతో నీ రూపాన్ని కప్పేసావయ్యా! దాన్ని కొద్దిగా తొలగించి నీ స్వరూపాన్ని చూపించమని ఈశావాస్యో పనిషత్తులో మంత్రం. దీనికి అనేకరకాలైన వ్యాఖ్యానాలు అనేక మంది చేసారుగాని సూటైన వ్యాఖ్యానం – నీ బంగారపు రంగు నీ అసలు స్వరూపాన్ని తెలియకుండా కప్పేస్తోంది.

ఏకాగ్రంగా నిన్ను ప్రార్థన చేస్తున్నాను ఆ లోపల దాగిన నీ అసలు స్వరూపమైన బ్రహ్మ తత్త్వాన్ని మాకు తెలియజేయి అని దీని భావం. ఇంత ప్రార్థించాం కనుక కాంతి పుంజం లోంచి లోపలికి వెళ్ళి అశ్వాలను చూడబోతున్నాం. అశ్వాల గురించి విస్తారంగా చెప్ప కున్నాం. మయూరకవి గుఱ్ఱాలను కూడా రకరకాలుగా దర్శించారు.

**మత్వాన్యాన్పర్శ్వతోఽ శ్వాన్-స్ఫటికమణిదృష-ద్దృష్టదేహో ద్రవంతీ**
**వ్యస్తేఽ హన్యస్తసంధ్యే-యమితి మృదుపదాపద్మరాగోపలేషు**
**సాదృశ్యాఽ దృశ్యమూర్తిర్మరకతకటకేఽ క్లిష్టసూతా సుమేరో**
**ర్మూర్ధన్యావృత్తిలబ్ధ-ధ్రువగతిరవతాద్బ్రధ్నవాహావళి ర్వః**

బ్రధ్న అంటే సూర్యభగవానుడు. వాహావళి - గుఱ్ఱాల వరుస. సూర్యభగవానుని గుఱ్ఱాల వరుస మనకి దివ్యగతిని అందించుగాక! అంటున్నారు. స్థిరమైన స్థితిని ఇచ్చుగాక!

పురాణాల ఆధారంగా సూర్యభగవానుడు మేరుపర్వతం దగ్గర ముందు ప్రకటింప బడతాడు. అలా వచ్చినపుడు మేరుపర్వతపు కొననుంచి ఆయన ఉదయిస్తున్నట్టు భావిం చాలి. ఈ భావన మనలో సహస్రారస్థానము నందున్న బ్రహ్మభావంలోకి తీసుకెదు తుంది. మనలోపల మేరువు అది గగనమునందు మేరువు అన్నప్పుడు ఊహాగతమైన ఒక భూమి కని భావిస్తే భూమి నుంచి క్రమంగా సూర్యమండలం వరకూ భావన చేస్తే అక్కడికి వస్తుంది. అలాంటి ఆ మేరువు నుంచి సూర్యుడు ఉదయిస్తాడు.



మనకి కనిపిస్తున్న స్థానమా? ఆయన ఉన్న స్థానమా? అంటే వేదం దీని గురించి చెప్తూ మేరువు కొన నందు కశ్యపుని సూర్యస్థానముంది అని వర్ణించింది. అది ఆయన అసలు స్థానం. అక్కడ్నుంచి ఆయన రథం బయలుదేరుతున్నప్పుడు గుఱ్ఱాలు వస్తున్నాయి. పర్వతమన్నపుడు ఆ పర్వతము పై అనేక రత్నాలు ఉన్నాయి. గుఱ్ఱాలు వచ్చేటప్పుడు ఆ రత్నాలు కనబడుతున్నాయి. ఇది ధ్యానంతో భావించి తెల్సుకోవలసిందే.

ముందుగా వాటికి కొన్ని స్ఫటికశిలలు కనపడి వాటిలో గుఱ్ఱాల ప్రతిబింబం కన పడింది. అలా కనపడగానే తమ జాతివే ఏవో గుఱ్ఱాలు వస్తున్నాయని రోషం వచ్చి ఇవి మరింత వేగంగా ముందుకి దూకాయి. అలా దుముకుతున్నప్పుడు ఆ వేగంలో మార్పులు వస్తున్నాయి. స్ఫటికమణుల తరువాత ఎఱ్ఱగా పద్మరాగమణులు కనపడ్డాయి. వాటి మీద సూర్యుని వెలుగు ప్రతిబింబించి మరింత ఎఱ్ఱగా కనపడుతుంటే అబ్బో! అప్పుడే సాయంకాలం సంధ్య వచ్చేస్తోందా అని నెమ్మదిగా నడవడం మొదలుపెట్టాయి.

తరువాత ఆకుపచ్చని శిలలు కనపడగానే అందులో కూడా తమ ప్రతిబింబాల్ని చూసు

కొని తమ కాంతే అనుకొని మరింత నెమ్మదిగా నడుస్తూ వెడుతున్నాయి.

ఇలా ఒక గతి కాకుండా రకరకాల గతులతో వెడుతుంటే వీటిని నియంత్రించడానికి సారథి అవస్థ పడుతున్నాడు. ఈ గుర్రాలు కొన్ని చోట్ల దుముకుతున్నాయి, కొన్ని చోట్ల నెమ్మదిగా ఉన్నాయి. ఆకుపచ్చని శిలల దగ్గర తమకాంతి అనుకొని మరింత నెమ్మదిగా వెడుతున్నాయి.

సూర్యుని గుర్రాలు హరిదశ్వాలు - ఆకుపచ్చగా ఉంటాయని అలా భావన చేసారు. అలాంటి గుర్రాలు మనకి సరియైన గతినిచ్చుగాక! అన్నారు. దీన్ని తీసుకొని శ్రీనాథుడు తెలుగులో చక్కగా వివరించాడు.

**స్ఫటికభూముల యందు బ్రతిబింబములు చూచి**

**యితరాశ్వబుద్ధి హేషిత మొనర్చు।** స్ఫటికభూములలో ప్రతిబింబించిన గుర్రాలను చూసి మరొక గుర్రములేమో అని సకలించాయట.

**బద్మరాగోపలప్రస్థభాగములందు**
**జరమసంధ్యాశంకజాద్యమందు।**
**మరకతమణిశిలామధ్యంబునందు**
**దృశ్యాదృశ్యమూర్తులై యలరుచుండు।**
**వైదూర్యమాణిక్యవప్రాంతముల యందు**
**సలిలాభిలాష నౌదలలు వాంచు।**



కొన్ని చోట్ల మాణిక్య శిలలు కనపడినప్పుడు జలం వలే కనపడుతుంటే ఇంతసేపు ప్రయాణం చేస్తున్నాం కదా దాహం తీర్చుకోవచ్చు నీరేమో అని అటు వెళ్లాయిట.

కిన్నెరస్త్రీలని చూసి సకిలించాయి.

ఇక్కడ మరొక శ్లోకంలో చెప్పిన భావాన్ని కూడా ఈయన తీసుకొని చూపిస్తున్నారు-

**మార్గోపాంతే సుమేరో-ర్నృపతి కృతనతౌ-నాకధామ్నాం నికాయే**

**వీక్ష్య వ్రీడానతానాం-ప్రతికుహరముఖం-కిన్నరీణాం ముఖాని**

సూర్యభగవానుడు బయటికి రాగానే ఎప్పుడొస్తాడా అని దేవతలు కాచుకుని కూర్చు న్నారు. స్తోత్రం చేస్తూ తలలు వంచి కూర్చున్నారు. వారందరిని ఈ గుర్రాలు ముందు చూస్తున్నాయి. తరువాత కొంత దూరం వచ్చే సరికి సిగ్గుతో తలలు వంచుకుని కిన్నెర స్త్రీలు నమస్కారం చేస్తున్నారు. వారిని కొంచెం ఆసక్తిగా చూసాయట గుర్రాలు ఎందుకంటే కిన్నెరస్త్రీ ముఖాలు గుర్రం ముఖాలు.

ఆ రెండు భావాలు శ్రీనాథులవారు ఇక్కడ తీసుకొచ్చారు.

**గారవం(గావరం)బెత్తి యుద్దామకామవృత్తి।**
**వాయుజవములు రవితేరివారువములు**
**వేల్పుగుబ్బలిప్రస్థానవీధి యందు**

వేల్పుగుబ్బలి అంటే దేవగిరియైన మేరువు. దాని యందు వస్తున్నప్పుడు ఈ దృశ్యం కనిపిస్తున్నదిట.

**సూతేసూయత్యపీష-జ్జడగతి వహతాం-కంధరాగ్రైర్వలద్భి**
**ర్వాహానాం వ్యస్యతాద్వ-స్సమమసమహరే-ర్హేషితం కల్మషాణి**

అసమమైన ఈ హరులు మనలను సమముగా అనుగ్రహించుగాక! అన్నాడు. సరైన గతులు లేకుండా నడిచే గుర్రములు మనకు సద్గతులు కలిగించుగాక! ఏడు బేసి సంఖ్య కాబట్టి అసమము. ఈ ఏడు గుర్రాలు మనలను సమము అంటే సమత్వంగా చక్కగా అనుగ్రహించుగాక! ప్రతి దానిలో ఆకాంక్ష దివ్యంగా చూపిస్తున్నారు. దీనితో గుర్రాల వర్ణన పూర్తి అయింది

**ఇప్పుడు సారథివర్ణన.** నాటకం ప్రదర్శించేటప్పుడు తెరతియ్యగానే సూత్రధారుడు చేతితో పువ్వులు తీసుకు వచ్చి ఆ వేదిక మీద చల్లి నాటకం జరగబోతున్నది అని చెప్పినట్లుగా, పగలు అనే జగన్నాటకం ప్రారంభంలో సూత్రధారిలా వచ్చాడు అరుణుడు లేదా అనూరుడు. ఎలా వస్తున్నాడంటే



**ప్రాతశ్శైలాగ్రరంగే-రజనియవనికా-పాయ సంలక్ష్యలక్ష్మీ**
**ర్విక్షిప్యాపూర్వపుష్పాం-జలి ముదునికరం-సూత్రధారాయమాణః**
**యామేష్వం కేష్వివహ్నాఃకృతరుచిషు చతు-ర్ష్వేవ లబ్ధప్రతిష్ఠా**
**మవ్యాత్ప్రస్తావయన్వో-జగదటనమహా-నాటికాం సూర్యసూతః**

ఈ రచన చేసిన సంస్కృతకావ్య కాలంలో ప్రత్యేకత నాటకం ప్రదర్శించే ముందు తెరతీయగానే సూత్రధారి అని ఒకడు వస్తాడు. ఆ సూత్రధారి వచ్చి చేతిలో పువ్వులు తీసుకొని వేదిక మీద జల్లి ఇప్పుడు నాటకం జరగబోతోందని చెప్తాడు.

అలా పగలు అనే జగన్నాటకం ప్రారంభంలో సూత్రధారిలా వచ్చాడు అరుణుడు. ఏ తెర తీసాడు? ఏ పువ్వులు జల్లాడు? ఎవరి నాటకం గురించి వివరించబోతున్నాడు? సూత్రధారి నాటకాన్ని ముందు వివరిస్తాడు. మన సంస్కృతి నాటకాలు చదివితే ఇది తెలుస్తుంది.

సూర్యునికి ఎంత ప్రభావం ఉందో అరుణునికి అంతప్రభావం ఉందని మనకి శ్లోకంలో చూపిస్తారు. ఉదయపర్వతమనే వేదిక మీదకి వచ్చి రాత్రి అనే తెరని తీసాదు. సూత్రధారి తన చెలికత్తెతో సహా వస్తాడు. అలా అనూరుడు తనతో పాటు ఉన్న అరుణకాంతి అనే చెలికత్తెతో వచ్చాడు. వచ్చి పువ్వులు వెదజల్లాడు. పువ్వులు వెదజల్లినపుడు విసురుతాడు గాని అవి అలా కనపడి మాయమైపోతాయి.

అలా ఆయన నక్షత్రాలనే పువ్వులని విసరాడుట. ఎంత అద్భుతంగా దర్శించారో గమనించండి. పైగా సూత్రధారి జరపబోతున్న నాటకం ఎన్ని అంకాలో చెప్తాడు. అలా ఇపుడు జరగబోతున్న నాటకం నాలుగు అంకాలు అని చెప్తున్నాడు. ఈ నాలుగు అంకాల విశేషం ప్రాతఃకాలసమయం, మధ్యాహ్నకాలం, సాయంకాల సమయము, సంగవకాలం. ఈ నాలుగు అంకాల నాటకం మా గురువుగారు వెయ్యబోతున్నాడని చెప్పి సూత్రధారుడు ప్రకటించాడు.

అలా ప్రకటించిన సూత్రధారుడు మనల్ని రక్షించుగాక! అని చెప్తున్నారు.

**ఆక్రాంత్యా వాహ్యమానంఽ పశుమివ హరిణాఽ వాహకోఽ గ్ర్యోహరీణాం**
**భ్రామ్యంతం పక్షపాతాఽ జ్జగతి సమరుచి-స్సర్వకర్మైకసాక్షీ**
**శత్రుం నేత్రశ్రుతీనాఽ మవజయతి వయోఽ జ్యేష్ఠభావే సమేఽ పి**
**స్థేమ్నాంధామ్నాం నిధిర్యఽ స్సభవదఘనుదేఽ నూతనస్సాదనూరుః**

అనూరుడు, గరుత్మంతుడు వయోజ్యేష్ఠభావంలో ఇద్దరూ సమానులే అన్నారు. లోకంలో ఇది సాధ్యమౌతుందా? ఒకరు పెద్ద అయితే మరొకరు చిన్నవారు అవుతారు. కాని వయస్సులో సమానులు అవుతారా?

అనూరుడు వయస్సు రీత్యా గరుత్మంతుని కంటే పెద్దవాడు కనుక వయోజ్యేష్ఠభావుడు. వయస్సు అనే శబ్దానికి పక్షి అని అర్థం కనుక గరుత్మంతుడు కూడా వయోజ్యేష్ఠభావుడే అని చూపించారు. పక్షులలో పెద్దవాడు గరుత్మంతుడు కనుక ఆయన వయోజ్యేష్ఠభావుడు అన్నారు. ముందు ఇద్దరూ సమానమని చెప్పి తరువాత అనూరుడి ఆధిక్యాన్ని చెప్పాలి. గరు త్మంతుడు పశువులాగ హరి చేత ఆక్రమించబడ్డాడు. సాధారణంగా పశువుని లొంగ దీసుకొని దాని మీద కూర్చుంటాం. అలా హరి(విష్ణువు) గరుత్మంతుని పశువులా ఆక్రమించు కొన్నాడు. అనూరుడు హరులను(గుర్రాలను) నడిపిస్తున్నాడు.

గరుత్మంతునికి పక్షపాతం ఎక్కువ అన్నారు. **పక్షపాతం** అంటే రెక్కలని అల్లార్చుతూ కొడుతుంటాడు. పక్షపాతమంటే పక్షము యొక్క పాతం. అనూరునికి రెక్కలు లేవు

ప్రశాంతంగా తీసుకెళ్తున్నాడు కనుక అనూరుడు గొప్పవాడు అన్నారు.

అనూరునికి అంతా సమబుద్ధే. ఎవరు ఏ కర్మ చేస్తున్నా అందరిని సాక్షిగా చూస్తూ ఉంటాడు. పక్షపాతం లేదని చెప్పడానికి ఉదాహరణ- గరుత్మంతునికి శత్రువులు ఉన్న కథ ఉందిగాని అనూరునికి ఎవరూ శత్రువులు లేరు. కళ్ళే చెవులుగా కలవారికి అంటే సర్పాలకి శత్రువు గరుత్మంతుడు అన్నారు. కాబట్టి శత్రువులెవరూ లేని అనూరుడే గొప్పవాడు అన్నారు. అనూరుని స్వరూపాన్ని చాలా అందంగా చూపిస్తున్నారు మయూరకవి. ముందు అందరిని అనూరుడే పలకరిస్తాడు. సూర్యుడు అనూరుని తరువాత ఉంటాడు. దిక్పాలకులందరిని అనూరుడు పలకరిస్తాడని చెప్తున్నారు.

ఆయన వస్తుంటేనే అందరూ సిద్ధంగా ఉంటారు. ముందు అనూరుడు వచ్చేటప్పుడు ఆయన ఒక్కొక్క దిక్పాలకుని పలకరిస్తున్నారు. ఆ పలకరించే తీరు చెప్తూ సూర్యుడికోసం నమస్కరిస్తూ ఎదురుచూస్తున్న వారందరిని అనూరుడు చూసి సంతోషం ప్రక్కకి తొలగండి అంటున్నాడు. వీరంతా నమస్కరిస్తూన్నారని చెప్పి సూర్యుడు క్షణం కూడా ఆగడు. ఆయన ఆగితే ప్రపంచం ఎలా నడుస్తుంది?

ఆయన ఆగలేదని మీ నమస్కారాన్ని తిరస్కారం చెయ్యడు. సంతోషం ప్రక్కకి తొలగండి, ప్రక్కకి తొలగండి అంటున్నాడు అనూరుడు. ఎవరెవరితో ఎలా మాట్లాడుతున్నారో కూడా చెప్తున్నారు.



ప్రక్కకెళ్ళండి అనే మాట కూడా చెప్పే తీరు ఒకటి ఉంటుంది. అందరితో ఒకేలా చెప్పరు. దిక్పాలకులలో కూడా పద్ధతులు ఉన్నాయి.యముడుతో మాట్లాడినట్టు ఇంద్రుడితో మాట్లడితే కుదరదు. దిక్పాలకుల పేర్లు ముందు చెప్పుకొన్నాం. ఎలా పలకరిస్తున్నాడో తరువాతి శ్లోకంలో చెప్తున్నారు.

> **వజ్రిన్జ్ఞాతం వికాసీ-క్షణకమలవనం౾భాసినా౾౾భాసివహ్నా**
> **తాతం నత్వాశ్వపార్శ్వా-న్నయ యమః మహిషం-రాక్షసా వీక్షితాఃస్థ**
> **సప్తీన్ సించ ప్రచేతః౾పవన భజ జవం౾విత్తపావేదితస్త్వం**
> **వందే శర్వేతి జల్పా౾న్ప్రతిదిశమధిపా౾న్పాతు పూష్ణో౾గ్రణీర్వః**

పూష అంటే సూర్యభగవానుడు. ఆయనకి ముందుండి నడిపే సారథి మనల్ని రక్షించుగాక! అంటున్నారు.

వజ్రిన్-ఓ వజ్రహస్తుడా! నీ వెయ్యి కళ్ళ కమలాలు ఒక్కసారి విచ్చుకొన్నాయే! అన్నాడు. ఇంద్రునికి సహస్రనేత్రుడని పేరు. సూర్యుడు వస్తే కమలాలు విచ్చుకొంటాయి. ఇంద్రుడి

నేత్రకమలాలన్నీ ఒక్కసారిగా విచ్చుకొన్నాయి. అబ్బా! నీ కళ్ళు విచ్చుకొన్నాయే అన్నాడు. దీని అర్థం సూర్యుడిని చూడగానే ఇంద్రుడు కళ్ళు విచ్చుకొని ఆనందంతో నమస్కారం చేసాడు. తరువాత ఆగ్నేయం వైపు తిరిగాడు. ఓ అగ్నీ! ఏమిటి వెల వెల బోతున్నావు అన్నాడు. ఎంత అగ్ని అయినా సూర్యుడు వచ్చాక వెల వెల బోవలసిందే.

యముడితో మాట్లాడుతూ నీ తండ్రికి నమస్కారం చేసి దూరంగా వెళ్ళవయ్యా, గుర్రాల దగ్గర్నించి దున్నపోతుని తియ్యవయ్యా అన్నాడు. సాధారణంగా దున్నపోతుకి గుర్రానికి పడదు. మీ నాన్నగారికి నమస్కారం చేసుకొని త్వరగా ప్రక్కకి తొలగు అంటున్నాడు. ఎందుకంటే గుర్రాలు బెదురుతాయి.

నైరుతి వైపు తిరిగి రాక్షసుని చూసి ఇదిగో! గురువుగారు నిన్ను చూసారులే వెళ్ళు అన్నాడు. నీ మీద ఆయన చూపు పడింది చాలు పో! అంటున్నాడు. దేవతలు ప్రకాశ స్వరూపులు, నువ్వు రాక్షసుడివి. వచ్చి దణ్ణం పెట్టావు నిన్ను చూసాదులే వెళ్ళు, ప్రక్కకి జరుగు అంటున్నాడు.

పశ్చిమదిశలో ఉన్న వరుణుని చూసి, ఇదిగో వరుణా ఈ గుర్రాలకి ఒకసారి స్నానం చేయించు అంటున్నాడు. వాయుదేవుని చూసి నువ్వు తొందరగా వెళ్ళు అన్నాడు. ఎందుకంటే నీ కంటే వేగంగా వెళ్ళేవాడు వస్తున్నాడు. అశ్వాలు అంటే కిరణాలు. వాయువుకి వేగంగా వెళ్ళడం లక్షణం. తరువాత కుబేరుడు ఒక ప్రక్క నమస్కారం చేస్తూంటే నీ గురించి చెప్పానులే! అంటున్నాడు. సాధారణంగా పెద్దవారి దగ్గరికి వెళ్తే వారి వ్యక్తిగత కార్యదర్శి ఉంటే ఎలా ఉంటాడో అలా రకారకాల పనులతో వస్తే మీ గురించి చెప్పాను చూస్తారులే పని అయిపోతుంది వెళ్ళిపో, అని చెప్తున్నట్టుగా వర్ణిస్తున్నారు.



ఇలా అందరితో చెప్తూ ఈశాన్య దిక్కుకి తిరిగి **వందే శర్వేతి** - వినయంగా చేతులు జోడించి శివా! నమస్కారం అని చెప్తూ వెళ్ళిపోతున్న అరుణుడు మనల్ని పోషించుగాక! రక్షించుగాక! అని అద్భుతమైన భావాన్ని అందించారు.

**పాశానాశాన్తపాలా-దరుణ వరుణతో-మా గ్రహీః ప్రగ్రహోర్థం**
**తృష్ణాం కృష్ణస్య చక్రే-జహిహి న హి రథో-యాతి మే నైకచక్రః**
**యోక్తుం యుగ్యం కిముచ్చైఽ శ్రవసమఖిలష-స్యష్టమం పుత్రశత్రో**
**స్తుక్తాన్యాపేక్షవిశ్వో-పకృతిరితి రవి-శ్శాస్తి య స్సోఽ వతాద్వః**

ఇక్కడ సూర్యభగవానుడు అనూరుడితో చెప్తూ ఎవరైనా ఏమైనా కానుకలు ఇస్తే అవి తీసుకోకు అని చెప్తున్నాడు.

వరుణునికి పాశాలు ఉన్నాయి. తీసుకోమని నీకివ్వవచ్చు వాటిని పుచ్చుకోకు. మన గుర్రాలకు అవసరమని తీసుకోకు. మనకున్న పాశాలు చాలు, ఏవీ అడక్కు అంటున్నాడు. దీని అర్థం మనకి ఉన్న పరికరాలతోనే మనం ప్రయత్నం చెయ్యాలి. ప్రక్కవాడు ఇచ్చింది పుచ్చుకోవాలని ఆశపడకు. పరద్రవ్యానికి ఆశించకు అని సూర్యుడు మనకిస్తున్న గొప్ప సందేశం. మన రథానికి చక్రం ఒకటే ఉంది మరొకటి పనికొస్తుందేమోనని ఆ విష్ణువు అక్కడ నిలబడితే ఆయన సుదర్శన చక్రాన్ని అడగకు, ఆయన ఇచ్చినా పుచ్చుకోకు. మనకున్నవి చాలు అంటున్నాడు.

ఉన్న ఏడు గుఱ్ఱాలు చాలు. ఇంద్రుడు ఉచ్చైఃశ్రవం పట్టుకున్నాడని అడక్కు. మనకున్న ఏడు గుర్రాలు బేసి సంఖ్య కనుక సరి సంఖ్యైతే బాగుంటుంది ఎనిమిదౌతాయని లాక్కోకు. వాళ్ళు ఇవ్వడానికి సిద్ధంగా ఉంటారుగాని నువ్వు పుచ్చుకోకు సుమా. ఇలా దేవతల మీద ఈయన ఆధిక్యం! పరద్రవ్యాన్ని ఆశించకు అని సూర్యభగవానుడితో చెప్పబడుతున్న సూర్యరథసారథి అనూరుడు మనల్ని అనుగ్రహించుగాక! ఇప్పుడు **సూర్యరథ వర్ణన**లోనికి వెడదాం. ఇక్కడ కూడా రకరకాలుగా చూపిస్తున్నారు.

**యోక్త్రీభూతాన్రథస్య-గ్రసితుమివ పురో-దందశూకాన్దధానో**
**ద్వేధావ్యస్తాంబువాహా-వళివిహితబృహ-త్పక్షవిక్షేపశోభః**
**సావిత్రస్స్యందనోఽసౌ-నిరతిశయగతి-ప్రీణితానూరురేనః**
**క్షైపీయో యో గరుత్మా-నివ హరతు హరీ-చ్ఛావిధేయప్రచారః**

ఇక్కడ సూర్యుని నారాయణునిగా చూడాలి. నారాయణుని రథం గరుత్మంతుడు. సూర్యుని రథం అనూరుడు. అనూరుడు గరుత్మంతునిలాంటి వాడే. గరుత్మంతుడికి సూర్యరథానికి ఏం భేదం లేదని చూపిస్తున్నారు.

సూర్యరథానికి పగ్గాలు సర్పాలు. సూర్యరథం విస్తారంగా ఉంది. విస్తారంగా ఉన్న సూర్యరథం- నోట్లో పాములు పెట్టుకున్న గరుత్మంతునిలా ఉందన్నారు. మహావేగంగా కదలడంతో గాలి ప్రక్కకి వెడుతున్నప్పుడు గాలిని విదిలిస్తున్న గరుత్మంతునిలా ఉన్నది. సూర్యరథం అనూరునికి ప్రీతి కలిగిస్తోందన్నారు. సోదరుడైన గరుత్మంతుడిని చూడగానే అనూరుడు ఎలా ఆనందిస్తాడో ఈ రథం కూడా గరుత్మంతుని వలే ఆనందాన్ని ఇస్తోంది.

హరి ఇచ్ఛను అనుసరించి గరుత్మంతుడు వెడతాడు. హరి అంటే గుఱ్ఱాలకి ఒక పేరు. కనుక వాటి ఇచ్ఛను అనుసరించి వెడుతోందని ఒక అర్థం. కనుక సూర్యరథం సాక్షాత్తు గరుత్మంతుని స్వరూపమే, పైన ఉన్నవాడు గరుడవాహనారూఢుడైన నారా

యణుడే. దీన్నే **'ఇంద్రం మిత్రం వరుణమాహుః'** అనే మంత్రంలో **'సుపర్ణోసి గరుత్మాన్'** అని గరుత్మంతుని స్వరూపంగా ఉపనిషత్తులలో చూపించారు.

మనం ఎక్కడికైనా బయలుదేరినపుడు మన వాహనాలకి ముందు పూజ చేసుకొని బయలుదేరతాం. బొట్లు పెట్టి, రక్షాకవచాలు కట్టడం చేస్తాం. అలా సూర్యరథం బయలు దేరుతున్నప్పుడు సంధ్యాసమయంలో ఆ రథానికి పూజ చేస్తున్నారని చెప్తూ

**అక్షే రక్షాం నిబధ్య-ప్రతిసరవలయై-ర్యోజయంత్యో యుగాగ్రం**
**ధూఃస్తంభే దగ్ధధూపాః-ప్రహితసుమనసో-గోచరే కూబరస్య**
**చర్చాశ్చ(ంచ) చక్రేఽ దధత్యో మలయజరజసా-సిద్ధవధ్వ స్త్రిసంధ్యం**
**వందంతే యం ద్యుమార్గే-స నుదతు దురితా-న్యంశుమత్స్యందనో వః**

దేవజాతులలో ఒకరైన సిద్ధకాంతలు వచ్చి సంధ్యాకాలంలో ఈ సూర్యరథానికి ఇరుసు దగ్గర ఒక చిన్న రక్ష కట్టారు. ప్రతిసరమని దీక్షాకాలంలో హస్తాలకి కొన్ని కంకణాలను ధరిస్తారు. దీనికి కంకణము అంటారు. **'నమః ప్రతిసర్యాయ చ'** అని రుద్రనమకంలో వస్తుంది. ఆ ప్రతిసరానికి ఒక శక్తి ఉంటుంది. ఈ సిద్ధకాంతలు ప్రతిసరమనే కంకణాన్ని కాడి కోనలకు కడుతూ, కాడిని నిలిపే స్తంభానికి ధూపం వేసారుట.



సారథి కూర్చునే రక్షాస్థానానికి కూబరము అని పేరు. అక్కడ పువ్వులు వేసి పూజించారు. చక్రానికి చందనపు నీరుతో చర్చ చేసారు. ఈ విధంగా ప్రతిచర్యచేస్తూ ద్యుమార్గంలో సూర్యునికి నమస్కారం చేస్తూన్న సిద్ధకాంతలతో పూజింపబడుతున్న ఆ రథము మన దురితాలను పోగొట్టుకాక అన్నారు. సూర్యరథధ్యానం దురితనాశనమనే విషయాన్ని రథవర్ణన ద్వారా పూర్తి చేసారు. ఇప్పుడు **మండలవర్ణన** చూపిస్తున్నారు.

పదివేల యోజనాల విస్తీర్ణం రథం, గుర్రాలు, కుబరములు అయిపోయిన తరువాత గణాలుంటారు. వీరు వెయ్యి యోజనాల విస్తీర్ణంలో ఉంటారు. మహాకాంతిపుంజ మండలం తొమ్మిది యోజనాలు ఉంటుందిట. ఇది సూర్యభగవానుడు కూర్చున్న చోటు. ఆ మండల మధ్యంలో ఆ దివ్య పురుషుడు భాసిస్తాడు. దాన్ని వర్ణిస్తూ

**యజ్జ్యాయో బీజమహ్నా-మపహతతిమిరం-చక్షుషా మంజనం య**
**ద్వారం యన్ముక్తిభాజాం-యదఖిలభువన-జ్యోతిషామేక మోకః**
**యద్వృష్ట్యంభోనిధానం-ధరణిరససుధా-పానపాత్రం మహద్య**
**ద్విశ్వాదీశస్య భాసం-తదవికలమలం-మంగళం మండలం వః**

స్వామి దివ్యమండలం అన్ని పగళ్లకు బీజముగా ఉంది. బీజం గుండ్రంగా ఉంటుంది.

అన్ని పగళ్ళకు బీజంలా ఉన్న మండలమది. చీకట్లో ఏదైనా వస్తువు కనపడకపోతే అంజనమని రాసుకొని చూస్తారు. అలా అన్ని చీకట్లను పోగొట్టే అంజన మండలంలాగా ఉంది. పైగా ముక్తి పొందే అర్హులకి ఇది ద్వారం వలే ప్రకాశిస్తున్నది. సర్వకాంతులకి మూల స్థానంగా ఉంది. సర్వ వర్షాలకు ఆధారంగా ఉన్నది. అక్కడ నుంచే వర్షాదులు లభిస్తున్నవి - **పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభిః** అన్నారు కదా.

సూర్యమండలం ఒక పాత్రలా ఉన్నది. భూమిలో ఉన్న అన్నరసాలన్ని తనకిరణాలతో లాక్కొని వేసుకుని తాగుతాడు. ఇచ్చేదీ ఆయనే, తీసుకునేదీ ఆయనే. ఆ మండలం దివ్యమైన సువర్ణగిరిపై ప్రకాశిస్తోంది. ముందు ఎర్రనికాంతులతో మండలం గోచరించి నపుడు బంగారుమయమైన పర్వతంపై ఎలా ఉన్నదంటే? బంగారపు వస్తువుపై పద్మ రాగమణి పెట్టినట్టు ఉందని వర్ణించారు. ఆ చుట్టూ చీకట్ల మధ్యలో ఈ మండలం ఎలా ఉందంటే- తుమ్మెదలు బాగా ముసిరిన పద్మం దగ్గర కింజల్కాలన్ని గుంపుగా పైకి లేస్తే ఎలా ఉంటుందో అలా ఉంది ఆ మండలం అన్నారు. కింజల్కం అంటే పద్మాల మధ్య లోని కేసరాలు. ఆ చుట్టూ ఉన్న చీకట్లు తుమ్మెదల గుంపులులా ఉన్నాయట. పైగా కాలమనే మహా సర్పమనే పడగ మీద మణిలా ప్రకాశిస్తున్నది ఆ మండలము. కాలవ్యాళస్య చిహ్నం- మహితత మమహో-మూర్ధ్ని రత్నం మహద్యద్.

**అహోమూర్ధ్ని రత్నం** - పగటికి ప్రారంభమణివలే ఉన్నదనే భావం కూడా తీసుకోవచ్చు. అలా ఉన్న మండలం మనకు జ్ఞానకాంతులను ప్రసాదించుగాక!

తరువాత **పురుష వర్ణన**. ఈ పురుష వర్ణనలో ప్రత్యేకించి రూపం ఏమీ చెప్పలేదు. కానీ సూర్యుడు అనబడే పురుషుడు దాని మధ్యలో ఉంటాడు. ఆ హిరణ్మయ పురుషుని ధ్యానించడమే యోగం.

**య యేషోంతరాదిత్యే హిరణ్మయఃపురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆ ప్రణఖాత్సర్వఏవ సువర్ణః** - అని ఛాందోగ్యం చెప్పిన మాట. కాంతి, అశ్వాలు, సారథి, రథం, మండలం, మండలమధ్యంలో ఉన్న పరమపురుషుడైన ఆదిత్యభగవానుడు. ఆయన్ని అనేక గణాలు స్తుతిస్తూ ఉంటే వస్తున్న విధానాన్ని చూపిస్తున్నారు.

**సిద్ధస్సిద్ధాంతమిశ్రం-శ్రితవిధి విబుధై-శ్చారణైశ్చాటుగర్భం**
**గీత్యా గంధర్వముఖ్యై-ర్ముహురహిపతిభి-ర్యాతుధానైర్యతాత్మ**
**స్సార్ఘం సాధ్యైర్మునీంద్రై-ర్ముదితతమమనో(నః)-మో(ప)క్షిభిఃపక్షపాతాత్**
**ప్రాతఃప్రారభ్యమాణ-స్తుతిరవతు రవి-ర్విశ్వవంద్యోదయో వః**

ఇందులో ఎవరెవరు సూర్యుని ఎలా కొలుచుకొంటున్నారో చెప్తున్నారు. సిద్ధులు వేదశాస్త్రాగమాది సిద్ధాంతాలలో వాక్కులతో స్తుతిస్తున్నారు. విబుధులు అనగా దేవతలు శ్రౌతవిధులతో ఆయన్ని ఆశ్రయిస్తున్నారు. చారణులు చాటు వచనాలతో (చమత్కార వచనాలతో) ప్రశంసిస్తున్నారు. గంధర్వులు గానాలతో స్తుతిస్తున్నారు. నాగులు సావధాన చిత్తంతో నమస్కరిస్తున్నారు.

యాతుధానులు అనబడే రక్షోజాతీయులు నియమబద్ధమైన అంతఃకరణాలతో కొలుచు కుంటున్నారు. సాధ్యులు పూజించడానికి అర్ఘ్యద్రవ్యాలు తీసుకున్నారు. అర్ఘ్యద్రవ్యాలు అంటే పూజించడానికి యోగ్యమైన ద్రవ్యాలు. మునీంద్రులు ఆనంద భావం నిండిన మనస్సుతో నమస్కరిస్తున్నారు.

మోక్షార్థులైన యోగులు పక్షపాతంతో నమస్కరిస్తున్నారు.

పక్షపాతం అంటే అన్నింటిని విడిచిపెట్టి ఆయన యందే ఎక్కువ ప్రీతి చూపించడం. యోగులు మోక్షార్థులై అనన్యంగా ఆశ్రయిస్తున్నారు.

అలా అందరి స్తుతికి పాత్రమైన సూర్యుడు మనలను రక్షించుగాక! అని వర్ణించారు.



**సిద్ధాంతసంసిద్ధి సిద్ధసంఘంబును**
**విధ్యుక్తపరిపాటి విబుధకోటి।**
**చాటుధారాప్రౌఢి చారణవ్యూహంబు-**
**కిన్నరవ్రాతంబు గీతసరణి।**
**ఖచరసంఘము విశృంఖలమణివైచిత్రి-**
**యాతుధానశ్రేణి యధికభక్తి।**
**గరుడలోకము నమస్కారవాక్యంబున-**
**నేకాగ్రమతి దందశూకసమితి।**
**ప్రతిదినంబును బ్రాతరారంభవేళ**
**నిర్నిబంధననిరుపాధినిరవగాధ-**
**నిర్నిరోధనిరాఘాటనిరుపమాన.**
**భక్తి సంభజియింతురీపద్మబంధు**

అని శ్రీనాథమహాకవి విజృంభించి చూపిస్తున్నాడు.

**తవ దివ్యరథం యాంతం అనుయాంతి పరార్థినః।**
**సిద్ధచారణ గంధర్వాః యక్షగుహ్యకపన్నగాః॥**

అని పురాణాలు చెప్తున్న భావాన్ని ఇక్కడ దర్శించాలి.

పురుషవర్ణన చేసేటప్పుడు ఈయన బ్రహ్మకంటె, విష్ణువుకంటె, రుద్రునికంటె ఏ విధంగా అధికుడో చూపిస్తారు. అసలు సృష్టి, స్థితి, లయకర్తలు విశ్రాంతి తీసుకుంటున్నారు. కైలాసంలో హాయిగా పార్వతీదేవితో పరమశివుడు, క్షీరసాగరంలో ఆదిశేషువుపై లక్ష్మీ సహితుడై శ్రీ మహావిష్ణువు, పద్మంపై ధ్యానం చేస్తూ బ్రహ్మ ఉన్నారు. వాళ్ళ పనులన్నీ సూర్యుడు చేయడం వలన వాళ్ళందరికి తీరిక దొరికి వారివారి పనులని ధ్యానం చేసు కొంటున్నారుట. బ్రహ్మవిష్ణురుద్రకృత్యాలు కూడా సూర్యుడే చేస్తున్నాడని భావిస్తున్నారు. ఆయనకి మనతో పదమూడు రకాల బాంధవ్యాలు తరువాత శ్లోకంలో చెప్తున్నారు. ఇది ఆఖరి శ్లోకం.

**దేవః కిం బాంధవస్స్యా-త్ప్రియసుహృదథవా-చార్య ఆహోస్విదర్యో**
**రక్షాచక్షుర్ను దీపో-గురురుత జనకో-జీవితం బీజమోజః**
**ఏవం నిర్ణీయతే యః-కిమివ న జగతాం సర్వదా సర్వదోఽసౌ**
**సర్వాకారోపకారీ-దిశతు దశశతాఽభీశు రభ్యర్థితం వః**

ఈ సంబంధాలకు తగినవాడు వెతికినా భూమియందు ఎవ్వడూ కనబడడు. కొందరి అనుబంధాలు తాత్కాలికంగా బాగా అనిపించవచ్చు, కానీ ఎప్పటికీ ఈ సంబంధాలు సూర్యునితో మనకు ఉన్నాయి. ఒక్క తండ్రిని మనం చూస్తే ఆయన తండ్రిగా మనకి ఈ జన్మకు మాత్రమే చూస్తాం, ఎన్ని జన్మలకైనా సూర్యభగవానుడే తండ్రి మనకు. కొంచెం ఆలోచిస్తే సూర్యుడే మనకి పిత అని తెలుస్తుంది.



ఆయన మనకు దేవత, బంధువు, ప్రియ, సహృత్, ఆచార్య, అహోస్విత్, అర్య అనగా గొప్పపుట్టుక కలిగినవాడు- మనం ఆశ్రయించినవాడు ఉదాతమైన వ్యక్తి అనిపించాలి. అలాంటి వ్యక్తిత్వం ఈయన దగ్గర ఉన్నది.

అంతేకాదు రక్షకుడు, నేత్రమైనవాడు, దీపమైనవాడు, మనకు పెద్దగా ఉండేవాడు గురువు, తండ్రి, మన జీవితం, ఈ జగత్తుకి మన జన్మకి మూలమైన బీజం సూర్య భగవానుడు. ఊరికనే పుట్టించడం కాదు మనకి ఓజస్సుని ఇచ్చే ధాతువు ఇతడు.

**ఓజస్తేజో ద్యుతిధర-** శక్తి జనకమైన ఓజస్సు. ఇలా పదమూడు రకాల బంధుత్వం ఎవరితో ఉన్నదని ఆలోచిస్తే ఈయన తప్ప మనకి ఎవరితో ఉంటాయని మయూరకవి పూర్తి చేసాడు.

**విద్యామైశ్వర్యమర్థం పరమపి లభతే స్తోత్ర సూర్యప్రసాదాత్ -** సూర్యప్రసాదం వల్ల

ఈ స్తోత్రాన్ని చదివిన వారికి ఆయుః, బలం, శ్రియం, ఆరోగ్యం, సత్కవిత్వం, విద్యా, ఐశ్వర్యం, అర్థం, మోక్షం లభిస్తాయి.

సాంబుడు సూర్యుడు ఎలా మనలను ఆదుకుంటాడో చెప్తూ-

**తామాసాద్య శ్రియమిహం గృహే కామధేనుం ప్రవాసే**
**ధ్వాన్తే భాతిం ధృతి మివ వనే యోజనే బ్రహ్మనాడిమ్**
**నావం చాస్మిన్ విషయవిషయగ్రాహసంసారసిన్ధౌ**
**గచ్ఛేయం తే పరమ మమృతం య న్న శీతం న చోష్ణమ్**

సూర్యుని అమృతస్వరూపం ధ్యానంతో చూస్తే, వెళ్లిపోతే అది శీతము కాదు, ఉష్ణము కాదు. అలాంటి ఆ స్వరూపాన్ని ఆశ్రయిస్తే అది ఇంట్లో ఉన్న సొమ్ము లాంటిది అన్నాడు.

ప్రవాసకాలంలో అంటే మనం ఒంటరిగా పరాయి చోట ఉంటే - మనల్ని సూర్యుడు కామధేనువులా ఆదుకుంటాడు. సూర్యభక్తులకి పరాయి చోటు లేదు.

సూర్యుడు ఉదయించే చోటంతా వారిదే. చీకట్లో వెలుగులా, అరణ్యంలో ధైర్యంలా ఆదుకుంటాడు. యోగంలో బ్రహ్మనాడి సుషుమ్నలా ఆదుకుంటాడు.



భయంకరమైన విషయాలనే మొసళ్ళతో ఉన్న సంసారమనే సముద్రం నుంచి బయటపెట్టే నావలా ఆదుకునే అమృతస్వరూపుడు సూర్యుడు అని సాంబుడు పంచాశికలో వర్ణించిన అమృతస్వరూపాన్ని, మయూరకవి దర్శించిన నూరు శ్లోకాలలోని ఆరు ఘట్టాల వర్ణనని ఆవిష్కరించుకుని సంపూర్ణ సూర్యస్వరూపాన్ని ప్రత్యక్షం చేసుకున్నాం. ధన్యులమయ్యాము.



శ్రీమదప్పయ్య దీక్షిత విరచిత-
## మహామహిమాన్విత ఆదిత్యస్తోత్ర రత్నమ్

విస్తారాయామమానం దశభిరుపగతో యోజనానాం సహస్రై
శ్చక్రే పఞ్చారనాభిత్రితయవతి లసన్నేమిషట్కే నివిష్టః,
సప్తచ్ఛన్దస్తురఙ్గాహితవహనధురో హాయనాంశత్రివర్గ
వ్యక్తాక్ల ప్తాఖిలాఙ్గః స్ఫురతు మమ పురః స్యన్దనశ్చణ్డభానోః॥ ॥1॥

ఇది రథ వర్ణన.

సూర్యుని రథం పదివేల యోజనాల పొడవు, అంతే వెడల్పు కలిగినది. ఐదు అరలు (ఆకులు), మూడు నాభులు, ఆరు నేములు కల ఒకేచక్రంపై అమర్చబడినది. ఏడు ఛందస్సులే గుఱ్ఱములుగా లాగుతున్న రథమది. సంవత్సర విభాగాలు, ధర్మార్థ కామాలనే త్రివర్గముచే ఏర్పరచ బడిన భాగాలు కలది. ఇటువంటి సూర్యుని రథం నా ఎదుట స్ఫురించుగాక!



- **ఐదు అరలు:** ప్రభవాది సంవత్సరాలలో మొదటిది సంవత్సరం. రెండవది పరివత్సరం. మూడవది ఇద్వత్సరం. నాల్గవది అనువత్సరం. ఐదవది వత్సరం.
  ఈ అయిదే కాలరూప సూర్య చక్రానికి ఐదు ఆకులు.
- **మూడు నాభులు:** ఉదయం, మధ్యాహ్నం, రాత్రి. ఇరుసు కఱ్ఱలను అమర్చడానికి మధ్యనున్న దండానికి చుట్టూ అమర్చిన మూడు మేఖలలే త్రినాభులు.
- **ఆరు నేములు:** 'నేమి' అనగా చక్రపు చివరి భాగం. ఆరు ఋతువులే ఆరు నేములు.
- **ఏడు గుఱ్ఱాలు:** ఏడు ఛందస్సులు. గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి.

ఆదిత్యైరప్సరోభిర్మునిభిరహివరైర్గ్రామణీయాతుధానైః
గన్ధర్వైర్వాలఖిల్యైః పరివృతదశమాంశస్య కృత్స్నం రథస్య,
మధ్యం వ్యాప్యాధితిష్ఠన్ మణిరివ నభసో మణ్డలశ్చణ్డరశ్మేః
బ్రహ్మజ్యోతిర్వివర్తః శ్రుతినికరఘనీభావరూపః సమిన్ధే. ॥2॥

ఇది మండల వర్ణన.

ఆదిత్యులు, అప్సరసలు, మునులు, సర్పములు, గ్రామణులు, రాక్షసులు, గంధర్వులు- అనే ఏడుగణముల చేత, వాలఖిల్యుల చేత ఆక్రమించబడిన పదవ భాగం కలది.

రథమధ్యంలో వ్యాపించి అధిష్ఠించి ఉన్నది- ఆకాశానికి మణివలె ప్రకాశిస్తున్నది- పరబ్రహ్మ ప్రకాశానికి మారు రూపమైనది - వేదసమూహాల ఘనీభావ (ముద్దగా అయిన) స్వరూపము కలది- అయిన సూర్యుని మండలము అత్యంత శోభతో ప్రకాశిస్తున్నది.

***సూర్యరథంలో చుట్టూ పదివేల యోజనాల మేర ఆదిత్యాదిగణాలు ఉన్నాయి. మధ్యలో తొమ్మిది యోజనాల భాగం మండలం. ఏడు గణాలలో ఒక్కొక్క గణానికి పన్నెండుమంది. మొత్తం 84 మంది.***

- ***ఆదిత్యగణాలు:*** *ధాత, అర్యముడు, మిత్రుడు, అంబుపుడు (వరుణ), వాసవుడు (ఇంద్రుడు), వివస్వంతుడు, పర్జన్యుడు, పూష, అంశువు, గభస్తిమాన్, త్వష్ట, విష్ణువు.*
- **అప్సరసలు:** కృతస్థల, పుంజికస్థల, మేనక, సహజన్య, ప్రమ్లోచంతి, శుచిస్మిత, ఘృతాచి, విశ్వాచి, ఊర్వశి, పూర్వచిత్తి, తిలోత్తమ, రంభ.
- **మునులు:** పులస్త్యుడు, పులహుడు, అత్రి, వసిష్ఠుడు, అంగిరసుడు, భృగువు, భరద్వాజుడు, గౌతముడు, కాశ్యపుడు, క్రతువు, జమదగ్ని, కౌశికుడు.
- ***సర్పములు:*** *వాసుకి, కంకరీకుడు, తక్షకుడు, నాగుడు, ఏలాపుత్రుడు, శంఖ పాలుడు, ఐరావతుడు, ధనంజయుడు, అగ్రమహాపద్ముడు, కర్కోటకుడు, కంబలుడు, అశ్వతరుడు.*
- ***గ్రామణులు:*** *రథకృత్, రథౌజస్సు, రథచిత్రుడు, రథస్వనుడు, స్రోతుడు, అరుణుడు, సుషేనుడు, సేనజిత్, తార్క్ష్యుడు, అరిష్టనేమి, రథజిత్, సత్యజిత్ (యక్షజాతీయులు).*
- **రాక్షసులు:** రక్షోహేతి, ప్రహేతి, పౌరుషేయుడు, వధుడు, సర్పుడు, వ్యాఘ్రుడు, చాపుడు, వాతుడు, విద్యుత్, దివాకరుడు, బ్రహ్మోపేతుడు, యజ్ఞోపేతుడు.
- ***గంధర్వులు:*** *తుంబురుడు, నారదుడు, హాహా, హూహూ, విశ్వా వసువు, ఉగ్రసేనుడు, వరరుచి, సర్వావసువు, చిత్రసేనుడు, ఊర్ణా యువు, ధృత రాష్ట్రుడు, సూర్యవచస్సు.*

*ఈ ఏడుగణాలల్లో గణానికి ఒకరు చొప్పున ఏడుమంది ఒక్కొక్క మాసంలో-క్రమంగా ద్వాదశ మాసాలు- సూర్యుని సేవిస్తున్నారు. వాలఖిల్యులు వేలసంఖ్యలో కొలుచుకొనే మహర్షులు.*

> నిర్గచ్ఛన్తో౽ర్కబిమ్బాన్నిఖిలజనిభృతాం హార్దనాడీప్రవిష్టాః
> నాడ్యో వస్వాదిబృన్దారకగణమధునస్తస్య నానాదిగుత్థాః,
> వర్షన్తస్తోయముష్ణం తుహినమపి జలాన్యాపిబన్తః సమన్తాత్
> పిత్రాదీనాం స్వధౌషధ్యమృతరసకృతో భాన్తి కాన్తిప్రరోహాః. ॥3॥

ఇది సహస్ర కిరణాల మహిమా వర్ణన.

సూర్యబింబం నుండి వెలికివస్తున్న కిరణాలు సమస్త ప్రాణులు హృదయనాడులలో ప్రవేశించునవీ - వసువులు మొదలైన దివ్యగణాలకు మధువులైనవీ - అన్ని దిక్కుల వ్యాపించు నాడులై వేడినీ, నీటినీ, మంచును వర్షించునవీ - అన్ని వైపులా జలాన్ని పానం చేస్తున్నవీ– పితృదేవతలకు స్వధను, మనుష్యులకు ఓషధులను, దేవతలకు అమృతాన్నీ ఏర్పరచునవి. ఆ కిరణాంకురాలు (అనుగ్రహ స్వరూపాలై) ప్రకాశిస్తున్నవి.

> శ్రేష్ఠాస్తేషాం సహస్రే త్రిదివవసుధయోః పఞ్చ దిగ్వ్యాప్తిభాజాం
> శుభ్రాంశుం తారకౌఘం శశితనయముఖాన్పఞ్చ చోద్భాసయన్తః,
> ఆరోగో భ్రాజముఖ్యాస్త్రిభువనదహనే సప్త సూర్యా భవన్తః
> సర్వాన్ వ్యాధీన్ సుషుమ్నాప్రభృతయ ఇహ మే సూర్యపాదాః క్షిపన్తు. ॥4॥



ఇది సప్తరశ్మి మహిమా నిరూపణం.

స్వర్గలోక భూలోకాలలో, ఐదు దిక్కులయందు (నాలుగు దిక్కులు, ఊర్ధ్వ దిశ) వ్యాపిస్తున్న ఆ వేయి కిరణాలలో శ్రేష్ఠములైన ఏడు కిరణాలు అన్ని వ్యాధులను నశింపజేయు గాక!

ఆ సప్తరశ్ములు చంద్రునీ, నక్షత్రసమూహాన్నీ, బుధుడు మొదలైన పంచగ్రహాలను ప్రకాశింప జేస్తున్నవి.

ముల్లోకాలను (ప్రళయవేళలో) దహించే ఆరోగ, భ్రాజ మొదలైన సూర్యులుగా ఏర్పడుతున్నవి. సుషుమ్న మొదలైనవి ఆ సూర్యపాదాలు (సూర్యకిరణాలు).

✦ *చంద్రుని వృద్ధి పొందించే కిరణం 'సుషుమ్న', అదే విధంగా నక్షత్రాలను భాసింపజేసే సూర్యకిరణ తేజం 'హరికేశ'. బుధుని 'విశ్వకర్మ', బృహస్పతిని 'అర్వాగ్వసు', శుక్రుని 'విశ్వవ్యచస్సు', కుజుని 'సంపద్వసు', శనిని 'స్వరాట్' అనబడే కిరణాలు వృద్ధి పొందిస్తున్నాయి.*

✦ కల్పాంతంలో మూడులోకాలను దహించే సప్తసూర్యులు; ఆరోగ, భ్రాజ, పటర, పతంగ, స్వర్ణర, జ్యోతిషీమాన్, విభాసః.

**ఆదిత్యానాశ్రితాః షణ్ణవతిగుణసహస్రాన్వితా రశ్మయోఽన్యే**
**మాసే మాసే విభక్తాస్త్రిభువన భవనం పావయన్తః స్ఫురన్తి,**
**యేషాం భువ్యప్రచారే జగదవనకృతాం సప్తరశ్మ్యుత్థితానాం**
**సంసర్పే చాధిమాసే వ్రతయజనముఖాః సత్క్రియాః న క్రియన్తే. ॥5॥**

ఇది ద్వాదశాదిత్యులను ఆశ్రయించిన రశ్ముల స్తవం.

ప్రతి మాసంలో విభజింపబడుతూ ఆదిత్యులను ఆశ్రయించిన తొంభైయారువేల కిరణాలు ముల్లోకాలను పవిత్రితం చేస్తూ ప్రకాశిస్తున్నాయి.

ఏడు రశ్ముల నుండి బయలు వెడలి, జగతిని రక్షించే ఆ కిరణాలు భూలోకంలో ప్రసరించని వేళ సంసర్పం, అధిక మాసం. అందువలననే ఆ కాలంలో వ్రతయాగాది సత్క్రియలు చేయబడవు.

సూర్యుని కిరణాలలో కొన్ని చొప్పున ద్వాదశాదిత్యులలో భాసిస్తాయి.



*వరుణుడు - ఆరువేల రశ్ములు, పూష -ఆరువేల రశ్ములు, దేవేశుడు (వివస్వతుడు) -ఏడువేల రశ్ములు, ధాత - ఎనిమిది వేల రశ్ములు, ఇంద్రుడు -తొమ్మిదివేల రశ్ములు, సవిత (అంశువు) -పదివేల రశ్ములు, భగుడు -11 వేల రశ్ములు, మిత్రుడు -ఏడువేల రశ్ములు, త్వష్ట - 8 వేల రశ్ములు, అర్యమ-10 వేల రశ్ములు, పర్జన్యుడు-6 వేల రశ్ములు, విష్ణువు-ఆరువేల రశ్ములు.*

*సూర్యక్రాంతి ఉండని చంద్రమానం అధికమాసం, సంసర్పం అనబడుతుంది. మధ్య గణన బట్టి వచ్చిన సంక్రాంతి రహిత మాసం అధికమాసం, స్ఫుట గణన బట్టి వచ్చినది సంసర్పం (బ్రహ్మ సిద్ధాంతం). ఈ మాసాన ద్వాదశాదిత్యులకు అధికారం లేదు. వారి కిరణాల ద్వారానే పావనత్వం జగతికి లభిస్తుంది కనుక, ప్రశస్తిలేని అధికమాసం సత్కర్మలకు పనికి రాదంటారు.*

ఈ విధంగా ప్రకాశించే ద్వాదశాదిత్యుల తొంభైయారువేల రశ్ములు ఉపాసకులకు పావనత్వాన్ని, రక్షణను ప్రసాదిస్తాయి.

**ఆదిత్యం మణ్డలాన్తఃస్ఫురదరుణవపుస్తేజసా వ్యాప్తవిశ్వం**
**ప్రాతర్మధ్యాహ్నసాయంసమయవిభజనాదృగ్యజుఃసామ సేవ్యమ్,**
**ప్రాప్యం చ ప్రాపకం చ ప్రథితమతిపథిజ్ఞానినాముత్తరస్మిన్**
**సాక్షాద్బ్రహ్మేత్యుపాస్యం సకలభయహరాభ్యుద్గమం సంశ్రయామి. ॥6॥**

ఇది ముఖ్యాదిత్యుని స్తుతి.(వేదసేవ్యుడు)

మండలమధ్యంలో దీపించే అరుణ శరీర తేజస్సుతో విశ్వాన్ని వ్యాపించినవాడు; ప్రాతః కాలం ఋగ్వేదం చేత, మధ్యాహ్నం యజుర్వేదం చేత, సాయంకాలం సామవేదం చేత సేవింపబడేవాడు, ఉత్కృష్టులైన జ్ఞానులకు సద్గతిగా పొందదగిన వానిగా, (సద్గతిని) పొందించే వానిగా ప్రసిద్ధుడు; 'సాక్షాత్తు బ్రహ్మయే' అని ఉపాసింప దగినవాడు; సకల భయములను తొలగించే ఉదయం గలవాడు అయిన ఆదిత్యుని ఆశ్రయిస్తున్నాను.

**యచ్ఛక్త్యాఽధిష్ఠితానాం తపనహిమజలోత్సర్జనాదిర్జగత్యా**
**మాదిత్యానామశేషః ప్రభవతి నియతః స్వస్వమాసాధికారః,**
**యత్ప్రాధాన్యం వ్యనక్తి స్వయమపి భగవాన్ ద్వాదశస్తేషు భూత్వా**
**తం త్రైలోక్యస్య మూలం ప్రణమత పరమం దైవతం సప్తసప్తిమ్. ॥7॥**

ఇది ఆదిత్యుని ప్రశస్తి.

ఏ ఆదిత్యుని శక్తిచేత అధిష్ఠించబడిన ద్వాదశాదిత్యుల అధికారము నియమ బద్ధమై లోకంలో కొనసాగుతున్నదో ఆ ఆదిత్యునికి నమస్కారం. ద్వాదశా దిత్యుల అధికారం (కర్తవ్య నిర్వహణ) తపింపజేయుట, మంచునూ, నీటినీ వర్షింపజేయుట మొదలైనది.

భగవంతుడైన శ్రీవిష్ణువు కూడా తాను ఆ ద్వాదశాదిత్యులలో ఒకడు గానుంటూ ఏ ఆదిత్యుని ప్రాధాన్యాన్ని స్పష్టం చేస్తున్నాడో– ముల్లోకాలకు మూలమైన పరమదైవమైన సప్తాశ్వునకు ప్రణామం.

**స్వఃస్త్రీగన్ధర్వయక్షా మునివరభుజగా యాతుధానాశ్చ నిత్యం**
**నృత్తైర్గీతైరభీశుగ్రహనుతివహనైరగ్రతః సేవయా చ,**
**యస్య ప్రీతిం వితన్వన్త్యమితపరికరా ద్వాదశ ద్వాదశైతే**
**హృద్యాభిర్వాలఖిల్యాః సరణిభణితిభిస్తం భజే లోకబన్ధుమ్. ॥8॥**

ఇది గణాలచే ఆరాధ్యుడు ఆదిత్యుడు అని ప్రస్తావించినది.

అప్సరఃస్త్రీలు నృత్యంతోను, గంధర్వులుగానంతోను, యక్షులు రథం పగ్గాలను పట్టు కొనుటతోను మునులు స్తుతులతోను, సర్పాలు లాగుట తోను-పన్నెండుగురు పన్నెండుగురు చొప్పున అమిత పరికరాలతో రథానికి ముందు సేవచేస్తూ ఎవరికి ప్రీతిని కలిగిస్తున్నారో; వాలఖిల్యులు మనో హరంగా మార్గనిర్దేశం చేస్తూ సేవిస్తున్నారో అటువంటి లోకబంధువైన ఆదిత్యుని సేవిస్తున్నాను.

**బ్రహ్మాణ్డే యస్య జన్మోదితముషసి పరబ్రహ్మముఖ్యాత్మజస్య**
**ధ్యేయం రూపం శిరోదోశ్చరణపదజుషా వ్యాహృతీనాం త్రయేణ,**
**తత్సత్యం బ్రహ్మ పశ్యామ్యహరహమభిధం నిత్యమాదిత్యరూపం**
**భూతానాం భూనభస్స్వః ప్రభృతిషు వసతాం ప్రాణసూక్ష్మాంశమేకమ్. ॥9॥**

ఇతడు 'సత్యం బ్రహ్మ' అని ఉపాస్యుడు... ఇదీ ఈ శ్లోక సారాంశం. సృష్టి ప్రారంభంలో పరబ్రహ్మ నుండి సంభవించిన బ్రహ్మాండం నుండి మొట్టమొదటిగా పుట్టిన పరబ్రహ్మాత్మ జుడు ఆదిత్యుడు -అని (శాస్త్రములందు) చెప్పబడినది.

ఈ ఆదిత్య బ్రహ్మము యొక్క శిరస్సు, బాహువులు, పాదములు క్రమంగా మూడు వ్యాహృతులు- భూః, భువః, సువః.



వీటితో కూడిన రూపముగా ఆతనిని ధ్యానం చేయాలి. భూమ్యాకాశ స్వర్గాది లోకాలలో నివసిస్తున్న ప్రాణుల యొక్క ప్రాణముల సూక్ష్మాంశమితుడు. (ప్రాణస్వరుపుడు -ప్రాణా ధారుడు). అహః (పగలు), అహమ్ (నేను అనే స్ఫురణ) అనే పేర్లుగల ఆదిత్య రూపంగా ఉన్న 'సత్యం' అనే బ్రహ్మమును నిత్యం చూస్తున్నాను (ధ్యానిస్తున్నాను).

**ఆదిత్యే లోకచక్షుష్యవహితమనసాం యోగినాం దృశ్యమన్తః**
**స్వచ్ఛస్వర్ణాభమూర్తిం వికలితనలినోదారదృశ్యాక్షియుగ్మమ్,**
**ఋక్సామోద్గానగేష్ణం నిరతిశయలసల్లోకకామేశభావం**
**సర్వావద్యోదితత్వాదుదితసముదితం బ్రహ్మ శమ్భుం ప్రపద్యే. ॥10॥**

ఆదిత్య అంతర్యామి వర్ణన ఇది.

ఆదిత్య మండలంలోను, లోకుల నేత్రంలోను, ఏకాగ్రమైన మనస్సుగల యోగుల హృదయంలోను సాక్షాత్కరింపబడే భగవానుడిప్పుడు స్వచ్ఛమైన సువర్ణం వలె ప్రకాశించు వాడు; వికసించిన పద్మముల వంటి రెండు నేత్రాలు కలిగినవాడు (మూడవనేత్రమైన

అగ్నిని మూసి ఉంచాడు), ఋక్కుల యొక్క సామముల గానములే 'గేష్ణము' (పర్వము) లుగా కలవాడు; మిక్కిలిగా భాసించే లోకేశ్వరత్వం, సకల కామ (భోగ)ములకు ఈశ్వర త్వము కలవాడు; అన్ని పాపములకు అతీతుడు కనుక 'ఉదితం' అని చెప్పబడిన పరబ్రహ్మ అయిన శివుని శరణుపొందుతున్నాను.

**ఓమిత్యుద్గీథభక్తేరవయవపదవీం ప్రాప్తవత్యక్షరేఽస్మిన్**
**యస్యోపాస్తిః సమస్తం దురితమపనయత్వర్కబిమ్బే స్థితస్య,**
**యత్పూజైకప్రధానాన్యఘమఖిలమపి ఘ్నన్తి కృచ్ఛ్రవ్రతాని**
**ధ్యాతః సర్వోపతాపాన్ హరతు పరశివః సోఽయమాద్యో భిషఙ్మః. ॥11॥**

ఇది ఆదిత్యోపాసనా మహిమ.

(ఈ సదాశివ బ్రహ్మమును) ఉద్గీథభక్తికి అవయవంగా ఉన్న 'ఓం' అనే అక్షరంలోను, సూర్యబింబంలోను ఉపాసించితే దురితాలను పోగొట్టగలం. ఈతని పూజనే ప్రధానంగా కల కృచ్ఛ్రవ్రతాలు అన్ని పాపాలను తొలగిస్తున్నాయి. అటువంటి మొదటి వైద్యుడైన ఈ పరమశివుడు మనచే ధ్యానింపబడి సమస్త రోగాలను హరించుగాక!



- ✦ *సామగానంలో భాగం 'ఉద్గీథం' (భక్తి= 'భాగం' అని ఇక్కడి అర్థం). దాని ప్రారంభంలో అవయవంగా ఉన్నది ఓంకారం.*
- ✦ *పాపాలకు ప్రాయశ్చిత్తంగా విధింపబడిన కష్టమైన వ్రతాలను 'కృచ్ఛ్రవ్రతాలు' అంటారు.*

**ఆదిత్యే మణ్డలార్చిః పురుషవిభిదయాదృన్తమధ్యాగమాత్మ**
**న్యాగోపాలాఙ్గనాభ్యో నయనపథజుషా జ్యోతిషా దీప్యమానమ్,**
**గాయత్రీమన్త్రసేవ్యం నిఖిలజనధియాం ప్రేరకం విశ్వరూపం**
**నీలగ్రీవం త్రినేత్రం శివమనిశముమావల్లభం సంశ్రయామి. ॥12॥**

గాయత్రీ ఉపాస్యుడైన శివుడే ఆదిత్యమండలాంతర్వర్తి అని చెప్పే శ్లోకమిది.

ఈ ఆదిత్యుని మండలం– ఋగ్వేదం, కాంతి– సామవేదం, పురుషుడు– యజుర్వేదం. గోపాలుల వరకు, స్త్రీలవరకు ఉన్న సకల జనుల కంటికి కనబడే (అందరికి ప్రత్యక్షమైన) తేజస్సుతో ప్రకాశిస్తున్నవాడితడు. గాయత్రీ మంత్రం చేత సేవింపదగిన (భర్గుడు) వాడు, అందరి బుద్ధులను ప్రేరేపించువాడు, విశ్వరూపుడు, నీలకంఠుడు, త్రినేత్రుడు,

ఉమావల్లభుడు- అయిన శివుని ఎల్లవేళలా ఆశ్రయిస్తున్నాను.

**అభ్రాకల్పః శతాఙ్గః స్థిరఫణితిమయం మణ్డలం రశ్మిభేదాః**
**సాహస్రాస్తేషు సప్త శ్రుతిభిరభిహితాః కించిదూనాశ్చ లక్షాః,**
**ఏకైకేషాం చతస్రస్తదను దినమణేరాదిదేవస్య తిస్రః**
**క్షప్తాః తత్తత్ప్రభావప్రకటనమహితాః స్రగ్ధరా ద్వాదశైతాః. ॥13॥**

(పై 12 శ్లోకాలలో చెప్పిన వాటి వివరణ ఇది)

ఆకాశానికి అలంకారమైన రథము (1వ శ్లోకం), వేదస్వరూపమైన మండలము (2వ శ్లోకం), సహస్రకిరణ భేదాలు (3వ శ్లోకం), శ్రుతులచే చెప్పబడిన సప్తరశ్ములు (4వ శ్లోకం), ఒక్కొక్క ఆదిత్యునిలో కొంచెం తక్కువగా చెప్పిన లక్ష (96వేల) కిరణాలు (5వ శ్లోకం), తరువాత ఆదిత్యుని స్తుతిస్తూ నాలుగు (6,7,8,9 శ్లోకాలు), ఆది దేవుడైన శివునికి సంబంధించినవి మూడు (10,11,12 శ్లోకాలు)

.... ఈ విధంగా ఆయా ప్రభావాలను ప్రకటించడం చేత పూజ్యములైన పన్నెండు 'స్రగ్ధర'లు (స్రగ్ధరా ఛందోవృత్తంలో చెప్పిన శ్లోకాలు) నిర్మింప బడినాయి.



**దుఃస్వప్నం దుర్నిమిత్తం దురితమఖిలమప్యామయానప్యసాధ్యాన్**
**దోషాన్ దుఃస్థానసంస్థగ్రహగణజనితాన్ దుష్టభూతాన్ గ్రహాదీన్**
**నిర్ధూనోతి, స్థిరాం చ శ్రియమిహ లభతే, ముక్తిమభ్యేతి చాన్తే**
**సంకీర్త్య స్తోత్రరత్నం సకృదపి మనుజః ప్రత్యహం పత్యురహ్నామ్. ॥14॥**

**ఫలశ్రుతి:**

ప్రతిదినం ఈ 'ఆదిత్య స్తోత్రరత్నాన్ని' ఒక్కమారైనా సంకీర్తించిన వ్యక్తికి దుఃస్వప్నాలను, దుర్నిమిత్తాలను, అన్ని పాపాలను, చికిత్స చేయరాని రోగాలను, చెడుస్థానంలో ఉన్న గ్రహముల వలన కలిగే దోషాలను, దుష్టభూతాలను, గ్రహాలను (పిశాచాదులను) ఆదిత్యుడు దూరంగా తొలగించి వేస్తాడు.

దీనిని చదివినవాడు ఈ లోకంలో స్థిరమైన సంపదను పొంది, అంతంలో ముక్తిని కూడా పొందుతాడు.

*శ్రీమదప్పయ్యదీక్షిత విరచిత 'శ్రీమదాదిత్యస్తోత్రరత్నమ్' సంపూర్ణమ్.*

# ద్వాదశార్యాసూర్యస్తుతిః

ఉద్యన్నద్య వివస్వాన్-
ఆరోహన్నుత్తరాం దివం దేవః
హృద్రోగం మమ సూర్యో-
హరిమాణం చాఽఽశు నాశయతు. ॥1॥

నేడు ఉదయిస్తూ, ఉన్నత స్థానమైన దివాన్ని ఎక్కుతున్న ప్రకాశ స్వరూపుడైన వివస్వాన్ (తన కాంతితో వ్యాపించువాడు) సూర్యుడు, నా హృదయవ్యాధినీ, కామెల వ్యాధినీ శీఘ్రంగా నశింపజేయుగాక. ('హృద్రోగం' అనే మాట గుండె జబ్బులను తెలియజేయడమే కాక, బైటకు కనబడని మానసిక రుగ్మతలను సూచిస్తోంది. 'హరిమాణం' అనేమాట పచ్చదనపు వ్యాధి (కామెల)నే కాక, బాహ్యమైన శారీరక వ్యాధులను తెలియజేస్తోంది. సూర్యభగవానుడు-ఆంతరిక వ్యాధులను బాహ్య రోగాలను నశింపజేయాలని దీని భావం.)



నిమిషార్ధేనైకేన
ద్వే చ శతే ద్వే సహస్రే ద్వే।
క్రమమాణ! యోజనానాం
నమోఽస్తు తే నళిననాథాయ. ॥2॥

ఒక రెప్పపాటులోని సగం కాలంలోనే రెండువేల రెండువందల యోజనాల దూరాన్ని దాటే సూర్యదేవా! పద్మములకు నాథుడవైన నీకు నమస్కారం.

కర్మ-జ్ఞాన-ఖ-దశకం
మనశ్చ జీవ ఇతి విశ్వసర్గాయ।
ద్వాదశధా యో విచరతి
స ద్వాదశమూర్తిరస్తు మోదాయ। ॥3॥

కర్మేంద్రియాలు ఐదు, జ్ఞానేంద్రియాలు ఐదు, (మొత్తం 10) మనస్సు, జీవుడు- అన బడే చైతన్యములు ఆదిత్యుడే. విశ్వసృష్టి నిర్వహణకై ఈ పన్నెండు రూపాలతో సంచరించే ద్వాదశాదిత్యరూపుడు మాకు సంతోషకరుడు అగుగాక!

**త్వం హి యజు ఋక్ సామః**
**త్వమాగమస్త్వం వషట్కారః।**
**త్వం విశ్వం త్వం హంసః**
**త్వం భానో! పరమహంసశ్చ. ॥4॥**

ఓ భానూ! ఋగ్వేద, సామవేద, యజుర్వేదములు, మంత్రశాస్త్రములు, వషట్కారం (యజ్ఞస్వరూపం), సర్వవిశ్వము హంస (ప్రాణస్వరూపం), పరమహంస (పర బ్రహ్మ) నీవే.

**శివరూపాత్ జ్ఞానమహం।**
**త్వత్తో ముక్తిం జనార్దనాకారాత్।**
**శిఖిరూపాదైశ్వర్యం।**
**త్వత్తశ్చారోగ్యమిచ్ఛామి. ॥5॥**

శివరూపంతో నున్న నీ నుండి జ్ఞానాన్నీ, విష్ణురూపమైన నీవలన ముక్తినీ, అగ్ని స్వరూపుడవైన నీచే ఐశ్వర్యాన్నీ, సూర్యరూపమైన నీ నుండి ఆరోగ్యాన్ని అర్థిస్తున్నాను. (సర్వదేవతాత్మకుడైన ఆదిత్యుడు సర్వాభీష్టములను ప్రసాదిస్తాడని భావం).



**త్వచి దోషా దృశి దోషాః।**
**హృది దోషా యేఽఖిలేంద్రియజదోషాః।**
**తాన్ పూషా హతదోషః।**
**కించిద్ రోషాగ్నినా దహతు. ॥6॥**

పూషా (పోషకుడు) అయిన సూర్యుడు తన ప్రతాపాన్ని కాసింత చూపించి మా చర్మదోషాలను, కంటి రుగ్మతలను, హృదయవ్యాధులను, సకల ఇంద్రియా లలోని దోషాలను రహించు గాక!

**ధర్మార్థకామమోక్ష-**
**ప్రతిరోధా నుగ్రతాపవేగ కరాన్**
**బందీకృతేంద్రియగణాన్।**
**గదాన్ విఖండయతు చండాంశుః। ॥7॥**

ధర్మార్థకామమోక్ష సాధనలకు ఆటంకంగా ఉన్నవీ, తీవ్రతాపాన్ని కలిగించేవీ, ఇంద్రియ శక్తులను బంధించేవీ అయిన వ్యాధులను ఖండించి, తీవ్రకాంతి కిరణాలు కలిగిన సూర్యుడు (చండాంశువు) మాకు ఆరోగ్యాన్ని ప్రసాదించుగాక!

**యేన వినేదం తిమిరం।**

**జగదేత్య గ్రసతి చరమచరమఖిలం।**

**ధృతబోధం తం నళినీభ-**

**ర్తారం హర్తారమాపదామీడే. ॥8॥**

పద్మాలకు పతియైన ఏ సూర్యుడు లేనట్లయితే గాఢమైన అంధకారం వ్యాపించి ఈ స్థావర జంగమాత్మక జగతిని మింగివేస్తుందో, ఆ రవి, పద్మాలను వికసింపజేసినట్లే మాకు నూతన వెలుగుతో జ్ఞానప్రకాశాన్నీ స్ఫూర్తిని కలిగించుగాక! - అనుచు ఆపదలను తొలగించే ఆదిత్య భగవానుని ప్రార్థిస్తున్నాను (స్తుతిస్తున్నాను.)

**యస్య సహస్రాభీశో-**

**రభీశులేశో హిమాంశుబింబగతః।**

**భాసయతి నక్తమఖిలం।**

**భేదయతు విపద్గణానరుణః. ॥9॥**

సహస్ర కిరణాలున్న ఏ సూర్యకాంతిలేశం చంద్రునిలో చేరి రాత్రిని ప్రకాశింపజేస్తు న్నదో, ఆ అరుణుడు మా ఆపదలనన్నిటినీ నశింపజేయుగాక!



**తిమిరమివ నేత్రతిమిరం।**

**పటలమివాఽశేషరోగపటలం నః।**

**కాశమివాధినికాయం।**

**కాలపితా రోగయుక్తతాం హరతాత్. ॥10॥**

కాలమునకు కర్త అయిన భాస్కరుడు-చీకటిని నశింపజేసినట్లే నా కంటిపొరను, తన వేడిమితో తెల్లును తగలబెట్టినట్లు మా మనోవేదనల సమూహాన్ని మొత్తంగా మా రోగ స్థితులను పోగొట్టుగాక!

**వాతాశ్మరీగదార్శస్-**

**త్వగ్దోషమహోదరప్రమేహాంశ్చ।**

**గ్రహణీభగందరాఖ్యా।**

**మహతీస్త్వం మే రుజో హంసి. ॥11॥**

ఆదిత్య దేవా! వాతవ్యాధినీ, అశ్మరీవ్యాధినీ (మూత్రపిండాలలో రాళ్లుచేరే వ్యాధి),

మూలవ్యాధినీ, చర్మవ్యాధుల్నీ, మహోదరాన్నీ, ప్రమేహాన్నీ, గృహణినీ, భగందరాన్నీ ఇలా అన్ని పెద్దవ్యాధులనీ నశింపజేయుమా!

**త్వం మాతా త్వం శరణం**

**త్వం ధాతా త్వం ధనం త్వమాచార్యః।**

**త్వం త్రాతా, త్వం హర్తా-**

**విపదామర్క! ప్రసీద మమ భానో!** ॥12॥

ఆర్యా! (పూజ్యా!) మాకు నీవే తల్లివి, నీవే ఆశ్రయమైనవాడవు, నీవే పోషకుడవు, ధనము, ఆచార్యుడవు, రక్షకుడవు, ఆపదలను హరించువాడవు.

భానూ! నన్ను అనుగ్రహించు.

**ఇత్యార్యాద్వాదశకం- సాంబస్య పురో నభః స్థలాత్పతితం।**

**పఠతాం భాగ్యసమృద్ధిః- సమస్తరోగక్షయశ్చ స్యాత్.** ॥13॥

ఈ పన్నెండు శ్లోకాలు 'ఆర్యా' ఛందస్సులో రచింపబడినవి. శ్రీకృష్ణుని పుత్రుడైన సాంబుని ముందు సూర్యానుగ్రహం వలన ఆకాశం నుండి పడిన శ్లోకాలివి.



**వీటిని చదివేవారికి సూర్యకృపచే భాగ్యములు పెంపు,**

**రోగాల నాశనం సిద్ధిస్తాయి.**